# శ్రీకృష్ణుని వేణుగానము

పదునేడవ శతాబ్దారంభమునందలి రాజపుత్ర చిత్రకళా పద్ధతి



మ. శ్రవణోదంచిత కర్ణికారకముతో స్వర్ణాభ చేలంబుతో
నవతంసాయిత కేకిపింఛకముతో నంభోజదామంబుతో
స్వవశుండై మధురాధరామృతముచే వంశంబుఁ బూరించుచున్
ఉవిదా! మాధవు డాలవెంట వనమం దొప్పారెడిం జూచితే.

మ. మమతన్ మోములు మీఁది కెత్తి తమ రోమంథంబు చాలించి హృ
త్కమలాగ్రంబులఁ గృష్ణు నిల్పి మురళీగానామృతశ్రేణి క
ర్ణములం గ్రోలుచు మేఁతమాని గికితానందాశ్రులై చిత్రితో
పమలై గోవులు చూచుచున్న వదిగో పద్మాక్షి! వీక్షించితే. — బమ్మెర పోతన్న.



చెన్నపట్టణము, డిసంబరు ౧౯౨౪

సంపుటము ౧. రక్తాక్షి సంవత్సరము మార్గశీర్షమాసము సంఖ్య ౧౨.

# కడుపుతీపు

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

కలదుగద యంధ్రవిష్ణు, స్థలమై శ్రీకాకుళాభిధానమ్మునఁ బే
ర్వెలసిన పుర మంధ్రావని, వెలనాఁటన్ గృష్ణపెంపు వెలసినచోటన్.

క. ఆయూర నొక్కయోవర, సీయరు సకుటుంబముగ వసించుచునుండన్
ప్రాయంపువాఁడు ద్రామిళుఁ, డాయన యిల్లాలు బిడ్డ లందపుఁ గందుల్!

చ. అరసి యెఱుంగ దిందనుక నత్తిలు నత్తలునీమతల్లి కాఁ
పురమున కాపురమ్మునకె పోయెను బిడ్డలు నల్గు రైదుగుర్
వరుసఁగ నచ్చటే కలిగి వర్ధిలుచుండిరి సర్వసౌఖ్యముల్
దొరకొనఁ దత్కుటుంబము కుదుర్కొనె నక్కడఁ బెక్కునాళ్లుగన్.

క. సోమరితనమున కలసట, కేమఱుపాటునకుఁ జోటు నీయక యాయిం
టామె యిలుదీర్చుకొంచున్, బ్రేమించున్ మగనిప్రాపు బిడ్డలప్రోవన్.

గీ. ఇంత లింత లంత లంతలు నగు నగు, మోమునిసుఁగు లింట గోము లెసఁగ
దోసపండ్లువోలె దోఁగాడుచుందురా, నిండు గన్నఁ గనులపండు గన్న!

ఉ. గొబ్బునవచ్చి యొక్కచను గుడ్చుచు నీడ్చుచు తైఁక మాఱుచేఁ
బ్రబ్బి మఱొక్కచన్ దడవిపట్టుచు రెండును బాలవంకలై

యుబ్బి స్రవింపఁగా జననియుం దల మూర్కొనఁ బొట్టనిండఁగాఁ
జుబ్బనఁ జూఁబలాడెడు నిసుఁగుఁ గనుంగొన వేడుకయ్యెడున్.

మ. కుచసంపన్నత కూలిపోవు ననియోఁ క్రొవ్వారు మైసౌరు విం
తచమత్కారము లంతరించుననియో, స్తన్యంబు లేకుండ గు
బ్బచనుల్ దిబ్బలుగా నొనర్చుకొని దబ్బాపాలచే నిప్డు పు
త్రచయంబుం బరిమార్చు మాతలటె మాతల్! కాలదూతల్ గదా!

వ. ఇప్పటి కయిదా ఱేండ్లకు ముం దక్కడ జరిగిన యక్కటికపువృత్తాంత మొక్కటి యిక్కడ చెప్పఁబూనినది. అది శ్రావణ మాసము.

గీ. దాఁటె బెజవాడ యానకట్ట నీటి మట్ట, మిర్వదైదడుగులకుఁ బయి గృష్ణవేణ్ణ
యుభయతటముల నిండారి యుబ్బి పొంగి, పొర్లి పార్వాఱుచుండె సముద్రమునకు.

శా. కూలెం గొంపలు ప్రాపుదక్కి పఱచెం గోతండముల్ నీటికిం
పాలయ్యెన్ ధనధాన్యసంతతులు జీవం బింత గాపాడుకోఁ
జాలం దుర్ఘట మయ్యెఁ బల్లెల కనస్థల్ హెచ్చెఁ గృష్ణామహో
ద్వేలస్ఫూర్జితదుర్నివారవిసరత్తీవ్రప్రవాహోర్భటిన్.

గీ. ముసురు వెసహెచ్చె; నీదురు విసరఁజొచ్చెఁ, బుట్టలన్ గట్టులన్ నీరు దొట్టి నిలిచె
వరదపెచ్చుతో నూరెల్ల బురద ఱొచ్చు, గజిబిజి ఘటించె నపుడు శ్రీకాకుళమున.

గీ. అధికమా ప్రవాహ మప్పుడు కృష్ణకు, నధికమా ప్రభావ మంచు నప్పు
డరుగుదెంచుచుండి రిరుగూళ్లనుండియు, నాడువారు స్నాన మాడువారు.

గీ. పసుపుకుంకుమములతోడఁ బండ్లతోడఁ, బూలతోఁ గృష్ణవేణ్ణకుఁ బూజచేసి
మ్రొక్కుచుండిరి పసిపైరు చక్కఁబడఁగ, నత్తటిని బుణ్యకాంతలు తత్తటముల.

సీ. కూఁకటివ్రేళ్లతోఁ గూలి తేలి యనేక, వృక్షంబు లంబుధి కేఁగుచుండె,
వడిఁ దప్పికొని చచ్చిచెడి చేరుకొనుచుండె, నెట్టకేలకుఁ బసుల్ గట్టులకును,
బెడిసి కన్నడు మీల నొడిసికొట్టుచునుండెఁ, గొంగలు మింటఁ గొంగొంగు రనుచు,
లంకల దాఁటి కూలంకషం బగు నేటి, ముంపు గన్గొనఁ బ్రజల్ మూఁగుచుండి

గీ. రాపదలఁ జేపడెడువారి కాపుకొఱకు, నిరుదరులయందుఁ బడవలు తిరుగుచుండె
నాల్గుమైళ్ల వెడల్పు కృష్ణాస్రవంతి, సాగరముపోలె భయదమై సాఁగుచుండె.

శా. స్నానార్థం బల యింటియామె చనె సంతానమ్ముతో నప్పు డ
చ్చో నుండెన్ దగుతేవఁ జూపి దరిఁగూర్చుండెన్ విభుం డామెయున్
దా నొక్కొక్కరిఁ గాఁగఁ జేతఁగొని సంతానమ్ము నీరార్చుచుం
బైనీటం బడి వచ్చు తుమ్మములుఁగొమ్మం జూచెఁ జేచెంతగన్.

క. పై కేఁగుదెంచు నంచుం, గైకొని యాకొమ్మ విసరెఁ గడఁగాఁ బడఁగా
నాకొమ్మ, యందు మిసమిసఁ, బ్రాఁకినయట్లయ్యె నదియుఁ బామో యేమో!

వ. అంత నాయమ్మ.

గీ. మోపిదేవి సుబ్రహ్మణ్యమూర్తి! నీకు, మ్రొక్కు చెల్లింతు దర్శనమునకు వత్తు
పుట్టలోఁ బాలుపోయుదుఁ బరుగు భయము, కల్గకుండ నాబిడ్డలఁ గావుమనియె.

సీ. కురులు చిక్కార్చి దిక్కులు గాంచి చేలాంచలము దిద్దుకొని కంచెలన్ దొలంచి
మొగము మంగళసూత్రమును నొలగందంబు, పసుపునఁ బూసి మఱి విసరివైచి,
గుమురొత్తుపులకల నిమిరి పొక్కిలిబంటి, నీట నీరెండ మై నాఁట డిగ్గి
గుమ్మడిమూటగాఁ గూర్చుండి చిగురాకు, దొప్పదోసిళ్ల నీ రెప్పళించి

గీ. దరినిగల బ్రాహ్మణుండు మంత్రములు పలుక, పలుకఁ బలుకఁగా త్రికృష్ణలో జలక మాడెఁ
గరగఁబోసిన పొంగు బంగారు పసంగ, సంగి కాంతులతోడఁ దరంగలాడె!

గీ. అర్ఘ్యమిడి సూర్యునకు హారహారి యటంచు, ముకుళిపుల్ మూసికొనియామె మునుఁగఁ గొనఁగ
'మునిఁగె మాయమ్మ యయ్యయో మునిఁగె'ననుచు, బిడ్డ లెల్లరుఁ దండరి బిందవైరి.

గీ. ఆఁకలేక యఖండమై యాదియంతె, మెఱుఁగరాకుండఁ బ్రవహించు నేటినీట
మున్గి యాకాంత కనరాకపోయె నింత, పొల్కి యుదె కాలవాహిని ముంగికసఁగ.

శా. 'భానోభాస్కర' మంత్రమున్ నొడువుచున్ భాస్వంతుఁ బ్రార్థించి తీ
రానన్ మంత్రముఁ జెప్పినట్టి ద్విజు సర్థం బిచ్చి మెచ్చించి సం
తానోపేతముగాఁగ నామె చనె సంతోషన్ గాకుళాధీశ్వరున్
శ్రీనారాయణు సంధ్రవల్లభుని దర్శింపం దదాస్థానికిన్.

శా. మాకుం గాఁపుర మీపురమ్ముగ నె సంభావింపఁగా నయ్యె నే
మోకానీ పెఱవోటి కేఁగఁదగు నుద్యోగంబు మా కృవదియున్
లేకుంటన్, సుఖమయ్యె, నెప్పుడు నిదేలీలన్ గటాక్షించుచున్
శ్రీకైవల్యమొసంగి యేలుకొనవే శ్రీకాకుళాధీశ్వరా!

గీ. అంచు వేఁడుకొంచు నర్చించి తీర్థప్రసాదములు గ్రహించి సంబరమున
బిడ్డ లపుడు కాళ్లకడ్డాలు రా నిల్లు, సొచ్చెఁ గాంత భర్త వచ్చు నంత.

క. శ్రావణమంగళవారము, గావున నోముగల బాలికలు పెక్కురు తో
డ్తో వచ్చిరింటి కాయమ, నావేళన్ పేరఁటమున కాహ్వానింపన్.

క. ఉత్తము నొక బ్రాహ్మణు నొక, ముత్తైదువఁ బిలిచి పెట్టి భోజన మానాఁ
డత్తరుణీమణి పాపప్రుఁ, బొత్తింకన్ నాకుఁ బోయెఁబో యని తనిసెన్.

ఇది తేపటివేళ.




భోగరాజు నారాయణమూర్తి గారు

## VIII

### యుగవిభాగము

మన మీనన్నయయుగ ప్రసంగ మింతతోఁ జాలించి యింకఁ దక్కిన యుగములంగూర్చి విచారింతము. ఆంధ్రకవుల చరిత్రమును వ్రాసిన వీరేశలింగము పంతులుగారు, పూర్వకవులు, మధ్యకవులు, ఆధునికకవులు, అని కవుల నెల్లర మూఁడుభాగములుగా భాగించినారు. ఈవిభాగములో పంతులుగా రేర్పరచుకొనినది సంవత్సర క్రమము (Chronological order). పదునొకండవ శతాబ్దము మొదలు పదునాఱవ శతాబ్దమువఱకుఁగల కవుల నెల్లరఁ బూర్వకవులనియు, పదునాఱు పదునేడవ శతాబ్దములయందలి కవులను మధ్యకవులనియు, మిగిలినవారి నాధునిక కవులనియు, వారు పేర్కొనియుండిరి. ఇందుకు భిన్నముగాఁ దమ రచించినకవుల చరిత్రమునందు శ్రీరామమూర్తిపంతులుగారు వాఙ్మయమునందలి మార్పుల ననుసరించి, పురాణకవులనియు, ప్రబంధకవులనియు, ద్వ్యర్థికవులనియు, శాస్త్రకవులనియు నామకరణములు గావించిరి. ఈవిభాగము వీరేశలింగముపంతులుగారికిఁ గూడ సమ్మతమైనదే. ఈయిరువురికవి విభాగక్రమములను గూడ నాధారముగాఁ గైకొని వంగూరి సుబ్బారావుపంతులుగారు వాఙ్మయచరిత్రమును వ్రాయుటకుఁ బ్రయత్నించి నట్లుగా వారి గ్రంథమువలనఁ దెలియుచున్నది.

పిఠాపురము హైస్కూలు హెడ్‌మేస్టరుగారైన మ.రా.శ్రీ, కూచినరసింహము పంతులుగారు ఈమధ్యఁ బ్రకటింపఁబడిన* చెన్నరాజ్య విషయసర్వస్వమున నాంధ్రవాఙ్మయమునుగూర్చి యొకవ్యాసమును వ్రాసి యందుయుగభాగమును ననేకవిధముగాఁ గావించినారు. చాళుక్యరాజులలో గణింపఁదగిన

#### చాళుక్యయుగము

సత్యాశ్రయుని కాలమునుండియు నాంధ్రవాఙ్మయచిహ్నలు గానవచ్చుచుండుటచేత సుమారాఱవశతాబ్దము మొదలు రాజనరేంద్రుని కాలమైన పదునొకండవ శతాబ్దమువఱకు 'చాళుక్యయుగ'మని పేరిడిరి. ఈ యుగమునందు వారు పేర్కొనిన కవులు నన్నపార్యుఁ

* Encyclopaedia of the Madras presidency and adjacent States 1920—21.

డును దత్సమకాలికుఁడైన పావులూరి మల్లనయు. కుమారసంభవ కావ్యకర్తయు నొరయూరు రాజ్యాధిపుఁడునైన నన్నెచోడుని సుమతిశతకకారుఁడైన బద్దభూపాలుని, మఱియుఁ దిక్కనను గేతనను వారి గ్రంథములను జేర్కొనుచు, పదియవ శతాబ్దము మొదలుకొని క్రీ. 1150 వఱకుఁ జోళయుగమని నిర్ణయించిరి. కాని పంతులుగారు నిర్ణయించిన యీచోళయుగములోని కవులకును వదియగు పరిమాణ సంవత్సరసంఖ్యకును బరస్పర వైరుధ్యము గానవచ్చుచున్నది. తిక్కనయుఁ గేతనయుఁ బదుమూఁడవ శతాబ్దములోని వారగుటచేతఁ జోళయుగమునకుఁ బరిమితమైన సంవత్సరసంఖ్య (1150) లోఁ జేరరు. మనుమసిద్ధి ప్రసిద్ధచోళవిభుఁడగుటవలన వానిమంత్రియైన తిక్కనను, చోళయుగమని యొకయుగ మేర్పరచినప్పు డిందులోనే చేర్పవలయును గాని మరియొక యుగమునఁ జేర్కొనరాదు. అందుచేత నన్నెచోడుఁడు తిక్కనకు సమకాలికుఁడని కొన్ని గ్రంథనిదర్శనములవలన నూహింపఁదగియున్నను, పదియవ శతాబ్దమునకుఁ బూర్వుఁడు కాఁడని చెప్పుట కభిప్రాయభేదము లుండవుగావున, ఈచోళయుగము 1000 లోఁ బ్రారంభించి 1250-60 ప్రాంతము వఱకుఁ బొడిగించుట యుక్తముగాఁ దోఁచుచున్నది. ఇది యిట్లుండ నీయుగమునందు నన్నెచోడుఁడు కుమారసంభవమువంటి గ్రంథములను*సంపాదించె (Edited) నని పేరిమోతము.

## చోళయుగము

## కాకతీయయుగము

పిమ్మటఁ జెప్పఁబడినయుగము కాకతీయయుగము. దీని యాద్యంతములు 1150 మొదలు 1325 వఱకు. ఈయుగములోఁ జేర్కొనఁబడిన కవులు పాలకురికి సోమనాథుఁడు, మారన, అనంతామాత్యుఁడు. భోజరాజీయకారుఁడైన యనంతామాత్యుఁడు పదునైదవ శతాబ్దమున శ్రీనాథున కించుమించుగ సమకాలికుఁడని యాంధ్రకవుల చరిత్రము చెప్పుచున్నది. ఈకవి కాలనిర్ణయమునకు యోగింపఁబడిన నిదర్శనములు తద్గ్రంథస్థములైనవి గాని కాని వట్టియూహలుగావు. అందుచే ననంతామాత్యుఁడు పదునైదవ శతాబ్దప్రారంభములోనివాఁడని చెప్పుటకు సందియము లేదు. దీనింబట్టి యనంతామాత్యునకును ‘కాకతీయ’ యుగమునకు నెట్టి సంబంధము లేదని చెప్పవచ్చును.

## రెడ్లియుగము

తరువాతియుగము రెడ్లియుగము. ఈయుగమున కేర్పరుపఁబడిన యాద్యంతములు 1325-1500. భారతారణ్యపర్వశేషమును బూరించిన యెఱ్ఱనమంత్రి సుప్రసిద్ధ కవీశ్వరుఁడు రెడ్లయాస్థానకవియై యుండుటచేత నాకాలమునాఁటి తదితరకవులఁ జేర్కొన నవసరము లేకనే యీయుగము రెడ్లియుగమని చెప్పవచ్చును. కాని యీయుగములోఁ జేర్కొనవలసిన శ్రీనాథుని, దీని తరువాత విజయనగరయుగమునందుఁ జేర్చుటయు మహాకవియైన పోతనామాత్యుని నానావిధకవులలోఁ

* " During the next epoch, Nanne Choda, King of Orayur, edited works of the stamps of Kumarasambhavam " Page 334.

జేర్చుటయు మాత్రము వింతగానున్నవి. ఆంధ్ర దేశచరిత్రమునుబట్టియు నాంధ్రకవుల చరిత్రములం బట్టియుఁ బురాతనమునుండియు జనసామాన్యమునఁ జెప్పఁకొనఁబడు చుండిన వాడుకలంబట్టియు, శ్రీనాథుఁడు రెడ్డిరాజులచేఁ బోషింపఁబడు చుండెననియు రెడ్లయాస్థానకవి యనియు నాంధ్రదేశప్రసిద్ధమై యుండ, నొకప్పుడు ప్రౌఢదేవరాయలచే సన్మానింపఁబడినంత మాత్రమున రెడ్లయుగము నుండి తప్పించి, వానిని విజయనగర కవులలోఁ జేర్చి రెడ్లకా గౌరవమును దొలంగించుట న్యాయముగాదని నావిన్నపము.

ఈ రెడ్లయుగము తరువాత 1200 మొదలు 1420 వఱకునుగల నానావిధ కవులం గూర్చియు, 1300 మొదలు 1600 వఱకు విజయనగరసామ్రాజ్యమును ప్రబంధములను గూర్చియుఁ బిదప నాంధ్రవాఙ్మయముతో సంబంధించిన తంజావూరు నాయకులు మొదలగు మరికొందఱిని గూర్చియు పంతులుగారు చక్కఁగ వివరించిరి.

ఆంధ్రభోజు లనందగిన శ్రీపీఠికాపురాధీశుల నీనవయుగమునకు యుగపురుషులుగా నిర్ణయించుటచేత నరసింహము పంతులుగారి వ్యాసము మాకు మరింత గణనీయమగుచున్నది. చాళుక్యులు-చోళులు-కాకతీయులు-రెడ్లు మొదలగు రాజులు కవితాభిమానులై కవులంబోషించుచు నాంధ్రదేశమున మిక్కిలి ప్రసిద్ధికెక్కిన విధము పంతులుగారి వ్యాసమునందుఁ గడుఁజక్కఁగ వివరింపఁబడినది.

### యుగపురుషుఁడు

కవులను గావ్యములను గావ్యవిశేషములను విడిచి కేవలము రాజులంబట్టియే యుగముల నేర్పరచుట కవిత్వచరిత్రమునకు సరిపడదు. మఱియు నొకయుగమునందొక మహాకవి మిక్కిలి ప్రఖ్యాతుఁడై నప్పుడు తద్యుగపురుషుఁడుగా నిర్ణయింపఁ బడవలసినవాఁడు తత్కవియా లేక వానినిబోషించురాజా యను విషయముఁగూడ విచారింపఁ దగినది. కవిత్వచరిత్రమునందొకానొక యుగ ముత్కృష్ట కావ్యరచనచే మిక్కిలి ప్రసిద్ధి వహించినపుడు, అయ్యుగప్రసిద్ధికిఁ గారణభూతుఁడు తదుత్కృష్ట కావ్యకారుఁడైన కవీశ్వరుఁడా తత్కవీశ్వరపోషకుఁడైన భూమీశ్వరుఁడా? ఈ ప్రశ్న కుభయులును గారణభూతు లనుటలో నెవ్వరికి నభ్యంతరముండదు. కాని యుగపురుషుని నిర్ణయింపవలసినప్పుడు మాత్రమియ్యిరువురి తారతమ్యమును విమర్శింపక తప్పదు. ప్రభువు లాదరించుచు సకలవిధముల బోషించుటచేతనే కవులు తగినంత మనశ్శాంతితో నుత్తమకావ్యరచన గావించి కీర్తి వహించినారు. తమచేఁ బోషింపఁబడిన కవులట్టి ప్రసిద్ధకావ్యరచన గావించుటచేతనే తత్ప్రభువులును గవితాచరిత్రమునందు స్మరింపఁబడుచున్నారు. అందుచే నొకరికీర్తి కొకరు కారకులగుచుండిరనుటలో సందియము లేదు. కాని కవులఁ బోషించుచు వారిచే నుత్తమకావ్యములను వ్రాయింపకయే మన కవితాచరిత్రమున స్మరింపఁదగిన రాజులెవరైన నున్నారా? రాజాశ్రయము లేకయే యుత్తమ

కావ్యములను రచింపఁగలిగిన కవులుమాత్ర మనేకులున్నారు. అందుచేఁ బ్రాధాన్యము కవిదియేకాని భూధవునిదికాదు. ప్రాధాన్యము కవిదియైనప్పుడు తద్యుగప్రసిద్ధి కాతఁడే యెక్కుడు కారణభూతుఁ డగుచున్నాఁడు. కావున యుగపురుషుఁడుగా నిర్ణయింపఁబడవలసినవాఁడు కవియేకాని రాజు గానేరఁడు.

కవులు యుగపురుషులు

పైవిషయములను బట్టి మన కవితాచరిత్రమునందుఁ గవులనుబట్టియే యుగములను నిర్ణయింపవలసియున్నది. కవులను బట్టియే యుగములను నిర్ణయింపఁబూనినప్పుడు ప్రప్రథమమునఁ దన భారతరచనచే నాఁటి దేశీయ కవిత్వములలో నాంధ్రకవిత్వమునకు నెక్కుడు ప్రాధాన్యము గౌరవమును గలిగించి కవులకెల్లరకును మార్గదర్శకుఁడైన నన్నపార్యుఁడు మనకు మొదటియుగపురుషుఁ డని వెంటనే స్ఫురింపఁగలఁడు. నన్నయవలెనే తత్సమానమైన భారతకవితా ప్రతిభచేఁ దమతమయుగములయం దెక్కుడు ప్రసిద్ధిగాంచిన మహాపురుషులు తిక్కనయు నెఱ్ఱనయుఁ గూడ మనకు యుగపురుషులుగాఁ బరిగ్రహింపఁదగినవారు మొత్తముపై నీ ముగ్గురం జేర్చి కవిత్రయ యుగమని యొక్కటియే యుగ మేర్పఱచుకొనుటకును వీలున్నది. కాని నిర్దిష్టవిషయములను విపులముగను సులభముగను జర్చించుకొనుటకును, కవిత్రయము వారి కవితాతారతమ్యములను వేర్వేఱుగ నిరూపించుకొనుటకును, అవకాశము కలుగునట్లుగఁ బ్రత్యేక యుగముల క్రింద విభజించుకొనుటయే యుక్తమము. ఈమూఁడు యుగములయందలి యితర కవులెల్లరును మొత్తముపైఁ గవిత్రయము వారివలెనే సంస్కృతమునుండి పురాణములఁ దెనిఁగించు నాచార మవలంబించినను, ఆయాచారమునకు భిన్నమైన గ్రంథరచన గావించిన కవులు మాత్రము లేకపోలేదు. యుగనాం ప్రదాయమునకు భిన్నమైన రచనావిశేషములు మనకుఁ బ్రతియుగమునందును గానవచ్చుచునేయుండును. అందుచే నిట్టి స్వల్పభేదములు మనయుగవిభాగక్రమమునకు భంగము గలిగింపఁజాలవు గావున మన కవితాచరిత్రమున కీక్రిందివిధముగా యుగవిభాగము చేసికొనవచ్చును.

i నన్నయయుగము. 1022-1250.

నన్నయ రచించిన భారతభాగమునకుఁ దరువాత, *నన్నెచోడుని కుమారసంభవము, రంగనాథ భాస్కరుల రామాయణములును, పాలుకురికి సోమనాథుని బసవపురాణాదులును, ఈ యుగములో గణింపఁదగిన గ్రంథములు. వీనిలో గణితశాస్త్రమును గుమారసంభవమును యుగవిశేషములుగా గణింపఁదగినవి. వీనిలో మొదటిది శాస్త్రమైనను సంస్కృతమునుండి తెనిఁగింపఁబడినదగుటచే యుగధర్మమును గొంతవఱకైనఁ బోలియున్నదకాని కుమారసంభవముమాత్ర మట్టిదికాదు. ఈ విషయము రెండవ ప్రకరణమునందే వివరింపఁబడినది.

* నన్నెచోడ రంగనాథ భాస్కరుల కాల నిర్ణయములు సంశయాస్పదములై యున్నను, వీరు మొత్తముపై నన్నయయుగమునందేకాని మఱియొక యుగమునందుఁ జేర్పఁబడరు.

ii తిక్కనయుగము. 1250-1350.

తిక్కనరచించిన భారత భాగమునకుఁ దరువాత నీ యుగమునందుఁ బ్రసిద్ధిచెందిన గ్రంథములు కేతనకృతములైన దశకుమార చరిత్రాదులు, మారనమార్కండేయ పురాణము, మంచన కేయూరబాహు చరిత్రము మొదలైనవి. వీనిలోఁ గేతనకృతమైన విజ్ఞానేశ్వరీయమను యాజ్ఞవల్క్య ధర్మశాస్త్రమును మంచన కేయూరబాహుచరిత్రయు నీయుగమునందలి విశేషములుగా గణింపఁదగినవి. ధర్మశాస్త్రమును దెనిఁగింపఁబూనినకవి నాఁటికిని నేఁటికిని గేతనతక్క మఱియొక కవికానరాఁడు. అప్పటికి రచింపఁబడిన గ్రంథములలో శృంగారరసము ప్రధానము గాఁగల కావ్యము మంచనరచించిన కేయూరబాహు చరిత్ర మొక్కటియే యని చెప్పవచ్చును. ఈవిశేషము కృతిపతి నిర్దిష్టమైనట్లు మంచన యీ క్రింది పద్యములోఁ జెప్పుచున్నాఁడు.

క. స్థాయిరసము శృంగారం
బై యలవడఁగథలు నీతులై యెడనెడ రాఁ
గేయూర బాహుచరితము
సేయుమునీవాంధ్రభాషశిల్పము మెఱయన్

సాధారణముగాఁ బ్రబంధములయందు మాత్రమే స్థాయిరసము శృంగారముగా వర్ణింపఁబడుచు వచ్చుటచేతఁ బ్రబంధసరణికి మంచనయే మార్గదర్శకుఁడైన ట్లూహింపఁ రాదా?

iii ఎఱ్ఱనయుగము 1350-1440

తన చిత్రకవిత్వపటుత్వముచే భారతారణ్య పర్వశేషమును బూరించి 'ప్రబంధపరమేశ్వర' విఖ్యాతినహించిన యెఱ్ఱనామాత్యుఁడీయుగమునకు భూషణప్రాయుఁడై యున్నవాఁడు. ఈయుగమునందలి కవులలో నెఱ్ఱన తరువాత నాతనితో సమానులైన నాచన సోమనాథుఁడును జిమ్మపూఁడి యమరేశ్వరుఁడును ముఖ్యముగా గణింపఁదగినవారు. సోమనాథుఁడు కవిత్రయము వారితో సమానుఁడని కొందఱును, కొన్ని విషయములయందుఁ గవిత్రయమువారికంటె నధికుఁడని మఱికొందఱును గీర్తించుచున్నారు. హరివంశమేకాక యిక్కవిసత్తముఁడు వసంతవిలాసమను ప్రబంధమును గూడ రచించెనట. ఈసోమునివలెనే యమరేశ్వరుఁడు సైతమును గవిత్రయ సంకాశుఁడని పదునైదవ శతాబ్దారంభము నుండియును గల యుత్తమకవులెల్లరును గొనియాడుచుండుటచేత నితఁడుఁగూడ మహాకవుల పంక్తియందుఁ జేరఁదగినవాఁడు. మాళవదేశమునందలి యుజ్జయినీ నగరమున కధిపతియైన విక్రమసేనునికథ 'విక్రమసేన' మనుపేర సమస్తవర్ణనములతో నిండిన శృంగారకావ్యముగా నమరేశ్వరుఁడు రచించెనట. ఈ కావ్యము రామకృష్ణ కవిగారికి లభించినట్లు తెలియుచున్నది. ఆంధ్రదేశమునకు మాత్ర మింకను లభింపకుండుటచే దీనింగూర్చి ప్రస్తుత మింత కన్న నేమియు వ్రాయఁజాలము. అయినను నాంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయమువారిచే సంపాదింపఁబడిన విక్రమసేనపద్యములను వీరేశలింగము పంతులుగారు పరిశీలించి యీ విక్రమసేనము సమస్త వర్ణనములతో నిండిన శృంగారకావ్యమని చెప్పుటచేతఁ బ్రబంధసరణి

కలదియే యని యూహింపఁ దగియున్నది. ఇట్లీ సోమనాథామరేశ్వర కవీశ్వరుల వసంతవిలాస విక్రమసేనములంబట్టి యీ ప్రబంధపరమేశ్వర యుగము సార్థక నామమును బొందుచున్నది.

iv పోతన శ్రీనాథయుగము. 1440-1520

ఎఱ్ఱనయుగ ప్రారంభము మొదలు-అనఁగా-1350 మొదలు, పెద్దనవఱకుఁ గల మధ్యకాలమంతయు సామాన్యదృష్టికి నొక్కయుగమువలెనే మనకుఁ గానవచ్చుచున్నది. కొంచెము విశేషములున్నను పెద్దనవఱకు రచింపఁబడిన గ్రంథములన్నియు మొత్తముపైఁ బురాణములే యగుటచేత, నన్నయ మొదలు పెద్దనవఱకుఁగల కాలమునకుఁ బురాణయుగమనియే కవులచరిత్రకారులు పేరిడిరి. కావ్యరచనలోఁ బెద్దనాఁడు గలిగినయంత విశేషనూతనత్వ మీమధ్యకాలములోఁ గలుగలేదు. ఆ విశేషనూతనత్వము రసోత్కర్షము. ఇది మనుచరిత్రముతో సంపూర్ణముగా వెల్లివిరిసినది. దీని చిహ్నములు పెద్దనకుఁ బూర్వులైన కొందఱు కవుల రచనయందుఁ గానవచ్చుచుండుటచేతఁ బ్రబంధయుగమునకు మార్గదర్శకులైన యట్టి కవులను మనము సామాన్యకవులుగా గణించి విడువరాదు. అందుచే మన మేర్పరచుకొనిన ఎఱ్ఱనయుగమును బెద్దనవఱకుఁ జేర్చక, ప్రబంధయుగము ప్రారంభించుటకుఁ బూర్వము, సంధియుగమని కాని ప్రబంధపూర్వావస్థాయుగమనికాని యొకయుగ మేర్పరచుకొనవలసియుండును. ఈ సంధియుగమునందలి కవులు, నన్నయ తిక్కనాదులు పురాణములు తెనిఁగించుటలో వహించిన స్వాతంత్ర్యముకంటె నెక్కుడు స్వాతంత్ర్యమును వహించి, స్వతంత్ర కల్పనలతోడను నపూర్వవర్ణనములతోడను గావ్యరచన గావించిరి. అట్టి స్వతంత్ర కావ్యరచన గావించిన యీ సంధియుగములోని కవులనెల్లర మనము రెండుతరగతుల క్రింద విభజించుకొనుట కవకాశము గానవచ్చుచున్నది.

i పురాణకథలను గైకొని ప్రబంధసరణి [illegible] రచించిన కవులు.

ii సంస్కృతకావ్య ప్రసిద్ధములైన చరిత్రకథలను గైకొని ప్రబంధసరణినందు రచించిన కవులు.

ఇందు మొదటి తరగతిలోఁ జేర్పఁదగిన కవులు పోతన, శ్రీనాథుఁడు, పిల్లలమఱ్ఱి పినవీరన, ప్రౌఢకవిమల్లన మొదలగువారు. పోతనామాత్యుఁడు కేవలము పురాణమును దెనిఁగించిన కవియైనను, తక్కిన పురాణకవుల రచనయందుఁ గానరాని నూతనత్వ మీతని రచనయందుఁ గానవచ్చుచున్నది. ప్రబంధమునకుఁ బ్రధానమైన రసోత్కర్షయుఁ దద్రసోత్కర్షకు లేశమును భంగము గలిగింపని పలువిధములైన శబ్దాలంకారములును పోతనవలెఁ బోషింపఁగలిగిన కవి ప్రబంధకవులలోఁగాని మరియే యితర కవులలోఁగాని కానరాఁడని చెప్పవచ్చును. ప్రబంధకవులవలెనే యితఁడును పురాణకవులకంటె నెక్కుడు స్వాతంత్ర్యమును వహించి, మూలములో లేని కథలనేకము లితర పురాణములనుండి తెచ్చిపెట్టుచు నిరువదివేల సంఖ్యగల సంస్కృత

భాగవతమును స్థాయిరసము భక్తిగాఁ జేసుఁగున ముప్పదివేల గ్రంథముగాఁ గావించెను.

శ్రీనాథుఁడు సైతమును నైషధ కాశీఖండ భీమ ఖండాదులను ప్రబంధశైలియందే తెనిఁగించి, యంతటఁ దనివిచెందక యనేక పురాణములనుండి శివసంబంధములైన గాథలనేర్చి హరవిలాసమనుపేర నవీన కావ్యమును గావించి ప్రబంధరచన కుండఁదగిన రచనా స్వాతంత్ర్యమును వెల్లడించెను. పిల్లలమఱ్ఱి పినవీరన శకుంతలాపరిణయమును మల్లన రుక్మాంగద చరిత్రయుఁగూడ ప్రబంధశైలియందే రచింపఁబడిన స్వతంత్ర కావ్యములని చెప్పఁదగియున్నవి. భారతములోని శకుంతల కథనుండియుఁ గాళిదాసు రచించిన యభిజ్ఞానశాకుంతలము నుండియుఁ గూడఁ బినవీరన పెక్కువిషయములను సంగ్రహించి తన కావ్యమునందుఁ జేర్చుకొనెను.

రెండవతరగతిలోఁ జేర్పఁదగిన కవులు జక్కనయు ననంతామాత్యుఁడు మొదలగువారు. ఈ కవులు పురాణగాథలను సంపూర్ణముగాఁ బరిత్యజించి, సంస్కృతకావ్యములలోఁ బ్రసిద్ధములైన విక్రమార్క భోజరాజాదుల చిత్రకథలను గైకొని ప్రత్యేక కావ్యములు గారచించి, శ్రీనాథాదులకంటెను నెక్కుడు స్వాతంత్ర్యమునుజూపిరి. మొత్తముపైఁ గావ్యరచనయందట్టి నూతనమార్గముల నవలంబించిన యీ యుగకవీశ్వరులందఱి యందుఁ బోతన శ్రీనాథు లెక్కుడు ప్రసిద్ధపురుషులగుటచేత మన మీయుగమును 'పోతన శ్రీనాథ' యుగమని చెప్పుటలో నధిక్షేప ముండదు;

v పెద్దనయుగము. 1520—1880

ఈ యుగారంభమునందే కావ్యరచన సంపూర్ణమైన ప్రబంధ స్వరూపమును వహించినది. కథాకల్పనా చాతుర్యము, అపూర్వ వర్ణనా నిపుణత్వము, భావ గాంభీర్యము, శృంగారరసోత్కర్ష, పాండిత్య ప్రకర్ష మొదలైనవి ప్రబంధస్వరూపమున కవయవములుగా గ్రహింపఁదగినవి. వీని నన్నింటిని గజుఁజాకచక్యముతోఁ జిత్రించుచు మనుచరిత్రమును రచించి, సంపూర్ణమైన ప్రబంధ స్వరూపము నేర్పఱచుటచేతనే పెద్దనార్యుఁడు రాయలచేఁ గవితాపితామహ బిరుదము నొందఁగలిగెను.

రాయలు రచించిన యాముక్తమాల్యదయు నీప్రబంధసరణిలోఁ జేరినదియే. రాయలయాస్థానకవులును, రాయలనాఁటి యితర కవులును మాత్రమే కాక, యించుమించుగఁ బందొమ్మిదవ శతాబ్దాంతము వఱకుంగల కవులెల్లరును, పెద్దనదారినే త్రొక్కుచు, మనుచరిత్రమునే మార్గదర్శకముగా నిడుకొనుటచేతఁ బురాణకవులలో నన్నపార్యునివలెనే ప్రబంధకవులలోఁ బెద్దనార్యుఁడును గవితాచరిత్రమునం దగ్రస్థానము నలంకరించుచున్నాఁడు.

మనుచరిత్రము తరువాత నీయుగములో మిక్కిలి ప్రసిద్ధిచెందిన ప్రబంధములు, తిమ్మన పారిజాతాపహరణము, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యము, నృసింహకవి కవికర్ణరసాయ

నము, పింగళిసూరన రాఘవపాండవీయ కళాపూర్ణోదయ ప్రభావతీ ప్రద్యుమ్నములు, రామరాజభూషణుని వసుచరిత్రాదులు, రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము, వేంకటకవివిజయ విలాసము, సూరకవి కవిజనరంజనము, నారాయణకవి రంగరాయ చరిత్రము మొదలైనవి.

వెన్నెలగంటి సూరన విష్ణుపురాణమును, కంకంటి పాపరాజు ఉత్తరరామాయణమును, ఈప్రబంధయుగములోఁ బ్రబంధశైలిని రచింపఁబడిన పురాణములు. మఱియు ద్వ్యర్థి ప్రబంధములు, త్ర్యర్థిప్రబంధములు, అచ్చతెనుఁగు ప్రబంధములు, సీతారామాంజనేయము, వేదాంత రసాయనమను క్రైస్తవ గ్రంథమును, ఈయుగమునందలి విశేషములుగా గణింపఁదగినవి.

vi వీరేశలింగయుగము. 1880 మొదలు ప్రస్తుతయుగము.

ఈయుగమునందలి కవులం గూర్చియు రచనాసాంప్రదాయములం గూర్చియు మన మిదివఱకే కొంత ప్రసంగించితిమి. ప్రస్తుతయుగమునందుఁ బ్రచారమునందున్న యుభయసాంప్రదాయముల యందునుగూడఁ దన యద్భుతరచనాకౌశలమును వెల్లడించుచు ననేక కావ్యములను రచించి యాంధ్రకవితాసవ్యసాచి యనందగిన వీరేశలింగము పంతులుగారు ఈయుగమునందలి కవులలో ముఖ్యముగా గణింపఁదగినవారు. ఈమహనీయుఁ డుభయభాషాకోవిదుఁడై యెన్నఁదగిన కవిత్వపటుత్వసంపదసంపాదించుటయే కాక, యాంగ్లభాషయు నభ్యసించి, తనరచనా విశేషములచేఁ బూర్వనాగరకులను నవనాగరకులనుగూడ సంతృప్తులఁ గావింపఁగలుగుచుండెను. దృష్టాంతమునకై యిచట దగుమాత్రముగా నీక్రిందఁ జేర్పఁబడిన గ్రంథజాలములవలన, నుభయ సాంప్రదాయరచనలయందును నీకవి సత్త్వముఁ బ్రతిమప్రతిభావంతుఁడని స్పష్టము కాఁగలదు.

Classical

శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధము
రసికజనమనోరంజనము
శుద్ధాంధ్రోత్తర రామాయణము
ధగత సంగ్రహము
రత్నావళి
అభిజ్ఞాన శాకుంతలము
మాళవికాగ్నిమిత్రము
ప్రబోధ చంద్రోదయము
దక్షిణగోగ్రహణము
హరిశ్చంద్రోపాఖ్యానము

Modern

చమత్కార రత్నావళి (Comedy of Errors)
రాగమంజరి (Sheridan's Duenna)
కల్యాణకల్పవల్లి (Do. the Rivals)
పథికవిలాసము (Goldsmith's Traveller)
సత్యరాజ పూర్వదేశయాత్రలు (Gulliver's Travels)
రాజశేఖర చరిత్రము (Vicar of Wakefied)
దుర్మార్గచరిత్రము (Cowper's John Gilpin)

ఇట్లుభయపక్షవిద్యాధికులను దత్తదుచిత గ్రంథరచనచే రంజింపఁజేయుటయే గాక,

రసవంతములైన తేటమాటలతో నూతనజ్ఞానదాయకములుగ షేక్స్పియరు నాటక కథలను బెక్కింటిని వ్రాసి బాలురను గూడ నీతఁడు పక్షపాతములేకుండఁ దృప్తిపరచెను. సత్యవతీ చరిత్రము మొదలైన స్త్రీజనపఠనార్హము లగు చిత్రకథ లనేకములు మృదుమధురశైలిని రచించుటయేకాక, స్త్రీలకొఱకు 'సతీహితబోధిని' అను నొకమాసపత్రికయు నెలకొలిపి, నేఁటియాంధ్రదేశమునందలి స్త్రీవిద్యాభివృద్ధికంతకు నిమ్మహాశయుఁడే కారకుఁ డయ్యెను.

జనసామాన్యమున గ్రంథావలోకనాసక్తి నిస్ఫుటముగా వ్యాపించినంగాని, యే దేశమున నేభాషయందలి వాఙ్మయమైనను వృద్ధిగాంచనేరదు. అందుచేఁ బామరులకు సుబోధగ్రాహ్యముగను, సన్మార్గబోధకముగను హాస్యరసప్రధానములగు పెక్కు ప్రహసనములను వాడుకమాటలతో వ్రాసి యీనవయుగమున నాంధ్రకావ్యములను జదువువారి సంఖ్య నిమ్మహామహుఁడే యింతయధికముగాఁ గావించెను. కావ్యరచనయం దిప్పటి కవులకుఁగల నూతనశక్తియు, స్వాతంత్ర్యమును నీతనిరచనావిశేషమువలనఁ గలిగినవియే యని నుడువ వచ్చును. ఆంధ్రదేశగ్రంథాలయములలో నున్నతస్థానము నలంకరించు నీతనిగ్రంథసంపుటముఁ జూచినప్పుడు, సంఘసంస్కరణోద్యమమునకై వెచ్చించిన జీవితభాగము సైతమును భాషావిషయముననే వినియోగించి యుండిన యెడల నీప్రతిభావంతుఁ డాంధ్ర సాహితీ ప్రపంచమున కింకను నెన్ని యుపకారములు గావింపఁ గలిగియుండునోయని తోఁచకమానము. రాజశేఖర చరిత్రము-సత్యరాజు పూర్వదేశయాత్రలు-సత్యవతి చరిత్రము మొదలగు నీతని గ్రంథములు కొన్ని తమిళ కర్ణాట కాంగ్లేయ భాషలయందు భాషాంతరీకరింపఁబడుటయే నూతన కావ్యనిర్మాణమునం దక్కవిసత్తము డప్రతిమప్రతిభావంతుఁ డనుటకు సాక్ష్యము. అందు రాజశేఖరచరిత్రపు టాంగ్లభాషాంతరీకరణము, ఇంగ్లాండులో ముద్రింపఁబడి, యచ్చటి మహాశయులచే సమున్నతముగా నుతింపఁబడుటవలన బంగాళాదేశపు రవీంద్రనాథ కవీంద్రునికంటె మున్ముందుగఁ బాశ్చాత్య విద్వాంసుల ప్రశంసం గన్న వీరేశలింగకవిపుంగవుం దలంచి యాంధ్రులెల్లరు గర్వపడవలసియున్నది. ఇయ్యాంధ్రకవిత్వచరిత్రమునం దీనాఁడు మనచేత నేకాక, 19వ శతాబ్దమునందే యిక్కవిశేఖరుండు యుగపురుషుఁడుగా నిర్ణయింపఁబడిన ట్లీక్రింది దృష్టాంతమునందు స్పష్టమగుచున్నది.

"......We did not think that the author of Vigraham which was intended to be a Sequel to Chinnaya Soory's Neethichandrika could altogether cast away his old associations and take to a totally different path in Telugu literature. We must confess, therefore, we are greatly surprised by the appearance of the two books under review. We may well say that Rajasekhara marks an era in the annals of Telugu Literature. It is the first Telugu novel that has yet appeared and as an attempt in a new direction we must consider it a success."

"The Hindu" Madras 1878.

ఇఁక నీ నవయుగంబునఁ బ్రసిద్ధులైన తక్కిన కవులం గూర్చి కొంత ప్రసంగింతము. చెన్నపురి రాజకీయ కళాశాలయందుఁ బ్రధా

నాంధ్రోపాధ్యాయులైయుండిన కీర్తిశేషులగు పరవస్తు చిన్నయసూరిగారు పంచతంత్రము నుండి కొంతభాగమును నీతిచంద్రికయను పేర నాంధ్రీకరించిరి. మఱియు నిదివఱకున్న తెనుఁగు వ్యాకరణములన్నియు సంస్కృతభాషా రచితములై కొన్నియు, ప్రౌఢాంధ్ర పద్యాత్మకములై కొన్నియు సుబోధకములు గాకుండుటచే వీరు బాలవ్యాకరణమను పేర నొక ప్రౌఢ వ్యాకరణమును వ్రాసిరి. ఇయ్యది నేఁటికిని గళాశాలలయందును మిక్కిలి ప్రచారములో నున్నది. మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు, నరకాసుర విజయ వ్యాయోగము, ధనంజయ విజయ వ్యాయోగము, ప్రసన్న రాఘవము, బిల్వేశ్వరీయము మున్నగు నుత్కృష్ట గ్రంథములు రచించి యాంధ్ర దేశ ప్రసిద్ధులైరి. అముద్రిత గ్రంథ చింతామణి పత్రికను నెలకొల్పిన పూండ్ల రామకృష్ణయ్యగారిభాషా సేవ మిగుల ప్రశంసనీయమైనది. శతగ్రంథకర్తయైన మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి కవితా ప్రభావ మద్వితీయమైనది. వారి గ్రంథము లసంఖ్యములు. గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారి కవి జీవితములు లోకవిదితములు. ఆంధ్ర నాటక పితామహఖ్యాతి గాంచిన ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి నాటకము లీ నవయుగాంధ్రకవితా లతాంగికి నూతనాలంకారములు. కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారిచే సంపాదింపఁబడిన యాంధ్రవిజ్ఞాన సర్వస్వము మూలమునను, తద్విజ్ఞానచంద్రికా గ్రంథమాలా ప్రచురముల మూలమునను, ద్రవిడభాషా ప్రపంచమున నాంధ్రభాష పట్టాభిషిక్తమై పాశ్చాత్య భాషలతోఁ గూడి వాహ్యాళి వెడలు గౌరవము సంపాదింపఁ గలుగుచున్నది. గురుజాడ అప్పారావు పంతులుగారి కన్యాశుల్కము మొదలగు గ్రంథములు కవితా నవ్యత ముత్యాల సరములై నూతన వికాసము నొసఁగుచున్నవి.

నాగానంద శాకుంతల ప్రతాపరుద్రీయాద్యనేకోత్కృష్ట గ్రంథరచనా ధురీణులై యాంధ్రదేశీయ విద్వాంసులచే మహోపాధ్యాయ బిరుద మొందిన వేదము వేంకటరాయ శాస్త్రిగారు మన యాంధ్రభాష కొసఁగిన మహోపకారము చిరకాల సంస్మరణీయము. కవిసింహ ఘంటాపంచాననాద్యనేక బిరుదాంకితులై నవయుగ శ్రీనాథు లనందగిన తిరుపతి వేంకటేశ్వరకవీశ్వరుల మధురకవితామృతమును జవిచూడని యాంధ్రుఁ డుండఁడు. వీరికావ్యములలో బుద్ధచరిత్రము పూర్వకవుల యుత్కృష్ట కావ్యములఁ బెక్కింటి నతిక్రమించుచున్నది. 'ఆంధ్రస్కాట్' అను పేరుగన్న చిలకమర్తి లక్ష్మీనరసింహము పంతులుగారి నవలలు నేఁటి గద్యకావ్య కర్తలకుఁ బలువురి రచనావిధానములకు మార్గదర్శకములు. నవలలే కాక వీరినాటకములును సుప్రసిద్ధములై సాధారణముగఁ బ్రతి నాటకసంఘముచేతను బ్రదర్శింపఁ బడుచుండెనని చెప్పవచ్చును. నేఁటియుత్కృష్ట నాటకములలో వడ్డాది సుబ్బారాయఁడుగారి వేణీ సంహారము పేర్కొనఁదగినది. నాటక కళాభివృద్ధికొఱకుఁ బత్రికాప్రకటనము నుద్గ్రంథ

రచనము గావించుచున్న కవిరాజు, మల్లాది వేంకటవిశ్వనాథశర్మగారి యొక్కయు, పురాణము సూరిశాస్త్రిగారి యొక్కయు నిరంతర పరిశ్రమలు ప్రశంసనీయములు. నవయుగ నేతనామాత్యులును, ఆంధ్ర వాల్మీకి బిరుదాంకితులును నగు వావిలికొలను సుబ్బారావు పంతులుగారి రామాయణమును, కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి భారతమును, పూర్వయుగములతో నిర్వీరేశలింగ యుగమును దుఁదూగించుచున్నవి. పదునొకండవ శతాబ్దమునాఁటి నన్నయభాష యథాక్రమముగా రచించుట యీనవయుగమున మానవప్రయత్నమున కసాధ్యముగాదనుటకు రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులుగారి ప్రాఁదెనుఁగుఁగమ్మయే సాక్ష్యము.

మఱియు నీనవయుగమునఁ బాశ్చాత్య మార్గమున విమర్శ గ్రంథములను వ్యాసములను రచించుచు నాంధ్ర సాహిత్యమునకు నూతనోజ్జీవనము గలిగించుచుండిన మహనీయులు పలువురున్నారు. వారిలో కట్టమంచి రామలింగా రెడ్డిగారు, బుర్రా శేషగిరిరావుపంతులుగారు, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి గారు, రాళ్లపల్లి అనంతశర్మగారు, నడుకుదుటి వీరరాజుపంతులు గారు, చిలుకూరి నారాయణరావుగారు మొదలగు కొంద ఱవశ్యముగా గణింపఁదగినవారు.

ఇట్లు పలువిధములగు నూతనకళలతోడను సర్వాంగ సౌందర్యముతోడను మన నవయుగాంధ్రభారతి 'భారతి'యను పేర మూర్తీభవించెనోయన భారతి యప్రతిమప్రతిభారతి నొంతయు నుల్లసిల్లుచు నాంధ్రులచేఁ బూజింపఁబడుచున్నది. ఏతత్ప్రతిష్ఠాపకులైన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి భారతీ సేవారతి నుతింపందగినది.

మిగిలిన యాధునికకవులం గూర్చియు వీరేశలింగయుగకవిచరిత్రమును వ్రాయు సందర్భమున మనము విపులముగఁ జర్చించుకొనవచ్చును.



# తాండవప్రకృతి

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

చెలువ తెమ్మెర మేనఁ బులకలెత్తెడివేళ, నడగుబ్బలులఁ గంప మడరువేళ
నిండు వెన్నెలచీర నిగ్గుదేలెడు వేళ, బీరెండ తెర జీరువాఱువేళఁ
గటికి చీకటికొప్పు కాఱు గ్రమ్మెడు వేళ, వేగుసందులఁ దెల్వి విరియువేళఁ
గడకారు నెమ్మోము కళలు మాఱెడువేళఁ, దొలికారు విరినవ్వు లొలుకువేళ
సరిగ నేవేళ కావేళ సరస మధుర, సతత నూతనగతి చమత్కృతులు సూపి
నవనవారంభ తాండవానందపార, వశ్యమునఁ దేలు ప్రకృతికి వందనములు

# కావ్యము - పరమ ప్రయోజనము

విద్వాన్ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రి గారు

## ౧

కావ్యములను చదువుచున్నాము. ఆనందించుచున్నాము. ఈకావ్యములు ఎందుకలన పుట్టినవి? వీనిని చదువుటవలన ప్రయోజనమేమి?—మున్నగు ప్రశ్నలు విమర్శనకు తోంచక పోవు. విచారింతము.

కావ్యముయొక్క యుద్దేశ్య ప్రయోజనముల గురించియు, కావ్యరహస్యముల గురించియు, సంస్కృత లాక్షణికులు బాగుగా మీమాంసించి యున్నారు. అందువలన, మనము చేయబోవు నీవిచారణలో మును మొదట వారి యాశయముల పరికింతము. ఈసంవాదములు కాంచుడు:

"చతుర్వర్గ ఫలప్రాప్తిః
సుఖా దల్పధియా మపి,
కావ్యాదేవ......—"

"విశ్వనాథ కవిరాజు."

(లఘుబుద్ధులకు సయితము కావ్యమువలన సుఖముగా చతుర్వర్గ ఫలప్రాప్తి కలుగుచున్నది)

చతుర్వర్గ ఫలప్రాప్తి కావ్యప్రయోజనమని తేలుచున్నది. సరియే. అయితే, కావ్యపఠనమువలన ఏ రీతిగా చతుర్వర్గ ఫలము సిద్ధించుచున్నది? అనుప్రశ్న కలుగుచున్నది. దానికి ఇయ్యది సమాధానము:—

౧. చతుర్వర్గ ఫలప్రాప్తి హి కావ్యతో రామాదివ త్ప్రవర్తితవ్యం న రావణాదివ దిత్యాదికృత్యాకృత్య ప్రవృత్తినివృత్త్యుపదేశ ద్వారేణ సుప్రతీతైవ.

౨. తత్కావ్యం సరసతాపాదనేన అభిముఖీకృత్య రామాదివ త్ప్రవర్తితవ్యం న రావణాదివత్ ఇతి కృత్యాకృత్య ప్రవృత్తినివృత్త్యుపదేశంచ కరోతి—"

మమ్మటుడు.

౧. (కావ్యమువలన చతుర్వర్గఫలప్రాప్తి ఎట్లు కలుగుచున్నదనగా 'రామునివలె ప్రవర్తింపవలె, రావణునివలె ప్రవర్తింపరాదు మున్నగు కృత్యవిధి, అకృత్య నిషేధము' వీనిబోధద్వారమున. ౨. కావ్యము రసమును కలిగించుటచేత పాఠకుల నభిముఖులచేసి 'రామాదులవలె ప్రవర్తింపవలసినది. రావణాదులవలె ప్రవర్తింపరాదు.' మున్నగు కార్యాకార్యములయొక్క విధి నిషేధములను ఉపదేశించుచున్నది.)

కావ్యపఠనమువలన చతుర్వర్గము అనగా, ధర్మార్థకామమోక్షముల ఫలము సిద్ధించుచున్నది. ప్రవృత్తినివృత్తులను కావ్యము ఉపదేశించుచున్నది. అని తేలుచున్నది. అనగా, నీతి కావ్యప్రయోజనము అని పైసంవాదములు చెప్పినట్లయినవి. రామాయణమువంటి సత్కావ్యము చదువుచున్నాము. అది యేమిచెప్పుచున్నది? రాముడు మహోదారుడు. పితృవాక్య పరిపాలనముకయి సర్వ సర్వంసహామండల ధూర్వహత్వమును త్యజించి, నారచీరలను కట్టినత్యాగి. భ్రాతృవాత్సల్య సంయుక్తుడు. సుగ్రీవుని వాలిమారణముచే రక్షించిన దీనదయా పరతంత్రుడు. సర్వజనులను రాక్షస భయంకరకృత్యములనుండి రక్షించిన నిర్వక్రపరాక్రముడు. కావున మీరును పితృవాక్యమును పరిపాలింపుడు. దీనుల రక్షింపుడు. సౌభ్రాత్రముకల్గియుండుడు. రామునివలె

ఫలములు పొందెదరు. కీర్తికాములయ్యెదరు అని చెప్పుచున్నది. లక్ష్మణునినుండి భ్రాతృభక్తి నేర్చుకొమ్మని యుద్బోధించుచున్నది. సీతయొక్క సౌజన్యాదులఁ దెలుపును; పాతివ్రత్యమును ఆమెనుండి నేర్చుకో వలసినదని సూచించుచున్నది. రావణుఁడు దురాత్ముఁడు; పరభార్యాపహారి; వ్యభిచారపరతంత్రుఁడు; సాధుజన బాధకుఁడు. అతఁడు తనచరిత్రము వలన, నికృష్ట జీవన మార్గమువలన తుట్టతుదకు మహాకష్టదశనొంది రామునిచే చంపఁబడినాఁడు. కావున, రావణుఁ డొనర్చినపనులు మీరు చేయవలదు. చేసిన, కష్టములు తప్పవు ఈవిధ ముగ నీతిని వ్యంగ్యసరణి నుపదేశించుచున్నది. ఈలాగు నసే, ప్రతిసత్కావ్యమునందును వ్యంగ్యరీతినే ఇట్టి నీతి సిద్ధించుచునే ఉన్నది. అందువలన, కావ్యపఠన ప్రయోజనము నీతి అని మనము అనుకొనవచ్చును.

అయితే, నీతి నేర్చుకొనుటకు స్మృతి నిషిద్ధము లయిన కావ్యములు ఎట్లు పఠనార్హములు? "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అనికదా స్మృతులు చెప్పుచున్నవి" అనుప్రశ్న కలుగుచున్నది. దానికి విద్యానాథుఁడు "అసత్కావ్య పరమ్" అనఁగా, 'కావ్యాలాపములు వర్జించవలసినది' అన్నప్పుడు అసత్కావ్యముల వర్జింప వలసినదనికాని, సత్కావ్యముల పరిత్యజింప వలసినదని కాదు అని సమాధానము చెప్పియున్నాఁడు. అగ్నిపురాణములో కావ్య లక్షణాదికము చెప్పఁబడి యున్నది. సాహిత్యశాస్త్రమునకు మూలసూత్రములు అగ్నిపురాణములో నున్నవి. కావ్యము పరిత్యాజ్యమే అయిన యెడల పురాణకర్త ఎట్లు లక్షణాదికమును రచించును? అదియుఁగాక కావ్య ముపాదేయమని ఈయగ్నిపురాణస్థ శ్లోకము చెప్పుచున్నది.

"నరత్వం దుర్లభం లోకే
విద్యా తత్ర చ దుర్లభా,
కవిత్వం దుర్లభం లోకే
విద్యా తత్ర చ దుర్లభా."

అగ్నిపురాణము.

"త్రివర్గసాధనం నాట్యమ్"

అగ్నిపురాణము.

(నరత్వము దుర్లభము. అందునను విద్యమఱియు దుర్లభము. అందు కవిత్వము దుర్లభము. కవితా విద్య మఱియు దుర్లభము.)

(నాట్యము త్రివర్గసాధనము).

నాట్యమనఁగా, అభినయప్రధానము లయిననాట కాదులని యర్థము. అనఁగా, రూపకములు. అవి త్రివర్గ సాధనము లన్నప్పుడు—కావ్యములు అవశ్యగ్రాహ్యము లని తేలుచున్నది.

"కావ్యాలాపాశ్చ యే కేచిత్
గీతకా న్యఖిలానిచ;
శబ్దమూర్తిధర స్యైతే
విష్ణో రంశా మహాత్మనః."

విష్ణుపురాణము.

(కావ్యాలాపములు గీతికములు శబ్దస్వరూపధారి యగు విష్ణుని యంశములు.)

కావున, పైసంవాదములవలన కావ్యము పరిత్యాజ్యము కాదని గాని, 'కావ్యాలాపములు వర్జించవలసినది' అనుస్మృతి అసత్కావ్యపరమని గాని సిద్ధాంతిత మగు చున్నది. అందువలన, పైప్రశ్న కవకాశ మేమాత్రమును లేదు సరియే, కావ్యము పరిగ్రాహ్యమె. అందు విచికిత్స ఏమియు లేదు. కావ్యమువలన నీతికదా కలుగు నను చున్నారు. నీతికై కావ్యములను మాత్రమే చదువవల యునా? శ్రుతులున్నవి; స్మృతు లున్నవి; పురాణ సంతతి యున్నది. అవి కావ్యములకన్న మిన్నగ ధర్మముల విధించుచున్నవి; వివరించుచున్నవి. అట్టియెడ, మహర్షి ముఖోద్గతము లగు వాక్యములు చదివిన, 'తీర్థమును' 'స్వార్థమును' కలవు.—కావ్యపఠన మెందుకు? అని ప్రశ్న కలుగుచున్నది

అవును, నిశ్చయమే. నీతినిబోధించు గ్రంథ జాతము మేము లేదనలేము. శ్రుతి స్మృత్యాదు లనేక ము లున్నవి. లఘుబుద్ధుల కవి రుచింపవు. ప్రభుసమ్మిత ములగు వానియర్థము నవి అందరు మనసున పట్టించుకొన జాలరు. కాఁబట్టి, లఘుబుద్ధుల నీత్యుపదేశమునకయి కావ్యము లవసరమగుచున్నవి. కావ్యము కాంతాసమ్మిత ముగ నీత్యుపదేశ మొనర్చుచున్నది. కావున, కావ్యజాత సంజాతమగు నీతి లఘుబుద్ధుల మనసుకు త్వరలో

రుచించును. వేదశాస్త్రములవలన నీత్యాదులు పరిణతబుద్ధులకు మాత్రమే—వారి కయినను అతికష్టముగ సిద్ధించు చున్నవి. కావ్యమో, సుకుమారబుద్ధులకు సయితము త్వరలో పరమానందము కలుగఁజేయుచు, సుఖముగా వానిని సిద్ధింపజేయుచున్నది.

“చతుర్వర్గప్రాప్తి ర్హి వేదశాస్త్రేభ్యో నీరసతయా, దుఃఖాదేవ పరిణతబుద్ధీనామేవ జాయతే. పరమానందసందోహజనకతయా సుఖాదేవ సుకుమారబుద్ధీనామపి పునః కావ్యాదేవ !—”

విశ్వనాథకవిరాజు.

“యద్వేదాత్ప్రభుసమ్మితా దధిగతం
శబ్దప్రధానాచ్చిరం,
యచ్చార్థప్రవణాత్పురాణవచనా
దిష్టం సుహృత్సమ్మితాత్;
కాంతాసమ్మితయా యయా సరసతా
మాపాద్య కావ్యశ్రియా,
కర్తవ్యే కుతుకీ బుధో విరచితః;
తస్యై స్పృహాం కుర్మహే”

విద్యానాథుఁడు.

పైసంవాదమువలన కావ్యములు సుకుమారమతులకు సరసములయి, ఆనంద సంధాయకములగుట, నీతిని సుఖముగా చిత్తమునకు హత్తునట్లొనర్చును అని తేలుచున్నది. అయితే, కావ్యములు సుకుమారబుద్ధులు చదువవచ్చును. నీతిని గ్రహింపవచ్చును; ఆనందింపవచ్చును. పరిణతబుద్ధులు కావ్యములు చదువుటయెందులకు? ప్రయోజనము లేదే? అని ప్రశ్న కలుగుచున్నది.

అవును, పరిణతబుద్ధులు ప్రభుసమ్మితములగు వేదములను కానీ, సుహృత్సమ్మితములగు పురాణములను కానీ చదివి నీతిని గ్రహింపఁగలరు. వారు కావ్యములమూలముననే నీతిని గ్రహింపవలయునన్న మాటలేదు. కాంతాసమ్మితములయిన కావ్యములవలనకాని వారు నీతిని గ్రహింపఁజాలరని చెప్ప వీలులేదుకదా. ఒక సాదృశ్య మరయుఁడు. ఒక రోగమున్నది. దానిని నివారించుటకు ద్వివిధములగు సాధనములు కలవు. ఒకటి చేదుమందు మఱియొకటి తియ్యనిమందు. ఎంతటి పిచ్చిరోగియయినను, తియ్యనిమందును వదలి చేదుమందును తీసికొనఁ బ్రయత్నించునా? మఱియొక సాదృశ్యము. ఒక గ్రామమునకు రెండు త్రోవలున్నవి. ఒకటికంటక శిలాదిసంస్కృతము. మఱియొక్కటి దిద్దితీర్చిన ఘంటాపథము. ఎంతపిచ్చివాడయినను రెండవదారిని వదలి, ముందటిడొంకతిరుగుడు నపేక్షించునా? అట్లే, నీతినిగ్రహించుటకు రెండుమార్గములున్నవి: ఒకటి—వేదపురాణాదుల మూలమున; మఱియొకటి—సరసములయి, ఆనందసంధాయకములగు కావ్యములమూలమున. పరిణతబుద్ధియైనను మనోహరమగు ద్వితీయమార్గమును విడచి, ప్రథమమార్గమును ఎవ్వఁడవలంబించును? అందువలననే, పరిణతబుద్ధులుకూడ కావ్యపఠనమున ప్రవృత్తులగుచున్నారు.

“నను తర్హి పరిణతబుద్ధిభిః సత్సు వేదశాస్త్రేషు కిమితి కావ్యే యత్నః కరణీయః ఇత్యపి న వక్తవ్యమ్. కటుకౌషధోపశమనీయస్య రోగస్య సితశర్కరోపశమనీయత్వే కస్య వా రోగిణః సితశర్కరాప్రవృత్తిః సాధీయసీ న స్యాత్?

విశ్వనాథకవిరాజు

పరిణతబుద్ధులు కావ్యశాస్త్రములుండఁగా, కావ్యమునందు ఎందుకు యత్న మొనరించుచున్నా రందురా? చేదుమం దుపయోగించవలసిన రోగము పంచదారచే కుదురునెడల, ఏరోగి పంచదారమందు మంచిదనఁడు?

కనుక, మనోహర సంవిధానములయి, రమ్యగభీర భావ సంకలితములయి, రసపరిపుష్టములయి, సహృదయులను ఆనందపరవశులను సంపాదించు కావ్యములమూలముననే నీతిని గ్రహింప యత్నించుచున్నారు. కనుకనే, సుకుమారమతులు, పరిణతమతులు కావ్యపఠనమునకే ప్రయత్నించుచున్నారు. అందువలన, కావ్యములు లఘుబుద్ధులకేకాక, అందఱకును ఆవశ్యకములని తేలుచున్నది. సరసులు, పరిణతమతులు, కేవలము నీతికొఱకై యేకాక, రసాస్వాదమునకయి, కావ్యములు శ్రద్ధాళువులై చదువుచున్నారు. వేదాదులయందు నీత్యుద్భాస మున్నను,

సరసతలేదు. కావ్యములో రసపుంజములు. అందువలన, కావ్యముల విషయమై పరిణతమతులకు ప్రవృత్తి కలుగుచున్నదని యిదివఱకే చెప్పితిమి. ఈనీతి కావ్యములయందెట్లు కలుగుచున్నది? అని విచారింపవలయును.

ఇంతవఱకు మనము కావ్యము పరిత్యాజ్యము కాదని చర్చించితిమి. కావ్యమునందు లఘుబుద్ధులకును, పరిణత మతులకును, ఎందువలన ప్రవృత్తి కలుగుచున్నదో నిరూపించితిమి. కావ్యముయొక్క ప్రయోజనము—కృత్యాకృత్య ప్రవృత్తి నివృత్త్యుపదేశము—అనఁగా, నీతి అని మనము మీమాంసించి యుంటిమి; మంచిది. అనీతికావ్యమును ఏవిధముగ నిబంధించిన, కల్గుచున్నదో ప్రస్తుతము మనము విచారింపవలెను. ప్రామాణికులగు లాక్షణికాగ్రగణ్యుల యాశయములు పరికింతము.

"సర్వేరల్పాపి వాగ్వృత్తిః
విద్వత్కర్ణావతంసతి;
నాయకో యది వర్ణ్యేత
లోకోత్తరగుణోత్తరః."

(అసమానగుణగణవిభూషితుఁడగు నాయకుని వర్ణించినయెడల, కవియొక్క యల్పమగు వాక్ప్రచారమయినను, విద్వాంసులకు కర్ణభూషణ మగుచున్నది.)

సరస్వతీకంఠాభరణము.

౨ "యత్ర పున రనుత్తమపురుషచరితం సన్నిబధ్యతే తత్కావ్యం పరిత్యాజ్యమేవ, తన్మూలాశ్చేయం స్మృతిః 'కావ్యాలాపాంశ్చ వర్జయే'దితి."

ప్రతాపరుద్రీయము.

(ఏకావ్యమునందు మహోత్కృష్టపురుషుని యొక్క చరితము నిబంధింపఁబడుటలేదో, ఆకావ్యము పరిత్యజింపఁదగినదే. కావ్యములయొక్క యాలాపములు వర్జించవలసినది. అనుస్మృతి అట్టికావ్యములకు అనుబంధించినది.)

3 "ప్రఖ్యాతవంశో రాజర్షిః
ధీరోదాత్తః ప్రతాపవాన్;
దివ్యోథ దివ్యాదివ్యోవా
గుణవాన్నాయకో మతః."

సాహిత్యదర్పణము.

(ఖ్యాతిచెందిన వంశము కలవాఁడు, రాజర్షి, ధీరోదాత్తుఁడు, ప్రతాపవంతుఁడు, దివ్యుఁడుకానీ, దివ్యాదివ్యుఁడుకానీ, గుణవంతుఁడు నాయకుఁడుగ ఉండఁదగును.)

పైసంవాదములవలన కావ్యమునందు నాయకుఁడు ఉత్కృష్ట గుణసమన్వితుఁడుగ ఉండవలయుననియు, అట్లుండిన కావ్యము కవితాచాతుర్యాదులు తక్కువయినను పండితుల మన్నిక్కునినియును, అట్లులేనికావ్యము పరిత్యాగ యోగ్యముకాని, పఠనయోగ్యము కాదని యును తేలుచున్నది. కావ్యమునందు నీతి ఎట్లు కలుగుచున్నది? అను ప్రశ్నమునకు ఇదియే ప్రత్యుత్తరము చెప్పినట్లయినది. ఉత్కృష్టగుణములు కల నాయకుని నిబంధించి వర్ణించినయెడల కావ్యమునందు నీతి కలుగవచ్చును. అయినే, ఉత్కృష్టనాయకముగు కావ్యము నీతిబోధకమెట్లు? అనిప్రశ్న. చూతము.

మనకు సుపరిచితమైన రామాయణమునే గ్రహింతము. నాయకుఁడు ఇందు శ్రీరామచంద్రుఁడు. ఉత్కృష్టగుణశాలి యగుటకు, మచ్చలేని వర్తనముకలవాఁడనుటకు సందేహలేశమును లేదు. అట్టి నాయకుని కావ్యమునందు నిబంధించినారు. కావుననే, ఈకావ్యమునందు నీత్యుద్భాస మున్నది. అతని గుణగణము సుస్పష్ట మగుచున్నది. అతని పితృభక్తి, దీనసంరక్షాపరతంత్రత, ప్రజాపాలనైక తత్పరత, మున్నగు గుణగణకుసుమపరీమళము మనోహరముగ దెసలఁ బర్వుచున్నది. అతని సహచరులగు లక్ష్మణునియొక్కయు, సీతామహాదేవియొక్కయు, సౌశీల్య, సౌభ్రాత్ర, పాతివ్రత్యాది గుణరత్న ప్రభలుకన్నులకు మిఱుమిట్లు గొల్పుచున్నవి. నాయకోత్కర్షము పుష్టమైనది కనుక కావ్యము నీతిదాయకము. ఈవిషయమునే (నాయకోత్కర్షము వర్ణించవలసినది అనువిషయము) పండితరాయలవారు సూచించియున్నారు.

"ఏవ మప్రధానస్య ప్రతినాయకాదేర్నానావిధానాం చరితానా మనేక విధా

యాశ్చ సంపదః నాయకసంబంధిభ్య స్తేభ్యో నాతిశయో వర్ణనీయః. తథాసతి, వర్ణయితు మిష్టో నాయకస్యోత్కర్షో న సిధ్యేత్, తత్ప్రయుక్తో రసపోషశ్చ నస్యాత్."

రసగంగాధరము.

(అప్రధానుఁడగు ప్రతినాయకుఁడు మున్నగువారి యొక్క చరితములు, సంపద, మున్నగువానిని నాయకునివానికన్న మిన్నగ వర్ణించకూడదు. అట్లు వర్ణించినచో, వర్ణనీయమయిన నాయకోత్కర్షము సిద్ధింపదు. నాయకవర్ణనజన్యమయిన రసపోషమును కలుగఁజాలదు.)

పైసంవాదమువలన నాయకుఁడు ప్రతినాయకాదులకన్న ఉత్తముఁడుగా వర్ణింపఁబడవలయునని తేలుచున్నది. లేకున్న, రసపోషము సిద్ధింపదని సంవాదముయొక్క యాశయము. సరే, నాయకుఁడు కావ్యమునందు ఉత్తముఁడుగ, వర్ణ్యుఁడు కావలెను. అట్లయిననే కావ్యము సత్కావ్యమగుచున్నది. అయితే, కావ్యమునందు నాయకోత్కర్షము ఎట్లు వర్ణింపవలయును? అని ప్రశ్న. ఆలోచింతము.

కావ్యమునందు నాయకునివర్ణనము రెండువిధములుగ చేయవచ్చును. నాయకునియొక్క సౌశీల్యమును, పవిత్రతను, గుణగణమును చెప్పి, నాయకవర్ణన మొనరించుట యొకవిధము. నాయకునియొక్క శీలము మున్నగు గుణములను ఎక్కువగా వర్ణింపక, ప్రతినాయకుని యొక్క బలపరాక్రమములను, రాజ్యవిస్తృతిని వర్ణించి, అట్టి నిర్వక్రపరాక్రమ సంయుతుఁడగు వానిని అవలీలగ జయించినవాఁడు ఈనాయకుఁడు అని వర్ణించుట మఱి యొకవిధము. లేదా, ఈరెండువిధములను కావ్యమునందు నిబంధించవచ్చును. ఏదే నొక్కటిమాత్రము వర్ణింపవలయునన్న నియమము లేదు. రెండవమార్గమును అవలంబించి వర్ణనాక్రమమును సాగించునప్పుడు ఒక్కవిషయమును మాత్రము విస్మృతిపథము నధిగమింపఁ జేయఁగూడదు.

"నచ ప్రతినాయకోత్కర్షస్య తదభిభావక నాయకోత్కర్షాంగత్వాత్, కథ మవర్ణనీయత్వ మితి వాచ్యమ్; యాదృశస్య ప్రతినాయకోత్కర్షవర్ణనస్య తదభిభావక నాయకోత్కర్షాం గతా సంపాదకత్వం, తాదృశస్య ఇష్టత్వాత్."

రసగంగాధరము.

(ప్రతినాయకోత్కర్షము నాయకోత్కర్షమునకు అంగముకదా! ఎట్లు వర్ణనీయముకాదు? అనఁగూడదు. ఎట్టి ప్రతినాయకోత్కర్షము నాయకోత్కర్షమునకు అంగము కాఁగలదో, అట్టివర్ణనము ఇష్టమైనందువలన.)

ప్రతినాయకోత్కర్షమును వర్ణించి నాయకోత్కర్షమును వర్ణింపఁ దలఁచినప్పుడు, అది నాయకోత్కర్షమునకు ఎంతవఱకు సాయపడునో, అంతమాత్రము వర్ణింపవలయునని తేలుచున్నది. ఉత్కృష్ట నాయకుఁడు వర్ణితుఁ డయినయెడల, కావ్యము నీతిబోధకమని ఫలితము. అయితే, కావ్యమునందు నీచుఁడగు నాయకుని నిబంధింతుము. అట్లొనరించిన తప్పా? ఒప్పా? ఎందువలన? నీతికదా కావ్యపఠనమువలని ప్రయోజనము! అయినచో, కావ్యమున నీచనాయకుని నిబంధించినప్పుడు నీతి కలుగునా? లేదా? అని ప్రశ్న బయలుదేరుచున్నది; విమర్శింతము.

## ౩

నీతిని రెండువిధములుగ బోధింపవచ్చును. నాయకుని సత్పురుషునిగ వర్ణించి, అతని సత్కృత్యములచే అతని కెట్టి కళ్యాణస్థితి సిద్ధించినదో నిరూపించి, మీరు కూడ నట్లు చేసినయెడల శుభములు పడయుదురు అని నీతిని గఱపవచ్చును. ఇదియొక మార్గము. ఈమార్గమును ఇదివఱకే రామాద్యుదాహరణములచే విశదీకరించితిమి. మఱల పిష్టపేషణ మొనర్పము. కావ్యమునందు నీచపాత్రమును నాయకునిగఁ జిత్రించుచున్నాము. అదియు, నాయకుఁడు తన దుష్కృత్యములచే ఎట్లు కష్టములు చెందినదియు, తుదకు నెట్టి నీచస్థితికి పాల్పడినదియు వివరించి, మీరు అట్లు ప్రవర్తింపరాదు అని రసికులకు నీత్యుపదేశ మొనర్చుచున్నది. ఇది యొకమార్గము. మొదటిది సద్భావపరంపరాబోధనమూలమున నీత్యుప

దేశ మొనర్చుచున్నది. రెండవది సద్భావాభావసంజాత కష్టావేదనమూలమున, మొదటిదానికన్న మిన్నగ నీతి నుపదేశించుచున్నది. ఒక వస్తువువలన మేలు స్పష్టముగ గోచరముకాదు. అభావమువలని కీడుమాత్రము సత్వరముగ, విశదముగ, గోచరించుచున్నది. చూడుడు, ఒక తార్కాణ: షేక్స్పియర్ కవిచంద్రునియొక్క (Macbeth) అనునాటక మున్నదనుకొనుడు. దానిని మామిత్రులు పరివర్తించినారు. అందలి నాయకుడు భైరవసింహుడు. వాడు నీచుడు; తృష్ణాతంతుని బద్ధుడు; రాజ్యకాంక్షచే రాజును జంపి, స్వామిద్రోహ మొనర్చిన పాతకి; రాజ్యము నిర్విఘ్నముగ జరుగుట కయి అనేక దారుణమారణము లొనర్చినవాడు; ఇట్టి వానిని గవి నాయకునిగ చిత్రించినాడు. కాబట్టి, ఈకావ్యము నీచకావ్యమనవలసినదేనా? అని విచికిత్స కలుగుచున్నది. కాని, నాయకు డింతటి వాడయినను, కావ్యము నీతినే బోధించుచున్నది. నాయకుడు తన పాపకృత్యములచే దనజీవితము నెట్లు ప్రళయభీకరముగ మార్చుకొన్నదియు, తుదకు తనపాపఫలముగ నెట్లు తృష్ణాగ్నికింధనమైనదియు, వివరించుచు—వీరట్లు ప్రవర్తింపవలదు ప్రవర్తించిన నట్లే చెడుగులు కలుగగల వనియు సహృదయుల నుద్బోధించుచున్నది. కావున, ఈకావ్యమువలనగూడ కావ్యప్రయోజనమైన ప్రవృత్తి నివృత్త్యుపదేశము కల్గుచునే యున్నది. కావ్యమునందు సత్పురుషుడు నాయకుడయిన యెడలనే, నీత్యుద్బోధము సిద్ధించును. లేకున్న లేదు. అనుమాట సత్యదూరమని మనకు ప్రత్యక్షమయినది. అయితే, విద్యానాథాదులు అసత్పురుష నాయక నిబంధనములగు కావ్యములు పరిత్యాజ్యములని చెప్పియున్నారు కదా, ఈ కావ్యములు పఠనయోగ్యము లెట్లు అని యందురా? అవును; నిశ్చయమే. విద్యానాథాదు లట్లుచెప్పిరి గాని, వారియావాక్యములు మాహృదయ సమ్మతములు కావు. ఏలయన—ప్రవృత్తి నివృత్త్యుపదేశము ఇట్టి కావ్యములవలనగూడ సిద్ధించుచున్నదని ఇదివరకే చెప్పియుంటిమి. కావున, ఏతాదృశకావ్యములకు కావ్యత్వహాని కాని, పరిత్యాజ్యత కాని, కల్గుటలేదని సిద్ధాంతము. సరియే, బాగున్నది. నీచనాయకుల జిత్రించిన కావ్యములుకూడ నీత్యుపదేశకములగుచున్నవి అని యొప్పికొందము. కవీశ్వరులు ఇట్టి నీచపరిస్థితులను గ్రహించి తమప్రతిభను, అనల్పకల్పనాశక్తిని, పాండితిని, వృథా వినియోగించి కవితను సాగించు టెందుకు? ప్రపంచమున మనోహరపరిస్థితులు లేవా? మహోదార చరిత్రులగు నాయకులు లేరా? భాషాదారిద్ర్యము సంభవించలేదే! పురాణములు వెదకినన్ని నాయకరత్నములు ఈయజాలి యున్నవే! ప్రతిభాదేవి ఉత్కృష్ట చరిత్ర సంపన్నుల సృష్టింపగలదే!! అట్టి నాయకుల పవిత్రచరిత్ర వర్ణనము 'పుణ్యమును బురుషార్థమును' గదా! ఎందుల కీనిరర్థకాయాసము, నీచప్రకృతుల నిబంధించి, కవులు ఫలములేని పనికయి అనుభవించుట? అను సందేహము డెందము నావరించుచున్నది. విచారింతము కాక.





# ఈశ్వర చింతనము

వేమూరి సీతారామశాస్త్రి గారు

పరికింపంబడు నర్థజాతమిది స్వప్నప్రాభవంబట్లు న
శ్వరమున్ హేయము దుఃఖదంబు నగుటల్ సర్వానుభూతంబ, యీ
శ్వరుమాయాబలమో మఱొండుకతమో ప్రాజ్ఞుండు సైతమ్ములన్
బరమార్థమ్మునకై యతింపఁడు తలంపన్ వింతయున్ వంతయున్.

శా. గాలిన్ మేడలఁ గట్టుపోలిక నసంఖ్యాకంపు బాలోచనల్
పాలిన్ జేయుదు రీప్రపంచమున స్థైర్యంబెంచి; యల్లంతలో
నేలంగూలుదు రీతలంపు లిటులే నిల్చుం గదా! యీధనం
బీలాగే గిన ముందిఁకేగనియొ యూహింపంగ రాదింతయున్.

మ. హితమేదో యహితంబెదో స్థిరమెదో యేదస్థిరంబో, సుఖో
న్నతిఁ జేకూర్చునదేదొ దుఃఖదమెదో నానుక్తిసంయుక్తిచే
మతిఁ జర్చించి నిజమ్ముఁ గాంచి హితముం బ్రాపించు పోంకౌన్ సదా
యతమున్ సల్పవలెన్; ఫలం బిదియె కాదా! మానవుం డొటకున్.

మ. కలిలో నర్వదిమోసములాయునని వక్కాణింతు రీనాఁడదిన్
దిలకింపంబడ దుత్తరక్షణమునేని న్నమ్మి దృష్టాంతమ్ముఁగా
మెలఁగం జెల్ల, "దెటుల్ భవాబ్ధి గడతున్ మేల్గాంతునే"ట్లంచుని
చ్చలుఁ జర్చింపవలెన్, భజింపవలె శశ్వద్భక్తమై సీశ్వరున్.

మ. బహుజన్మార్జిత పుణ్యసంచయమునన్ బ్రాపింతురా జ్ఞానధూ
ర్వహ మీమానవజన్మ, మింద పరమార్థమ్ముం దగాఁ జెల్లు శ్రీ
మహిళాజాని భజించుకంటెఁ బరికింపన్ రాదు తన్మాయమొం
డిహమందున్; దెలివొంది నేఁగిరపడుండీ దీనవుండన్ జనుల్.





# ప్రణయ కోపము

(ఒకవిమర్శనము)

ఆంధ్ర శేషగిరిరావుగారు

"ఉ. కమ్మనితేనె లొల్కు నుడికారము సొంపు; రసంబు కూర్పుఁగా
నిమ్ముగఁ జేయు నేర్పు; చెవిఁ జేర్చినవో నమ్మతి ప్రవాహమై
సమ్మద కారణంబయిన శైలియుఁగల్గి తలిర్చునట్టి......" — శేషాద్రిరమణకవులు

'ప్రణయకోపము' శ్రీవేంకట పార్వతీశ్వర కవులచే రచింపఁబడిన చవిఁగల చక్కని చిన్నిగీతమాలిక. పింగళి సూరనకుఁ బిమ్మట భాషాసౌభాగ్యసౌందర్యపరిపోషక మగు కవన మల్లువారే ఆంధ్రకవితాప్రపంచమున గొడ్డువోయియుండ వీ రవతరించి క్రొంగ్రొత్త కవనంపు సొంపుసంపదలు గూర్చి ఆంధ్రసారస్వతసుందరికి ముద్దు మురువు కూర్చుచున్నారు. ఆంధ్ర సారస్వతమునందు వీరి కవిత్వము గొప్పపరివర్తనము గావించినది. అంతదనుక ఆంధ్రకవులందుఁ బాదుకొని యున్న మూర్ఖాభిప్రాయములను వీరికవనము కొంతవఱకు సడలించినది. కవితాకన్య తల చీఁదఱ పూర్తిగఁ దొలఁగించినది. శ్రీనాథుఁడు సీసముల యొయ్యారపునడకను, సుమతీశతక కారుఁడు కందముల జిగిబిగియు, కవిధూర్జటి శార్దూల మత్తేభముల ధారావేగమును, వేమన ఆటవెలఁదుల మృదుమాధుర్యములును, ఆంధ్రలోకమునకుఁ జూపి చిరస్మరణీయులైనట్లే శ్రీవేంకటపార్వతీశ్వరకవులు తేటగీతలు మంజరుల లాలిత్యలావణ్యములు వెల్లవిరించి చరితార్థులైనారు. నవ్యకవిత్వమునకు, ఖండకావ్యరచనమునకు వీరు సృష్టికర్తలు గాకపోయినను సూత్రధారులు. చింతా శంకర దీక్షితులు, వేదుల సత్యనారాయణశాస్త్రి, నాయని సుబ్బారావు, నండూరి బంగారయ్య, చిల్లరిగారి కామేశ్వరరావు, నండూరి వేంకటసుబ్బారావు, నిడుమర్తి సత్యనారాయణ, భమిడిపాటి రామసోమయాజులు, మునిమాణిక్యము నరసింహారావు మొదలగు యువకవులు వెన్నపూసవంటి నవ్యకవిత్వమునకు వీరి కవిత్వము పురోగామి యనుట సత్యసమీపము. ఆంధ్రభాషాబాలామకుఁ బ్రాణప్రాయ మనఁదగినది వీరికవిత. అట్టి కవితాకలశ మంపుఁ 'బ్రణయకోప'మను గీతమాలిక అమృతపుఁ జినుకువంటిది.

ప్రణయకోపధారిణియగు రాధ కథారంగమునఁ బ్రవేశించుచున్నది. అది 'స్వాంతమలరించు వర్షావసరము' 'జోరుమని వానకాలువలు జారుచుండు'టచే శుకదంపతులు తొఱ్ఱు వీడుటలేదు. 'తొఱటవాయని శుకదంపతుల' వలెఁ దానుకూడ సుఖింపఁగోరి 'ఆసపడి ప్రాణనాయకుఁడు' వచ్చియున్నాఁడు, రాధికకడకు. అట్టిమెడ.

'ప్రణయకోపంబు దాల్ప నెవ్వారి తరంబు?
గొల్లచేడియ రాధకుఁ జెల్లెఁగాక!'

రాజసగుణప్రధానయగు సత్యభామవలెఁ జీటికిమాటికిఁ జిలిపి బుస్సులాడు స్వభావముకలదియా రాధ? కాదు. ఆమె 'మృదుల తర పుష్పసుకుమారహృదయ.' గోపాలుఁడే తన సర్వస్వమని నమ్మినది. ఆతఁడు చెంత లేనిచో తనదు జీవమే వమ్మని తలఁచునట్టిది. అట్టి రాధ ఏలనో!

'ప్రేమ గలవాఁడు, నందుని పిల్లవాఁడు,
మదన జనకుండు, తనయెట్టె యనుటనుండ.'

అవ్వలిదిక్కు మోమైపె నిలిచినది. పారిజాతాపహరణములోని 'లతాంతాయుధుఁగన్న తండ్రి' పదమునకువలె నిచ్చో 'మదన జనక' పదము సాభిప్రాయ విశేషముగలది. శ్యామాంగ ప్రభుఁడు, పద్మదళాక్షుఁడు, రసికజన శిఖామణి, ప్రేమైకమూర్తి, తన కన్నుల యెదుట నుండి 'నెయ్యంపుపలుకుఁ' బూన,

'గారవం బేదో రాధకుఁ గలుగదాయె.'

ఆ కారణమేదియో—'రాధాకృష్ణులు మేమింత యెఱుఁగినవారు కారు' అని చాటుకొన్న—కవీశ్వరులే కనిపెట్టఁ జాలకున్నారు. ఏమందురా?

'ఎట్టి నిర్బంధ మయ్యెనో యేమొగాని
ఎట్టి గొడవలు పుట్టెనో యేమొగాని
యేమి యూహించెనో చెప్ప లేము'

అని కవులే ఒప్పుకొనుచున్నారు. కథాంతమునన్నైనఁ గారణము తెలిసికొనఁ బ్రయత్నింతము.

పోలయలు కానియున్న దంపతుల నడుమ కవులిరుఁ దీర్పరులగుచున్నారు. కాని వీరి తీర్పు 'తుని తగవు' సామ్యమైనది. ఎట్లందురా? వీరి తీర్పున కృష్ణుఁడును రాధయుఁగూడ దోషులే. చూడుఁడు—

'గోపికానాయకుం డెంత కొంటెవాఁడొ
అంతకంటెను ఖండిత యగు నురాధ,
ఎంతకైనను మగవాఁడు కృష్ణమూర్తి
తనదు నధికార మటుఁజూపఁ దగదు రాధ;
మృదుల తర పుష్పసుకుమార హృదయ రాధ
నిట్టు లలయింపఁదగదు శ్రీకృష్ణునకును.'

ఈతీర్పైన ప్రణయకోపమును చల్లార్చినదా? లేదు; మీఁదు మిక్కిలి 'పలుకుమను చున్న ప్రణయమునకును'— 'కూడదను చున్న కోపమునకును' పోరాటఁ గల్పించె,

'రాధకాకృష్ణుల పృథానురాగగరిమ
మోతఁగియున్న వారలకిది యొంతవింత!'

అని తల పంకించుచున్నది.

ప్రణయానురాగ కలితులైన రాధాకృష్ణుల నొక్క సౌధాంతమునందె నిల్పి ఎడమొగము పెడమొగముగఁ జేసిన ప్రణయకోప మహిమను గూర్చి కవులు తలపోయుచున్నారు.

'నిరత మీకోపమిట్టులే నిలుచునేమొ?'

యని భయమొందుచున్నారు. ఆ అనుకూల దాంపత్యము, ఆ చనవు, ఆ కూరిమి,

'కుటిలమైన తాత్కాలిక క్రోధవహ్ని
బారిఁ బడిపోవఁదగినదా?'

అని జాలిపడుచున్నారు. అంతలో మూసమే లేని ప్రణయకోపమున కింత చింతిల నేల యని ధైర్యమొందుచున్నారు. ఈధైర్యములోఁ బ్రణయకోప మిట్టిదనిపోల్చి చెప్పుటకుఁ గవులకు అవకాశమును అవసరమును గల్గినది. కావున వారు ప్రణయకోప తత్త్వము నిట్లని నిర్వచించుచున్నారు.

'...తెలియరాకమైనది దాని తెఱఁగు
దానికుటిల ప్రకృతి యసాధారణంబు
దానివేషంబు మాయావితానకంబు
దాని వృత్తం బనాలోచితంబుగాదె?'

నాయికా నాయకుల నడుమ మధ్యవర్తులై, తీర్పరులై, ప్రణయకోపతత్త్వనిర్వచనమున రాధికాకృష్ణులనుండి వేఱైన కవు లిట నుండి మరల పాత్రములతో నైక్యమొందుచున్నారు. మూతులు ముడిచి పెడఁబాసిపోయిన రాధాకృష్ణు లిపుడు అన్యాపదేశముగ నిట్లని మాటలాడుకొనుచున్నారు. వారికిఁ జిరకాల పరిచితులైన కవులు పలుకునవ్వడినివారి సంభాషణముల పోలికపట్టి తెల్పుచున్నారు. నర్మగర్భముగా రాధ యిట్లనుచున్నది.

'అళివరా! నీవు చాల ధన్యాత్ముడవు
మంద భాగ్యను నావంక మరలెదేల?
వలపుఁ గొలిపెడు నీపువ్వు వాటిలోన
కరిగి విహరింప నిన్నెవ్వ రాఁగఁగలరు!'

దానికిఁ గృష్ణుఁడు చమత్కారముగ నిట్లని నర్మోక్తులాడుచున్నాఁడు.

'ఒక్క తరుకోటరంబున నున్నవార
లొట్టువెట్టిన ముట్టుకో కుండు టెట్లు?
కసరివలికిన బెదరక మసలు టెట్లు?
లొట్టఁదీసి గట్టనఁబెట్టి మోసి చిలుక!'

రాధికా హృదయాంతర క్రోధవహ్ని సుధాధారా రసస్యందియైన యీవచనములచే నైనఁ జల్లారలేదు. వేఱుపాయమరయ యత్నించుచున్నాఁడు కృష్ణమూర్తి. ఇంతలో 'స్యందనాశ్వహేషారవంబు, అక్రూరుఁడువచ్చెననుజనవాచకంబు, "శౌరియెక్కడ?" ననెడి ప్రశ్నావిరావంబు,' నొక్కమాఱుగ నుదయించి చిరవియోగ సూచకమగు కృష్ణు మధురాప్రయాణము రాధస్మృతి పథమునకుఁ దెచ్చినవి. వెతలముంచు వియోగము సహింపనేరక రాధిక వెన్నుని కలిసికొనఁ దత్తరపాటుతోఁ గేళిసౌధము వెడలివచ్చినది. కాని,

'అప్పుడే కృష్ణుఁడక్రూరు నరదమెక్కె'

అంతట రాధకు 'డిల్లపాటునగుండె గుభిల్లు'మన్నది. ఆమె తనదోషము గ్రహించినది. తన్నుఁదా నిందింపఁ దొరకొన్నది. కోపమును పాపుకోపమన్నది. తన బ్రదుకు నోరుని వెలిపింపఁబోయి తా వెలిచినట్లైనదని చింతిల్లినది. తిరిగి శౌరి కంటఁబడనేని తప్పులకుఁ బాదములు పట్టుదాననని కృతనిశ్చయయైనది. మఱియు:

'వేణుగాన లోలుండెంత విరసుఁడైన
సరస నుంచుటయే నాకుఁ జాలు......'

ననుకొన్నది. కృష్ణమూర్తి తనకడకు

'వచ్చుటే పదివేలు వాత్సల్యముంచి
చూచుటే పదివేలు సుస్నేహ ముంచి'

—నండూరి బంగారయ్య.

అను అల్పసంతోషగా మారిపోయినది, ఖండితనాయకా లలామయగు రాధిక. కావుననే ప్రణయకోప తత్త్వజ్ఞులైన శ్రీవేంకట పార్వతీశ్వర కవులు,

'ఎదురు కొను కొలందిని కోప మెచ్చుచుండు
వెడసి చనుకొలందిని ప్రేమ హెచ్చుచుండు'

నని నిజము వాక్రుచ్చినారు.

మృదులపర్యంకమున రాధ నిశ్చేష్టయై పడియుండి, కొంత సేపటికిఁ దెప్పిరిల్లి, లేచి

కూర్చుండి, చారు చేలాంచలమునఁ గన్నీరు దుడిచికొని, రమణుపేర నొకయుత్తరము వ్రాసి ముగించినది. మొదటినుండి తుదిదాఁక ఆలేఖ చదువుకొన్నది. అంతట నామె 'అతితరంబగు దుఃఖము నాఁపలేక' పోయినది. 'రమణునకు లేఖనంప ధైర్యంబులేక పోయినదామెకు. ప్రతిక్షణ మహాయుగము లెట్లును గ్రమింపలేక పోయినది. అంతట.

'ఏమి తలపోసికొన్నదో యేమొ కాని
హస్తమందున్న పత్రిక నట్టె విడిచి
సౌధమును డిగ్గి బిరబిరఁ జనియెరాధ'

కథారంభమునుండి నాయికకూడ నిష్క్రమించినది. అట్లగుట నీ ఖండకావ్యము కష్టాంతకమనుటయే సమంజసము. కష్టాంతిక కావ్యరచన హైందవ సాంప్రదాయవిరుద్ధమని కాఁబోలు దీనిని సుఖాంత సూచకముగనైనఁ జేయఁ గవులు యత్నించిరి.

శా. 'ఆకర్ణాయతనేత్రమై మణిమయో
ష్కుత్కుండలవ్యంధ్యశో
భాకీర్ణాంచిత గల్లమై సురవనం
తై సుందర భ్రూయుతం
బై కమ్రస్మిత చంద్రికా విలసితం
బై యొప్పు శ్రీరాము మో
మీకాయంబునఁ జూచు భాగ్యమిఁకలే
దేమో? సుమిత్రాత్మజా!'

కంకంటి పాపరాజు.

అని ఆమందాకినీతీరమున సీతామహాసాధ్వివాపోయిన విధమున, రాధిక మనోనాయకుని గూర్చి

'నీవగు ప్రేమను నీదు భాగ్యమును
బొంది సుఖించెడి పుణ్యమేమియును
నీకఁ బాకుఁ గల్గఁబో దీ జన్మమందు'

అని లేఖాముఖమున వనరుచున్నది. ఇది శ్రీకృష్ణుని హఠాత్సందర్శన నిష్క్రమణ ఫలితమగు నిరాశ, నిరుత్సాహములచే వ్రాసిన వ్రాఁతగాని నిజముమాత్రము కాదని కవుల యభిప్రాయము. ఏమందురా? రాధికా కృష్ణులతోఁ జిరపరిచయముగల కవులలేఖిని ఇట్లని ఘోషించుచున్నది.

'రాధికా కృష్ణు లిందుఁ బరస్పరంబుఁ
గలిసికొనకుండ మనకథ గడఁచెగానిఁ
వార లెట్టులైనఁ గలియక పోరు తుదకు'

ఏమందురా?

'ప్రణయకోపంబు వైరకారణముగాదు
ప్రియుల హృదయంబు పాషాణ మయముగాదు'

ఇట్లు వ్రాయుటచే నీకావ్యము సుఖాంతము కాకపోయినను; సుఖాంత సూచకమైననైనది.

ఈ కృతికి మూలసన్నాగ మనఁదగిన రాధికా ప్రణయ కోప కారణ మేమి యో కథాంతమునను వచ్చియు మన మెఱుఁగఁ జాలకున్నారము. అవును! మన కెట్లు తెలియును?—కవులు మనయందు నెనరుంచి తెలుపకుండిన—కాని కవు లీయెడ గారకాయవాట ముచేసి, 'ఏకాంతమునఁ జరించు దంపతుల వృత్తమెవ్వరు తలఁపఁగలరు?'—అన్నారు.

ఈ 'ప్రణయకోపము' నిజముగా సుధారసంపుఘుటిక. ఆంధ్రప్రబంధములలో ప్రభావతీప్రద్యుమ్నమున కొంతటి పలుకుబడి యున్నదో ఆంధ్రఖండ కావ్యములలో దీని కంతటి పలుకుబడి తప్పకకల్గును. ఖండకావ్యములలో నింతటి రసవత్తరమైన కృతి మఱి ఆంధ్రమునలేదు. శ్రీవేంకట పార్వతీశ్వర

కవులు రచించిన ఇతర గీతమాలికలుగాని, లాతి ఆధునికాంధ్రకవి గ్రామణుల రచనములు గాని, రసవిషయమున ఈ ప్రణయకోపమున కీడురావనుట మువ్మాటికి నిశ్చయము. రమ్యత, నవ్యత ఈ గీతమాలిక ప్రధానగుణములు.

రాధాకృష్ణు లిందు నాయికానాయకులు. 'పూతవసిండినంటి వలపుం బచరించు' నెఱమెచ్చులాడి కాక రాధిక 'ఐహికాముష్మికానంద ప్రవాహపూర్వకమైన శృంగారరస మాత్మ నిరుపుకొల్పి' నెన్నని విశుద్ధముగఁ బవిత్రహృదయముతోఁ బ్రేమించినపడఁతోఁడి. కృష్ణుఁడో ఆమెను అల్లారుం బ్రేమముగాఁ జూచి ఆనందించువాఁడు. ప్రణయకోపకారణమున వీరిలోఁగల్గిన అలుకలు లిందు రమ్యముగ వర్ణింపఁబడినవి. పాత్రల ప్రవేశ నిష్క్రమణము లిందుపొందికగాఁ గుదిరినవి. రాధ ప్రణయములకు స్పర్థఁబెంచి చమత్కరించి కవులు పాఠకులను దన్మయత్వము లో ముంచినారు. తేటగీతములకొలకు శ్రీ వేంకట పార్వతీశ్వర కవులును, ఈకవులకోసము తేట గీతములును ఆంధ్రమునఁ బుట్టినవనుట ఈగీతమాలిక చక్కఁజదివిన రసజ్ఞుల కనుభవనీయాంశము. విశేషించి ఈకావ్యమునం దెల్లయెడలఁ జూపట్టునది శైలీమార్దవము. కొన్నిచోట్ల ఇందలి శైలి ముక్కుతిమ్మనార్యుముద్దు పల్కులతో ముచ్చటలాడుచున్నది.

ఈకావ్యమందలి రాధవలె విశుద్ధప్రేమ గల్గియుండు నాయికలు ఆంధ్రప్రబంధములు కనని వినని సంగతి. ఉత్తరములు కథాసరణి యందుఁ జొప్పించు నొకనవీనమార్గము. ప్రభావతీప్రద్యుమ్నమున ప్రద్యుమ్నుఁడు శుచిముఖిచేరఁ బంపించిన యుత్తరము ఆకావ్యమందలి నూతనమార్గములలో నొకటి. ప్రస్తుతము మన విమర్శనకుఁ బాల్పడిన 'ప్రణయకోపఖండకావ్యము'నకు 'రాధికాసాధుభావ విరాజమానమోహలేఖ' చైతన్యము కల్గించుచున్నది. 'సౌరభము వెదఁజల్లు భావము' లకు సాంతలు యనఁదగిన ఈ వాక్ప్రసూనమాలిక ఆంధ్రభాషావధూటికి రమ్యగ్రీవాలంకారము కాఁగలదు.

## బాలకా!

### పాణ్కులూరి లక్ష్మీనారాయణ గారు

ఈ చిద్విలాసంబు నెందైనఁ గందునా? పరమాత్మ పగుణుఁడో పట్లఁగాఁగ,
ఈసచ్చిదానంద మెందైనఁ గందునా? అవ్యక్తుఁ డీరీతి నాడకున్న,
ఈరూపురేఖల నెందైనఁ గందునా? నేను నీవై యిల నెగడకున్న,
ఈచంచలత్వంబు నెందైఁ గందునా? ఇంపొ పరబ్రహ్మ మెడలఁదక్క,
సూర్యుఁడవు నీవ చంద్రుఁడుఁ జుక్క లీవ, సత్వమును నీవ సర్వసాక్షి వీవ,
ఇన్నియునుగూడ నీవయ్యు యేద్వ నేల, బాలకా! వేగఁ దెల్పుమ భవ్యసరణి.

-ము నామె ప్రాపంచికసౌఖ్యాభిలాషులకు
గ్రాహ్యాయులగు సద్గోపాలురఁ బూజించుటకుఁ
...మును బ్రకటించెను. ఇందువలన
...నకమగు రామభక్తియు స్వయం
... మొల్ల రామాయణ

# ఆంధ్ర కవయిత్రులు—వారి కవిత్వము

రావూరి చిట్టి వెంకట సుబ్రహ్మణ్యము గారు [సారస్వతసమ

సారస్వతప్రపంచమునకు స్రష్టలైన కవి భావనాసౌధాంతర విహారహారులై, ప్రకృతికాంతాలలామ యొసంగు మధువునే యమృతప్రాయంబుగా నాస్వాదించుచు, దివ్యానుగ్రహమునఁ జొక్కి లోకమునం దందఱికంటె మిన్నలై ప్రకాశించుచుందురు. మహాత్ముల కార్యము లెట్టివైన లోకమునకు శ్రేయస్సు నాపాదించువిషయమున జగమునం దెవ్వరిని పరకుఁగొనక స్వానందమునకు సూటిగాఁ బోయి యుల్లసమునఁ బలుకు కవిపల్కులు 'కారణ సంక్రాంతగుణానుషంగము'న శ్రోతలకును బాఠకులకును నట్టి యవ్యాహతానందమునే చేకూర్చును. అట్టి కవితల్లజులు ప్రతిదేశమునందును బ్రతికాలమునందును గలరు. వారు తమ నామగోత్రములకే కాక తాము జన్మించిన దేశమునకును గ్రామమునకును గూడఁ జిరతరమగు కీర్తి ఘటింతురు. ప్రతిసత్కార్యమునందును స్త్రీలుగూడఁ బురుషుల ననుకరించి వన్నెకెక్కురీతినే కవిత్వవిషయమునందుఁ గూడఁ బ్రతిదేశస్త్రీలును విశేషయశమును గాకపోయినను దక్కువకాని యశము నార్జించియున్నారు. ఇట్టి కవయిత్రులు ప్రతిసారస్వతమునందును గణనీయస్థానముల నాక్రమించియున్నను వారిసంఖ్య యాయాసారస్వతమునందలి కవులసంఖ్యతో సమము గాకపోవుట యటుండగా నాసంఖ్యయందుఁ బదివంతైన నుండదనుట నిర్వివాదాంశము. దీనికిఁ గారణము వైదుష్యసంపాదనమునఁ బురుషుల కున్న శ్రద్ధయు, నాసక్తియు, నవకాశమును స్త్రీలకు లేకపోవుటయే. తక్కుంగల దేశములందు కన్న మనహిందూ దేశమున స్త్రీవిద్యావిషయము మిగుల వెనుకఁబడియున్నది. అయినను బురుషులతోఁ బాటు సమానస్వాతంత్ర్యముల ననుభవించుచున్న స్త్రీలుగల యితరదేశ సారస్వతములఁగూడ కవయిత్రుల సంఖ్య మిక్కిలి తక్కువగనే కాన్పించుచున్నవి. అట్టిచో భాషావిశేషములందుఁ దదితరభాషలందున్నను. కథాప్రాజాలినను నుత్తమసారస్వతసంపదయందు మొదటి మనయాంధ్రభాషాసారస్వతమునందుఁ గవయిత్రులు పెద్దసంఖ్యగా నుండునని యూహించుట కేవలము ప్రమాదము. మఱియు నాంధ్రదేశమందు పౌరాణికయుగములలో నేసిగముగా నుండెనో మనకుఁ దెలియరాదుకాని మనకుఁగలచరిత్రనేత్రమునఁ జూచినచో స్త్రీవైదుష్యము చాలకాలము నుండియు వానకాలమునందలి కోకిలకూతయై యుండెననుట సర్వజనవిదితము. కట్టుదిట్టములకుఁగారణమేమన మనయాంధ్రులకు నితరదేశములవారికంటె శిష్టాచారసాంప్రదాయములం దెక్కువ దీక్షయుండుటయుఁ జాలనట్టి శిష్టాచారమును తప్పుత్రోవలో నర్థము చేసికొంటయు మాత్రమేయై యున్నది. ఇతరసారస్వతములందలి కవయిత్రుల సంఖ్యకు మనకవయిత్రుల సంఖ్య పొత్తుగాఁ దీసిపోవకున్నను మొత్తముమీఁద మన కవుల సంఖ్యయందు శతాంశమైన నుండుననుట శంక్యము. ఆంధ్రసారస్వతమందుఁ గొంచె మభిరుచిగల వారందఱు తెలుఁగు కవయిత్రుల నామములు రెండుమాత్రమే యని వచించుట విచారసూచకము. అందు మొదటి యామె మొల్ల. ఈమె భక్తివైరాగ్యలక్షణములు గల పాఠకుల కెడతెగిపిలేని సంబరము నొసంగును. రెండవ యామె ముద్దుపళని. ఈమె శృంగార రసాస్వాదనపరులగు కావ్యభిక్షుకుల నోగిరమును వమనముఁజేయును. వెల్లడికి వచ్చిన దీ కవయిత్రీద్వయము మాత్రమే. కవనమునం దించుమించుగాఁ బైవారితో సమానయు నితరవిషయములన్నిటి యందును వారికంటె నధికురాలును నగు తరిగొండ వెంకమాంబ యింకను బుస్తకవిక్రేతల గృహములందునే విశేషముగా నివసించుచున్నది. మిగిలిన కవయిత్రుల నామములు 'కవిజీవితము' లందును బరిశోధకుల స్వాధీనమందును నున్నవి కాని వ్యాప్తికి వచ్చుట

కవులు రచించిన ఇతర గీతములయందుఁగల ...క యాకవయి లాతి ఆధునికాంధ్రకవి గ్రామణు... జాలని కతమునవో గాని, రసవిషయమున ... మునకు దుర్జ్ఞేయము కీడురావనుట ముమ్మానము ప్రయత్నము సేయక త, సర్వత్ర ఈ గీతసయున్నంతవట్టును మనయాంధ్ర సారస్వతమునకు నాపాదించిన యా రాధా ...ర్చి చర్చించి యారమణీమణుల నాద కులు. స్వస్తి.

నెజ-

## ౧. మొల్ల

ఉ. తీయని తేనెమాటల నతిప్రమదంబు జనింపనట్లు రా, మాయణమున్ రచించి తన మర్త్యశరీరము వీడియు న్నశిక, కాదుముతోడ నెల్ల కవికాంతము సన్నుతు లీయ నాంధ్రులో, కాయతనంబున న్వాలయునట్టి పవిత్రను మొల్ల వెంచెదన్.

ఈకవయిత్రీమతల్లి రచించిన గ్రంథము రామాయణము. ఇది సంస్కృతమునందువలెనే యాఱుకాండములుగా విభజింపఁబడి మిక్కిలి సంగ్రహముగా వ్రాయఁబడినది. మొల్లరచనయందు రామాయణ కథయే సంగ్రహమైనదికాని యాకథలోని మాధుర్యమును, రసమును నెంతమాత్రము సంగ్రహము కాలేదు. ఈమె తనగ్రంథములో నెచ్చటను స్వీయమగు కులగోత్రములఁ గూర్చి చెప్పికొనకపోయినను జిరకాలమునుండి కుమ్మరమొల్ల యని యావదాంధ్రదేశమునందును బ్రఖ్యాతిగాంచియున్నది. తనజనకుని పేరు ఆతుకూరి కేసనసెట్టి యని గ్రంథపీఠికయందు వ్రాసియున్నది. మఱియుఁ దనకుఁ బాండిత్యవిశేషమేమియు లేదనియు గంధ్గ్రంథములేవియుఁ దాను బఠించియుండలేదనియుఁ గవిసాంప్రదాయములు తనకు సగమెఱుక యనియు 'గోపవరపు శ్రీకంఠమల్లేశు వరముచేత నేఁ గవిత్వంబు సెప్పగా నేర్చి కొంటి' ననియుఁ దెలియఁజెప్పినది. ఈపద్యము నాధారముగాఁ జేసికొని యీమె నివాసస్థానము నెల్లూరిమండలములోని గోపవరమని విమర్శకులు నిశ్చయించినారు. ఈమె పూర్వకవిస్తుతిలో శ్రీనాథుఁడు తుదిగాఁ దత్పూర్వుల మాత్రమె పేర్కొనియున్న కారణమునను, తెనాలి రామకృష్ణుఁ డీమె గృహనామమునువిని యాక్షేపించెనను జనపరంపరగాఁ దెల్పుచువచ్చు కథవలనను దర్వాతి లాక్షణికులలోఁ గొందఱివలన వారి లక్షణగ్రంథములం దీమె పద్యము లుదాహరింపఁబడియున్న కతమునను నామెజీవితకాలము కొంచెమెచ్చుతక్కువగా నాంధ్రభోజుఁడగు శ్రీకృష్ణదేవరాయల కాలమేయనియును జరిత్రకారులు నిర్వివాదముగా నిర్ధారణ చేసియున్నారు. వివాహానంతరము మాఱిపోవలసిన తనగృహనామమును గాని భర్తృప్రసక్తినిగాని యీమె తనగ్రంథమునం దేమియు వివరపఱచనందున మొల్ల బాలవితంతువై యుండునని మనవారు తలపోసియున్నారు. దానిని నమ్మవచ్చును. ఏమన, తక్కువజాతియందు జనించి వివాహానంతరము భర్తృగృహమునకుఁ బోయి కాపురము సేయుచునిచఁకు కూడఁబలుకుకొని సామాన్యగ్రంథమును జదువఁగలమాత్రపు విద్యావాసనయైన నంటుట మనదేశమునందు మిక్కిలి యరుదనుటకంటె లేదనియే చెప్పవచ్చును. అదియటుండఁ బాండిత్యము సంపాదించి గ్రంథములు రచించినవారిలో నిత్యసువాసిని యగు ముద్దుపళనితక్క చాలవఱకుఁ గవయిత్రులును విదుషీమణులును భర్తృవిహీనలనియే మనము వినుచున్నాము. ఇందులకు లీలావతి, తరిగొండ వెంకమాంబ మున్నగువారి చరిత్రములు మనకుఁ బ్రమాణములు. ఇట్టివో గ్రంథపఠనమునకు మాత్రమే కాక గ్రంథరచనకుఁ గూడ సభర్తృకయగు మొల్లకు నవకాశము చిక్కెనని మనము నమ్ముటకు వీలు కానరాదు. ఈమె విగతభర్తృకయైనను సభర్తృకయైనను నామెగృహవిషయముల ప్రసక్తి మనకంతగా నవసరము లేదు. భక్తిముక్తిదాయకమగు రసవత్కావ్యమును రచింపఁగల్గి తనజన్మము ధన్యముగాఁ జేసికొనఁగల్గుట యామహామణి యదృష్టము. ఇట్టి సరసగ్రంథమునకుఁ గర్తృత్వవిషయము శంకాస్పదము కాకపోవుట మనయదృష్టము. ఈమె సభర్తృకయే యైయుండిన మన సారస్వతమునకు మొల్లరామాయణము లేకపోయియుండునేమో! కనుక మనయూహ సత్యమేని యీమె విగతభర్తృక యగుటయే మనకు మంచిగాఁ బరిణమించెనని కన్నీరులోనైనను మనము చెప్పవలసియున్నది. లోకవ్యవహారములం దామె భర్తృవిహీనగా వ్యవహరింపఁబడినను సత్యమున కీమె శ్రీమతియే.

ఇక నీమె రచనాకౌశల్యమును బరీక్షింతము. మొల్ల రామాయణము మిక్కిలి ముద్దులుగులుకు పద్దెములలో రచింపఁబడినది. ఎంతటి పామరులకైనను నీమె కవిత్వము బోధపడి శ్రవణానందమును గూర్చును. కేవలము తమ పాండిత్యప్రకటనముకొఱకు కఠినమైన పదములఁగూర్చి దుర్ఘటము లగు పద్యములు వ్రాయుకవుల నీమె యాశ్వాసాంతములందైన ననుకరింపలేదు. అదియుఁగాక,

ఆ. తేనె సోక నోరు తీయన యగు రీతి
తోడ నర్థ మెల్లఁ దోఁచకుండ
గూఢశబ్దములను గూర్చిన కావ్యము
మూఁగ చెవిటివారి ముచ్చటగును.

క. కందువ మాటలు సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెలుఁగునకుం
బొందై రుచియై వీనుల
విందై మఱి కానుపించు విబుధుల మదికిన్.

అని పీఠికయందు తనగ్రంథరచనా విధానమును మనకు విశదపఱచి యందొక్క యక్షరమైన పొల్లుపోకుండునట్లు గ్రంథము సాంతముగా నిర్వహించినది. ఎందఱెన్ని మాఱులు 'రాజును దైవమైన రఘురాము నుతించినఁ దప్పు గల్గునే' యని తనకుఁ బూర్వము రామాయణము లున్నను దానుగ్రమ్మఱ దానిని రచింపఁబూనుటకుఁ గారణము తెలిపెను. ఇందువలన నామె వినయసౌశీల్యములును బూర్వకవుల యందలి భక్తియు మనకు విశదము. మఱియు,

క. నేరిచి పొగడిన వారిని
నేరక కొనియాడువారి నిజకృప మనుపం
గారణ మగుటను భక్తియె
కారణముగఁ గాని చదువు కారణ మగునే!

అను పద్యము వలన నామెకు శ్రీరామునందుఁగల భక్తియు, మోక్షకామికి నకలంకభక్తియ ప్రధానమను వేదాంతజ్ఞానమును, స్వజాతివారలతోఁ బోల్చి చూచినచో నామెయందుఁ గన్పట్టు పాండిత్యాధిక్యమునం దామెకుఁ గల నిర్గర్వమును వ్యక్తము లగుచున్నవి. 'రామనరపాలకునిన్ స్తుతిఁజేయు జిహ్వకున్, జిల్లర రాజలోకమును జేకొని మెచ్చఁగ నిచ్చపుట్టునే' యని చెండియు నామె ప్రాపంచికసౌఖ్యాభిలాషులకు మాత్రమే యాశ్రయులగు నరపాలురఁ బూజించుటకుఁ దనకుఁగల యసహ్యమును బ్రకటించెను. ఇందువలన నామెయొక్క యకలంకమగు రామభక్తియు స్వయం ప్రకాశమగుచున్నది.

విమర్శనసౌలభ్యముకొఱకు మొల్ల రామాయణమును రెండుభాగములుగా విభజింపవచ్చును. కథాప్రారంభము నుండి కిష్కింధాకాండము తుదివఱకును మొదటి భాగము. సుందరకాండము మొదలు గ్రంథాంతమువఱకును రెండవభాగము. ప్రథమభాగము నందు మనోహరమగు పద్యములును శుద్ధమగు ధారయు నున్నను మనము విశేషించి రసాస్వాదనముకొఱకు నిలువవలసిన సందర్భములు మిక్కిలి తక్కువ. ప్రథమ భాగమునందు కథాపరిమాణ మెక్కుడుగను స్థలము తక్కువగను నున్నది. అందుచేఁ బెద్దకథను కొద్దిస్థలములలో వ్రాయవలసి వచ్చినందున నొక్కవిషయమునను మొల్ల మనకు రససంస్ఫురణముఁ గలుగఁజేయఁజాలినది కాదు. అయినను నీభాగమందు మనము మిక్కిలి యక్కజముతో గమనింపవలసినది యామె సంగ్రహనైపుణి. రెండవభాగమునందు మొల్ల మనచే 'బళీ, బళీ' యనిపించుకొనుచున్నది. సుందరకాండము రామాయణమున కంతకును సుందరమైన మండనము. అందు కథ తక్కువ, రసము సమృద్ధి. ఈవిషయము మొల్ల గ్రహించినదగుటచేఁ దన యసదృశశక్తిని వినియోగించి సుందరకాండము రచించుటవలనఁ దన సంగ్రహనైపుణితోఁ బాటు రచనాకౌశల్యమును, రచనాకౌశల్యముతోఁ బాటు రసమును జిల్కు శక్తిఁ బ్రకటించినది. ఇఁక యుద్ధకాండమన్ననో సంగ్రహరామాయణములు వ్రాసిన ప్రతికవిని మించి యంచితమైన నేర్పరితనముతో రచించినది. కావున మనయానందమునకు నిలయము ద్వితీయభాగమే యగును. అట్టి యనుపమానందము ననుభవించుటకు మున్న ప్రథమభాగమును బరిశీలించి యందలి విశేషముల నారయుదము.

వాల్మీకివలెను దదితరులగు నాంధ్రరామాయణకర్తలవలెను నీమె కథాప్రారంభము నయోధ్యాపురవర్ణనముతోడ మొదలుపెట్టినది. ఈ యయోధ్యాపుర

వర్ణనమువలననే యీమె వాల్మీకిరామాయణమునుజూచి యుండలేదని స్పష్టమగును. వాల్మీకి యయోధ్యానగరమును జక్కగా నిరువదినాలుగు శ్లోకములలో వర్ణించెను. అందున వర్ణనాక్రమము మిక్కిలి యుక్తియుక్తముగా నున్నది. మొల్ల యీనగరమును బదునేను పద్యములలో స్వతంత్రముగా వర్ణించినది. వర్ణన మనోహరముగా నున్నను వర్ణనక్రమము స్తుతిపాత్రము కానేరదు. అభేదాధ్యవసాయములగు సమాసములతోను, చక్కని గమనముగల సీసములతోను వర్ణనము రాజిల్లుచుఁ బ్రబంధకవులరచనను జ్ఞప్తికిఁ దెచ్చును. వర్ణనయందలి పద్యము లన్నియు హృదయంగమములే యైనను గ్రంథవిస్తరము గాకుండ నొకటి రెండు పద్యములను మాత్ర మిచ్చట నుదాహరించు చున్నాను.

క. భోగానురాగ సంపద
భోగులు వర్తింతు రందు భూనుత లీలన్
భోగానురాగ సంపద
భోగులు వర్తింతు రిందు భూనుత లీలన్.

ఉ. రాజులు కాంతియందు రతిరాజులు రూపమునందు
వాహినీ రాజులు దానమందు మృగరాజులు విక్రమ
కేళియందు గో, రాజులు భోగమందు నెసరాజులు
సంతతతేజమందు రా, రాజులు మానమందు నగరం
బున రాజకుమారు లందఱున్.

ఇందలి రెండవపద్యముఁ జదివి యానందింపని యాంధ్రపాఠకు లుండరు. మొల్లకుఁ దరువాతి కవు లనేకు లీపద్యము ననుకరించి తమగ్రంథము లందుఁ బద్యములను వ్రాసికొనిరి. పైపద్యములు రెండునుగాక యింకను సీసపద్యములు మిక్కిలి చక్కనివిగలవు. కథాప్రారంభమునందలి తొలిపద్యమే ముద్దులు చిలుకుచున్నది. ఉత్ప్రేక్షాతిశయోక్తులతో నింపి రమ్యములును శ్రావ్యములును నగు పద్యములతోఁ బురవర్ణనలు జక్కగాఁ గావించినను బ్రతిప్రబంధకవియుఁ బురవర్ణనాక్రమమునం దనగా— నొక రాచనగరు వీధినుండియో యావీథిని సరిగా వర్ణించి పాఠకుని మనస్సునందు నాపురము చిత్రించుటయందు —సఫలుడగు నైచినాఁడు. వాల్మీకి యీ* వర్ణనము బాగుగా నిర్వహించినాఁడని చెప్పినాము. సంస్కృతమును జూడని మొల్ల తనకుఁ బూర్వులగునాంధ్రకవులు వర్ణించినట్లే తానును పురవర్ణనము చేసినది. కేవల మనుకరణమగుటచే రచనాకౌశలము తక్క నయోధ్యావర్ణనము నందు మొల్లచూపిన విశేషమేమియు లేదు. తరువాత దశరథుని వర్ణించి యాతఁడు సంతానలబ్ధికై పుత్రకామేష్టి చేయుట యాదిగా సీతాకల్యాణ పరశురామ గర్వభంగముల పర్యంతముఁ గల యావత్కథయు రమారమి డెబ్బదిపద్యములలో కుదించి బాలకాండము సమాప్త మొనర్చినది. ఇట్లు కుదించినను ముఖ్యకథాంశములతో సంబంధమున్న సామాన్యవిషయముల నెంతమాత్రము నీమె విడిచినదికాదు. ఋశ్యశృంగుని వృత్తాంతము, సురలు బ్రహ్మకడకుఁ బోయి తమబాధలు చెప్పుకొనుట, వారందఱును విష్ణువుకడకేగి ప్రార్థించుట, యహల్యాశాపవిమోచనము మొదలగునవి యొక్కొక్కటొకటిరెండు పద్యముల మాత్రము స్ఫురింపఁ జేయుచు విరమించినది. తరువాత నయోధ్యాకాండమునందలి కథనంతయు నలుపది పద్యములలో సంగ్రహించినది. అయినను వస్తువున కెచ్చటను లోపము కలుగలేదు. ఆరణ్యకాండమునందు శూర్పణఖావృత్తాంతమును, జనస్థానపుణ్యజనవధయు, సంగ్రహముగాఁ జెప్పఁబడినను, శూర్పణఖ తన పరాభవమును రావణునితోఁ జెప్పికొనుట యాదిగా మాయామృగ మేతెంచుట, సీతాపహరణము, జటాయువృతి. శ్రీరామసీతాన్వేషణము, దుఃఖము, జటాయువు పరలోకగమనము, కబంధవధ, శబరీసత్కారము, యివి నాతివిరళముగాను నాతిసంగ్రహముగను వర్ణింపఁబడి పాఠకుల కుల్లాసమును బుట్టించుచున్నవి. సీతాసౌందర్యవర్ణనము, రామునిసీతాన్వేషణము ననుకరణములే యైనను నవి కొలదిపాటిగా నుండుటచే హృద్యములై యుండును. కిష్కింధాకాండ మిరువదియేడు పద్యములతోఁ బూర్తియయినది. సుగ్రీవునితో సఖ్యము, వాలివధ, సీతాన్వేషణార్థము కపులేగుటయు మాత్రమే యిందుఁ జెప్పఁబడినవి. మాయావి దుందుభుల వృత్తాం

* మొదట వాల్మీకి అయోధ్యయందలి ప్రజలనందఱ నేకముగా వర్ణించి తరువాత నాలుగువర్ణములవారిని ప్రత్యేకముగాఁ జేర్కొనినాఁడు. పిదప నగరమునందలి కోటను కోటయొక్క బలమును జెప్పి యప్పుడు దశరథుని వర్ణించినాఁడు. వ్యర్థముగ నుత్ప్రేక్షలకుఁబోయి నగరచిత్రము నాంధ్రకవులు చెఱచినారు.

తను, వాలిసుగ్రీవుల భేదకారణము, వాలిశ్రీరాముల సంవాదము మున్నగునితివృత్తములు మొల్ల వ్రాయలేదు. కిష్కింధాకాండముతో మన ప్రథమభాగము ముగియుచున్నది. ఇంతవఱకును మొదటినుండియుఁ గల గుణాగుణములఁ గూర్చి యించుక వ్రాయవలెను. కథాప్రవచనమందు స్వల్పవిషయమును వదలియు వదలకయు నింపుకగా స్ఫురణకుఁ దెచ్చి సాగిపోవుటయందు నీమె కడు నేర్పరి. (మచ్చునకు) రావణుఁడు మారీచుని మాయామృగమవు కమ్మని నప్పు డాతఁడు మొదట నూపిన యనంగీకార మీమె నాల్గుపదములలో సూచించినది. 'నీవు పర్ణశాలకడం బొడకట్టి...యతని నతి దూరంబుగాఁ గొనిపోయి మాయంబైన నేను రాముని భార్యం గొనివత్తు ననిన విని సమ్మతిలక మాఱుత్తరం బిచ్చిన రావణుం డాగ్రహుండై చంపెద ననఁ డా సన్న యోడంగి కనకమృగరూపంబు దాల్చె.' కబంధ వృత్తాంతమును గూడ నిట్లే 'వక్షణాక్షిముఖుడై చనుదుఁ జిత్రరూపంబున నున్న కబంధుని వధియించి' యను నాల్గుమాటల సంగ్రహించెను. ముఖ్యకథకుఁ గబంధవృత్తాంత మెంత యవసరమో శబరీవృత్తాంతముఁ గూడ నంతియ యావసరము. అయినను కబంధవధ నాల్గుమాటలం జెప్పినదై శబరీవృత్తాంతమును మూఁడు పద్యములలోఁ జెప్పి తననేర్పును సూక్ష్మబుద్ధినిఁ దెలియఁజేసినది. కబంధ వధయందు రాముని శౌర్యము తప్ప వేఱేమియుఁ బ్రకటము కాదు. ఆ శౌర్యగుణ మీవరకే చాలచోట లందుఁ బ్రకటమయినది. ముందును ననేక విధములుగాఁ బ్రకటము కానున్నది; కాని శబరియందు శ్రీరాములు ప్రకటించిన యవ్యాజభక్తవాత్సల్యగుణము భవిష్యత్కథయందు దెచ్చుటను గానరాదు. కనుక తనబుద్ధి సూక్ష్మత నుపయోగించి మొల్ల కబంధ వృత్తాంత మించుమించుగాఁ బరిహరించి శబరీవృత్తాంతమును వివరించెను. క్రమముగ గుణపోషణ కనువగు తావులేని తనసంగ్రహగ్రంథమందుఁ గూడ మొల్ల యిట్టి సూక్ష్మ విషయమునకు వన్నె పెట్టినది. ఇంతకంటె పెద్దగ్రంథమును నానావర్ణనలతోఁ బ్రబంధపాకమున రచించిన యయ్యలరాజు రామభద్రయ్య తనరామాభ్యుదయమునందు, శబరీవృత్తాంత ప్రాముఖ్యము గ్రహింపలేక కాబోలును, దానిని బరిహరించెను.* మఱియు రెండువిశేషములు. ౯౦౯ వతిరసవమయమున,

చ. సుడిగొని రాముపాదములు సోకిన ధూళి వహించి
రాయి యే, ర్పడ నొకకాంత యయ్యెనట పన్నుగ
నీతని పాదరేణు వి, య్యెడ వడినోడ సోక నిది యే
మగునో యని సంశయా, త్ముఁడై కడిగె గుహుండు
రామపదకంజయుగంబు భయమ్ము పెంపునన్.

అను పద్యము పాఠకుల చిత్తరంజనము ఘటించునో యనుభవజ్ఞుల కెఱుక. ఆ రసానంద మిట్టిదని నిర్వచించుట కెవ్వరితరమును గాదు. ఆపద్యములోని భావము మొల్ల సొంతమో లేక యీమె మఱియొకచోటనుండియైన గ్రహించినదో చెప్పలేను. మొల్ల తనరచనకు ముఖ్యాధారముగా నాదరించిన భాస్కరరామాయణమునం దీభావము గానరాదు. (వైవాక్యమునకుఁ బ్రమాణములు ముందు జూపఁబడును) కనుక నీయుదాత్తభావము మొల్లదే యైనచో నీమెకేమి స్తోత్రము నీయఁగలము? భావనాసౌధమునందు రమ్యకనకాసనమునం దీమె నునుమటికే రసజ్ఞుఁ డెంకిఁ బెట్టును? తరువాత వానకాలమునందు శ్రీరాముఁడు పొందిన సీతావిరహము నతి పేశలముగా వర్ణించి మొల్ల యసమానమగు నైపుణ్యమును జూపినది. ఆపద్యములిం దుదహరింపక విరమించుటకు మనస్సొప్పదు.

ఉ. హారలు నోటికిన్ రుచులు గూడుట తప్పెను; దుంప
గూరలున్, గారము దోఁచె జిహ్వకును గమ్మని
తేనెలు చేఁదులయ్యెఁ గం, గారయెఁ జిత్తమంతయును
గంటికి నిద్ర రహింప దయ్యె శ్రీ, గారవ మెల్ల
సీతఁ బొడగానమి రామనృపాలమౌళికిన్.

ఉ. తాలిమి దూలిపోయి పరితాపమునం దిరుగాడు
నొక్కచోఁ, గాలును నిల్వఁ ద్రొక్కఁ డధికారము
చాలక యెప్పుడుం గడుం, జాలి వహించుఁ జిత్త
మునఁ జంచలతం గను భూమిపుత్రిపై, మేలిమిఁ జేసి
రాముఁడట మిన్నక వేదురు గొన్న కైవడిన్.

కి. కాం. 24, 45.

* రామభద్రయ్యగ్రంథ మాంధ్రీకరణమని యాక్షేపణ రావచ్చును. అయినను రసప్రతిపాదనంబున భాషాంతరీకరణకర్తకు మూలాతిక్రమణదోషము పట్టదు.

నవనిపై విలసిల్లు నఖిలరాజన్యులు
  త్రేలఁ జూపఁగలేని విల్లు విఱిచె
ఘోరాటవులలోనఁ గ్రుమ్మరినప్పుడు
  ఖరదూషణాది రాక్షసులఁ జంపెఁ

గీ. బాదరజమున నొక ఱాయిఁ బడఁతిఁ జేసె
లీల మాయామృగంబును గూల నేసె
రాజమాత్రుండె మేదినీ రక్షకుండు
రామభూపాలుఁ డాదినారాయణుండు.

గీ. అట్టి రామున కీ యబ్ధియనఁగ నెంత
లంకయన నెంత దనుజుల పొంక మెంత
నీవనఁగ నెంత నీలావు చేవ యెంత
చెప్పనేటికి నీవు చూచెదవు గాక.

ఇఁక మనము కంతోషములో విమర్శనము సేయఁ బూనునది హనుమత్సీతా సంభాషణము. ఈవిషయము కేవల మొక్క నాటకప్రాయముగా రచించి మొల్ల మనల రసానందపారవశ్యమున నూగులాడఁ జేయుచున్నది. మొల్ల రామాయణమునకంతకును నిదియే రసవంతమగు పట్టు. రామాయణకర్త లనేకులీసందర్భమున రస ప్రతిపాదనము సేయఁజాలరైరి. పైవారలయందుఁ గానరాక మొల్లయందు విశేషముగాఁ దోఁచు సుగుణ మొకటి కలదు. అది విషయనివేదనమునందలి చాతుర్యము. అది ఏవిషయమును బహిష్కరింపవలయునో, ఏవిషయమును విశదపఱచవలయునో దేనిని సంగ్రహింపవలెనో దేనిని విరళీకృతము సేయవలయునో మొల్ల యెఱింగినట్లు పైవారలెఱుంగలేకపోయిరి. అందువలనే వారీపట్టున రసభంగమును గావించిరి. ఈయొక్క విషయము నాధారము చేసికొని, పాండిత్యప్రతిభతోడను, నసంఖ్యాకములగు వర్ణనలతోడను తమగ్రంథముల నింపి యుత్తమ ప్రౌఢకావ్యము లనిపించుకొనిన యనేక పండితకవుల కన్న, మొల్లయే రామాయణమును రసవంతముగా రచించినదని వచింపవచ్చును. రామాభ్యుదయమునందు రామభద్రకవి హనుమంతుఁడు శింశుపావృక్ష మవరోహణము సేసి రామాంగుళీయకమును మహాదేవికిచ్చెనని యొక పద్యమునందుఁ దెల్పి తరువాత నాముద్రికను సంబోధించి సీత పలవంతను దెందుట పదునాలుగుపద్యములందు వ్రాసియున్నాఁడు. ఈపద్యములు తగుమాత్రముగా నున్నచో మిక్కిలి చక్కఁగా నుండియుండును గాని యమితముగాఁ బహునాల్గు వ్రాయుటచే వానియందలి విలువ కానరాకపోవుట యటుండఁ జదువుటకు విసుగు గూడ జనించుచున్నది. విద్యుద్జ్యోతిపరిమాణము క్షణభంగురము గావునఁ దదవలోకనమునందు మనకుఁ గుతూహలము పుట్టును. కాని యది సూర్యభగవానునిరీతి నిత్యప్రకాశముతో నిశ్చలత్వమును దాల్చినచో మన కద్దానియందుఁగల యవలోకనాకుతూహలము నశించును. రసవంతములగు పద్యములకును నిదియ లక్షణము. రామభద్రకవి యీవిషయము గుర్తింపలేక పోయెను. అట్లు పదునాల్గుపద్యములలో సీతవలవంతను వ్రాసి తరువాత నొక సీసపద్యమందు సీతాహనుమంతుల సంభాషణాంకమును ముగించెను.

'సీ. అయ్య! నీనామధేయమేమి?......

గీ. అనినఁ దనతోడ వేశ్వేర నతఁడు దెలుప...
.. జడలో రత్నమిందమనుచు నిచ్చి..యనుపుట
యును' (రామాభ్యు. షష్ఠాశ్వా. ప. 198)

అని యీవిధముగా ముగించెనుగాని రామభద్రకవి వారిసంభాషణమందుఁ గల రసమాధుర్యము నెంతమాత్రమును బోషింపలేఁడాయెను. అతఁడు తనగ్రంథమందు హనుమద్విశ్వరూపప్రదర్శనమునకుఁ జోటునీయలేదు. సీతాదేవి శ్రీరామునకుఁ బంపిన సందేశము వివరింపలేదు. సీత తాను బూర్వము లక్ష్మణుని నిందించినందుల కిప్పుడు హనుమంతునిచేఁ బంపిన క్షమార్పణము సూచింపలేదు. పైవిషయములులోపించిన హనుమత్సీతా సంభాషణ మెంత రసవిహీనమో తజ్జ్ఞులకు విశదము. ఇఁక మొల్ల యన్ననో పైవిషయముల నన్నిటిని లోపమేమియుఁ బొరయకుండ నతిసరసముగా వివరించినది. శింశుపావృక్షమునుడిగ్గి పావని సీతాదేవియెదుటఁ బ్రత్యక్షమై రామముద్రికనిచ్చి నిజోదంతమెఱిఁగించెను. ఆయమయు నాముద్రికం గొని నిజభర్త యంగుళీయకముగా గ్రహించియు, 'దనుజమాయలచేత తఱుచు వేగుటఁ జేసి' 'నిను విశ్వసింపఁ జాలను చూపింపుము నీతెఱంగు విభునివిధము నా కనవుడుఁ బావని తెలియఁగ ...విన్నవించె విస్ఫుట ఫణితిన్.' అయినను

జానకి, హనుమంతునియం దింకను నమ్మిక పుట్టమి 'రాముని చందం బెఱింగింపు' మని కోరెను. ఈయెడ నాంజనేయుఁ డొనరించిన శ్రీరామవర్ణనమును మొల్ల భక్త్యుద్రేకమున రచించెను. అదెట్టిదన,

సీ. నీలమేఘచ్ఛాయఁ బోలు దేహమువాఁడు
ధవళాబ్జపత్ర నేత్రములవాఁడు
కంబుసన్నిభమైన కంఠంబు గలవాఁడు
బాగైన యట్టి గుల్ఫములవాఁడు
తిన్ననై కనుపట్టు దీర్ఘబాహుల వాఁడు
ఘనమైన దుందుభిస్వనము వాఁడు
పద్మరేఖలు గల్గు పదయుగంబుల వాఁడు
చక్కని పీన వక్షంబువాఁడు
గీ. కపటమెఱుఁగని సత్యవాక్యములవాఁడు
రమణి! రాముండు శుభలక్షణములవాఁడు
ఇన్నిగుణముల రూపింప నెసఁగువాఁడు
వరుస సౌమిత్రి బంగారు వన్నెవాఁడు.

చేమకూర వెంకటకవి యంతటివాఁడు తన విజయవిలాసము నందు దీని ననుకరించుచు 'ఎగుబుజంబుల వాఁడు మృగరాజమధ్యంబు పుడికిపుచ్చికొను నెన్నడుమువాఁడు...' అను పద్యమును వ్రాసికొని సమటను మించి యీపద్యమునందలి యౌత్కృష్ట్యమును వేఱువర్ణింపలేను. తరువాతను మారుతి విశ్వరూపమును జూపినఁగాని యాదేవి తనశిరోరత్నము నీయలేదు. పిదప సీతాసందేశమును మొల్ల సువర్ణాక్షరములతో రచించినదని చెప్పవచ్చు. ఆపద్యమునందుఁ గరుణారస మాకారమునువహించి మనచిత్తములను సంభ్రమింపఁజేయుచున్నది. సీతాదేవి యవస్థయందు దానుంటినని యూహించి మైమఱచి యానాఁటి సీతాఖేదము తన మనము నావరింప మొల్ల యీపద్యమును రచించి యుండును. తన్మయత లేనిచోఁ బ్రయత్నమున కిట్టి రచనలు దుస్సాధ్యములు.

సీ. నిడుదపు న్నెఱివేణి జడలుగా నవరించి
మలిన జీర్ణాంబరం బొలియఁగట్టి
భూమిరజంబు విభూతి పూఁతగఁ బూసి
తన దివ్యమూర్తి చిత్తమున నిల్పి
నిరశన స్థితితోడ నిలిచి భూశయ్యను
బవళించి నిదుర యేర్పడఁగ విడిచి
తారకబ్రహ్మమంత్రంబుఁ బఠించుచుఁ
గఠినరాక్షస దుర్మృగములలోన.
గీ. సహితలంకామహాద్వీపగహనసీమఁ
దపము సేయుచు నున్నాను తన్నుఁగూర్చి
నాకుఁ బ్రత్యక్ష మగు మని నాథునకును
విన్నవింపుము సత్త్వసంపన్న! నీవు.
[సుం. కాం. 118]

మొల్ల తన రామాయణమును జాలవరకు భాస్కర రామాయణము ననుకరించి వ్రాసినదని యీవరకే చెప్పియున్నాము. అందులకుఁ బ్రమాణముగా నాయా సందర్భముల ననుసరించి కొన్ని పద్యములు చూపఁబడు ను. సీత లక్ష్మణునకు సందేశము బంపుచు హనుమంతునితో నీక్రిందికరీతిగాఁ జెప్పెనని భాస్కరరామాయణమునందు వ్రాయఁబడినది.

'క. జనని గతి నన్ను జూచును
జనకుని చందమున రామచంద్రునిఁ జూచున్
జననీ జనకుల పంపున
వెనుకానల మమ్ముఁ గొల్చి ప్రీతిని వచ్చెన్.
వ. అట్టి నామఱఁదియుండెలోడఁ గుశలంబడిగితినని మఱియు నస్సుగునిధితో నిట్లనుము.
క. పూనెని పరుసంబులు తను
నాడిన యాఫలము గంటి నను మింకను నా
కీడుఁ దలంపకు మను మీ
కాడిక రాకుండ మెలఁగు మను కృప పుట్టన్'
(సుం. కాం. ప. 329, 330, 331.)

పైపద్యములఁజూచి మొల్ల యీక్రింది విధముగా రచించినది:

చ. జనకుని భంగి రామనృపచంద్రుని నన్నును దల్లిమాఱుగాఁ, గని కొలువంగ నేర్చు గుణగణ్యుఁ, లక్ష్మణు నీతిపారగున్, వినఁ గనరాని పల్కు- లవివేకముచే తను బల్కినట్టి యా, వినుత మహాఫలం బనుభవించితి నంచును జాటి చెప్పుమా.
క. ఆమాటలు మది నుంచక
నామానముఁ గావుమంచు నయవినయగుణో
ద్దాముఁడు రాముని తమ్ముఁడు
సౌమిత్రికిఁ జెప్పవయ్య సాహసివర్యా!
(సుం. కాం. ప. 116.)

మొల్ల రామాయణమున నీపద్యములు మాణిక్యములు వంటివి. ఇంత చక్కనిపద్యముల నీ సందర్భమునం దే కవియు రచింపలేదు. రామభద్రకవి తనగ్రంథమునం దీవిషయమే విరమించినాఁడు. అందువలన రామాభ్యుదయమునం దా సందర్భమున రసమున కెంత చేటువచ్చెనో రసజ్ఞులకు విశదము.

మారుతికిని రక్షోవీరులకును నశోకవనధ్వంసము కారణముగా జరిగిన పోరాటమును మొల్ల యతివిరళముగ, నతియుత్సాహముతో విరచించినది. ఇందువలన నీమెకు యుద్ధవర్ణనమునందుఁగలయభిలాషయు,నొక్కొక్కవీరుని వేర్వేర రణాంగణమునందు నిరూపించి వర్ణించుటయందు గల సంతోషోద్రేకములును వ్యక్తము లగుచున్నవి. పైవిషయము రామాభ్యుదయకవి పదునేడు పద్యములలో సర్వము పూర్తిచేసెను. శ్రీరామచంద్రోపాఖ్యానాఖ్యమున రామాయణమునే రచించిన వారణాశి వెంకటేశ్వరకవి పదునేను పద్యములలోఁ దుద ముట్ట వర్ణించెను. ఉదాహృతగ్రంథద్వయములో నొక్కొక్కదానికిం బదిరెట్లు పెద్దదగు భాస్కరరామాయణమునం దీయితివృత్తమే యరువదినాలుగు పద్యములం దభివర్ణింపఁబడియెను. దానికి రెండురెట్లు పెద్దదగు గోపీనాథరామాయణమునం దిది తొంబదినాలుఁగు పద్యములలో వర్ణితము. ఇట్లుండ నీ విషయము, రామాభ్యుదయ శ్రీరామచంద్రోపాఖ్యానముల కన్నను జిన్నదగు మొల్లరామాయణమునందు, సుందరములగు నరువదినాలుగు పద్యములందు విరళీకృతమైయున్నది. అనఁగా మొల్లరామాయణమున నీ యుద్ధవిషయము దానికంటెఁ బదియుంబదిరెట్లు పెద్దవగు భాస్కర గోపీనాథ రామాయణములలో వలెనే పెద్దగా వర్ణింపఁబడినది. ఈసంఖ్యాకలనము, యుద్ధవర్ణనమందు మొల్లకుఁ గల యాసక్త్యభిలాషల వ్యక్తపఱచుటకై చేయఁబడినది. తిరువాత హనుమద్రావణసంవాదమును లంకాదహనమును జక్కగా వర్ణింపఁబడినవి. వెంటనే హనుమంతుఁడు సముద్రతరణముఁ గావించి తన కొఱకు వేచియున్న యంగదాదులఁ గలియుటయు నుపరి మధువనభంజనమును వర్ణింపఁబడినవి. మధువనభంజనమందు కోతిచేష్టలఁ బ్రకటించు నీక్రిందిపద్యము చదువఁదగినది.

సీ. ఒకఁ డాకొని కొమ్మ లూఁచినఁ బండ్లెల్ల
 జేకొని తేర భక్షించు నొకఁడు
ఒకఁ డాకొని తేపుచున్నట్టి తేనియల్
 తడయక కొల్లాడి త్రాగు నొకఁడు
ఒకఁ డాకొని కోయుచున్నట్టి కాయలు
 మిన్నక యాటాడి మ్రింగు నొకఁడు
ఒకఁ డాకొని గోళ్ల నొలిచినట్టి చివుళ్లఁ
 బుక్కిళ్ల కొలఁదిగాఁ బొక్కు నొకఁడు
గీ. తరువుపై నుండి తరువుపై దాటు నొకఁడు
 పండ్లకైవంటి ప్రాఁకైనఁ బ్రాకు నొకఁడు
 దిగుడుఁ గాల్చుండి తరువున కెసురు నొకఁడు
 పెద్దపొదుపుననుండి పుప్పించు నొకఁడు.

(సుం. కాం. ప. 233.)

ఇఁక సుందరకాండమును వదలి యుద్ధకాండము నందుకొనవచ్చును. కాని సుందరకాండాంతమున మొల్ల కరుణారసము నొలికింపుచు వ్రాసిన మఱియొక్క పద్యమును మాత్రము చవిచూతము.

సీ. కట్టిన వస్త్రంబు కట్టుకొంగె తక్క
 జీర్ణించిపోయిన చీరతోడ
సుడుగని వగలతో నోరంత ప్రొద్దును
 జెక్కుఁ జేర్చిన చేయితోడఁ
బుడమిపైఁ బొరలాడు నొడలు బూడిద గ్రుంగి
 నిరతంబు దొరగు కన్నీటితోడ
నిడుద పెన్నజడ వేణి సడలించి జడలతో
 నిరత నిరాహారనియతితోడఁ
గీ. గినుక జంకించు దైత్యకామినుల నడుమఁ
 దపముఁ జేయుచు దనుజబాధలకు నోర్చి
 వనిత ప్రాణంబు దక్క సర్వము త్యజించి
 నిత్యమును మిమ్ము మదిలోననిలిపియుండు.

(సుం. కాం. ప. 246)

మొల్లరామాయణమునందు యుద్ధకాండము మూడాశ్వాసములుగా వ్రాయఁబడినది. మొదటియాశ్వాసమునందు రావణుఁడు మంత్రులతో మంత్రాలోచనము సేయుట విశేషమగు నేర్పుతో వ్రాయఁబడినది. అతికాయుఁడు, నింద్రజిత్తు మొదలగువారు దశకంఠున కుత్సాహముఁ గలుగఁజేయుట, విభీషణుఁడు రావణునికి నీతి బోధించుట, రావణుఁ డాతనిఁ బరాభవించుట మొదలు

గాఁగల వృత్తాంతముఁ జదువుచో నాటకమును జదువునట్లుండును. విభీషణుఁడు రావణసభాస్థలమును వీడుమఁ బలికిన పలుకులును, నాతఁడు శ్రీరాముని శరణు వేడుటయును మనోరంజకముగా నున్నవి. యుద్ధవర్ణనాసక్తియాం పంతర్గర్భితమై యొక చిత్రవిషయము మనకు మొల్లయందు గోచరించును. యుద్ధసన్నద్ధుడై రణరంగమున కేగు రథికుని రథగమనమును వర్ణించుటయం దీమె కొక యానందము గలదు. ఇట్టి యుద్ధయాత్రావర్ణనములు సుందరకాండమునందు రెండును, యుద్ధకాండమునం దాఱును మొత్త మెనిమిది గలవు. ఆయెనిమిదివర్ణనములును నొక్కొక్కటి యొక్కొక్క సీసపద్యమునందుగలవు. అవన్నియుఁ బ్రత్యేక ప్రత్యేక వర్ణనములతో రాశ్లుము నూతనవిషయములతో నిండి ఘనసు క్తిదోషములకు, దావీయక చక్కగా నున్నవి. ద్వితీయాశ్వాసమునందు చిత్తముల నాకర్షించు విషయములు లక్ష్మణాని మూర్ఛయు, రాముని శోకమును, ఈసందర్భమున భాస్కరరామాయణమందు గల

'గీ. అన్న దిగనాడి నను శరణన్న నేను
లంకపట్టము గట్టితి శంకమాను
మని విభీషణుఁ బల్కితి నదియుఁ దప్పె
నిల నభాగ్యుల కెందును గలదె పెంపు.'

అనుపద్యమును, బంధుఁడవై లేర్చ...నను మఱియొకపద్యమును జూచి మొల్ల తనగ్రంథమందు వానిని మించు సోయగముగల పద్యములఁ జొందుపఱచినది.

ఉ. వినుఁడు కపీంద్రులార పలవింపుము వజ్జనకుండు నాకమున్, జనియె ధరాతనూభవనిశాచరుచేఁ జెం వోయ నేఁటితో, ననుజుఁడు దీఱె నింక యడివియాసల నుండుట నాకు ధర్మమే; చనుఁడు నిజాశ్రమంబులకు సంశయ మొందక మీరు గొబ్బునన్.

ఉ. అక్కట! నీవు నింటఁ గలయట్టి సుబాంధవకోటిఁ, బాసి నీ, విక్కడ కేగుదెంచితి విహీనముదంబున ముమ్ము, నమ్మి పెం, పెక్కఁగ రావణుండు తగ నే లెడి లంకఁ గడంగ నీకు నేఁడక్కగ నిత్తు నన్ బ్రతిన తప్పె విభీషణ! నీవు పోవుమా!

క. నీవంటి తోడఁబుట్టువు
నీవంటి గుణోత్తరుండు నిజమూహింపన్
భూవలయమందుఁ గలఁడే
భావింపగ నీవె తక్క పావనచరితా!

క. నిన్నిచట విడిచి పురికిని
జన్నను నినుఁ గన్న తల్లి సనుదెంచి ననున్
నిన్నడుగఁ దడవ మదిలోఁ
జిన్నంబోవుమను నేమి చెప్పుదుఁ దండ్రీ!

(యు. కాం. అ. 2)

ఇత్యాదిపద్యములు మిక్కిలి చక్కగా నుండును. తృతీయాశ్వాసమునందు రావణుఁడు పాతాళహోమము సేయఁ బూనుటయుఁ గపివీరులు దానికి విఘ్నమొనర్చుటయు నందముగా వ్రాయఁబడినవి. ఆసందర్భమున నంగదునిచేఁ బరాభవింపఁబడిన మండోదరివిలాపము చదువఁదగినది.

మ. మయదైత్యేంద్రునికిన్ దనూజనయి నేనుం జొప్ప, నీ పత్నినై, జయ పెట్టంగను నింద్రజిజ్జననినై సర్వాంగనాపూజ్యనై, భయ మెన్నండు నెఱుంగనట్టి, నను నిబ్బంగిన్ వనాటుండు నిర్భయవృత్తిం దలపట్టియీడ్వఁ గనుఁగొంచుండితే నీ మ్రుంగలన్.

క. రాముని దూతలు నన్నును
బాములు పెట్టంగఁ జూచుచుఁ బందువ నీకున్
నా మానముఁ గాపాడని
నీ మానుష మేటి కిపుడు నిర్జరవైరీ!

ఉ. ఈ మునివృత్తికన్న దనుజేశ్వర! రామునితోడ నేఁడు సంగ్రామము సేసి గెల్చిన నఖండరమావిభవంబు గల్గు నా, రామునిచేతఁ జచ్చిన స్థిరంబగు మోక్షము గల్గు దీనికై, యేమిటి కింత దైన్యమిసి! యిచ్చఁ దలంపుము రాక్షసేశ్వరా!

తరువాత రామరావణయుద్ధము మొల్ల శ్రీయగుట నేమో భీభత్సముగా వర్ణింపలేకపోయెను. రావణుని యుద్ధయాత్ర మహాట్టహాసముగా రచింపఁబడినది.

క. గిరి గిరి నఢము నభంబును
ధర ధరయును జలధి జలధి దార్కొను రీతిన్
సురరిపుఁడు నసురరిపుఁడును
దురమున నెదిరించి రథిక దోర్బలయుక్తిన్.

మొల్ల రాముని యొక్కయు రావణుని యొక్కయు సమరకళా నైపుణ్యము వేత్త్వర చిత్రిం

చినది. రావణవధానంతరము సీతాపరీక్షయు రాముఁడయోధ్యానగరంబునకు సీతాలక్ష్మణులతోడను సకల వానరముఖ్యులతోడను బోయి పట్టాభిషిక్తుఁ డగుటయుఁ జెప్పఁబడినది.

సానం దీర్చినకొలఁదిని జాతిరత్నము మెఱయునట్లు గ్రంథమును రచించినకొలఁదిని విశేషములు గన్పట్టుచునే యుండును. కనుక నింక గ్రంథమునఁ గంతకును గల విశేషాంశములఁ గొన్నిటిని మాత్రము చర్చించి విరమింతము. ఇందలి శైలి మిక్కిలి సరళమయి, మృదువై, పదలాలిత్యముతో నొప్పారుచుండును. సమకాలీనుల పాండితీపంగులవ్యామోహములకు లోఁగక మొల్ల తన గ్రంథమునం దన్నివిషయముల నించుమించుగా స్వతంత్రమగు పోకడలనే పోయినందున నామె గ్రంథము సర్వజనాహ్లాదకరముగా నున్నది. కొలఁది రోజులు వెనుక వఱకును నీమొల్ల రామాయణమును మన పాఠశాలలయందు బాలురకుఁ జెప్పెడు వాడుక యుండెడిది. మొల్ల వచనశైలికూడ మృదువుగను, కథాచనుపదపరిచయమునకు సారవమయి భాసిల్లుచుండును. మొల్లయందు గల గొప్ప సుగుణ మేమన విషయనివేదనమామె తేటతెల్లములగు మాటలలో ననాయాసముగ రచించును. ఎట్టి సందర్భములయం దితరకవులైనచో లేనిపోని స్వర్థాడంబరములకుఁ బయిసెత్తి తాము శ్రమపడి పాఠకులను శ్రమపెట్టి యుందురో, యట్టి సందర్భములయందు మొల్ల యెంతమాత్రమును పడుముకొనక చిన్న చిన్న పద్యముల ముద్దులు గులుకునట్లున్నది యున్నట్లు చెప్పెను. మచ్చునకు నాల్గయిదు పద్యములఁ జూతము :

ఆ. పర్ణశాలలోనఁ బరికించి పరికించి
సీత కానఁబడమిఁ జిన్నవోయి
చిత్తమంత కలఁగి శ్రీరామచంద్రుండు
పలువరింపఁ జొచ్చె భ్రమసి భ్రమసి.
(ఆ. కాం. ప. 51)

క. సప్తాంభోధులుఁ గలఁగెను
సప్తద్వీపములు వణఁకె శైలము లదరెన్
సప్తానిలములుఁ దలఁకెను
సప్తాశ్వుఁడు భ్రమనుపడియె జగములు గదలెన్.
(సుం. కాం. 188)

ఆ. అగ్నిదేవుఁ డప్పు డాత్మలోఁ జింతించి
హితుఁడు నాకు లోకహితుఁడు పవనుఁ
డతని పుత్రుఁడైన హనుమంతునకు నేను
చలువఁ గూర్తునంచుఁ జల్లనయ్యె.
(సుం. కాం. 219)

ఆ. ఇంక నేలఁ దడయ నినకులాధీశ్వర
కపులఁ బంపి వేగఁ గట్టు మయ్య
కట్టకట్ట దాటు కమలాప్త కులచంద్ర
నీదు కీర్తిలతకు నెలవుగాఁగ. (యు. కాం. 23.)

గీ. రక్తసిక్తాంగుఁడై ధాత్రి శక్తి నాటి
యున్న తమ్ముని గనుగొని యున్నవాఁడు
దుఃఖమంతంత నాఁగక తొంగలింపఁ
దొడలపై నిడి బాష్పముల్ దొప్పదొఁగ.
(యు. కాం. ఆ. 2,45.)

ఈమె యమకము కొఱకును శబ్దాలంకారముల కొఱకు నెన్నడును బ్రయత్నింపక పోయినను మొల్ల రామాయణమందలి శైలి సౌకుమార్యమున కావన్నెలును జిన్నెలును దమంతటదామే వచ్చినట్లున్నవి.

క. వని వని యెదుటను రాఘవుఁడు
గనుగొనియె మహీజనోగ్రకలుషాద్రి మహా
శనిరూపం బవఁడగు నా
ఘన ముక్తిసిద్ధూమవిలాస కబరిన్ శబరిన్ కి. కాం.

క. ఆ లోఁ గాంచిరి సత్కపి
జాలము కరిశరభసింహశార్దూలమృగా
ళిలముఁ బుణ్యాకదంబ వి
శాలము నగు నమ్మహేంద్రశైలము లీలన్.
(సుం. కాం.)

క. విమలమకరందలుబ్ధ
భ్రమరనికరపక్షపవనపరికంపిత స
ల్లక్షణీయ కుసుమసౌరభ
కమలంబులు గలుగు కొలనుఁ గనుఁగొని యచటన్
(యు. కాం.)

క. కుటిలభ్రూకుటి నటన
స్ఫుటధూమ విలాసపవనప్లుతోత్కృతిజనితో
ద్భట రోషానలకీలో
త్కట నేత్రుండగుచుఁ బలికెఁ గటము లదరగన్.
(సుం. కాం.)

మఱియును, పలయచోట్ల నీ కవయిత్రి చక్కని దేశీయములను వాడి రసము నినుమడింపఁ జేయుచు వచ్చెను. కూరాటి తేఁటులు, కావేటి కుట్టములు, బూటుగా భారపడంగఁ జాలుదు, కంటిలో నెరసుచందమున, నెవి నిల్లుకట్టుకొని, మొదలగు జాతీయ లోకోక్తులును మద్యే మార్గమిత్యాది సంస్కృత ప్రయోగములును గ్రంథమును జదువువారలకు ముదంబును గూర్చును.

మొల్ల రామాయణమునందు 'వనయ్యెనేని' 'కోసుక' 'పట్టుక' మొదలగు వ్యాకరణవ్యతిరేక ప్రయోగములు లేకపోలేదు. అవి యున్నను పేరుమాత్రముగా నున్నవి. గ్రంథప్రాశస్త్యమునకుఁ గాని రసపుష్టికిఁగాని వాని వలన నే యంకిలియుఁ గలుగదు. లాక్షణికు లీ గ్రంథమును బ్రమాణముగా నంగీకరించినారు. 'వీతిహోత్రుని సిరి నీటముంచి' యను నొక సీసపాదమున యతిభంగము కాన్పించుచున్నది. అది లేఖకుల ప్రమాదమనుటకు వీలులేదు. కావున మొల్లయే పొరబడెనని చెప్ప నొప్పు. ఇట్టి నలుసులు ప్రతికవియందును సాంప్రదాయమో యనునట్లు గన్పడుచున్నవి. కావున మొల్ల యం దీయల్పదోషములు పరిగణనీయములు కావు. వస్తువు ప్రాతదేయైనను దానికి మెఱుఁగుపెట్టి పాఠకుల కెంతమాత్రమును విసుగులేకుండ నిర్వహించిన మొల్ల యొక్క యనల్పధిషణావిభవము నభినందించి యేతద్రామాయణ విమర్శనము నిఁక విరమించెదను. మన సారస్వతమున నీ రామాయణ మమూల్యాభరణమై యత్తురామ్నాయమెంతికాలము నశ్వరమై యుండునో యంతకాలమును నాంధ్రజనులచేఁ బఠింపఁబడుచుండును గాక!

ఈవ్యాసమున్యమున వయ్యాలరాజు రామభద్రకవి నారణాశి వెంకటేశ్వరకవి మొదలగు వారిం దలపోయుట మొల్ల వారికంటె నధికురాలని చెప్పుటకుఁ గాదు. వారి పాండితీవిభవ మనన్యసామాన్యమై మనకాశ్చర్యమును గొలుపును. వారి కవితలు విశేషముగ శేముషీవిభవముతో నొప్పారుచుండును. కాని పాండితీప్రకర్షమును, వర్ణనాధిక్యమును, నలంకారప్రౌఢిమను ఇత్యాదులను ప్రబంధనిబంధనలఁ బ్రాధాన్యముగా నెంచిన వారికిని కేవలము రసమునే ప్రాధాన్యముగా నెంచిన మొల్లకును గల భేదమును సూచించుటకుగాను పైవారి ప్రసక్తి నిందు తేవలసివచ్చెను. అంతియ కాని వేఱొండు కాదని విన్నవించుచున్నాను.




# సీతరువాత

(పిరుగుబోతు)

చందమామ వెలుగు బావా
చక్కగా వున్నాది బావా.
అంతకన్న నీనవ్వు పిల్లా
హాయిగా వున్నాదే పిల్లా.

అంతులేని యీసంద్రం బావా
ఎంతలోతుంటుందో బావా.
నీ హృదయం ముందు పిల్లా
నేలమట్టా సంద్రం పిల్లా.

గండు కోయిలపాట బావా
కమ్మగా వున్నాది బావా.
నీమాటలముందు పిల్లా
నిలువ దాగానమ్ము పిల్లా.

మూడుమూర్తుల రూపులు బావా
ముద్దుగావున్నాయి బావా.
ముద్దులొలుకు నీరూపు పిల్లా
మూర్ఛదెచ్చే నేమొ పిల్లా.



# సుకవి భావన

చింతలపూడి సీతారామయ్య గారు

పలుకులఁ జెల్మి, భావములఁ బ్రౌఢిమ, యర్థములన్ నయంబు, శ
య్యల నవకంబు, రీతుల నొయ్యారము, నెయ్యెడ వేని కేవి కా
వలయునొ వాని నెల్ల రసభావము లేర్పడునట్లు గూర్పఁగాఁ
గలనని కాని, లే ననుచుఁ గాని వచింపఁగ నాకు నేటికిన్?

చ. భువిఁ గవులైన వారలనె పొందును నిందలు; షేక్స్పియర్ మహా
కవియును గాళిదాసకవికల్పకుజంబు జగంబు అవ్వకున్
దవిలిరి కాదె? సంస్తుతిపథంబె గణింపని నాకు నిందకున్
దవులుటకో తప్పటో యనెడి తర్కవితర్కపథంబు లేటికిన్?

చ. కవితయె విద్యలందుఁ బ్రముఖంబని లోకము మెచ్చుఁగాక, స
త్కవియె జనాళిలోన నధికప్రథితుం డనఁ జెల్లుఁగాక, త
త్కవికృతియే సదర్థములకంటెను సార్థక మౌనుగాక, నా
కివియె మహత్తరంబు లన నేటికిఁ గావని చెప్ప నేటికిన్?

చ. శ్రుతులఁ బఠించి, శాస్త్రములఁ జూచి, పురాణములన్ గ్రహించి, స
త్కృతులఁ దలంచి, లోకము నెఱింగి, వినిర్మలవృత్తినై, తట
స్థత వెలయంగఁ గల్పనలఁ దన్మయతన్ బ్రకటించుచుంట నా
మతమగుఁ గాని లోక మనుమాటలతోఁ బనియేమి నాకికన్?

చ. ప్రకృతి గ్రహించి దానిఁ దెలుపం దగు పాటలు పాడి, భావనా
ప్రకృతిఁ దలంచి దాని దెలుపం దగు పల్కులు పల్కి మానవ
ప్రకృతి గణించి దాని నిలుపం దగు సుద్దులు వ్రాసికొంట నా
ప్రకృతి; జగంబు మెచ్చులకు వ్రాయుట తిట్లకు మాను టేటికిన్?



# పూవులు

పాపినేని వేంకటేశ్వరరావు గారు

పుష్పమా! నన్నుఁజూచి నవ్వెదవేల? పొడుపుఁ గొండను వెలుంగులయందు నిహాలుఘాకేకులు చిత్రకళ లీనుచున్నవనియా? పూలపాటఁ బాడుచున్న భ్రమరుఁడు నిన్ను చుంబించుచున్నవాఁడనియా? భావగర్భములగు గీతికలపాడుచున్న మలయపవనుఁడు నిన్నుఁ గౌఁగిలించె ననియా?— నవ్విన నవ్వుకొందువుగాక, నాకేమి సిగ్గు!

కోయిలా! నన్నుఁ బరిహాసించెదవేల? తీయమామిడి చివురుజొంపములయం దాగుచుంటివనియా? గాలిపాటలపై తేలిపోవుచుంటి వనియా? విశ్వకుమారిని మేలుకొలుపుచుంటి వనియా? పరిహాసించిన పరిహాసింతువుగాక, నాకేమి యుడుకు!

అభ్రమా! నన్ననాదరించెదవేల? అంతరాని శాంతాభ్రవీథి సంచరించుచుంటివనియా? గాలి ముఖముఁగాంచు తెరచాపల నెత్తి తేలియాడుచుంటివనియా? కులుకుసంజ గాడ్పున సాగిపోవుచుంటివనియా?— అనాదరించిన అనాదరింతువుగాక, నాకేమి విచారము!

అభ్రపథమా! నన్ను బాధించెదవేల? తళుకుఁగుప్పూవుల వెదఁజల్లఁగలవనియా? తారకారత్నహారముఁ గూర్చఁగల వనియా? నీలాలవిపంచిని నదింపఁగలవనియా?— బాధించిన బాధింతువుగాక, నాకేమి 'బాధ'!

అంధకారమా! నన్ను భయపెట్టుటేల? ఇమ్మహాలోకమును గ్రసించితివనియా? కవికుమారుని హృదయగర్భమున దేకుపిడచితి వనియా?— భయపెట్టిన భయపెట్టుదువుగాక, స్వేచ్ఛావిహారి అగు నాకేమి 'భయము'!

# భారతీవందనము

త్రిపురాన వేంకటసూర్యప్రసాదరావు గారు

నలువారు నిండు పున్నమనాటి చందురుం
        దలపించు నెమ్మోము చెలువుతోడ,
వెలలేని తమ్మి కెంపులసొంపు నింపు కెం
        దమ్మిపూవుల కిరీటమ్ముతోడ,
విలసద్బుధము వోలె వెన్నంటిక్రేగాడు
        రమణీయకబరీభరమ్ముతోడ,
జ్ఞాన ముక్తియుక్తి సరసలీలాంభోజ
        సక్తినొప్పు హస్తములతోడ,
    నఱుత మంగళపుష్పమాల్యమ్ము దాల్చి,
    యెఱ్ఱతామరగద్దెపై నింపుగులుకు,
    సతులితోంకారపీఠమ్ము నధివసించు,
    "భారతి"కి భారతికి నమస్కారశతము.




నోరి నరసింహశాస్త్రి బి. ఏ., సాహితీసమితి సభ్యుడు

౧

"బుల్లీ, మీ పెద్దనాన్న వచ్చారు, రా!" అనే పినతల్లి మాటలు వినగానే పెరటిలో గోలగా అరుస్తున్న మాలకాకులవంక చూస్తూ కూర్చున్న బుల్లి వాకిట్లోకి పరిగెత్తుకొని వచ్చింది.

తాండవకృష్ణయ్య అంతకుముందే రైలు దిగి వచ్చినాడు. వాకిట్లో ఆయనను చూడగానే నాగరత్తమ్మ కాళ్లకు నీళ్లిచ్చి "అంతా కులాసాగా ఉన్నారా?" అని అడిగింది. కృష్ణయ్య కాళ్లు కడుక్కుంటూ "ఆ, అంతా బాగానే ఉన్నారు" అన్నాడు.

ఇంతలో బండివాడు వాకిట్లో 'సామీ' అని కేకలు పెట్టుతున్నాడు. కృష్ణయ్య "పోవోయి, ఒప్పుకున్న ప్రకారము ఇచ్చినానుగా, పో" అని అన్నారు.

"ఏం సామీ రొంబా కష్టముంది. ముక్కాలు రూపాయి ఏం సరిపోతుంది? కడుపు నిండదు సామీ" అని బండివాడు గోలచేయ సాగినాడు. ఆ మాటలు విని నాగరత్తమ్మ "ఇక్కడినుంచి బ్రాడ్వేకు ఆరణాలే ఎప్పుడూ తీసుకుంటారు కాని. సెంట్రలు స్టేషనునుంచి ముక్కాలు రూపాయికూడా చాలదేం?" అన్నది.

అక్కడి రివాజు తెలిసిన తర్వాత తాండవ కృష్ణయ్య బండివాణ్ణి గదమాయించినాడు. ఇక లాభం లేదనుకొని "మంచిదానవే అమ్మా!" అని వాళ్లను అరవతెలుగులో తిట్టుకుంటూ బండివాడు వెళ్లిపోయినాడు.

తాండవకృష్ణయ్య నొచ్చుకున్నాడు.

"ఈ దరిద్రగొట్టువాళ్లు ఎప్పుడూ అంతే లెండి! అసలు ఇక్కడికి అర్ధరూపాయి ఇస్తేనే ఎక్కువ! మీ తమ్ముడుగారు మీకు కనిపించలేదా? మీకోసమే రైలుదగ్గరికి వెళ్ళినారే?" అన్నది నాగరత్తమ్మ.

"అట్లాగా, నేను రైలు దిగగానే తమ్ముడుగారు వస్తారేమో నని ఇటూ అటూ చూసి కనపడకపోతే బండి చేసుకొని వచ్చివేసినాను" ఇట్లా అని తాండవకృష్ణయ్య అక్కడ ఒక బల్లమీద కూచున్నాడు. అప్పుడు నాగరత్తమ్మ బుల్లిని కేకవేసింది. బుల్లి వాకిట్లోకి వచ్చి ఎవరో క్రొత్తమనిషినిచూసి బెదురు చూపులు చూస్తూ సిగ్గుతో పోయి పినతల్లిని "అప్పా!" అంటూ గట్టిగా కౌగిలించుకున్నది.

నాగరత్తమ్మ బుల్లి పట్టు కొంత సడలించుకొని దాని ముఖము తాండవకృష్ణయ్య వైపుకు

తిప్పి, "అటువైపు చూడు, చిలకల బాబును మరిచిపోయినావా?" అన్నది.

బుల్లి తాండవకృష్ణయ్యవైపు చూస్తున్నది. ఇంతలో ఆయన జేబులోనుంచి రెండు పంచదార చిలకలుతీసి చూపి "దా, బుల్లీ" అన్నాడు.

బుల్లి మొదట కాస్త సంకోచించి తర్వాత ఆయనదగ్గిరికి వెళ్లింది. రాగానే బుల్లిని పట్టుకొని కృష్ణయ్య తన ఒళ్లో కూర్చోపెట్టుకొని చిలకలు చేతికిచ్చి "బుల్లీ, నన్ను మరిచి పోయినావా?" అని అడిగినాడు.

అందుకు బుల్లి "ఊఁహుఁ" అంటూ ఎడమచేయి విసరగా అది పోయి తాండవకృష్ణయ్య చెంపమీద త గి లిం ది. ఆయన ఆచెయ్యి ముద్దుపెట్టుకున్నాడు.

"తప్పగాదూ, పెద్దనాన్నగారిని అట్లా కొట్టవచ్చునా?" అన్నది నాగరత్తమ్మ.

బుల్లి పెద్దనాన్న ఒళ్లోనుంచి లేవవలెనని ప్రయత్నిస్తూ ఉండగానే చంద్రశేఖరం వచ్చినాడు. ఆయనను చూడగానే బుల్లి చివాలున లేచి "ఏమితెచ్చావు?" అంటూ ఎదురుగా పరుగెత్తుకొని వెళ్లింది.

చంద్రశేఖరం తాండవకృష్ణయ్యను చూసిన తొందరలో బుల్లివంక సరిగాచూడక తాండవకృష్ణయ్యతో "ఈ రైలుకే వచ్చారా? నేను ప్లాటుఫారముమీద ఎంత వెదకినా కనపడలేదే!" అన్నాడు.

"నేనూ మీకోసము వెదకినాను. ఆనందడిలో ఒకరి నొకరు చూసేదెట్లా? ఎంత మందో!" అన్నాడు తాండవకృష్ణయ్య.



"మీరు గట్టిగా వస్తానని వ్రాయడంబట్టి స్టేషనుకు వచ్చి మీరు కనబడక పోయేప్పటికి ముసలాయనకు పాప మెట్లా ఉన్నదో అనుకున్నాను. చాలాసేపు ప్లాటుఫారముమీద ఈ చివరనుండి ఆ చివరకు వెదుకుతూ తిరిగి మీరు రాలేదని నిశ్చయంచేసుకొని ట్రామెక్కి వచ్చినాను. మీనాన్నగారి కెట్లా ఉన్నది?" అంటూ చంద్రశేఖరం అక్కడనే కుర్చీలో కూచున్నాడు.

"ఏదో కాస్త అట్లానిలిచిఉన్నది. ఏమున్నది, పిల్లదిగులుతప్ప ఆయనకు మరేదీ లేదు. తల్లీతండ్రీ లేనిపిల్లే, దానిని ఒకయ్యకిచ్చి వెంటనే ముడివేస్తేనేకాని వల్లకాదని పట్టుపట్టినాడు." చంద్రశేఖరం తన

వంకనైనా చూడకపోయినందువల్ల ఇంతలో బుల్లి మొగ మింత చేసుకొని కన్నీళ్లతో పినతల్లి వద్దకు వెళ్లినది. పినతల్లి బుల్లితో "నీ పెళ్లిట, బుల్లీ, ఆమాటలువిను" అన్నది. తికమకతో బుల్లి వాళ్లసంభాషణ విన సాగింది.

"వెదుకుకోకుండా మేనత్తకొడుకు ఉండనే ఉన్నాడాయెను. ఆరేళ్ల పిల్ల పెళ్లి కెందు కింతతొందర!" అన్నాడు చంద్రశేఖరం.

అందుకు తాండవకృష్ణయ్య "ఐతే నేమి? ఆయనవిచ్చి ఆయనిది. మేమంతా ఉన్నాము గదా, ఈ పెళ్లి ఇంత తొందరలో ఎందుకంటే ఆయన వింటేగా, ఆయన కళ్లతో చూడవలె నట, ఏమి చేస్తాము పెద్దవా డట్లా తొందర చేస్తుంటే!" అన్నాడు.

తాను మొదట సరిగా ఆదరించనందుకు బుల్లి చిన్నబుచ్చుకున్నది చూచి చంద్రశేఖరం దాన్ని దగ్గిరికితీసి "పుచ్చాయి తాతయ్య జ్ఞాపకమున్నాడూ?" అని అడిగినాడు.

బుల్లి కొంత శాంతించి ఆశ్చర్యంతో తల యెత్తి చూస్తున్నది.

నాగరత్తమ్మ "జ్ఞాపకం లేదమ్మా, నీ కెప్పుడూ పుచ్చకాయలు తెచ్చి కోసిపెట్టేవారే, ఆ తాతగారు, జ్ఞాపకం లేదూ?" అన్నది.

"పుచ్చాయి తాతయ్యా? తెల్లటి పిలకజుట్టు ఉంటుంది, ఆ, తెలుసు" అని బుల్లి పలికింది.

"తాతయ్య నిన్ను తీసుకురమ్మన్నాడు వస్తావా?" అని తాండవకృష్ణయ్య అడిగినాడు.

"ఆఁహాఁ" అన్నది బుల్లి తల ఊపుతూ.

మళ్లీ తాండవకృష్ణయ్య "తాతయ్య నీకు పెళ్లి చేస్తారట చేసుకుంటావా?" అని అడిగి నాడు.

వెంటనే బుల్లి అన్నది, "ఆ! నాకు ఒళ్లంతా కనపడకుండా పూలు కప్పుతారా, పల్లకీలో కూచోబెట్టుకొని శంఖాలు ఊదుతూ తాళాలు వాయిస్తూ ఊరేగిస్తారా?"

"శంఖాలు కాదమ్మా. బ్యాండూ సన్నాయీ రమ్ముఁవోళ్లు వాయిస్తారు. పూలజడ వేసుకొని పల్లకీలో నువ్వొక పక్కా- బావొక పక్కా- కూచుని ఊరేగుతారు. నీకు బావ జ్ఞాపక మున్నాడా?" అని తాండవకృష్ణయ్య అడిగి నాడు.

"ఆ! బావకూడానా? బావ మంచివాడేలే. మే మిద్దరమూ పూలతో ఆడుకుంటాము. ఇన్ని పూలుంటవిగా!" అని తన బుల్లి చేతులు ఎడంగాజాపి చూపుతూ బుల్లి పలికింది.

"ఆ" అన్నాడు తాండవకృష్ణయ్య.

అప్పుడు నాగరత్తమ్మ బుల్లిని "మీ పెద్ద నాన్నగారు నిన్ను మీ ఊరు పెళ్లికి తీసు కొని వెళ్లుతారట, వెళ్లుతావా?" అని అడి గింది.

దానికి బుల్లి "ఆ, ఇక్కడేగా పెళ్లి అయ్యేది!" అన్నది.

"ఇక్కడ కాదు, మన ఊళ్లో! పుచ్చాయి తాతయ్య ఉంటాడే, ఆ ఊళ్లో!" అని అందు కున్నాడు తాండవకృష్ణయ్య.

బుల్లి "ఊఁ, నీకు తెలియదులే. ఇక్కడే పెళ్లిళ్లు ఔతవి. అక్కడ అంతా పోతారు.

ఇప్పుడెవరు పోయినారు పెద్దనాన్నా ?" అని అడిగింది.

"ఛా, అట్లా అనరాదు" అని ముగ్గురూ ఒక్కసారిగా అన్నారు.

బుల్లి జంకక అన్నది, "మీకు తెలియదులే. అక్కడ ధర్మరాజు అందరినీ ఎత్తుకపోతాడుగా ! పిన్ని చెప్పింది నాకు తెలుసులే, అప్పా, కాదూ ?"

"పిన్నికేం తెలుసు ? అది ఎప్పుడూ అట్లాగే అంటుందిలే" అన్నాడు నవ్వుతూ చంద్రశేఖరం.

బుల్లి తల నాజూకుగా నెమ్మదిగా ఇటూ అటూ తిప్పుతూ అడుగులు ఇటూ అటూ వేస్తూ "ఎట్లా ఐనా నే నాఊరు వెళ్లనులే" అన్నది.

"మన ఊరు రావమ్మా ? అక్కడ కావలసినన్ని పుచ్చకాయలు. తాతయ్య కోసిపెట్టుతాడు ; నీకు చాలాచిలకలు కొనిపెట్టుతాను. బావతో చక్కగా ఆడుకుందువుగాని, రావూ ?" అని తాండవకృష్ణయ్య అడిగినాడు.

"రాను, అక్కడికి వస్తే మళ్లీ రాకుండా అందరినీ ధర్మరాజు ఎత్తుకు పోతాడు. పుచ్చకాయలూ చిలకలూ అన్నీ ఇక్కడికే తీసుకు రారాదూ ? బావా నేను ఇక్కడనే పల్లకీలో ఎక్కి పెళ్లి చేసుకోవచ్చుగా !" అన్నది బుల్లి.

"పిచ్చిదానా," అన్నాడు చంద్రశేఖరం.

"నరేగాని,బుల్లి బాగా అల్లరి చేస్తున్నదా ?" అని తాండవకృష్ణయ్య అడిగినాడు.

"నే నల్లరిచేయను. అల్లరి చేస్తే ధర్మరాజు వస్తాడుగా ! వాడంటే నాకు భయం" అన్నది బుల్లి.

ఇంకా కొంత సేపు సంభాషణ జరిగినమీదట వాళ్లు స్నాన భోజనాలకు లేచినారు.

"ఇందాక అప్ప నాకేమీ తీసుకు రాలేదు. ఇవ్వాళ చిలకల బాబు దగ్గర అన్నానికి కూచుంటా" అన్నది బుల్లి.

౨

బుల్లికి నాలుగేళ్ళ ఈడున తండ్రి గతించినాడు. ఇప్పటికి సంవత్సరం కిందట తల్లికూడా కాలధర్మము పొందినది. ఆ తర్వాత పినతల్లి నాగరత్నమ్మ తన దగ్గరకు తెచ్చుకొని పెంచుతున్నది.

నాగరత్నమ్మకూ చంద్రశేఖరానికీ పిల్లలు లేరు. భార్యా భర్తా ఎప్పుడూ ఒకటే తీరుగా కాపరం చేస్తూ ఉండడము విసుగుపుట్టి, పిల్లలుకావలెనని ముఖ్యంగా కోరుకునే ఈడు వాళ్ళకు వచ్చినది. కాని అప్పుడే పిల్లలసలు కలగరేమో అనేసందేహము అంకురిస్తున్నది.

ఆసమయంలో బుల్లి సందర్భపడడముచేత వాళ్ళకు కొంత మనశ్శాంతి కలిగినది. అందువల్ల వాళ్లు బుల్లిని మిక్కిలిఆదరంతో చూసుకుంటున్నారు.

చంద్రశేఖరం ఉద్యోగముచేస్తూ పై అధికారితో పోట్లాడి వాళ్లే డిస్మిస్ చేయుటానికి ప్రయత్నిస్తూ ఉండగా తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి భార్యతో చెన్నపట్టణంవచ్చి

లా కాలేజిలో చేరినాడు. వాళ్లు వచ్చేటప్పుడు బుల్లినికూడా వెంటతీసుకొని వచ్చినారు.

నలుగురిలో పెరిగిన బుల్లికి చెన్నపట్టణంలో ఒంటరిగా ఉండడము మొదట కష్టమనిపించినది. ఏదో దిగులుదిగులుగా ఉండేది. ఎప్పుడూ ఏదో ఏడుపే. మాటిమాటికీ తల్లి విషయము ప్రశ్నలు వేసేది. పినతల్లి ఏదో విధంగా ఆ మాటలు మరిపించవలెనని ఏవో మాటలు అల్లి చెప్పుతూ ఆదరంతో పెంచుతున్నది.

ఒకరోజున బుల్లి, తల్లికోసము మరీ మారాము చేసినది. "అమ్మను ఎక్కడికో తీసుకుని పోయినారు, ఎక్కడికి వెళ్లిందో చెప్పు"మని కూచున్నది.

"ఊరికి వెళ్లిందమ్మా" అని నాగరత్నమ్మ కన్నీళ్లతో అన్నది.

"ఏఊరికి వెళ్లింది? నన్నుకూడా అక్కడికి తీసుకుపోరాదూ?"

"నీవు వెళ్లకూడదు. చిన్నవాళ్లను రానీయరు."

"నువ్వు తీసుకుపోరాదూ? అమ్మను చూచి ముద్దియ్యాలెనని ఉన్నది. నువ్వు పెద్దదానివేగా!"

"సరేకాని అమ్మా, మొన్న మ్యూజియముకు వెళ్లినాము జ్ఞాపకమున్నదా? అక్కడ పిట్టలూ లేళ్లూ పెద్దపుల్లూ పాములూ బీరువాలలో పెట్టి ఉన్నవి చూశావా? ఆ ఈకల పక్షి జ్ఞాపకమున్నదా?"

"కాదు లెద్దూ! ముందు నన్ను అమ్మ దగ్గరకు తీసుకునిపో!"

"అల్లరిచేయవద్దు, నిన్ను రానీయరు!"

"నన్ను రానీయక పోయే దెవరేం?"

"ధర్మరాజు"

"వాడేనా అమ్మను తీసుకు పోయింది?"

"అవును"

"నాన్ననూ?"

"వాడే"

"ఇంకా ఆఊళ్లో మా మామ్మనూ పనిచేసే సుబ్బినీ గడ్డంబాబునూ తీసుకు పోయిందికూడా వాడేనా?"

"వాడేకాని నీ రైలుబండి ఏది?"

బుల్లి పినతల్లి నోరు గట్టిగా మూసి "అది సరే లెద్దూ, ధర్మరాజు ఎక్కడ ఉంటాడు?" అని అడిగింది.

"ఆ ఊళ్లోనే."

"అయితే అమ్మ నన్నెట్లా విడిచిపెట్టి ఉన్నది? కాస్తసేపు ఆడుకోడానికి వెళ్లితేనే ఎక్కడికే అని వెంబడి పడేదే?"

నాగరత్నమ్మ కన్నీళ్లతో అన్నది: "ఏంజేస్తుంది? ధర్మరాజు రానీయడు."

"నన్నుకూడా వాడు తీసుకొని పోడూ?"

"ఊహూఁ!"

"నేను వెళ్లగూడదూ?"

"వెళ్లగూడదు. మనని అప్ప ఇవ్వాళ నాటకానికి తీసుకు వెళ్లుతారట! మొన్న మనం చూసిన బొమ్మలు ఎట్లా ఉన్నవి?"

"ముందు ఇదిచెప్పు, నే నెందుకు వెళ్ల కూడదు?"

"నీవు వెళ్లితే ధర్మరాజు కొడతాడు."

"ధర్మరాజు మంచివాడు కాదూ?"

"వాడు బహు చెడ్డవాడు"

"వాడు ఎట్లా ఉంటాడు?"

"నల్లగా ఉంటాడు"

"మాలకాకిలాగా ఉంటాడేం?"

"అవును"

"గడ్డముంటుందా? బూచివాడిలాగా ఉంటాడేం?"

"బూచివాడి కంటే కూడా చెడ్డవాడు. వాడి దగ్గిరికి వెళ్లితే బూచివాడే జడుసుకుంటాడు"

"అయితే, అమ్మ జడుసుకోలా?"

"అమ్మా జడుసుకుంది. ఏంజేస్తుంది?"

"నాన్న వాణ్ణి కట్టలేడూ? మాఊళ్లో గీరల గోచీవాణ్ణి ఒకసారి నాన్న చావ గొట్టినాడుగా!"

"ధర్మరాజు అటువంటివాడు కాడు. వీడు నాన్ననుకూడా కొడతాడు."

అయ్యో! నాన్న ఎప్పుడూ నన్ను కొట్టేవాడు కాడే! ధర్మరాజు కొడతాడా?"

"ఆ!"

"అయితే ధర్మరాజు ఈ ఊళ్లోకూడా ఉంటాడా?"

"ఉండడు"

"వాడు మాఊళ్లో నేనా ఉండేది?"

"అవును"

"అయితే నేను మా ఊరు మళ్లీ వెళ్లను. ఇక్కడనే ఉంటానే అప్పా!"

"మీఊరు వెళ్లవద్దు, ఇక్కడనే ఉండు!"

"ఇక్కడికి ధర్మరాజు రాడుగా! వాణ్ణిచూస్తే నాకు భయం వేస్తుంది."

"ధర్మరా జీఊరు ఎప్పుడూ రాడు కాని పిల్లలెవరైనా అల్లరిచేస్తూ ఉంటే భయపెట్టడానికి వస్తాడు."

"నేను అల్లరి చేయనుగా!"

"అయితే వాడూ రాడుగా!"

ఆపైన ఎప్పుడూ అమ్మనూ నాన్ననూ చూపించమని మళ్లీ బుల్లి ఆగంచేసి ఎరగదు. బుల్లికి వాళ్ల ఊళ్లో ధర్మరాజు ఉన్నాడనీ అందరినీ కొట్టి ఎత్తుకుపోతాడనీ భావ మేర్పడ్డది. ఎవరైనా వాళ్లి ఊరినుంచివస్తే వాళ్లను "ఎవరు పోయినారు?" అని ముందుగాపోయి అడిగేది.

ఎప్పుడన్నా బుల్లి ఆగంచేస్తూఉంటే ధర్మరాజు వస్తున్నాడంటే ఇక కుక్కురి మిక్కురి మనదు. ధర్మరాజు పేరెత్తుతే ఆ పసికూన ఒళ్లు వణికేది. ఆ పసిపిల్ల పూవమనస్సులో ధర్మరాజు కఠిన స్వరూపము గాఢంగా నాటి పోయింది.

చెన్నపట్టణం వచ్చినతర్వాత ఎక్కువభాగము ఇంట్లోనే ఉండడమువల్ల ఎప్పుడోకాని బయటికివెళ్లడము తటస్థించేదికాదు. అట్లా వెళ్లినప్పుడెప్పుడూ శవాన్నిచూడడము తటస్థించలేదు. వీటికి పినతల్లిమాటలు తోడ్డె ధర్మరా

జక్కడ లేడనీ అక్కడ మనుష్యులు పోరనీ కూడా బుల్లి మనస్సుకు తోచింది.

కాని ఆమధ్య వాళ్ళొకసారి మ్యూజియముకు వెళ్లుతున్నరోజున ఒక శవాన్ని పల్లకీలో పెట్టి పూలతో అలంకరించి శంఖులు ఊదుతూ తాళాలు వాయిస్తూ ఆడంబరంగా తీసుకొనిపోతూ ఉండడము బుల్లికి కనపడ్డది. పడుకున్న శవాకారం చూడగానే దాని తల్లిదండ్రుల సంగతి జ్ఞాపకము వచ్చి "ఏమిటది? వాణ్ణి ధర్మరాజు ఎత్తుకు పోతున్నాడా?" అని అడిగింది.

"కాదు. అది పెళ్లిపల్లకీలో ఊరేగిస్తున్నారు" అన్నది పినతల్లి.

"అవును లే. ఇది పెళ్లిళ్ళ ఊరుగా! నాకుకూడా ఇక్కడ పెళ్లి చేస్తారా?"

"నీకూ ఔతుంది."

"అప్పుడు నన్నూ ఇట్లాగే పూలుపెట్టి పల్లకీలో ఊరేగిస్తారా?" అని బుల్లి అడిగింది.

ఇంతలోకే ఊరేగింపు దాటిపోయింది. ఇంకో వైపుగా సోల్జర్లు వస్తూఉంటే బుల్లి దృష్టి ఆ వైపుకు మళ్లింది.

అప్పటినుంచీ చెన్నపట్టణం పెళ్లిళ్ల ఊరని బుల్లి మనస్సులో నాటి పోయింది.

ఇటువంటి సందర్భంలో వాళ్ల తాతగారు బుల్లిని పెళ్లినిమిత్తము స్వగ్రామానికి తీసుకురమ్మని పెద్దకుమారుడైన తాండవకృష్ణయ్యను చెన్నపట్టణం పంపినాడు.

## 3

బుల్లి తాతగారికి చాలా జబ్బుగా ఉన్నది. ఆయన గొంతులో ఊపిరి ఉండగానే బుల్లికి పెళ్లి చేయవలెనని పట్టు పట్టినాడు. వెదుకుకోకుండా వరుడుకూడా మేనరికము సిద్ధముగా ఉన్నందుచేత వెంటనే పెళ్లి చేయ నిశ్చయించుకున్నారు. వివాహలగ్నము వారము రోజులే ఉన్నది. కావలసిన సంబంధం కాబట్టి ఏమీ అనుకోకుండా రెండు వైపులవాళ్లూ అడావిడిగా పెళ్లిపనులు చేస్తున్నారు.

తాండవకృష్ణయ్య వచ్చినరోజు రాత్రికే మళ్లీ ప్రయాణము కావలెనని వచ్చినాడు. తొందరతొందరగా బుల్లి పరికిణీలూ చొక్కాలూ నాగరత్నమ్మ సర్దసాగింది. బుల్లికి దిగులు పుట్టింది.

"ఎందుకే అప్పా ఇవన్నీ సద్దుతున్నావు?" అన్నది.

"రాత్రికి పెద్దనాన్నగారితో ఊరికి వెళ్లుతువుగాని,"

"నేను వెళ్లను"

"నీ కక్కడ పుచ్చకాయలూ పంచదార చిలకలూ పెడతారు"

"నేను వెళ్లనంటే! నాకవన్నీ అక్కరలా!"

"నీకు సిల్కు జాకెట్లూ పరికిణీలూ లేసుచొక్కాలూ ఇన్ని కుట్టిస్తారు"

"నా కవేమీ అక్కరలా! నేను వెళ్లనూ!"

"నీకు చక్కగా తలదువ్వి, ముఖాన కల్యాణం బొట్టుదిద్ది బుగ్గను కాటికపెట్టి కాళ్లకు పసుపూ పారాణీనూ పూసి పెళ్లికూతుర్ని చేస్తారు.

పూట కోళమాదిరిగా పూలజడ వేస్తారు. బావతో చక్కగా పూలచల్లాడుదువుగాని. సరే. కాని బావకు తలంబ్రాలు ఎట్లా పోస్తావు? పోయడం నీకు బాగా చేతనౌనా?"

"నాకు తెలుసులే, అక్కడ ధర్మరాజు నన్ను పట్టుక పోతాడు," అని బుల్లి వణుకుతూ అన్నది.

పినతల్లి బుల్లిని దగ్గిరికి తీసుకొని వీపు చరిచి "లేదమ్మా, ధర్మరా జక్కడ లేడు. నిన్ను భయపెట్టడాని కన్నాను గాని నిజంగా అక్కడ ధర్మరాజు లేడమ్మా!" అన్నది.

"కాదులే, నాకు తెలుసు. ఇందాక పెద్దనాన్నను కొట్టినా నని నన్ను ధర్మరాజుకు అప్పగించ దలుచుకున్నావు కాదూ? నేనిక పెద్దనాన్నను కొట్టను" అని బుల్లి కన్నీళ్లు విడిచింది.

పినతల్లి కూడా కన్నీళ్లతో కౌగిలించుకొని "లేదమ్మా, ధర్మరాజు నిజంగా అక్కడ లేడు. ఉంటె మాత్రము వాడేం జేయగలడు? పెద్దనాన్న తన్ని పారవేస్తాడు" అన్నది.

"వద్దే అప్పా! నాన్నను ఎత్తుకు పోయినాడుగా. పెద్దనాన్నను చూస్తే ఏం భయం? నాకే పెద్దనాన్నను చూస్తే భయం లేదు."

"అయ్యో, అట్లా అనరాదే. చెప్పతుంటే విను అమ్మా, అక్కడ ధర్మరాజు లేడు. అమ్మ నిన్ను పిలుచుకు రమ్మన్న దట."

"నేను అల్లరిచెయ్యను అప్పా! నాకు ధర్మరాజంటే భయం. ఆఊరు నన్ను పంపవద్దు. నేను పోను."

"కాదమ్మా, అమ్మ నిన్ను పిలుచుకు రమ్మన్నదట. ఆ ఊళ్లోనుంచి ధర్మరాజు ఇప్పుడు వెళ్లిపోయినాడు. నీ కేం భయం లేదు."

ఎంత చెప్పినా బుల్లి ఏమీ వినలేదు. ప్రయాణానికి సద్దుతున్నకొద్దీ బుల్లి ఏడుపు ఎక్కువవుతున్నది. ఇదేమి కర్మ మని పినతల్లి దిగులుపడసాగింది. ఇంతలో బజారుపను లన్నీ చేసుకొని సాయంత్రమయ్యేప్పటికి చంద్రశేఖరం తాండవకృష్ణయ్యా వచ్చినారు. వాళ్లు కూడా తమ శాయశక్తులా చెప్పి బుల్లిని ఓదార్చ చూచినారు. కాని వాళ్లకు సాధ్యం కాలేదు. ఓఘాయిత్యంగా ఉంటేమాత్రము ఏమి చేస్తారు? తాతకు ప్రాణం మీదికి వచ్చి ఉంటే ఆరోజే వెళ్లక తప్పుతుందా?

ఇప్పుడు బుల్లిని తాండవకృష్ణయ్య తీసుకొని వెళ్లితే చంద్రశేఖరం నాగరత్తమ్మా లగ్నం నాటికిరావచ్చునని వాళ్లు మొదట ననుకున్నారు. కాని బుల్లి ఆగంతో దాన్ని ఒంటరిగా తాండవ కృష్ణయ్య తీసుకొని పోవడము సాధ్యముకాలేదు.

"పోనీ, ఇకవారము రోజులేకదా వ్యవధి. ఈ నాలుగురోజులపాటూ ఎట్లాగో చంద్రశేఖరం గారు ఇబ్బంది పడతారు. పిల్ల ఇంత ఆగం చేస్తున్న దామెను! పోనీ నువ్వుకూడా ఇవ్వాళనే బయలుదేరమ్మా! అని నాగరత్తమ్మతో తాండవకృష్ణయ్య అన్నాడు.

కాని అప్పుడామె బయలుదేరితే భర్తకు ఇబ్బంది. ఐనా ఏమీచేసేది లేక చంద్రశేఖరమే ఆమెను పోనీ ప్రయాణం కమ్మన్నాడు. ఆమె అడావిడిగా బట్టలన్నీ సద్దుకొని ఆరోజే

ప్రయాణమైనది. ఆమెకూడా బయలుదేరు తుందని తెలిసిన తర్వాతనైనా, బుల్లి ఆఆగపు ఉద్ధృత్వము చాలించినదే కాని పూర్తిగా ఊరికి వెళ్లడానికి ఉన్ముఖం కాలేదు.

చంద్రశేఖరం వాళ్లను పంపడానికి రైలుస్టేషనుకువచ్చి వెళ్లేటప్పుడు "నేను లగ్నంనాటికి వస్తాను, జాగ్రత్తగా వెళ్లండి!" అని బుల్లిని ముద్దు పెట్టుకొని వెళ్లిపోయినాడు.

## ౪

వాళ్లు ఊరికి వెళ్లేటప్పటికి ఇంటిచుట్టూ చాలా సందడిగా ఉన్నది. వాకిట్లో జనము వచ్చేవాళ్ళూ పోయేవాళ్లుగా ఉన్నారు.

బుల్లికి తన తండ్రీ తల్లీ చనిపోయినరోజులు జ్ఞాపకము వచ్చినవి. అప్పుడూ ఇట్లాగే జనం రామంధాళిగా తిరిగేవాళ్లు. "మాఇంట్లో ధర్మరాజు ఎవరిని ఎత్తుకుపోతున్నాడే అప్పా" అని బుల్లి నాగరత్నమ్మను అడిగింది. "ఈ ధర్మరాజు నెక్కడ పట్టుకున్నావే? అట్లా అనరాదమ్మా" అని నాగరత్నమ్మ అన్నది కాని ఆమెకుకూడా భయంగానే ఉన్నది. తాండవకృష్ణయ్య ఆపాదమస్తకమూ కంపిస్తున్నాడు.

ఇంటికి వాళ్లు వెళ్లే టప్పటికి వాళ్లకు కాళ్లకు నీళ్లిచ్చేవాళ్లుకూడా లేకపోయినారు. బుల్లి తాతగారు అవసానదశలోఉన్నారు. ఆ కష్ట సమయంలో ఇంటికి వచ్చిన బంధువును మర్యాద చేయచూచేది ఎవరు?

తాండవకృష్ణయ్య తండ్రివద్దకు వెళ్లినాడు. ఆయనను భూశయనంచేసినారు. కాని ఆయన కింకా స్మృతి తప్పలేదు.

"నాన్నా, బుల్లి వచ్చింది" అని తాండవ కృష్ణయ్యానోట మాటలు వెడలే టప్పటికి మరణవేదన పడుతున్న ఆ వృద్ధుని కళ్లు వికసించినవి. అతిప్రయత్నం మీద ఓపిక తెచ్చుకొని "అమ్మా, బుల్లీ" అని మూలుగుతూ పిలిచినాడు.

పక్కను నిలుచున్న ఎవరో పొరిగింటి ముసలమ్మ ఒకతె "మీ పుచ్చాయి తాతయ్యా పిలుస్తున్నాడు, పో అమ్మా, బుల్లీ!" అని కళ్ల నీళ్లు పెట్టుకున్నది.

బుల్లి నివ్వెరపోయింది. దాని తల్లిదండ్రుల అవసానదశలు జ్ఞాపకమువచ్చినవి. పక్కను మంచ ముండగా వాళ్లనూ ఇట్లాగే కింద పడుకో బెట్టినారు. అంతా ఇట్లాగే మూగి ఉన్నారు. అప్పుడూ కొంతమంది ఇట్లాగే కన్నీళ్లు విడుస్తున్నారు. కొందరి కళ్లూ ముక్కులూ ఎఱ్ఱగాఉన్నవి. అక్కడ తప్పక ధర్మరాజుంటాడని తాతదగ్గరికి వెళ్ల జంకింది. "పిల్ల మాగాభరలో భయపడుతున్న దట్టా" అన్నారు ఒకరు.

బుల్లిని ఎవరో ఒకరు తాత దగ్గరకు తీసుకొని వెళ్లినారు. అక్కడ దానికి ధర్మరాజు కనపడ లేదు. కాబట్టి కొంతభయం తీరింది. తాత బుల్లి చేయిపట్టుకొని "అమ్మా, [illegible] కళ్లతోచూచి కష్టపెట్టకుండా [illegible]చినానో పోయినాని ధ్రువగతి నాయందు వరల నిమ్మా.



నారాయణ !" అన్నాడు. చుట్టునున్నవాళ్లు కొందరు 'నారాయణ' అన్నారు, మరికొందరు కళ్లనీళ్లు పెట్టుకున్నారు.

కాని ఆవృద్ధుడు ఆరోజున పోలేదు. మరునాడు సాయంత్రందాకా వచ్చే తెలివి పోయే తెలివితో అతని జీవము తన్నుకి లాడినది.

సూర్యుడస్తమించినాడు. అసురసంధ్యారాగము లోకాన ఆవరిస్తున్నది. దీపాలు పెట్టేవేళ ఐనది. అప్పుడు ఆ వృద్ధుని దేహములోని చైతన్య దీప మారిపోయింది.

"అడుగోనే ధర్మరాజు! తాతయ్యను లాక్కుపోతూ నన్నుకూడా రమ్మని చేతితో సంజ్ఞ చేస్తున్నాడే!" అని అప్పుడు బుల్లి కెవ్వున కేక పెట్టింది. ఇతరుల ఏడుపులో అది కలిసిపోయింది. ఆ సందడిలో బుల్లి సంగతి కనుక్కునేవాళ్లెవరు?

ఆరాత్రి పడుకోబోయేప్పుడు బుల్లి ఒళ్లు వెచ్చగా ఉన్నట్లు నాగరత్తమ్మ చూచి కొంచెము భయపడ్డది.

౫

మరునాడు చెక్కల మంటగా బుల్లికి జ్వరము వేగిపడుతున్నది. ఆ జ్వర మెక్కడి జ్వరమో అంటే భయం. ఉ[illegible]నచే[illegible]ష్ట[illegible] వేడికే పక్కపోము." [illegible]సాధ్యమయింది. అందులో పైత్యించినది. ఉలికి ఉలికి పడుతున్నది.

"అమ్మ రమ్మంటున్నదా? రాను—మాల కాకి!—నీ నలుపుచూస్తే నాకు భయము వేస్తున్నది—బావా, ఊరేగుదాంరా!—పూలేవీ? శంఖులేవీ?—తాళాల చప్పుడు చెవులు పగులుస్తున్నది—బూచి వాణ్ణికూడా భయపెడతారా?—బట్టకట్టుకో—పిల్లలను కొడతాడా?—నాన్నను కొట్టుతున్నాడు—పూలేవీ? ఇన్నిపూలు! పల్లకీ!—ధర్మరాజు మంచివాడుకాడే, ఆఊరు వెళ్లనే అప్పా!—నేను అల్లరిచెయ్యనే! పెద్దనాన్నను కొట్టనుగా! వాడు నన్ను లాక్కుపోతున్నాడే! పెద్ద నాన్నా, అయ్యో!"

ఈవిధంగా పిచ్చిమాటలూ వెర్రిమాటలూ; మధ్యమధ్య ఎగిరెగిరి పడుతుంది; కెవ్వుమని కేకవేస్తుంది.

నాగరత్నమ్మకు కాలు నిలవడంలేదు. తండ్రి కర్మ సందడిలో ఉన్నా తాండవకృష్ణయ్య ఏమీ అశ్రద్ధ చేయకుండా బుల్లి సంగతి కనుక్కుంటున్నాడు.

పైత్య జ్వరమని రాజవైద్యుడు మందులు విసుగూ విరామం లేకుండా పోస్తున్నాడు.

జడుసుకున్నదని మాంత్రికులు విభూతీ తీర్థమూ ఇస్తున్నారు.

భూతచేష్ట అని భూతవైద్యాలు చేయిస్తున్నారు.

ఇందులో సూతకము, ఎట్లా ఉండవలెనో అట్లా ఉన్నది!

తల్లికంటె ఎక్కువగా నాగరత్నమ్మ బుల్లి దగ్గర నిద్రాహారాలు లేకుండా కూచుంటూ ఉన్నది. బలవంతాన తాను బుల్లిని ఇక్కడికి తీసుకొనివచ్చినది తలపుకు వచ్చినప్పుడు ఆమె హృదయంలో చిచ్చులపిడుగులు ప్రవేశించి కలచివేస్తున్నట్లుగా ఉంటున్నది. భర్త వస్తే ఏమి జవాబు చెప్పగలదు?

చంద్రశేఖరానికి వృద్ధుని మరణవార్త తెలియలేదు. బుల్లి వివాహానికి చక్కని పరికిణీలూ చొక్కాయీ, వరుడికి బట్టలూ, కట్నాలు కానికలకు ఇంకా ఎన్నో చక్కనివస్తువులూ కొనుక్కొని లగ్నం నాటికి ఉత్సాహంతో వచ్చినాడు.

ఆయన ఇంటికి వచ్చేటప్పటికి బుల్లిని ధర్మరాజు తీసుకొనిపోయి తల్లిదండ్రులు తాతా ఉన్నచోటికి చేర్చినాడని తెలిసింది.

"తమకు పిల్లలు లేకపోయినా అదే తమపిల్లగా భావించి నాగరత్నమ్మా చంద్రశేఖరం గారు మురుస్తూ ఉంటే ఇట్లా అయింది, పాపము! మరి ఆ చంద్రశేఖరంగారి ఏడుపు చూస్తే గుండె తరుక్కుపోతున్నదమ్మా!" అనుకున్నారు.

# అంత్యనేపథ్యము

నిడుమోలు కనకసుందరం గారు బి. ఏ., (ఆనర్సు)

ఆవనినాడు సంవీక్షణ మంతరింప
నంత్యనేపథ్య మత్తుల నలముకొనఁగ
ప్రాణము ప్రశాంతియందు నిర్గమన మొందు
నాదినము రాఁగలదటంచు నేఁ దెలియుదు.
వినను నిశీథముల తార లరయుచుండ,
పూర్వమల్లె ప్రభాతంబు పొడుచుచుండ,
వివిధసుఖదుఃఖములనెల్ల వెలికిఁ గ్రక్కి
జలధి తరగలగతి గడియలును బొరలు.
ఇటుల నాతుదిగడియల నెంచినపుడు
లుప్తమగు కాలమానావరోధ మెపుడు.

మరణకాంతిని గాంతును భవదగమ్య
భవ్యలోకంబు, నగణితభాగ్యయుతము—
అధమపీఠంబు నచ్చట నరుదుకాదె!
అధమ జీవితమేనట యరుదుకాదె!

వ్యర్థముగ నేను గాంక్షించు వస్తుచయము
నేగడించినవాని—బోని మ్మవేల
ఎంచలే కెవ్వి నే నిరసించినానో
వాని ధ్రువగతి నాయందు వరల నిమ్మ.



# శాపగ్రస్తమైన యిల్లు

(ఫ్రెంచికథకుడు బాల్‌జాక్ కథకు అనుకరణము)

మరుపూరు కోదండరామరెడ్డి గారు

సీతారామయ్య మాకు బాల్యమిత్రుడు. ఆయన పొడుగుగా, సన్నగా నుంటాడు; చామనచాయ. ఆయనముఖాన గడుసుదనము, తెలివితేటలు చెయిచెయి గలుపుకొని చిరునవ్వు చంద్రికలలో విహరించుచుండు ను. నేటి తొలకరి కవులలో ఆయన ఒకడు. కొండ చరియల్లో గండశిలలచే నిరోధింపబడకుండా, సాంద్రా రణ్యములలో నుండి వచ్చు గంభీరనినాదముతో శ్రుతి గలిపి నురుగులుగ్రక్కుచూ పాడుతూ శరవేగమున పోవు సెలయేటిప్రవాహానుగుణ్య మైనది ఆయన కవితాధార. ఆయనకు ఘోరమగు విషయమును వినడం అన్నా వర్ణిం చడంఅన్నా మహాసరదా.

ఒకనాటిసాయంత్రం కొందరు స్నేహితులము నెల్లూరు చెరువు చూడను పోయినాం. చెరువు తెప్ప లుగా నిండిఉన్నది. నరిసింహులకొండమీదనుంచి వచ్చు పిల్లతెమ్మెరల ప్రేరణచే చిన్నచిన్న అలలు ఆడుచూవచ్చి కట్టకు తగిలి విరిగిపోవుచున్నవి. మేము అలలను తాకే ట్టు కాళ్లు పెట్టుకొని మెట్లమీద వరుసగా కూర్చొ నున్నాం; చిలవలు గుంపులుగుంపులుగా గూడి ఊర్మికా డోలికల్లో నూగుచున్నవి. సూర్యుడు పడమట ఒకటి గాచేరి ఉండే మొగుళ్ళల్లో దూరినాడు; తరిపిఎండ దట్టంగాఉండే మేఘాలను భేదించుకొని వచ్చి ప్రకృతికి అంతా బంగరుపోత పోసినటె. కొంతసేపు ఏదో లోకా భిరామాయణం మాట్లాడుకొ న్నాం. కొంతసేపటికి సీతా రామయ్య తాను బయటకు తీసిన ఒక ఇంటిసంగతి చెప్తా నన్నాడు.



‘ దయచేసి చెప్పండి ’ అన్నా.

సీతారామయ్యకు తనకష్టా లు ఫలించినందులకు సంతో షస్ఫులింగాలు కండ్లగుండా బయటకు వచ్చి ముఖానికి ఒక వింతకాంతిని గూర్చినవి. ఏదో కొంతసేపు యోచించి ఇట్లు చెప్ప మొదలు పెట్టి నాడు:—

"స్వర్ణముఖి పశ్చిమతీరమున కాళహస్తికి చాయగా ఒకపాతపెద్దయిల్లున్నది; చుట్టుపట్లా ఎంతదూరము చూచినా ఒక్క గుడిసైనా కాన్పించదు. ఇంటివెనుక ఏటి అంచువరకు ఒకతోట ఉన్నది. దారులప్రక్కన వేసిన చెట్లు చాలకాలమునుండి కత్తిరించక పోవుటచేత పొదల్లాగ పెరిగిపోయినవి; రెల్లు ఏటంచున చాలా ఉన్నతంగా పెరిగి వెలుగుగా ఏర్పడిఉన్నది. ఏటికట్టమీద అడవిపువ్వులు దట్టంగా పూచి ఒకవిధమైన రమ్యతనే కూర్చినవిగాని అవి శిథిలదేవతను ఆరాధించిన పూజా పుష్పాలే అయినవి. మామిడి మొదలైనచెట్లు కొన్నిఏండ్లనుండి సంస్కారంలేక గొడ్డుబోయినవి. వాలుకాయుతమైన దారులలో గడ్డి మొలచి చిహ్నలే మాసిపోయినవి. అచటకు పోయిన హృదయానికి కలిగే సంతాపానికి, అవ్యక్తానందానికి దోహదమిచ్చే దానికి ఒక పుట్టలో పగిలి పోయినగడియలను లెక్కించి పాతగిన్నెలు పడియున్నవి.

మిద్దెకప్పు చాలావరకు కూలిపోయి ఉన్నది. చుంలల్లో గుడ్లగూబలు, పయిడిగంటలు, కీచురాలు గూళ్లు పెట్టిఉన్నవి. గోడల్లో పెద్దపెద్ద పగళ్లున్నవి. వాటిలో గడ్డి, చెట్లు పెరిగిఉన్నవి. కిటికీలు తలుపులు అన్నీ మూసి ఉన్నవి. గడియలు బందులు త్రుప్పుపట్టి ఎఱ్ఱగానున్నవి. తలుపులు ఎండకు ఎండి, వానకు తడిసి ఇడిసిపోయినవి. ఇంటికి వేసిన రంగంతా పోయి, పాచిపట్టి నల్లగాపోయినది. అక్కడ అంధకారము, నిశ్శబ్దము నిర్నిరోధంగా అధికారము చలాయిస్తున్నవి. పక్షులు పిల్లులు, ఎలుకలు, ఉడుతలు నక్కబావను రాజుగా జేసుకొని, అంతఃకలహాలు పెట్టుకొంటూ, రాజీలు కుదుర్చుకొంటూ రాజ్యాంగం నడిపిస్తున్నవి. బలవంతులు బలహీనులను బాధించడం అక్కడకూడా కద్దు. ఆ ప్రదేశంలో ఎచ్చటకుపోయినా 'దీనిగూర్చినదంతయు నొక్క అగాధమగు సమస్య' అని అస్ఫుటాక్షరములతో వ్రాసి కండ్లయెదుట కట్టినట్లు స్ఫురించుచున్నది.

ఇంటి ముందుభాగమున సగంవిరిగిన ఒక కమాను గల సింహద్వారము గలదు. ఇక్కడకూడ వెనుక తోటను బోలి సంకులపరిస్థితులే గోచరిస్తున్నవి. అక్కడక్కడ నాటియుండే రాళ్లచుట్టూ గడ్డి, నాగజెముడు అలుముకొన్నది. అడుగుపెట్టరాకుండా పల్లేరు పరచుకొనిపోయియున్నది. ఇంటిముందు ఒకజలపాత్రం విరిగి పడియున్నది. దాంట్లో నాగజెముడు అడవైపోయియున్నది. దానిచుట్టూ అరుగులు పగిలి ఉప్పరిని కొద్ది గాలితాకుడుకే పడేటట్లున్నవి. ఇంటిలోకి పోవు మెట్లరాళ్లన్ని వదలి చిల్లుపాల్లుగా పడిఉన్నవి. నేల చాలావరకు చెమ్మగిలి చితచితలాడుచున్నది. కప్పల 'గరరబరటా పురరబరరగటా'లును, కర్దమసంబంధములైన కీటకారావములును అంతరాయములేకుండా వినబడుచున్నవి.

దైవనిర్దిష్టుండై ఆశ్రయాళుడు ఈ నివాసముగుండె నడచెనా? ఎవడైన యీ ఆరామమును ఉప్పుమడి కమ్మని శాసించెనా?—ఇచట నెవడైన మాతృభూమికి విద్రోహ మొనర్చెనా?—దైవదూషణ మొనర్చెనా?... ఇవీ అక్కడతోచెడు ప్రశ్నలు. దీనికి క్రిమికీటకాదులు మాత్రం అతిదీనంగా అరచునేకాని ప్రత్యుత్తరంమాత్రం యిచ్చుటలేదు. ఈ నిర్జనప్రదేశం అంతు ఎవరికీ తెలిసినదికాదు. ఇది ఎవరిదో ఒకసంపన్నుని ఆవాసముగా తోస్తున్నది. ఇంటిముందు ఏదో ఏవో పెద్ద అక్షరములతో వ్రాసినట్లున్నది; కాని అవి పాచిపట్టి చెరిగిపోయియున్నవి. అతికష్టంమీద 'లక్ష్మీనిలయం' అని చదివినాను.

కాళహస్తిలో రాజప్యనార్థమై యుండిన కాలంలో యీవిచిత్రమైనయిల్లు నాకొక సంతోషావహమైన విషయమైనది. ఇది శిథిలముకంటె వేరైనది. శిథిలోన్ముఖమైనదానికి కొంతపూర్వచరిత్ర గలదు. అయితే యీగృహము నిలిచియుండియు, ప్రతీకారంగా నాశనమే నిర్ణీతమైనట్లు క్రమముగ శిథిలమగుచు దాని గర్భములో ఒకరహస్యమును— అగోచరమైన విషయాన్ని—యిముడ్చుకొనియున్నది. అచట దానిఉనికియే ఒకవిశేషానికి సంజ్ఞగా తోస్తున్నది. చాలామారులు ధైర్యంగా ఆ ప్ర దే శ ము న కు వెళ్లి, చీల్చేముళ్లను త్రొక్కుకొంటూ, యజమానుడు లేనట్టి ఆతోటలో నడిచితిని. శిథిలదేవతచేత క్ర మ భ ం గ ముచేయబడిన ఆచోటును చాలసేపు చూస్తూనిలబడే వాడిని. అది ఎందులకో చాలకాలంవరకూ దీనివిషయమై ఎవరిని అడిగినవాడినికాను. అప్పుడప్పుడు కొన్ని గీతాలుకూడ

వ్రాసినాను. దుఃఖయుతములైన కొన్ని తలంపులకు లొంగక తప్పినదికాదు. ఈ నిర్జనతకు అప్పుడే నాకు కారణము తెలిసియుండిన నేవ్రాసిన పద్యాలఘాటు చెడియుండేది. ఆ ఆవాసమంతా దురదృష్టజలదావృత మైనమానవజీవితదృశ్యంగా తోచినది. శవాలులేని శ్మశానప్రకృతి స్ఫురించినది. నాకచట ఆనందాశ్రువులను అణచి దుఃఖాశ్రువులే కురిసేవి.

ఒకనాటిసాయంత్రం ఒక కష్టాంతనాటకమును పూర్తిచేస్తూ 'లక్ష్మీనిలయానికి' వెళ్లినా; నాటకాన్ని గురించి యోచిస్తూ పుట్టలలో నడుస్తున్నాను. ఒకపిట్ట బుఱ్ఱున పైనపోయింది. భయకంపితహృదయముతో రాపడినిలుచున్నాను. మందుపలిపెము నిలువెల్లకప్పి నట్లైనది; ఇంతలో గాలి ఎండుటాకులను కదిలించినది. అది ఆగృహోదరప్రదేశమునుండి వచ్చిన విలాపంవలె వినబడ్డది. మరీ గడగడ వణకినాను.

మనస్సంతా అంధకారంతో నిండిపోయింది. అట్లే సత్రానికివచ్చినాను. భోజనంచేసి నాగదిలో చాపమీద తలక్రింద చేయిపెట్టుకొని పరుండి యోచనలో మునిగిపోయియున్నాను. ఒక్కతలంపైన గట్టెక్కలేదు. గోడమీద వెలుతురులో పురుగులను తింటున్న బల్లినిమాత్రం గమనిస్తూ పరధ్యానంలో ఉన్నాను. సత్రం ఆమె త్వరగా తలుపుసెట్టుకొని లోనప్రవేశించి ఆతురతతో 'అయ్యా! అయ్యా! రామనాథంగారు వచ్చి ఉన్నా'రన్నది.

'రామనాథంగారెవరు?'

'ఏమిటీ.........మీరు రామనాథంగారు తెలియదా!ఓ! ఇదిచాలాచిత్రం' అంటూ బయటికిపోయినది.

అప్పుడే సన్నటి, పొడుగాటి మనిషి నా ఎదుట నిలబడ్డాడు. ఆయన డీకొనబొయ్యే పొట్టేలులాగ లోపలికి వచ్చినాడు; తల కొంచెం చిన్నదిగాఉన్నది; నొసలు విశాలంగా ఉన్నది. ముఖం వెడల్పుగా చప్పిడిముక్కుతో విరాజిల్లుచున్నది. ఆయన నాకు చాలాకొత్తగా ఉన్నాడు. ఒకనల్లకోటు వేసుకున్నాడు; అది భుజములమీద, చంకల్లో చినిగిపోయియున్నది. కానిమెడలో ఒక అమూల్యమణి దీపపువెలుతురున కాంతిపుంజాలను ప్రవహింప జేస్తున్నది. చెవులలో తెల్లరాళ్లఅంటు జోళ్లున్నవి.

'ఏమహాశయునితోడి సంభాషణభాగ్యము నాకు లభింపనున్నదో నేతెలుసుకొనవచ్చునా' అన్నాను.

వెంటనే ఆయన నేనున్న చాపమీద నాకెదురుగా కూర్చున్నాడు. అరచేతులను రుద్దుకొంటూ-'అబ్బా! ఎంతచలండి...అయ్యా, నేను రామనాథం గారిని' అన్నాడు.

'మంచిదిచూస్తాం' అని మనస్సులో అనుకొంటూ వినమ్రుడనై నాను.

'నేను కాశీహాస్టిలో ఒకన్యాయవాదిని'

'చాలా సంతోషం'

'ఒక్కనిమిషం' అంటూ నిశ్శబ్దంగా ఉండుమని ఆజ్ఞాపించేమాదిరి చేతులెత్తి 'మన్నించండి మీరు లక్ష్మీనిలయానికి తరుచుగా వెళ్లుచున్నట్లు నాకు తెలియవచ్చింది' అన్నాడు.

'అవునండీ'

'ఒక్కనిమిషం' తలాడించుచూ 'ఇదే తగినచర్య తీసుకొనవలసిన ప్రమాదం. అయ్యా, కీర్తిశేషురాలైన సుశీల మరణశాసనము ననుసరించి—వీలు హక్కుదారుని బాధ్యతతో—ఇక తమరచటకు పోకూడదని విన్నవించుటకు వచ్చియున్నా, ఒక్కనిమిషం...నేనేమి పోలీసు వాడిని కాదులేండి. దీనిని అపరాధంక్రింద కట్టాలని నాకిష్టములేదుకాని కాశీహాస్టిలోకల్లా అందమైన భవనాన్ని నాచేత పాడుపెట్టించినకారణాలు మీకు తెలియకపోవచ్చును; అయినా మీరు విద్యాధికులుగా కనబడతారు. అడ్డగించిన ప్రదేశంలోనికి ప్రవేశించుటను చట్టములు కఠినశిక్షలు విధిస్తూ నిషేధించుచున్నవని మీరు తెలుసుకోవలెను. పుట్టలే గోడతో సమానంకదా! అయినా ఆయింటి ఇప్పటిస్థితి మీజిజ్ఞాసకు కారణమై ఉండవచ్చును. ఇంటిని తమయిష్టానుసారంగా మూడమనేదాని కంటె నాకు వేరేసంతోషదాయకమైనవిషయంలేదు... కాని...వీలువ్రాసిన ఆమెవాంఛితార్థములను నెరవేర్చవలసిన బాధ్యత నాకు గలదు; కాబట్టి ఇక మీరు ఆతోటలో ప్రవేశింపకూడదని ప్రార్థిస్తున్నా. ఒక్కనిమిషం—అయ్యా, వీలు చదివినదిమొదలు నేనుగూడా దాని

దగ్గరకుపోలేదు. ప్రతిసంవత్సరం ఆమెనిర్ణయించిన ధనము నుండి పన్నుమాత్రం కట్టుచున్నా. ఒక్కనిమిషం...ఓ! సుశీలగారి మరణశాసనం కాళహస్తిలో చాల గందరగోళం చేసింది.'

ఇక్కడ ఆయన చీదుటకు నిలిపినాడు. ఈవిషయమే తన జీవితంలో గొప్పకార్యమైనట్లు తనకీర్తి, తన ప్రతిభ సర్వస్వమైనట్లు ఆయనమాటలవలన నాకర్థమైనది. అయినా వాస్తవాన్ని అధికారముతో తెలుసుకుందామనే సంతృప్తికి వ్యతిరేకుడను కాలేను.

'అయ్యా, యీ విశేషమునకు కారణం అడుగుట నింద్యముకాదనుకొంటా' అన్నాను.

ఈమాటలతోగూడా ఒకమనిషికి ప్రియతమమైన విషయాన్ని అనుసరించే సర్వానందాలను సూచించు ఒక చూపును ప్రసరింపజేసినాడు. చాలా ఆత్మసంతృప్తితో కోటుచేతులు పైకిలాగుకొని, పొడిడబ్బీ బయటకు దీసి; తెరచి నాకియ్యబోయినాడు. నేను వద్దనగా ఒక్కపెద్ద చిటిక తాను తీసికొని పరవశత్వమును పొందినాడు. ఎవడేని యిచ్చాపూర్తి ఆనందము ననుభవింపక మరియొకనికి కలుగు ఆనందాన్ని తెలిసికోలేడు.

రామనాథమునకు పొడిపిచ్చి. పంచఅంచుతో ముక్కుతుడుచుకొంటూ, పొడిఘాటు శబ్దాన్ని తగ్గించగా అర్ధనిమీలితనేత్రుడై మునిముక్కుతో యిట్లు చెప్పదొడగినాడు:—

'నేను మొదట చెన్నపట్నంలో ఆర్బత్‌నాట్‌లో గుమస్తాగావుండినాను. చాలామంచినౌకరి లేండి. బహుశా దానినిగురించి చెప్పగా విని ఉంటారు. ...లేదుగాబోలు; అది దివాలాతీసింది. ఆసంగతి లోకవిదితం అయింది. చెన్నపట్నంలో తగిన వరుమానం లేకపోవుటచేతను అప్పుడు వకీళ్ల అదృష్టం చూచి యిక్కడకు వచ్చి న్యాయవాదిగా చేరినాను. ఇక్కడ ఒక శ్రీమంతుడు తనకూతురుతోగూడా తన ఆస్తినంతా నా కిచ్చినాడు. ఒక్కనిమిషం!.'

అంటూ కాసేపునిలిపి మరల మొదలుపెట్టినాడు.

'ఇక్కడకువచ్చి నేను న్యాయవాదిగా చేరిన మూడునెలలకు,ఒకరాత్రి నేనుపండుకొనబోవునపుడు—ఇది జరిగినదినా పెండ్లికిముందు—సుశీల తనదాసి వెంకటలక్ష్మిచే నన్ను పిలువనంపినది. అది యిప్పుడు యీ సత్రంలోనే పనిజేయుచున్నది...ఒక్కనిమిషం. చెప్పడానికి మరచినాను—సుశీల భర్త మధుసూదనుడు చెన్నపట్నంపోయి అక్కడ, నేనింకొ రెండుమాసాలకు యిక్కడకు వస్తాననగా చనిపోయినాడు — ప్రతి విషయంలో అతిగా ప్రవర్తించి అతి నికృష్టపుచావు చచ్చినాడట పాపం. తెలిసిందా? మధుసూదనుడు వెళ్లిననాడే సుశీల లక్ష్మీనిలయాన్ని పాడుబెట్టి కాళహస్తి బహదూరుపేట తోటలో ఒకమిద్దెయందు చేరినది. కొంచెము సామానునంతను స్వహస్తంగా సవరు సుశీల స్వాధీనంలో ఉండే ప్రదేశాన్ని, సదరు లక్ష్మీనిలయాన్ని సాధారణంగా అలంకరిస్తున్న యావత్తు సామానులను తగిలబెట్టిందంటారు.—ఓ! ఇదేంది! మన్నించండి వీలు వ్రాస్తున్నాననుకొన్నాను.—అవును. వెనుక తోటలో దహనం చేసిందంటారు. లక్ష్మీనిలయాన్ని విడిచింది మొదలు ఆమె ఎవరికినీ కనబడేదికాదు; కొన్నిరోజుల తరువాత ఇంటికిపోయినవారికిగూడ కనబడేది కాదు. మనిషి చాలామారింది.

'ఒక్క నిమిషం...ఆమె చాలామంచిది. ఆమె యీహారం నా కిచ్చినది.' అంటూ మెడలో వజ్రాన్ని చూపినాడు.

'ఆమెకు చాలా జబ్బు చేసింది. బ్రతుకాశే వదలుకొన్నది. ఒక్కవైద్యుని గూడ పిలువలేదు. ఇక్కడ ఆడవాళ్లంతా సుశీల మనస్సు బాగలేదే అంటారు.వాళ్లు సుశీల నాసహాయ మపేక్షించిందనగానే నాకాశ్చర్యమైంది.

'నేను పోయినది నిశీథంలో అయినా ఎట్లో వూరంతా తెలిసింది. దారిలో దాసిని కొన్ని సంగతులడిగినా, జబాబు చాలా అయోమయంగా ఉండినది; కాని ఆమెకుఆరాత్రిగూడా గడవడం దుష్కరంఅనిచెప్పింది. పన్నెండు గంటలకు సుశీలయిల్లు చేరినాం. పెద్దపెద్దవి, గాఢాంధకారబంధురంగా ఉండే గదులు దాటినాము. నేల చెమ్మగా భూతపిశాచాలకు నివాసయోగ్యంగా ఉండినది. శిథిలదేవతయొక్క తొలివలపు చూపులు ఆ సౌధముమీదగూడ ప్రసరించినట్లేఉన్నది. కడకు సుశీల ఉండే గది చేరినాము. అది మిద్దెమీద ఉండినది. ఆమె పండుకొని యుండే పరుపుమీద ఆమె ఎచ్చట

నున్నదో కనుగొనేదానికి చాలా కష్టపడ్డాను. ఇంట్లో లాంతరు వెలుగుచున్నా గది పెద్దదగుటచేత వెలుతురు చాలిందికాదు. ఇల్లంతా దుమ్ము నిండిఉన్నది. అందువలన గదిలోనికి పోగానే తుమ్ములు దగ్గుతో కలిసివస్తున్నవి. ఆమెప్రక్కన ఒక బల్లమీద ఒక బంగారు ఉంగరము ఉన్నది. తరువాత దాన్ని నాభార్యకు యిచ్చివానులేండి.

'ఆమెముఖం పాలిపోయినది; చంద్రుకలుమాత్రం చీకట్లను ఈనుచున్నవి. ఈజిప్టుకేవాల్లాగ (మమ్మీలు) పెద్దదిండ్లకు ఆనుకొని పండుకొనియున్నది; ఆమెకండ్లు జ్వరముచే కాంతిహీనములై నిర్జీవములైనట్లు ఎముకల్లో కదులుటలేదు; ముఖాన స్వేదం బిందువులు కట్టిఉన్నది. చేతులలో మాంసములేదు; ఎముకలను కోమలమైన చర్మంతో కప్పినట్లున్నది; నరాలు స్ఫుటంగా కనబడుచున్నవి. నిజంగా ఆమెస్థితి చాలా భయోత్పాదకంగా ఉండినది; వ్యాధి ఆమెమీద చాలాఘోరంగా దోపిడీలుచేసింది. పెదవులు తెల్లబారి ఉన్నవి. మాట్లాడేటప్పుడు కూడా చలించనట్లున్నవి. నావృత్తిచేత యిట్లు చావసిద్ధముగనున్నవారి యిండ్లకు ఏడ్పులనడుమ మరణశాసనాలు వ్రాయను పోయియుండినా, నిర్జనంగా పాడుపడినట్లు ఉండే యీ విశాలమందిరములో ఒకమూల నిశ్శబ్దంగా ఉండే యీమనిషిని చూడగానే మనస్సు నూతనపరిస్థితులకు ఆకరమైంది. ఎట్టి స్వల్పమైన అలుకుడుగూడా వినిపించుటలేదు. ఉచ్ఛ్వాసనిశ్వాసములుగూడ జరుగునట్లు తోచలేదు. నేను తదేకధ్యానముతో ఆమెను చూస్తూ రాయిమాదిరి నిలబడ్డాను...ఇప్పుడూ నే నక్కడ ఉన్నట్లే తోస్తున్నది.

కడకు ఆమె కండ్లుచలించినవి. కుడిచేయి ఎత్తవలెనని ప్రయత్నించినది, కాని, తత్క్షణమే పరుపుమీద పడిపోయింది. 'నేను చాలా ఆతురతతో మీకోసం కనిపెట్టుకొని ఉన్నా' అన్నది. ఇది ఒక నిట్టూర్పులాగు వెల్వడినది. అది కంఠధ్వనియే కాదు. ముఖం వుబ్బినట్లుండినది. మాట్లాడేదానికి సర్వప్రయత్నములు చేసింది.

'అమ్మా' అన్నాను.

సుశీల నన్ను మాట్లాడవద్దని సంజ్ఞ చేసింది. ఇంతలో వెంకటలక్ష్మి వచ్చి 'మాట్లాడవద్దు. ఏమాత్రం శబ్దాన్నిగూడ వినసహించదు' అని నాచెవిలో గుసగుసలాడింది.

నేను కూర్చున్నాను. కొన్ని ముహూర్తాల తరువాత ఆమెశక్తినంతా ఆయత్తంచేసుకొని కుడిచేయి కదలించినది. చాలాకష్టంమీద దిండుక్రింపకు పోనిచ్చినది; కానేపుకదలకుండా ఉండింది. తుదిప్రయత్నంచేసి చెయిబయిటకులాగింది. దానితోగూడా ఒక లకోటా చేసిన కాగితం బయటికి వచ్చింది. ఇది చేయగానే చెమటబొట్లు కొన్ని నొసటనుండి రాలి దిండుమీద పడ్డవి......'ఇది నామరణశాసనం. దీనిని మీకొప్పజెప్పమన్నాను' అన్నది.

'హా! తండ్రీ.' అంతే—బల్లమీద ఉంగరం లాక్కొన్నది. త్వరగా పెదవులవగ్గరకు తీసికొనిపోయి ముద్దు బెట్టుకొన్నది......ప్రాణాలుబాసింది.......

ఆమె చంచలరాహిత్యమైన కన్నులు తలచుకొంటె నాకు యిప్పటికీ భయం—ఆమె చాలా ఘోరంగా బాధపడియుండవలెను. ఆమె తుదివీక్షణం సంతోషార్ద్రంగా ఉండింది. చనిపోయినా ఆసంతోషం ఆమెముఖంమీద నిలిచియుండినది.

ఇంటికివచ్చి కాగితం విప్పిచూచినా. సుశీల తన మరణశాసనానికి కర్తగా నన్నే నియమించినది. ఆస్తినంతా కొండమీద సంస్కృతపాఠశాలకు వ్రాసింది. లక్ష్మీనిలయాన్ని గురించియీవిధముగానున్నది:—'దీనిని యాభైఏండ్లు వదలిపెట్టవలసినట్లు—ఆమె గతించినరోజు మొదలు, మరణసమయంలో ఎట్టిస్థితిలో ఉండెనో అట్టిస్థితిలోనే—ఎవరుగూడా దానిలో ప్రవేశించుటకుగాని ఎట్టిమరమ్మతులు చేయుటకుగాని గట్టిగానిషేధించింది. అవసరమైనచో మనిషిని కాపుంచవలసివచ్చిన,అట్టికర్చుకు గూడ కొంతధనం నిర్ణయించినది. గడువుతీరిన తదనంతరం, శాసనంవ్రాసిన ఆమెకోర్కెలు నెరవేర్చబడినచో ఇల్లు నావంశానికి చెందవలసినట్లును; తద్భిన్నమైనట్లయిన యీ మరణశాసనానికి అనుబంధంగాఉండే మరియొకదానిలోనివ్రాత నెరవేర్చిన తనవారసులకో చెందవలసినట్లును వ్రాసిఉన్నది. అందువల్ల......' అంటూ వాక్యం పూర్తిగాకమునుపే నిలిపినాడు. ఆయన సంతోషంతో తేలిపోతున్నాడు. గర్వోన్మేషంతో

నన్ను చూడడం మొదలుపెట్టినాడు. ఆయన గౌరవాధిక్యాలను కొంచెంశ్లాఘించి చాలా తృప్తికలుగజేసినాను. చివరకు 'మీమాటలవలన, పాలిపోయి, అస్థిపంజరమై చావ సిద్ధముగనుండిన ఆమె నాకట్టెదుట కనబడుచున్నది. అయితే యీ అసాధారణమైన మరణశాసనంలోని విషయాలనుగురించి మీఉద్దేశమేమో' అని ముగించినాను.

'వజ్రంచేత నన్ను బహూకరించిన ఆమెసుగుణాలను నిర్ణయించడానికి నేనుప్రయత్నించను' అని నవ్వినాడు. ఎట్లో కష్టసాధ్యంమీద కాళహస్తిలో ఆబాలగోపాలం యీవిషయాన్నిగురించి అనుకొన్నది చెప్పించుకొన్నాను. అవి చాలామట్టుకు పరస్పరభిన్నంగాను, కేవలం తలతోకలేకుండానుండుటచేత నాకు దీనివిషయమై ఎంత ఆసక్తిఉండినా మాటలమధ్య నిద్రమత్తుచేభారంగా ఉండే కనురెప్పలు కలుసుకొని పోవుచున్నవి. కడకు రామనాథం లేచి 'దీనినిగురించి తగుజాగ్రత్తవహించండి' అంటూవెళ్లినారు.

అప్పుడే నేనులేచి తలుపు ఓరవాకిలిగావేసి, సోఫాకుర్చీలోకూర్చుని పరిపరివిధములుగా యోచిస్తున్నా. కొంతసేపటికి ఎవరోతలుపుకొట్టినారు...... సత్రంఆమె లోపలికివచ్చి త్వరగా 'రామనాథంగారు లక్ష్మీనిలయంవిషయమై పాతపాటే పాడినా డనుకొంటాను' అని ఇంకా హెచ్చిన ఆతురతతో 'ఏమిటి మీకు చెపుతుండినది?' అన్నది.

సుశీల విచిత్రగాథను ముక్తసరిగా మూడుమాటల్లో చెప్పి 'అమ్మా, దీనివిషయం నీకు ఇంకా కొంత ఎక్కువ తెలిసినట్లున్నది. లేకపోతే ఇప్పుడు ఇంత ఆతురతతో ఎందుకొస్తావు' అన్నాను.

'లేదు నీతోడు నాకుతెలియదు'

'వద్దు, ప్రమాణంచేయవద్దు—నాకు తెలుసును—రహస్యాన్ని గర్భస్థంజేసుకొని నీనేత్రాలు గురుత్వాన్ని పొందిఉన్నవి. నీకు మధుసూదనుని తెలుసును; దయచేసి చెప్పు, ఆయన ఎటువంటిమనిషో?'

'మధుసూదనుడు సరసుడు, చాలాపెద్దమనిషికూడాను. ఆయన ఎప్పటిడబ్బుఅప్పు డిచ్చేవాడుకావటంచేత ఆయనతో మాకేమి తగాదా ఉండేదికాదు.... అయితే పాపం కొంచెం దుడుకుమనిషి. ఇక్కడ ఆడవాళ్లంతా ఆయనను చాలాభూషించేవాళ్లు.'

'కొంచెం దుడుకు కావడంచేతనా?,

'ఉండవచ్చును. వాళ్లు అన్నట్లు ఆయనదగ్గర ఏమో ఉండవలె ఆయనను సుశీల వివాహము చేసుకొనేదానికి' అన్నది. ఈ మాటల్లో కొంచెం అసహిష్ణుభావం పొడచూపినది. మరల ఒక్కక్షణం అయినతరువాత మొదలుపెట్టినది. నాకు యితరులకు కష్టం కలిగించాలని లేదుగాని,...ఆమె కాళహస్తిలోకల్లా సౌందర్యఖని, సౌభాగ్యవంతురాలు. ఆమెకు సాలుకు ఇరవై వేలరూపాయలవరుమానం గలదు......ఊరంతా ఆమెపెండ్లిని చూడను పోయినారు; పెండ్లికొడుకు సహజసౌందర్యముతో అందరిని వశపరచుకొంటున్నాడు. నిజంగా ఆసనువుకు భూషణప్రాయుడు.'

'వాళ్లు చాలాసుఖంగా ఉండినారా?'

'ఏమిటి, సుశీల అద్వితీయమైన మహాయిల్లాలు. ఆమెమాటలు దయగూరసపరిపూరితములు. మధుసూదనుడు కొంచెం గడుసువాడైనా ఆయనంటే మాకు చాలా యిష్టం.వారిగుణలతలు పెనవేసుకొని అల్లిపోయినవి; అంత అనుకూలదాంపత్యం సీతారాములకుగూడ లేదనవలసిందే.'

'అయితే వారివియోగమునకు ఏదో అనివార్యమైన దురదృష్టం కారణభూతమై ఉండవలె' అన్నాను.

ఏదో యోచించినట్లు నటించి.......

'వాళ్ల అదృష్టహీనాన్నిగురించి నే నెప్పుడు చెప్పలేదు. తెలిసిందా. మరీదానివిషయమై నాకేమి తెలియదు.' అన్నది. కాని చూపులుమాత్రం హృదయం కలతచెందినట్లు ప్రకటిస్తున్నవి.

'ఆ! మంచిది......,ఆవిషయమై నీకు నిజంగా తెలుసునని నాదృఢనమ్మకం'

ఈమాటలతోగూడ చేష్టలుదక్కి పటంలో బొమ్మలాగనిలబడ్డది. ఏమి యోచించుకొనుచున్నదోగాని ఊహాసముద్రముయొక్క అలలో చిక్కుకొన్నట్లు మాత్రం ముఖలక్షణాలు సూచిస్తున్నవి. చివరకు మాటలు ప్రారంభించినది:—

'మంచిది......నాకు తెలిసినవంతా చెప్పెద వినండి. రామనాథంగారు మిమ్ములను చూడవచ్చి

నప్పుడు లక్ష్మీనిలయసంబంధమైన సుశీల విషయం సమగ్రంగా చెప్పిఉంటాడనుకొన్నాను. మీరు గుణవంతులుగ తోచుట నాకు మీతోమాట్లాడవలెనని బుద్ధిపుట్టించింది .....ఎవరికీ ఏట్టి అపకారముచేయని నాబోటి నిర్భాగ్యురాలిని బయటపెట్ట రనుకొంటాను : ఇక్కడ వాళ్లకు దీనివిషయం ఒక్కమాటైన చెప్పేదానికి ధైర్యం చాలిందికాదు—వాళ్లంతా కరేపాకుకోసే ఎరుకలగుంపులేండి. వాళ్లనోరు త్రాగుబోతువాళ్లనోరు వంటిది. వాస్తవంలో నీమాదిరి యిన్నిరోజులు మా సత్రంలో ఉన్నవాళ్లులేరు. ఐదువేలరూపాయల..... .....కథను వినేదానికి అర్హులుగూడా నాకు కన్పించలేదు—.

'రంగమ్మా,' అంటు ఆమెమాటకు అడ్డంవచ్చి 'నీకు నమ్మకముంటే ఆభారం నామీదవేయుము...... యీలోకంలో మోయవలసిన బాధ్యత నామీద ఉంటుంది.' అన్నాను.

'దానికి నీవు భయపడవలసిన అవసరముండదులే' అని మహావేగంతో అన్నది. దీనివలన నాకొక్కడికే కాదు యీకథచెప్పినది అనుకొన్నాను. అయినా చెవియొగ్గి నా.

'మదనపల్లినుండి వచ్చి ఒకధనవంతుడు మాసత్రంలోఉండేవాడు; రెండుమూడు సంవత్సరా లుండినాడు. పనేదో మాకుతెలిసిందికాదు. ఆయనపేరేదో యీశ్వరయ్య...ఆ...విశ్వేశ్వరయ్య. అదిలెక్కలపుస్తకంలో ఉన్నది. కావలిస్తే మీరు చూడవచ్చు. ఆయన చాలా అందగాడు — మదనపల్లిలో అందరూ కురూపులట. మంచివృథకాయుడు. ఆయనవి పొడుగాటి వెంట్రుకలు; పిడిగంటువేసుకొన్నప్పుడు ముద్దులుమూటగట్టుచుండేది. ఆయన మంచిమంచి పట్టువస్త్రాలు ధరించేవాడు. అటువంటివి నేనెక్కడా చూడలేదు. మననగరిలోగూడ లేవనవచ్చు......ఇంకా, భోజనప్రియుడుకాడు; వినమ్రుడు, మంచిమర్యాదస్థుడు కావడంచేత ఆయనంటే ఎవరికీ కోపంకలిగే అవకాశమే లేదు.

ఆయన ప్రతిదినం దేవాలయానికి పొయ్యేవాడు. కొన్నిరోజులకు సుశీల గుడికిపొయ్యేవేళకే ఆయనా ఎప్పుడూ వెళ్లడం కనిపెట్టినాను. దేవళంలో ఎప్పుడు ఒకచోటనే కూర్చుండి జపంచేసుకొనేవాడు; దీనిని గురించి ఎవరికీ అనుమాన ముండేదికాదు, ఎందుకంటే దేవళంనుంచి తిరిగివచ్చిందాక తలయెత్తి ఒకరిని చూచేవాడుకాడు.

ప్రతిసాయంత్రం కొండలమీద పాతకోటచూడబొయ్యేవాడు. అక్కడుంటే వాళ్లవూరు జ్ఞాపకంవచ్చేదికాబోలు; మదనపల్లిఅంతా కొండలమయం అట, ఆయన ఒకప్పుడు చెప్పినట్లు నమ్మకం—మొదటనుండి ఆయన రాత్రిళ్లు ప్రొద్దుపోయి ఇంటికి వచ్చేవాడు. నగళ్లలో రెండోజాము కొట్టిందాక ఒక్కొక్కప్పుడు రాకపోతే నాకుచాలా కలవరంగా ఉండేది; అయితే క్రమేణా అలవాటైంది. ఆయన మిద్దెమీద కడపటిగదిలో ఉండినాడు.

ఒకనాటి సాయంత్రం బాగాచీకటిపడ్డ తర్వాత మాబట్టలపిల్లవాడు బట్టలను ఏటిలో కడుగుచుండగా, చాలాదూరమునుండి చేపలాగ యీదుచు వస్తుండే మన విశ్వేశ్వరయ్యను చూచినాడు; వాడువచ్చి నాతో చెప్పినాడు. రాత్రి పండుకో బొయ్యేటప్పుడు ఆయన దగ్గరకుపోయి 'స్వర్ణముఖిలో యీదుచున్నారట. జాగ్రత్త! పెద్దపెద్దసుడిగుండాలు పాచిబట్టినరాళ్లు విశేషంగా ఉన్నవి. ఆవలగట్టున ఉండేరెల్లు జాగ్రత్త అన్నాను. నా కీసంగతి తెలిసినందులకు చాలాచీకాకుపడినట్లు ముఖకళ మారిపోయింది.

'చివరకొకనాడు......అవును ఉదయమే .. విశ్వేశ్వరయ్య తనగదిలో లేడు...ఆరాత్రి సత్రానికి రానేలేదు. నేను ఆయనగదిలోకి వెళ్లి గాలించినాను; అల్మారాక్రింది అరలో ఒకజాబుపెట్టి ఉన్నది. దాని క్రింద నోట్లకట్టఉండినది—తర్వాత లెక్కచూచుకొంటే వెయిన్నీ ఏనూరు రూపాయ లుండినవి. అక్కడనే ఒక చిన్నదంతపుపెట్టె ఉండింది. దానిలో రెండుమూడువేల రూపాయలనగ లున్నవి. వాటినిచూచి నాకు మనస్సు ఆరుమూడయింది— ఏమీతోచక పరుగెత్తుకొనిపోయి పాలుపిండ బోవుచుండిన మాయింటాయనను పిలుచుకొని మరల ఆగదిలోనికి బోయినాను—అప్పుడాయన ఉండినాడు!' అంటూ నెట్టుకొనివచ్చే దుఃఖాని ఆపుకొని ప్రారంభించినది. 'ఆయన జాబు చదివినాడు. దాంట్లో

'నేను తిరిగి రాకపోతే యీడబ్బు నగలు మీరుతీసుకొని నాపేర దానధర్మాలు చేయండి' అనిఉన్నది. అప్పుడే మాయింటాయన వెతుకుటకు బయటకుబోయినాడు . . ఇప్పుడే కథకు విచిత్రమైనఘట్టం:— ఏటి ఇవతలి ఒడ్డున రాళ్లలో లక్ష్మీనిలయానికి యెదురుగా విశ్వేశ్వరయ్య గుడ్డలు కనబడినవి; ఆయనవాటిని తీసికొనివచ్చినాడు— ఆయన చాలా వెతుకవన పోవుటచేత ఆయనను ఎవరూచూడలేదు. తరువాత గుడ్డలను కాల్చివేసినాము. మాయింటాయన విశ్వేశ్వరయ్యఆపాచిలో యిరుక్కొనియో, సుడిగుండాలలో పడో మునిగిపోయి ఉంటాడను కొన్నాడు. నేనుమాత్రం అదినమ్మలేదు. విశ్వేశ్వరయ్య మొదటవచ్చినప్పుడు ఆయనచేతినుండిన పచ్చలఉంగరం తరువాతలేకపోవడం సుశీల చనిపోవునప్పుడు ముద్దుపెట్టుకొనిన ఉంగరం ఇదేమాదిరిదని వెంకటలక్ష్మి చెప్పడంచేతను సుశీల కథకు యీయనకు కొంతసంబంధం ఉండవలెనని నానమ్మకం......ఇంతే నాకేమి తెలియదు.'

'మంచిది . అయితే దీనినిగురించి వెంకటలక్ష్మిని అడుగలేదా?'

'అడుగలేదు. అయినా ఏంప్రయోజనం? ఆపిల్ల మొద్దు. దానికి ఈసంగతి తెలుసు; అయితే బయటకు రావడం ఎట్లా?'

కాసేపుండి రంగమ్మతలుపు ముందుకు వేసుకొని పోయినది. మనస్సు అయోమయసముద్రంలో గాఢాంధకారానిలాహతకల్లోలపరంపరలలో జిక్కి దరిగానకుండా ఉన్నది. లక్ష్మీనిలయం— పాడుబడ్డతోటలో, విరిగిన స్తంభములు కప్పుతో, నిర్జనంగా ఇంటిని మరుగుపరచే రెల్లుతో మర్మభేదకంగా ఎదుట నిల్చినది. ముగ్గురి ప్రాణములను తీసిన ఈనాటకం అంతు కనుగొనవలయునని సంకల్పించుకొన్నాను. కాళహస్తిలోకల్లా వెంకటలక్ష్మియే నాకు ముఖ్యమైనది.

ఆమెముఖం పూర్ణారోగ్యంతో ప్రకాశిస్తున్నా జాగ్రత్తగా పరిశీలింప హృదయాంతరాళమున రహస్యాలను అణచిపెట్టినచిహ్నాలు చిన్నమబ్బుచాటున మినుకుమినుక్కను నక్షత్రంవలె అప్పుడప్పుడు స్ఫురించుట గమనించినాను. తన అనుగుపట్టిని చంపి, ఆశిశువు తుది విలాపాన్ని వినావినే ఆమె ప్రవర్తనములాగు ఉన్నది వెంకటలక్ష్మి ప్రవర్తనము. మరల అవ్యాజానురాగములను గురిసే ఆమెముఖబింబాన్ని, అమలినములైన చూపులను, నిర్దుష్టమైన చిరునవ్వును చూస్తే కథ అంతా మరచిపోయ్యేవాడిని.......కాదు— లక్ష్మీనిలయవృత్తాంతం బయటకు దీయనిదే కాళహస్తి వదలకూడదనుకొన్నాను.

ఒకనాడు అన్నంవడ్డించేటప్పుడు నేను 'వెంకటలక్ష్మి' అన్నాను.

'అయ్యా!' అన్నది ఒకమాదిరి కలతచెందినట్లుంది.

'సరేగాని ఈసంగతిచెప్పు— సుశీల దగ్గరనుండి కూడా ఈసత్రంలో పనిచేస్తున్నావేమి? మరణసమయమున నీకేమియిచ్చి పోలేదా?'

'ఇవ్వకేమి?' అన్నది గౌరవసూచకంగా;

ఈమాటతో ఇంకా అడిగేదానికి నాకు సందు దొరికింది. కథలో ఆమేముఖ్యమైన పాత్రగాను, ఉచ్చులోఇరుక్కొన్నట్లు కూడా తోచింది; ఆమె ఈఆఖ్యానానికి తుది అధ్యాయంఅని తోచింది; ఇదిమొదలు వెంకటలక్ష్మితో చాలాచనవుగా మాట్లాడుతుండేవాడిని. పోగాపోగా ఆమెయందు సద్గుణాలు మూర్తీభవించినట్లు కనుగొన్నాను. ఆమె చాలాశుభ్రంగా, అందంగా ఉంటుంది— ఇంతెందుకు పురుషులను వశపరచుకొనే దానికి కావలసిన సామగ్రిఅంతా ఆమెదగ్గర ఉన్నది.

ఒకనాడు ఏదోపండుగ; అందుచేత సత్రానికి ఎవరు రాలేదు; వెంకటలక్ష్మికి పని తక్కువైంది. నేను మధ్యాహ్నం కూర్చొని 'పారిజాతాపహరణం' చదువుకొనుచున్నా. ఇంతలో వెంకటలక్ష్మి మిద్దెమీదకు వచ్చినది. 'వెంకటలక్ష్మీ! ఇటురా!' అన్నాను.

వెంకటలక్ష్మి నవ్వుచూ వచ్చి 'ఏమండి' అంటు తలుపుబట్టుకొని నిలబడ్డది.

'సుశీలదేవి సంగతి నీకు తెలిసినంతా దాచకుండా చెప్పు.'

'సీతారామయ్యగారు! అది నన్ను అడుగవద్దు' అని భయకంపితయై చెప్పింది; ముఖాన చీకట్లు కమ్ముకొన్నవి. స్వచ్ఛమైన ముఖకాంతి మాసినది. కండ్లు అకలుషితములైన కాంతిని పోగొట్టుకొన్నవి— కాసేపు అట్టే నిలబడ్డది......'మీరు కోరినట్లే మీకు చెప్పెదను. దయచేసి నా రహస్యాన్నిమాత్రం దాచాలె' అన్నది.

'నీకేమి భయంలేదు. నీ రహస్యం దొంగల మనస్సులోవలె భద్రంగా ఉంటుందిలే'

ఈమాటతోగూడ ఆమె తలుపుదగ్గర కూర్చున్నది—నిలుచోని, ఉపవాసాలు చేస్తూ ఎవరుకథలు చెప్పలేరులే. కథ ఆమూలాగ్రంగా చెప్పింది: అంతా చెప్పవలెనంటే యీదినంకాదు, కాబట్టి సంగ్రహిస్తాను.

"లక్ష్మీనిలయంలో సుశీలగది క్రింద నున్నది. ఆగదిలో నాలుగడుగుల చదరం గలిగిన చిన్నగది ఒకటి ఉన్నది. దానిలో సుశీల గుడ్డలు పెట్టివుంచేది. నేను చెప్పబోవువిషయం జరిగినరాత్రికి ముందు మూడు నెలలప్పుడు ఆమెకు కొంచెం జబ్బుచేసింది. అందుచేత మధుసూదనుడు మిద్దెమీదకుపోయి పండుకొనేవాడు. ఈనాటిసాయంత్రం 'క్లబ్బు'నుండి ఊహింప నలవికాని కొన్ని విషయాలవల్ల ప్రతిదినం వచ్చేదానికంటే రెండు ఘంటలు ఆలస్యముగా వచ్చినాడు—ఏదోవిషయం మీద తెగని మీమాంస రావడంచేత గాబోలు. ఆనాడు చీట్లాటలో ఐదురూపాయలు గూడ ఓడినాడు—అప్పట్లో అది పెద్దమొత్తమే.

కొన్ని రోజులవరకు సుశీల నిద్రపోయినదో లేదో వెంకటలక్ష్మిని అడుగుతూ నిద్రపోయిందని ఎప్పుడూ చెప్పుచుండగా నమ్మకముచేతను, పరిచయము చేతను కలిగే సౌమ్యభావముతో మిద్దెమీద తనగదికి పోవుచుండేవాడు.

అయితే ఈరాత్రి ఆయనే సుశీలదగ్గరకుపోయి, ఆసంగతి స్వయంగా చెప్పవలయునని బుద్ధిపుట్టింది. మధుసూదనుడు ఆమధ్యాహ్నం సుశీల అసాధారణంగా అలంకరించుకొనుట కనిపెట్టినాడు. ఆసాయంత్రం 'క్లబ్బు'నుండి వచ్చేటప్పుడు తనభార్య స్వస్థతజెందినదనిన్నీ వ్యాధి ఆమెకు ఇంకా కొంత సౌందర్యాన్నే కూర్చింపనిన్నీ తనలో తాననుకొన్నాడు. సుశీల మధుసూదనుడు వచ్చి భోజనంచేసి గదికిపోయి పండుకొన్నాడనుకొన్నది. అప్పుడు వంటవాడు, గుర్రపువాడు వంటఇంట్లో పులిజూదం ఆడుచున్నారు; వెంకటలక్ష్మి చూస్తూకూర్చొని ఉన్నది. అందుచేత మధుసూదనుడు వెంకటలక్ష్మిని పిలువకుండా తానే దీపమును పైన మెట్లల్లో పెట్టి దాని వెలుతురులో మిద్దెదిగి సుశీలగదిదగ్గరకు వెళ్లినాడు బోరుననుండే ఇంట్లో నడుస్తుంటే మూలలన్నీ మారుమ్రోగుచున్నవి. మధుసూదనుడాగదితలుపు తీసేసమయానికే గదిలో ఆచిన్నగది తలుపుగూడ శబ్దమైనట్లు గమనించినాడు. అయితే లోపలికిరాగానే సుశీల ఒక్కతే పుస్తకం చేతబట్టుకొని ఇటునటు తిరుగుచూ చదువుకొనుచున్నది. మధుసూదనుడు దాంట్లో ఉండేది వెంకటలక్ష్మి అనుకొన్నాడు. కాని అదేందో ఒకవిధమైన అనుమానం కర్ణరంధ్రాలలో ధ్వనించుచునే యుండినది. సుశీలవట్టు చూచినాడు. వీక్షణములు కలత జెందియున్నవి.

సుశీల 'ఈరాత్రి చాలా ఆలస్యమైనదే' అన్నది. స్వచ్ఛమును, మధురమును అయిన ఆమెకంఠధ్వనిలో చాలా మార్పు కన్పడ్డది. మధుసూదనుడు మాట్లాడలేదు; ఇంతలో వెంకటలక్ష్మికూడా వచ్చినది. ఆయనకు పిడుగు పడ్డట్లైంది.

మధుసూదనుడు వెనుక చేతులు పెట్టుకొని గదిలో ఇటునటు తిరుగుచున్నాడు. సుశీల మెల్లగా 'ఏదో ఒకమాదిరి ఉన్నారేమి?' అన్నది. వెంకటలక్ష్మి సుశీల తీసి అందిచ్చు నగలు అందుకొంటున్నది. వెంకటలక్ష్మితో 'నీవుపో నేనే పెట్టిలో పెడతా' అన్నది. మధుసూదనుడు ఇంకను మౌనముద్రను వీడలేదు. సుశీల భర్తవీక్షణాలలో కొంతవగ్గును గమనించి భర్తతో ఒంటరిగా నుండవలెనని వాంఛించినది. వెంకటలక్ష్మి కాసేపు గుమ్మంలో నిలువబడి వెనుకకు తిరిగి చూస్తూవెళ్లింది—అంత మధుసూదనుడు సుశీలదగ్గరకుపోయి కూర్చుండి మెల్లగా నిరుత్సాహంతో 'నీగుడ్డలగదిలో ఎవరో ఉన్నారు' అన్నాడు.

సుశీల భర్తవైపు సౌమ్యతతో జూచి 'లేరు, ఎవరూలేరు' అన్నది. ఈ 'లేరు' అన్నమాట మధుసూదనునికి హృదయభేదకమై నిశితనారాచమైనది. ఆయన దానిని నమ్మలేదు; కాని తనభార్య ఆసమయమునందున్నంతపవిత్రముగను, అంతనిష్కళంకముగను ఎప్పుడూ కాన్పించలేదు.. ...లేచి గదితలుపు తీయబోయినాడు. సుశీల తటాలున చేయిబట్టుకొని నిలిపింది. దుఃఖభాజనమైన చూపులతోచూచి స్నిగ్ధరాగచోదితమయిన వాక్కుతో 'జ్ఞాపకముంచుకొండి,— అక్కడ

ఎవరులేనట్లయితే ఇంతటితో మనయిద్దరి మధ్య సర్వమును ముగియును' అన్నది. ఈమాటలతోగూడ ఒకవిధమైన గాంభీర్యము, గురుత్వమును సుశీల సర్వాంగముల నాశ్లేష మొనర్చినవి. అంత మధుసూదనుడు 'లేదు. నేనుపోను ......ఎటులైనను మనవియోగము తప్పనిది —నీహృదయ నైర్మల్యమును నేనెరుగుదును. నీవుజీవితయాత్రను పవిత్రముగ గడుపుచున్నావని నాకు తెలియనిది కాదు. మృత్యువును దప్పించుకొనుటకు నైచ్యమున కొడిగట్టవని నేనెరుగుదును ......కాని మనయిద్దరిమధ్య అనుమాన మనే మహార్ణవము ప్రభంజనప్రేరితమై ఘోరతరసంకాశమైన అలలతో ఘూర్ణిల్లుచున్నది' అన్నాడు. ఈమాటలు వినగానే సుశీలనేత్రములనుండి ప్రఖరమైనకాంతి వెల్వడినది. మధుసూదనుడు మరల కొంతసేపటికి 'ఉండు ...ఇదిగో రామాయణము— దైవసాక్షిగా అక్కడ ఎవరులేరని ప్రమాణము చేయుము. నిన్ను నమ్మెద... ఎప్పటికీ ఆతలుపు తీయను అన్నాడు. సుశీల 'దైవసాక్షిగా ...... ..'

'బిగ్గరగా'

'దైవసాక్షిగా ఆగదిలో ఎవరును లేరు' నిశ్చలంగా ప్రమాణం చేసినది.

రెండు నిముషముల తరువాత మధుసూదనుడు నవ్వుతూ 'సుశీలా, ఆపచ్చలఉంగరం ఎక్కడిది. చాలా బాగున్నదే. ఇంతవరకు నేను గమనించలేదు' అన్నాడు సుశీల వ్రేలుబట్టుకొని చూస్తూ 'మన సుబ్బాబత్తుడి దగ్గరకొన్నా. ఆయన మదనపల్లినుండి వచ్చినవాళ్ల ఎవరి దగ్గరనో కొన్నాడట' అని జవాబు చెప్పింది —

'చాలాబాగున్నది' అంటూ వెంకటలక్ష్మిని పిలిచినాడు. ఆలస్యములేకయే వెంకటలక్ష్మి ఎదుట నిలబడ్డది ...వెనుక తోటప్రక్కఉండే కిటికీదగ్గరకు పిలిచి మెల్లగా 'నీవు వెంకడిని పెండ్లి చేసుకొనవలయునని ఉండే సంగతి నాకు తెలుసును. అయితే పాపం నీదారిద్ర్యమే మీనడుమ నిలిచింది —సరే, పోయి వాడిని తక్షణమే తీసికొనిరా, తాపిమట్టంతో రమ్మని చెప్పు; ఇంట్లో ఎవరికీ తెలియకుండా నిద్రలేపుకొని రావలె. తెలిసిందా? నీమనసు...తర్వాత, నీఅదృష్టం పండుతుంది. గొణుక్కోకుండా పో, లేకపోతే — అంటూ ముఖం చిట్లించుకొన్నాడు. వెంకటలక్ష్మి మాట్లాడకుండా పోయింది.

మధుసూదనుడు నడవలోకి వచ్చి 'పెంచలూ.'అని బొబ్బరించినాడు; పులిజూదం చాలించి వచ్చినాడు. పెంచలుగాడు గుఱ్ఱపువాడైనను, మధుసూదనునికి మంచి అంతరంగికుడు.

'పోయి అందరూ నిద్రపొండి' అన్నాడు పెంచలును దగ్గరకు రమ్మని చేతితో సంజ్ఞ చేస్తూ. తరువాత మెల్లగా 'వాళ్లంతా నిద్రపోయిన తర్వాత నాతోవచ్చి చెప్పు' అన్నాడు. మధుసూదనుడు సుశీలను ఒకకంటితో కనిపెట్టుతూనే మాట్లాడినాడు. లోపలికి వచ్చి కూర్చొని 'క్లబ్బు' సంగతులు చాలా కులాసాగా చెప్తూ ఉన్నాడు; ఇంతలో వెంకటలక్ష్మి వచ్చింది. వీరి యిష్టాగోష్ఠిని జూచి దానికేమి అర్థమైంది కాదు.

'అయ్యా! వెంకడు వచ్చినాడు' అన్నది నిమ్మళంగా.

'లోపలికి రమ్మను' అన్నాడు బిగ్గరగా.

వెంకడు దాకినాడు లోపలికి రాగానే సుశీల కొంత విస్మిత అయినది. మధుసూదనుడు 'వెంకా! పోయి గుఱ్ఱపు లాయందగ్గర ఉండే ఇటికెరాళ్లు సున్నం దీసికొనిరాండి; ఆచిన్నగదివాకిలికి గోడకట్టవలె' అని వెంకడిని వెంకటలక్ష్మిని వెంటగా పిలిచి యిట్లా మెల్లగా అన్నాడు:— 'వెంకా, విను...ఈరాత్రికి నీవు యిక్కడనే పండుకొనవలె. అయితే రేపు వేకువనే నేను చెప్పిన ఒక పట్నంపోవలె...నీకు రెండువేలరూపాయలిస్తా. అక్కడ నీవు పదిసంవత్సరములుండవలె; ఆచోటు నీకు అనుకూలపడకపోతే వేరొకపట్నంపోవచ్చును—అది దగ్గరకాకుంటే సరి. పొయ్యేటప్పుడు నీవు చెన్నపట్నంపోయి నేను వచ్చిందాక అక్కడనే ఉండవలె; అక్కడ మరల మూడువేలరూపాయలు వీలువ్రాస్తా; నేను చెప్పినట్లు నెరవేర్చి తిరిగివస్తే ఆపైకం నీకు చెందుతుంది: ఈధనానికి యీరాత్రి మనంచేయబొయ్యేపని తపసించినా బయటకు రానీయకూడదు........ఇంక, 'వెంకటలక్ష్మీ! నీసంగతి: మీ పెండ్లినాడు వెంకడినే పెండ్లాడితే, ఐదువేలరూపాయలు యిచ్చేటట్లు వీలువ్రాస్తా; అయితే నీవు యీవిషయమై మూగై ఉండవలె— లేకపోయెనా ఈధనం నీకు చెందదు!.

వెంకడు గోడకట్టడం ప్రారంభించినాడు. సుశీల 'వెంకటలక్ష్మి, యిటువచ్చి సాజడచుట్టు' అన్నది. మధుసూదనుడు బేలుదారిని, గదితలుపును, సుశీలను గమనిస్తూ పరధ్యానంలో ఉండినట్లు గదిలో ఒక మూల నుండి మరియొక మూలకు నడుస్తున్నాడు. ఎంతకష్టపడ్డా కొంచెంగా తాపిశబ్దం వినబడక తప్పిందిగాదు. మధుసూదనుడు దూరంగాపోయివున్నాడు. పనివాడు రాళ్లను తెచ్చి క్రిందబోయుటలో శబ్దమైనది, ఆసమయంలో సుశీల ఎవరికీ వినబడకుండా 'వెంకటలక్ష్మి, వెంకడితో గోడలో రెండురంధ్రాలు పెట్టమని చెప్పితే నీకు సంవత్సరానికి ఏనూరురూపాయలిస్తా' అన్నది. తరువాత బిగ్గరగా 'పోయి రాళ్లు అందీ, పో' అన్నది.

మధుసూదనుడు, సుశీల నిశ్శబ్దంగా ఉన్నారు. వెంకడు గోడను భుజాలవరకు కట్టినాడు సుశీలను పలుకరిస్తే అన్యాపదేశంగా ఏమైనా చెపుతుందేమోయని మధుసూదనుడు పలుకలేదు. సుశీల గంభీరభంగమనియో, వివేకమనియో మాట్లాడలేదు. మధుసూదనుడు అటు తిరిగియుండునపుడు వెంకడు తాపితో తలుపుకు వేసియుండిన అద్దాన్ని కొట్టినాడు; అప్పుడు వాళ్లు ముగ్గురుఒకమనిషి--దుఃఖానలదగ్ధుడగు ఒకమనిషి—ముఖమును చూచినారు; అతని కండ్లుమాత్రము ప్రజ్వలిస్తున్నవి. మధుసూదనుడు వెనుకకు మరలక ముందే సుశీల లోపలనున్న మనిషికి తలతో ఏదో సంజ్ఞ చేసింది. ఈసంజ్ఞతో పకవాలేదన్నది కాబోలు.

వేకువన ముక్కాలుగడిచేవేళకు గోడ పూర్తిఅయినది. వెంకడు అక్కడనే పండుకొన్నాడు. పెంచలుగాడు వాడిని కనిపెట్టుకొని ఉండినాడు. మధుసూదనుడు సుశీలగదిలోనే నిద్రపోయినాడు; ఉదయాన నిద్రలేస్తూ 'దివానుతో పోయి మాట్లాడవలె' అని కండ్లు పులుముకొంటూ అన్నాడు. లేచి పైన ఉత్తరీయంవేసికొని వెనుకకు చూస్తూ బయటకు పోయినాడు.

సుశీల ఆనందోద్రేకమువలన వణకినది. సుబ్బాబత్తుడు దగ్గరకో, దివాంజీ దగ్గరకో పోవుచున్నాడనుకొన్నది. మధుసూదనుడు తోటగుమ్మం దాటక ముందే వెంకటలక్ష్మిని పిలిచింది. 'వెంకటలక్ష్మి! కట్టుతీసికొని రా, గోడను త్రవ్వి మరలాకట్టుదాము. రాత్రి వెంకడు కట్టడం చూచినాం కదా.' అన్నది భయవిహ్వలయై.

రెండు ముహూర్తములలో వెంకటలక్ష్మి రెండు కట్టులు తీసికొనివచ్చినది. మహాప్రయత్నముతో ఇద్దరు పచ్చిగోడను పడగొట్ట నారంభించినారు; సుశీల కొన్ని రాళ్లను తీసినది. అధికోత్సాహంతో ప్రపంచం మరచి త్రవ్వుమన్నది... వెనుకదిరిగి చూచుసరికి మధుసూదనుడు వెనుక నిలువబడియున్నాడు. సుశీల మూర్ఛాహతయై క్రింద పడిపోయినది; మధుసూదనుడు సుశీలను 'మంచం మీదకు పట్టండి' అన్నాడు. మధుసూదనుడు తాను లేనప్పుడు ఇది జరుగునని శంకించియే ఇట్టి చిత్రమైన ఊరలు పన్నినాడు.—నిజంగా దివాంజీతో నిన్ననే మాట్లాడినాడు; సుబ్బాబత్తుడు కోసం మనిషిని ఇంతకుముందే పంపినాడు......గదిలోని అలజడి స్తిమితపడిన కొద్దికాలమునకే సుబ్బాబత్తుడు వచ్చినాడు.

రాగానే మధుసూదనుడు చాలా ఆతురతతో 'నీవు మదనపల్లివారిదగ్గరనుండి కొన్ని ఉంగరములు కొన్నావా? అని అడిగినాడు.

'లేదయ్య' అన్నాడు బత్తుడు. ముఖం అయోమయలక్షణాలను కనబరచినది.

మధుసూదనుడు క్షుద్బాధా పీడితమైన వ్యాఘ్రము అవస్థలం జెంది చివరకు ఎరయైన హరిణమును జూచినట్లు చూచినాడు సుశీలను. సుశీల అదేమాదిరి వీక్షణాలను జబాబుపంపినది.

'పెంచలూ! నాకు అన్నం ఇచటకే తీసికొనిరా, సుశీలకు జబ్బుగానున్నది ఆరోగ్యమును బొందినదాక నేనిచటనే యుండెదను' అన్నాడు.

పాషాణహృదయుడు మధుసూదనుడు ఇరువదినాల్గుదినములు ఆగదిలో సుశీలదగ్గరనే ఉండినాడు. మొదటిరోజులలో ఆగదినుండి ఏదైన స్వల్పధ్వనివినవచ్చిన సుశీల చచ్చుచున్నవానియందు దయాంతరంగికుడవుకమ్మని ప్రార్థించుచుండేది. దానికిబదులు మధుసూదనుడు 'దానిలో ఎవరూలేరని రామాయణము నెత్తిన బెట్టుకొని ప్రమాణంచేస్తినికదా' అని వారించేవాడు. సుశీల పలికేదిగాదు."

* * * * * *

కథ ముగియగానే స్తంభీభూతులమైన మేము నెమ్మదిగా తెప్పరిల్లినాము; ఇండ్లకు వచ్చుటకు బయలుదేరినాము; కథలో చివరవాక్యం జ్ఞాపకమునకు వచ్చినప్పుడెల్ల మాలో కొందరికి చాలాకాలము వరకు ఒకవిధమైన శైత్యం అంగకములను ఆవరించేది.




[లేఖకః—పట్టణాధిష్ఠితతుండీరమండలోద్భవో
హారితగోత్రజో ప్రసిద్ధద్విజన్మా మహేశకుమారశర్మా.]

యస్మిన్ దేశే వయం జాతా యద్భాషాఽమరభారతీ
యద్దేవతా పరాశక్తిస్తాం తాం తద్భాషయా స్తుమః.
అస్య శ్రీజన్మభూమి సఙ్కీర్తనస్తవనస్య ఋషిర్బఙ్కిమచన్ద్రః,
నానాఛన్దాంసి, భారతభూమిర్దేవతా;

ధ్యానమ్

సువారిసుఫలాకులాం మలయమారుతైః శీతలాం
సువర్ణరజతాలయాం సఫల సస్యసుశ్యామలామ్,
సుధాధవలచన్ద్రికాపులకితోల్లసద్యామినీం
ప్రఫుల్లకుసుమోజ్జ్వల ద్రుమదలౌఘసంశోభినీమ్. ౧

సుకోమల సుహాసినీం సుమధురార్ద్ర సంభాషిణీం
శుభావహ వరప్రదాం సకల సౌఖ్యసంపత్ప్రదామ్,
హిమాలయ సురక్షితాం సురనదీ పవిత్రీకృతాం
స్వదేశవరమాతరం సభయభక్తి వన్దామహే. ౨

కోటికోటిసరకణ్ఠనిస్సృత గభీరఘోష వికరాలికే
కోటికోటిబహుకోటిబాహుధృత ఘోరఘోరకరవాలికే,
ఈదృశి త్వయి హి సత్యపి ప్రబల శౌర్య వీర్య ధృతి సఞ్చయే
అమ్బ కిం కథయ దుర్బలేతి తవ వాచ్యతా సముచితా భవేత్. ౩

నమామ స్తారిణీం సైన్యా ద్దివ్యదోర్బలధారిణీమ్,
రణాజిరే రిపుదలవారిణీం పరమాతరమ్. ౪

త్వం విద్యాసి త్వం ధర్మోఽసి,
హృదయం త్వమసి మర్మ త్వమసి,
త్వం హి ప్రాణా జనని శరీరే. ౫

బాహుష్వంబ త్వం నః శక్తిః,
హృదయే మాతస్త్వం నో భక్తిః,
తావకో విగ్రహో మన్దిరే మన్దిరే.

త్వంహి దుర్గా మహాకాలీ దశశస్త్రాస్త్రధారిణీ,
కమలా కమలోత్ఫుల్లదలజాలవిహారిణీ;
విద్యాప్రదాయినీ వాణీ నమామస్త్వాం వరాననే. ౭

నమామః కమలా మార్యా మమలా మతులాం శివామ్,
సుజలాం సుఫలాం రమ్యాం మాతరం భారతేశ్వరీమ్. ౮

సుస్మితాం సరలాం సస్యశ్యామలాం రత్నభూషితామ్,
ధరణీం త్వాం నమస్కుర్మో భరణీం భారతాహ్వయామ్. ౯

నగాధిరాజనన్దినీం మృగాఙ్కమౌళికామినీమ్,
వరాభయప్రదాయినీం వ్రజామి విశ్వపాలినీమ్. ౦

వేదగీతనాదినీం హోమధూమపావనీమ్,
మోక్షధర్మబోధినీం నమామిభారతేశ్వరీమ్. ౧

స్వదేశభక్తపాలినీం స్వధర్మనిష్ఠతారిణీమ్,
స్వజాతిదైన్యహారిణీం భజామి భారతేశ్వరీమ్. ౩

సమత్వతత్త్వఘోషిణీం సహోదరత్వవాదినీమ్,
స్వతన్త్రతాభిలాషిణీం భజామి భారతావనీమ్. ౪

హిమాలయాద్రిరక్షితాం సురాపగాపవిత్రితామ్,
తపోధనైర్నిషేవితాం భజామి భారతాంబికామ్. ౫

స్వదేశతా ముపేయుషీం సురాలయా ద్గరీయసీమ్,
మహీతలే మహీయసీం భజామి భారతస్థలీమ్. ౬

వన్దేఽనఘాం భారతపుణ్యభూమిం మహార్హరత్నాకరదివ్యభూమిమ్,
సఙ్గీతసాహిత్యనివాసభూమిం మనోరమాం మామకజన్మభూమిమ్. ౭

జయతు జయతు పుణ్యాజన్మభూర్భారతానాం
జయతుజయతు దివ్యా భారతీ భారతానామ్,
జయతుజయతు హృద్యా వాక్సుధా సత్కవీనాం
జయతుజయతు భవ్యా బాలగోపాలమూర్తిః. ౮

మఙ్గళం కఞ్జనయనః కామితార్థప్రదాయకః,
తనోతు భగవాన్ కృష్ణో దివ్యమఙ్గళవిగ్రహః. ౯

శ్రీ కాశీనాథవంశ్యేన శ్రీ నాగేశ్వరశర్మణా,
సంపాదితే పత్రరత్నే "భారతీ" నామ్నిమాసికే.
సఙ్కీర్తన మిదం పుణ్యం జన్మభూమేః ప్రకాశ్యతే,
రచితం దేశభక్తేన మహేశాత్మజశర్మణా.




రంగము

[ఉదయపురరాణా యొక్క అంతఃపురము. తెల్లని చలువరాతిలోఁ జెక్కఁబడిన శ్రీకృష్ణ బాల విగ్రహము నిలుపఁబడి యున్నది. రాజును, రాణియు, రాజకుమారియగు మీరాబాయియుఁ ప్రవేశింతురు.]

రాజు—(మీరాబాయినిజూచి) ఈ చిన్న జాతిదేవుని నీవు మఱచిపోవలెను. నిన్ను నీవు, విశాలగగనభాగమున కెల్ల నాథునిగా, మహోన్నత పర్వతసమూహములకు రాజుగా, ఈ గభీరాంభోనిధులకుఁ గర్తగాఁ దలంచుచున్నావు. మానవ విధినిర్ణేతగా నెంచుచున్నావు. ఎవరి సమీపమున నీవు రేయింబవళ్లు కూర్చుని మృదుమధురముగాఁ గనుదమ్ముల బాష్పసలిల ప్రవాహముచే నింపి, స్తోత్రముచేయుదువో, అట్టి మాటలేని, నిర్జీవమైన నీకృష్ణబాలుని, నీ మనస్సునుండి పారఁదోలుము.

రాణి—కుమారీ! నిశ్చలజలములో నుషఃకాంతులవలె నీ హృదయమున యౌవనవసంతోదయ మగుచున్నది.

మీరా—అంతఃప్రాయపుమధురిమచే నలరారు నాహృదయ సంగీతమును, శ్రీకృష్ణుని పాదారవిందములకు నర్పించుచున్నాను.

రాజు—నీకుఁ దలదిరుగుచున్నది. నీమాటలు పిచ్చిగా నున్నవి. తరంగములవలె జాతిపై నృత్యమొనర్చుచున్నవి. బాలా! ఈతెల్లని బొమ్మలో నీకేమి కనఁబడుచున్నది?

మీరా—దేదీప్యమానమగు సింహాసనమున దేదీప్యముగఁ బ్రకాశించు రాజును—నా ప్రభువును—నాపతిని—జూచుచున్నాను.

రాజు—(కొంచెము కోపమున) నీ ప్రభువా? నీపతియా? నీపతియా? మదాంధవైతివా? ప్రేయసీ! వింటివా విచిత్రపు మాటలు. ఈమెకు మతిభ్రమణము గలిగినటులఁ దలఁచవా?

రాణి—నిజము. ఆమె సరిగాలేదు—(కూఁతును జూచి) ఈ చెక్కఁబడిన యాకారమునందుఁ బూజింపఁదగినది నీకేమి కనఁబడుచున్నదమ్మా?

మీరా—అంతర్హితమైన సృష్టిని బ్రేరేపించిన శబ్దము బయల్వెడలుటకు మున్నే కల

---

* హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయిగారి దానికిఁ దెనుఁగు.

నిశ్చలమైన జలనిధిని—విజ్ఞాన జ్యోతిని—ప్రకృతి రహస్యముల కుత్పత్తిస్థానమును—సర్వత్ర వ్యాపించిన ప్రాణమునకుఁ బ్రాణమును నేదర్శించుచున్నాను.

రాజు—విశృంఖలమైన యూహా ప్రపంచమునుండి యిట్టి రిత్త తలంపులు గైకొనుచున్నావు.

మీరా—భక్తి విశ్వాసము లనునీరెండును నాత్మనుండి యావిర్భవించిన కవలపిల్లలు. నిర్జన ప్రదేశములుగూడ గైన విశ్వాసముచే, నపార వ్యోమవీథినిఁ బ్రకాశింపుచున్నవి. వత్సరములు గడచిపోవుచున్నవి. చూడుడు: మునిపుంగవుల నమ్మికలచే శిలలు ద్రవించినవి. ప్రహ్లాదుని భక్తిచే నగ్ని చల్లపడినది. మత్తేభపాదము పుష్ప సదృశమైనది. మహోన్నతాచలము శిశు పరిమాణమైనది. ఆహా! అతఁ డుత్తుంగ తరంగముల జయించెను. హాలాహలము నమృతమొనరించెను. నాభక్తిగూడ నట్టిదే!

రాజు—రాలిన చుక్కను నాకాశము విస్మరించినట్లు, ఎగిరిపోయిన పక్షినిఁ దటాకమట్లు, గాయమును కత్తి మఱచిపోయినట్లు, నీవు దీనిని మఱచిపోవలెను.

మీరా—ఆకాశము నక్షత్రమును మఱచునా? తటాకము విహంగమును విస్మరించునా? లవిత్రము గాయమును మఱచునా? కాదు తండ్రీ! లేదు జనకా! ఈయన్నిటిలోను విరహదుఃఖమును నేఁగనుఁగొనుచున్నాను. అట్టివో నేనెట్లు, ఈ రారాజును మఱువగలను?

రాణి—అర్థములేని మాటలు మాట్లాడుచున్నది!

రాజు—(కోపముతో) బుద్ధిలేని మాటలు:—ఓసీ! నీ వుస్మత్తవనియు, సన్న్యాసులతో నృత్యము సేయుచున్నావనియు, దైవము యొక్క గార్దభంబులగు పురోహితుల మాయలలోఁ జిక్కికొంటి వనియు, మత సిద్ధాంతములలోఁ దగుల్కొంటి వనియు లోకులు వాకొనుచున్నారు. నీయభిమాన పహాత్కికమును జుల్కన సేయుచున్నారు. ఆహాత్కిక మిపుడు కృత్రిమమైన దానివలె విలువలేని దగుచున్నది. నగరమంతయు గేలిసేయుచున్నది. చుల్కనసేయుచున్నది. దుష్టనారీజంఘాత్పతితకటకమునువలె, వ్రేలితోఁ జూపుచున్నారు. శిరశ్శైత్య మొనరించిన, ఈ చిన్నప్రతిమను—చలనములేని దానిని—మరువుము.

మీరా—నక్షత్రమండలమున శుక్రునిఁ బ్రకాశింపవలదని చెప్పినఁ జెప్పుఁడు. శక్రకార్ముకమును గాంతులఁ బ్రసరింపవలదని యడిగిన నడుగుఁడు. తుషారశీకరములను వర్షింపవలదని ఆకాశమున కానతిచ్చిన నానతిండు. అంకురముల మొలకలెత్తవలదని యాజ్ఞాపించిన నాజ్ఞాపింపుఁడు. కాని నా—

రాజు—పిచ్చిదానా! ప్రేలకుము. పిచ్చి సంతోషముచే నీకనుదమ్ములు బరువైనందులకు పిశాచములుగూడ నగుచున్నవి.

పొట్టును దిశలకు వెదచల్లినట్లు, నీపేరును దశదిశలఁ బ్రజలు వాకొనుచున్నారు. నీ క్షత్రియ జన్మమునుగూడ సంశయించుచున్నారు. నిరంతరము నిన్ను వ్రేళ్లతోఁ జూపి, యపహాస్యించుకొనుచున్నారు. దీని కంతయు నాశిలావిగ్రహమే కారణము సుమా.

మీరా—లోకమెట్లు తలంచిన నాకేమి? వాఁగుడుచే నెవ్వరు క్షీరసదృశకాంతులొలయు తారకలయొక్క, మధుజ్యోతులఁ గ్రుమ్మరించు భాస్కరుని యొక్క, తేజస్సు నాఁపుదురు? దినము కొలఁకు నుత్కంఠతో నుండకుండ నిశను జేయువారెవరు? నిర్వక్రపరాక్రమశాలియగు నీ చిన్నికృష్ణుని కొఱకై, జ్ఞానతాపమునఁ గలిగిన, ఈక్షుత్తును, ఈపిపాసను, ఈవాంఛను సడ్డపెట్టువారెవరు?—రాజోత్తమా! లేరు, లేరు. గ్రహతారకల కంటె ననాదియగు దీనిని నాశనమొనర్ప నదిలేదు, లేదు.

రాణి—ప్రియకుమారీ! నీయౌవనమిట్లు రిత్త సేయుట మే మంగీకరింపము.

రాజు—ఉషఃకాంతులీను రాకుమారుని వివాహమాడి, యాతని చిత్తభృంగ పుష్పమై, వెలయుఁగాక!

మీరా—ఏమీ? నాశరీరమును విక్రయింతురా? వ్యభిచారమును నేర్పుదురా? నాహృదయేశుని పవిత్రద్వారమునుండి, నాయాత్మను బలాత్కారముగా లాగుదురా?

రాజు—(మహోగ్రముతో) దేవీ! పొమ్ము. విషపాత్రను దెమ్ము.

(రాణివెళ్లి, విషపాత్రను గైకొనివచ్చినది)

మీరా—శరీర యౌవనము క్షణికము. కాయము ముదిసి, రాలిపోవుచున్నది. కాని జనకా! ఆత్మ నిత్యయౌవనముగలది. శాశ్వతమైనది. దైవసంస్పర్శచే నాశనము లేని దగుచున్నదని యెఱుంగుము.

రాణి—అయ్యో! ప్రియతనూజా!

రాజు:—ఓసీ! ఉన్మత్తశీలా! ఇంకను వ్యవధి నొసంగుచున్నాము. భవత్కృత విగ్రహమును మఱచిపొమ్ము. జీవితమునకు, అమూల్యాధికార ప్రాబల్యమో, భీకరోరగ విషమో—రెంటిలో నేదియో కోరుకొనుము.

మీరా—అమృత జీవనమునుండి మరల్చి, మృతజీవితము లంచముగా నాయాత్మకు నొసంగుచున్నారా? అయోమయ శృంఖలాబద్ధచరణయుగంబుతో బానిస యెట్లు తన యజమానుని సతీమణికి లంచమివ్వ సాహసించును?

రాజు—పుత్రీ! యోచింపుము. ఆలస్యము విషమగును.

మీరా—యోచింపవలసిన దేదియు లేదు.

రాజు—ఏమియు లేదా? (రాణినిజూచి) ఈపె నీడకూడ మన గడపపైఁ బడరాదు. ఇఁక మీఁద నీపె వెలివేయఁబడినది—ఎవరి కర్మమున వారేపోవుదురు. విషపుగిన్నె నిమ్ము. ఆపాదమస్తకము వ్యాపించిన మాయామంత్రములతోనున్న యీపెతో—నీచ

విగ్రహారాధన యొనర్చు నీపెతో—మనకు సంబంధము పనికిరాదు. (మీరాబాయి తో) పో! పొమ్ము! లేచి పొమ్ము! నీదేవునితోఁ జెప్పుకొనుము.

రాణి—(విచారముతో) ఓ నా చిన్నికుమారీ! ఈరాత్రి నీవెచటికిఁ బోవుదువు. చితిజ్వాలలు నిన్నుఁ గబళించును. నీయౌవనము, నీసౌందర్యము, మొగ్గలో నశించిపోవునా? సృగాలారావములు నిన్ను భయకంపితురాలిగాఁ జేయవా? నీయస్థులు ప్రవాహములో వేసెదరు ఎంతశోకించునోగదా పుత్రీ!

మీరా—మనమెల్లర మొక్కుదినములో నుద్భవించి నశించెడు పిపీలికలము. మనశరీరములు మాయాదేవియొక్క, దర్పణగానబడు మృగతృష్ణలు; జలదములలోని మెలిమెఱుములు; మోసపుదివ్వెలు; నక్తంచరులగు కొఱవిదయ్యములు. యౌవన సౌందర్యములు మాయాదేవి శరీరావిర్భూతమైన మోసపుదళుకులు. విసపుగిన్నకు నజ్ఞానయుక్త శరీరము భయమొందును. ఈపీఠముపై ముగ్ధస్వరూపమున నున్న శ్రీకృష్ణ శ్వేత కరకముల సంస్పర్శచే, ధన్యమైన నాశరీరము—అమృతపాన మొనరించిన నాశరీరము—భయపడదు.

(విషపు గిన్నెఁ దీసికొని, నిర్భయముగా నిశ్చలముగాఁ ద్రాగును. తెల్లనిబొమ్మ రూపముమారి విషపు రూపమును దాల్చినది. కాని ఆమె మారలేదు.)

రాణి—చూచితిరా! చూచితిరా! ఆమె హస్తపద్మము లెంత నిశ్చలముగా నున్నవో, ఎట్టి ధైర్యమును వహించినవో!

రాజు—(భయపడి) ఆ—దేవీ! శిలాదైవము కాంతి గోల్పడి విషపు రూపము వహించుచున్నది.

మీరా—ఏమి! నేనెట్టి అమృతమును గ్రోలితిని. శీతలమేఘాంతర్హిత మధుధారలా ఇవి? నాశరీరము పుష్పసౌరభమును వెదజిమ్ముచున్నది!

రాణి—పుత్రీ! కుమారీ! వినుమా! అదృశ్యమునుండి దృశ్యమును వేఱుచేయు తనుతెర పటాపంచలైనది. పావనస్వరూప సమీపమునఁ గరతలమునఁ గరకరులఁ బడిన దివ్యసురూపమును నేఁడు తిలకించుచున్నారము.

రాజు—(దైన్యముతో) నాకన్నులఁ జీల్చివేయుఁడు! ఓ దేవా! నన్ను దండింపుము—సృష్టిలో గొప్పవాఁడైన సూర్యుఁడు నీలాంబరము నుండి "రాజాధమా! ఎవరురా? విషముగ్రోలినది. నీకోసమా? దైవమా?" అని నన్నుఁ గేలిసేయుచున్నాఁడు.





# చలి! చలి! చలి!

గుండిమెడ వేంకటసుబ్బారావు గారు

మూల మూలలఁబట్టి బూజెక్కుచున్న కుంపటులు మెల్లన బైటఁ బడెడువేళ
పుట్టిండ్లనున్నట్టి ముద్దుటిల్లాండ్ర రావింప భర్తలు చీట్లు నంపువేళ,
వయసుమీఱిన మోటు బ్రహ్మచారులు నిజస్థితి కెంతొ విధిని నిందించువేళ,
నరులెల్ల పూర్వ మెన్నఁడులేని భక్తి వెల్వెల్ల భాస్కరుని సేవించువేళ,

గీ. అకట! యేలఁ దెచ్చితివి దయ్యంబ! యిట్టి, ఘోరదురవస్థ మాకంచు సారెసారె
కును వయోవృద్ధులు గొణుగుకొనెడి వేళ, శీతకాలంబువచ్చె! పెన్ భూతమటుల!

ఉ. కాకకు నాకరంబయి జగంబులఁ గాల్చెడు గ్రీష్మభానుఁ బా
పాకరుఁడంచు ధూర్తుఁడు దయారహితుం డనుచున్ దలంతు! శ్రీ
తాకరమై ప్రకంపిత దురంత జగంబయి యున్న యీ చలిన్
వేకువ మ్రొక్కుచుందు రతనిన్ భువనావనుఁ డంచుఁ జిత్రహా!

క. ఏమైనను ఋతువులలో, హేమంతము నిర్దయుఁడగు నేలిక వోలెన్
శ్రీమంతుల కెల్లనన్నను, పామరులగు పేదలకును ప్రాణాంతికమా!

సీ. ధనమదాంధులకు నిత్యమహేంద్ర భోగంబు! బడుగు పేదలకు జీవనవిరక్తి!
సుకృతులౌ సద్గృహస్థులకు నోములపంట! బ్రహ్మచారులకుఁ బాపంపు ఫలము!
అనఘరాధులకు బ్రహ్మానంద రాజ్యంబు! రంకుటాండ్రకు మనస్సంకటంబు!
వైరాగ్యనిధుల కీశ్వర విలాసంబు! పామరకోటి కిహలోక నరకసిద్ధి!

గీ. ఆహాహా! హేమంత! పూర్వకర్మానుగతుల, నిట్లు వ్యతిరేకఫలముల నిచ్చునీవు
అమృత మొకనోట, విషము నన్యమునఁ గ్రక్కు, నిరుశిరంబుల సర్పంబవేమొ, చెపుమ!

గీ. తప్ప కేఁడాది నొకసారి దయవహించి, వచ్చిపోవుచునుందు వెబ్భంగినైన!
ఎంత యభిమానమయ్య, హేమంత! నీకు, బంధుమిత్రులు శుష్కసంబంధులరయ!



# జొన్నకల్లి.

తాపీ ధర్మారావు గారు, బి. ఏ.,

## ౪

### రామునకు సీత యేమగును?

ఎవ్వఁడో యొకఁడు- ఏయుగమునకో, యేమండలంబుననో, రామాయణమంతయు విని "రామునకు సీత యేమగును" అని నిర్భయముగ నడిగెనంట. ఆతఁడు నాకగ్రజుఁడనిపిన్నవింప సంతసించుచున్నాఁడ. పాపము! అచటివా రెంత హాసముసేసిరో, యెందఱు కేళిసేసిరో, యన్నగా నెంత యవమానము నందినారలో మనకుఁజెప్పువారు లేరు. అడిగిన యీ యసంబద్ధ ప్రశ్నమునకుఁ బ్రతిఫలంబుగ నాతఁడు నేఁడుఁగూడ జీవించి యేయున్నాఁడు. అడిగినందున నన్నగారి కమరత్వ మలవడినది; యింక తమ్ముఁడు మాత్రము తక్కువ యగునా యను నాశ యుంట సహజంబుగదా! మహాశూరులంబలె, నతిలోకమనీషులవలె నాచంద్రార్కము నీతనిఁగూడ మఱచువారు లేరు. మూర్ఖసందేహములు మోముఁజూపినంత మాత్రమున, నితరులు, మాయన్నగారిపేరున మొగముపై మొత్తి "రామాయణమంతయు విని రామునకు సీత యేమగునని యడిగిన ట్లున్నదని నవ్వి కొందురు.

ప్రశ్నమడిగినవాఁడు పరమమూర్ఖుఁడనియే భావముగాని, విద్వాంసుఁడగునేమో యను విచారము మనకు లేదు. విద్వాంసుఁడును వెఱ్ఱివాఁడును స్థూలదృష్టినొక్కరీతి నుండు వారలేకదా! సన్నుత బుద్ధులను జొన్నకల్లి అనుట సాంప్రదాయసిద్ధము. అట్లని, జొన్నకల్లి లందఱును మన్నన కర్హులని మా వాదముకాదు. పరిశీలించి చూచెదముగాక!

(1) ఉత్తర వాశిష్ఠపురాణమునందును, స్కాందోత్తరపురాణమునందును నున్నయట్టుల కర్ణాటదేశమున నీ కథ కలదు.

"లక్ష్మీదేవి దశరథుని యింట రాముని సోదరియయి యవతరించెను, జనకమహారాజు దశరథునివలన నా శిశువును వరముగఁబడసి, పెంచికొనఁ దననగరమునకుఁ దీసికొనిపోయెను. అట్లు తీసికొనిపోవునప్పుడు దశరథుఁడు 'రాజేంద్రా, యీ బిడ్డ భూతలంబు నంటిన నంతర్హితయగుం గావున నేల తాఁకనీయక కడుజాగరూకతతోఁ బెనుచుకొనఁదగు'నని జనకునితోఁ బల్కెను. అటులనే జనకుండు నతిశ్రద్ధాళువయి యాకుమారిక నొకపీఁటపయినుంచి పెనుచుకొనుచు న[illegible]చుండెను. ఇట్లుండ నొక్కనాఁడు జాజలియను పేరుగల ఋషిసత్తముండు జనకుని దర్శింప నేతెంచె. ఋషివచ్చువేళ నితరులెవ్వరును లేకుంటఁజేసి, యాతని కాతిథ్యము నొసఁగు నూహతో సీత తనపీఁటనుండి క్రిందికి దిగెను. అట్లుదిగిన తత్క్షణంబుననె యాపె భూగర్భంబుఁ జొచ్చి కంటికిఁ గానరాకుండెను. తరువాత నేడుసంవత్సరముల యనంతరము, యాగముకొఱకు జనకుఁ డాస్థలంబును దున్నుచుండఁగా, నందు సీత కానవచ్చెను. ఆ వెనుక రాముఁ డా సీతను బెండ్లియాడెను."

రామునకు సీత యేమగునో?

(2) ఒక్క పౌరాణికుఁడు భార్గవపురాణమున నీరీతిఁగలదని నుడువుచున్నాఁడు :

"దేవతలనందఱను జయించి రావణుఁడు మహావైభవముతో రాజ్యముచేయుచు, బ్రహ్మదేవుఁ దనకు పంచాంగ బ్రాహ్మణునిగ నుంచికొన ననుగ్రహించెను. ఈ యాదరణంబునకే కానోపును తమ్మిచూలి రావణుని కోటి సంవత్సరంబులు జీవింప వరంబొసఁగెను.

అట్టులనుండ నొక్క నాఁడు బ్రహ్మవచ్చి, పంచాంగ నివేదనంబునకు సమయము చిక్కక, చాలసేపు ద్వారము కడ వేఁచియుండవలసివచ్చి తన కోపమును శాపరూపంబున వెలిగ్రక్కుచుండెను. అంతలో నారదఋషి యొట్టులనో లోనఁ బ్రవేశించి 'బ్రహ్మ నిట్టులఁ గనిపెట్టి కొని యుండఁజేసినందుల కప్పటికే నీ యాయుర్దాయ మున ముప్పాతిక నశించె! మిగిలిన పాతికయు సోదరుని వివాహము జేసికొనిన కాంతను చెఱఁబట్టిన యప్పుడు నశించు'నని చెప్పిపోయెను. జనకునకు భూమిలో దొర కిన సీత రాముని చెలియలని యెవ్వరికినిఁ దెలియదు. ఆసీతనె త్తికొనిపోవుట చేతనే రావణుఁడు తన చావు నకు మార్గముఁ జేసికొనెను"

ఇందు పైనుదాహరించిన కథ యనుసంధానముచేయఁ బడుట స్పష్టముగదా. రామునకు సీత యేమి కావలె నందురు?

(మనవి:— ఈకథను బట్టి యార్య - అనార్య సంఘముల యాచారంబు లారయుబుద్ధిగలవారు కలుగు దురుగాక)

(8) ఇంతియేకాదు: ప్రాచీనగ్రంథంబగు "దశరథ జాతక"యను బౌద్ధగ్రంథంబున నీకథం గనుడు.

"వారణాసీ ప్రభువగు దశరథునకు రామపండి తుఁడనియు లక్ష్మణుఁడనియు నిరువురు పుత్రులును సీత యను నొక్క కూఁతురును గలరు. వారితల్లి మరణించుట చేత నింకొక వివాహమునుఁ జేసికొని భరతుఁడను మఱి యొక కుమారుని దశరథుఁడు గాంచెను. ఆభార్యవలని దుర్బోధన కారణముగ నాతఁడు తన పెద్ద కొడుకులనిద్ద అను పండ్రెండు సంవత్సరములు దేశాంతరముల నుండ వలయునని పంపివైచెను. సీతాదేవియుఁ దనయిష్టాను సారముగ వారలతో నేగ, వారు హిమాలయమునకుఁ బోయిరి. అట సీతాలక్ష్మణులు రామపండితుని పితృతు ల్యునిగ భావించి కందమూలఫలాదులందెచ్చి యిచ్చి సేవించుచుండిరి.

ఇచ్చట దశరథుఁ డింకను పండ్రెండువర్షములు జీవించునని దైవజ్ఞులు నుడివినను నాతఁడు తొమ్మిది వత్సరములకే మరణించెను. తదనంతరమున భరతుఁడు పట్టాభిషిక్తుఁడగుట కిష్టపడక రామపండితునిఁ దీసికొని వచ్చుట కరణ్యమునకేఁగెను. జనకుని మరణవార్త విని యంత సీతాలక్ష్మణులు మిక్కుటముగ నేడ్చిరిగాని, రామపండితుని కంట నీరు కయినఁ దడి కలుగదయ్యె. అట్టులుంటకుఁ గారణంబేమని భరతుఁడడుగ 'గతించిన వారలంగూర్చి విచారించుట నిరర్థకంబు ........ అని రాముఁడు చక్కగ బోధించిచెప్పెను. తాను మిగిలి యున్న మూఁడు సంవత్సరములును ముగిసినంతనె దనుక రాజ్యమునకు రానని, సీతాలక్ష్మణులను భరతునితో దేశమునకుఁ బంపెను. అంతియకాక, గడ్డితోఁ జేయఁ బడియుండిన తనపాదరక్షలనుగూడ వారికిచ్చియనిపెను. మంత్రులాపాదుకలను సింహాసనమున నుంచి రాజ్యపాల నము సేయుచుండిరి. వారివిచారణంబుల నన్యాయముం డిన నాపాదుక లొక్కదానితో నొక్కటి కొట్టుకొను చుండును. అట్టియెడల వారు తిరుగ నభియోగమును విచారించు చుందురు. న్యాయముజరుగునంతకాలము నవి కదులుటలేదు. అట్టు లామూఁడు వర్షము లయిన పిదప రామపండితుఁడు తిరుగ వారణాసికి వచ్చి సీతాదేవిని రాణిగా నేలుచు 16,000 వత్సరంబులు రాజ్యముచేసి యూర్ధ్వలోకీరంబు బాసెను."

ఈజాతక కథ బుద్ధదేవుఁడు తానొక యొకకృషి వలుఁగు వియోగవిచారభరంబున దుఃఖించుచుండి నప్పుడు వానికి చెప్పినది. కథతుదను బుద్ధుఁడు తాను పూర్వజన్మమున నా రామపండితుఁడయి యుండెనని స్పష్టముచేసెను. రామునకు సీతయేమగు నందము?

4. సింహళద్వీప చరిత్రంబగు మహావంశంబున మూలపురుషుఁడగు విజయుని జననక్రమంబు నించుక యాలోచించి చూడుఁడు. ఆమహామహుని పితరు లేక గర్భజనితులే యని ధ్రువమగును. లిడియా యను దేశపు ప్రభువగు సాద్యత్తుఁడు తనసోదరినే వివాహము చేసి కొనెనని హెరొడోటస్ అను చరిత్రపితామహునిఁ జది విన వారందఱు నెఱిఁగినదియ. క్రైస్తవగ్రంథములందు ఏబ్రహాను, పారసీకులలో కంబైసస్ అను కవ్యజీయఁ డును, రోముదేశప్రసిద్ధుఁడగు అగ్రిప్పాయును రెండు వేలసంవత్సరముల పూర్వమువఱకు సోదరీమణులఁ బరిణ యమగు నాచారము సర్వజన సమాదరణీయంబుగ నుండె ననుటకు నిదర్శన ప్రాయులగు చున్నారుగదా. ఇంక

ఫినీషియా, అస్సిరియా మొదలగు పురాతన దేశసాంప్రదాయముల నారయు భాగ్యముగలవార లనేక విచిత్రాచారములఁగాంచఁ గలుగుదురు. గ్రంథవిస్తరభీతిచే మఱియొక సమయంబును నిరీక్షించుచుండెద.

ఇన్ని రీతుల నింతబలముగల ప్రశ్నమునకు మాయన్నను మసిగుడ్డ వేసినై ఛలిరిగదా! చెలియలిని చేపట్టుటయా! హరిహరీ! ఎంతకర్ణకఠోరము. అనియనని వారుండరు. సర్వప్రపంచము నీనాఁడా మాటకు చోటునీయరు. ఆచారపరాయణు లావేశంబున పశువులనుగూడఁ దీయుదురు. నిజమే. కాని, కాలమంతయు నీనాఁడు మనకున్న కమిట్ల పైనే నడచుచుండెనా? ప్రాఁతనీరు పోయి క్రొత్తనీరు వచ్చుట చెఱువులకే కాని యాచారములకు లేదనియే నాభావము? ఈజిప్టుదేశమున చెలియలినిఁ బెండ్లియాడుట రాజధర్మముగ నుండెను. ఇందుక భేదముతో మహమ్మదీయులకు సోదరీకల్యాణమగుట కలదు. దైవసృష్టిని మానవేతరజీవులందు ప్రవర్తింపఁబడిన భగవత్ సూత్రము తొలుతమానవులకేల యాచరణీయంబుగ [illegible] తైత్తిరీయబ్రాహ్మణములయందుఁ బ్రజాపతి కూఁతురగు సీత, ప్రజాపతిచే సృష్టింపఁబడిన చంద్రుని వివాహము చేసికొనుట కథము లేకుండునా? ఇంద్రునకు స్వసృజారుఁడను బిరుదు నామంబునకుఁ దెరువెయ్యది? ఋగ్వేదంబున సూర్యభగవానుఁడు గూడ స్వసృజారాభిధేయవిరాజితుఁడగు చెల్లెలిమగండేకదా! బ్రహ్మ తన కూఁతుం బరిణయమగుట విదితమేకదా! 'ప్రజా'యన కూఁతునకు, 'పతి'యన భర్తయగుటచేతనే నా ప్రజాపతియను నామంబునకు సార్థకతఁగాంచెను? ఇట్టి దృష్టాంతరంబు లసంఖ్యాతంబుల నీయనగును. గ్రంథదైర్ఘ్యంబు ఖండిననుండవిందు.

ఇట్టి ప్రవర్తనలును నామంబులును నానాగ్రంథకాలంబుల సర్వసాధారణము లయియుండె ననుట సమంజసంబగును. అట్టులుండుట కాచారవ్యవహారము లావిష్కంబుల నుండకున్న నెద్దెండకను నేనుబోతు నీడకును నీడ్చునట్లగును. మానవచరిత్రంబున నీపరిస్థితు లొకానొక కాలంబున నుండి యుండవలయునని నిర్ధారణము సేయుటకు శాస్త్రసమ్మతి పెక్కుభంగులఁ గలదు. మానవేతరజీవసంతతి ననుకరించుటయేకాక యీయాచారమునకు బలము నిచ్చు నింకొక్క కారణముగూడఁ గలదు. సంసారస్వత్వంబులన్నియుఁ దొలుత సార సాక్షియధీనంబులే కాని పురుషుల కైవసంబులు గావు. అధికారాభిలాష మందజనకును సహజంబేగదా! కావునఁ దమపితరుల భాగ్యంబు నంద సోదరిని తనకర్ధాంగిగఁ జేసి కొనవలయును. కావుననె పెండ్లి మేనరికమని మనయందున్న వాడుకయు నిందే జనించెను. వానిం దప్పం బనిలేదు. భారతంబు నరయువారల కింకను జిత్రంబులగు నాచారములు పొడకట్టకమానవు; ఆ యాచారంబులం బట్టి, పురాతన ఫినీషియా యీజిప్టు లోనగు దేశముల చరితలతో సమన్వయము చేసికొను నాతఁడు మనయార్యుల యాథార్థ్యము తెలియఁగఁజాలి యుండును. కుశాగ్రబుద్ధులగు పాఠకులు పరిశోధనల గావించి, పక్షపాతపిశాచంబు వాతఁబడక, లోకంబుల నుండఁదగు సత్యమును వెలువరింతురు గాక యని ప్రార్థింతును.

# నాటి నేటి వైద్యులు

## వైద్యరాజ దంటు సుబ్బావధాని గారు

గురుశుశ్రూషల మంత్రదీక్షల మహద్గోష్ఠీవిహారమ్ములన్
వరశ్రద్ధాయుతు లౌచు భక్తిగరిమన్ వైద్యుల్ మునుల్ యోగులై
పరకాయంబుల దూరి రోగముల దెల్పంగల్గి రంతర్ముఖుల్
తరమా నాస్తికకోటి కట్టిసుమహత్త్వం బిప్డు సిద్ధింపగన్!



షాలీమార్ ఉద్యానము

ఓమ్

# కవీంద్రసాక్షాత్కారము

ఓలేటి వేంకటరామశాస్త్రి గారు

## (౧) నన్నయభట్టు

ఆర్యా! నన్నయభట్ట సత్కవివరేణ్యా! యేమి? నీ వట్టు లా
శ్చర్యావిష్టమనస్కతం గనెదు? నీ చారిత్రసంసృష్టి మా
చర్యల్ సూచిన వింత పుట్టనోకో? దోషజ్ఞోత్తమా! నీ కని
ర్వార్యంబుల్ సుమి మా విచిత్రరచనాప్రాగల్భ్యసంరంభముల్.

గీ. ఎచట నేకులమందు నీ వెపుడు పుట్టి, యెట్లు చరియించి యేగితో యేరి కెఱుక?
వ్రాసికొనవైతి నీ చరిత్రం బదేమి, హేతువో చెప్పరాదటోయీ! మహాత్మ!

ఆ. గీ. మాకుఁ దెలియనీక యేకారణముననో, దాఁచికొంటి నీదు ధన్యచరిత
జమ్మిచెట్టు, దానశాసనమ్ములు, భారతమ్ము నెట్లు నీవు దాఁపఁగలవు?

క. ఎవ్వరి కెట్టులు దోఁచిన, నవ్విధమున నీ చరిత్ర మలుకొ[illegible]
ముచ్చిల్లొరఁగ నీ వటు, ని[illegible] నిశ్చేష్టుఁడవై?

క. [illegible]పత్త్రం బగు నీ, చరితమునకు మొదలు తుదయు సమకూరక యే
మెఱిఁగిన తెలుఁగున నొడివెదు, నెఱవాదుల నుడులజోలి నీ కేమిటికిన్

క. ఏ మేమని నుడివినఁగా, నీ మహితభవచ్చరిత్ర మిపు డెఱుఁగఁ దరం
బే? మఱి మా యూహల కీ, వేమియు ననుకొనకుమీ కవీంద్రప్రవరా!

గీ. వైదికుఁడ వని కొందఱు వక్కణింప, నొరులు కొందఱు, కాదు నియోగి వంచు
వైదికుఁడవో నియోగివో వాదు లేల? వంద్యుఁడవ కావె యేశాఖవాఁడ వైన?

సీ. రాజాధిరాజమార్తాండ రాజనరేంద్ర, పార్థివేశ్వర కులబ్రాహ్మణుఁడవు!
అవిరళ జపతపోయజ్ఞ వేదపఠన, దాన ప్రతిగ్రహ తత్పరుఁడవు!
వర్ణిత బ్రహ్మాండ వాయు వారాహాది, నానాపురాణవిజ్ఞాన మతివి!
ఉభయభాషాకావ్య యోజనా సామర్థ్య, కలిత విశేష లోకజ్ఞ మణివి!
గీ. ఇట్టి నిను వైదికుఁడ వన నేమిదోష? మట్లుకాక నియోగివే యన్న నేమి
తప్పు? వేదజ్ఞలోకజ్ఞతలనుబట్టి, యుభయుఁడవు నన్న మఱియింత యొప్పుఁగాదె!

క. కావించిన యజ్ఞతప, శ్శ్రీవేదాధ్యయన జపవిశేషాదులచే
నీ వైదికత్వ మెపుడుం, బోవదు; సంశయముఁ జెందఁబోకుము; సుకవీ!

క. వైదికలౌకికనిర్ణయ, వాదం బటు లుండ నామవైఖరిఁ గనువో
కేవలముఁ గన్నడుఁడ వను, భావము జనియించు నన్ని భట్టకవీంద్రా!

క. కర్ణాటివాఁడ వైనను, నర్ణిత మగు వేఁగినాటివాఁడ వయిన నా
నిర్ణయము మాకు వలదో, పూర్ణప్రజ్ఞా! కవిప్రభుఁడ వెన్వాఁడనో.

ఉ. పావనమైన నీ చరణపంకజదివ్యపరాగయుక్తి గో
దావరితీరభూమి యనదాతచరిత్ర! పవిత్ర మయ్యెఁ గా
దే? వివరింప నింక మఱి యెచ్చటఁ బుట్టినవాఁడ వైన మా
కేవిధ మైనచింతయు, నొకింతయు, లేదుచుమీ మహాశయా!

ఆ. గీ. తణుకుపురిముగాని దటీవాటికగాని, కాక యొండొకండు గాని నీకు
జన్మభూమి యైన సకలాంధ్రమండల, మునను నిండియుంటి వనఘ! యిపుడు.

క. ఆదికవీంద్రుఁడ వని యా, మోదమ్మున నుండ నెగ్గుపుట్టెఁదొడఁగె నీ
యాదిత్వమునకు; దీన, విషాదము నీ కేలగలుగు సర్వజ్ఞమణీ!

గీ. [illegible]తావిశేషసామర్థ్యకలనఁ, గవులలో నెల్ల నీ వగ్రగణ్యుఁ డగుట
[illegible]డవు, నన్నచోడమహారాజునవ్వఁగాక!
నెప్పటికి నీవ యాదికవిశ్వర[illegible]

క. వ్యవహారభాష వాడిన, వ్యవహారజ్ఞుండవంట వ్యాకృతి నెల[illegible]
తవులం బెట్టితి? నది యి, ట్లవు నని నీ వప్పు డెఱుఁగవా? మహనీయా!

ఆ. వె. కాదు, కాదు, మఱపు గల్గె; నావ్యాకృతి, నీది కాదటంచు నిన్న మొన్నఁ
దేల్చెఁగాదె? యేమి? తెలతెల్లఁబోయెదు? కవివరేణ్య! తప్పు గలదె యిందు?

క. ఆరణ్యపర్వమీవే, పూరించితి వనెడు బుద్ధి పొడమిన నది నీ
గౌరవమునకే యగుఁ గద, నారాయణభట్ట మిత్ర! నవ్వెద వేలా?

ఉ. పాయనికూర్మి నీ వపుడు భారతసంహితయందు నీ సహా
ధ్యాయిని జేరుకొంటివి సహాయుఁడుగా; నది యెన్న కేము నా
రాయణభట్టు వాఙ్మయధురంధరతన్ విడఁదీయ భారతా
మ్నాయముఁ ద్రిప్పుచుంటి మని నవ్వకుమయ్య! మహాకవీశ్వరా!

ఆ. వె. అడుగఁ దగిన సంశయమ్ములు పెక్కుండఁ, జనితి వేమి? శబ్దశాసనుండ!
తలఁప నీదు దివ్యదర్శనలాభంబు, దొరకు టింక మాకు దుర్లభంబు.




# శారద

పో. రామచంద్ర రావు గారు, బి. ఏ.

## ౧. లేఖా గమనము

"శారద! శారద! ఏమిచేయుచుంటివే? ఎవరో పిలుచుచున్నారు చూడు" మని వంటకార్యమునం దప్రమత్తయై యున్న యశోద తన తనయ నుద్దేశించి పల్కుటయు శయనాగారమున నాంధ్రగ్రంథపఠనోత్సాహమగ్న మానసయగు శారద తన్మయత్వమునుండి మేల్కాంచి "అమ్మా! పిలిచితివా?" యని ప్రశ్న వేయుటయు, తల్లి పూర్వోక్త ప్రకారము పలుకరింప, శారద సింహద్వారమును తెఱచి చూచెను. అంత తపాలవాం డొక లేఖ "జానకిరావుగారి కీయుం డని" శారద కొసంగి వెడలిపోయెను.



శారద... మేల్కాంచి "అమ్మా! పిలిచితివా?" యని ప్రశ్న వేసెను.

ఆ కమ్మను కరమున దాల్చినంతనే యా కోమలహృదయమున విద్యుల్లతా ప్రసారమైన ట్లొకవిధమగు సలజడి కలిగెను. ఒడలు గగుర్పొడిచెను. స్వాంతమారాటపడజొచ్చెను. స్వేదబిందువు లాణిముత్తెపుసరములట్లు కపోలపాళి నలంకరించెను. ఈ యుత్తలపాటేలొకో?

శారద పదునైదేండ్ల బాలిక. హైందవ సాంప్రదాయానుసారము పదునైదేండ్లయన్నులమిన్నను బాలిక యని పేర్కొనుట యసంగతమైనను శారదనట్లు వాక్రువ్వవలసి వచ్చెను. శారద శారదాదేవి యపరావతారమనుట యతిశయోక్తి కానేరదు. ఆమె రూపజితశారద. వివిధసద్గుణవిశారద. సకలవిద్యావిశారద. ఆమె జనకుండు ధనవంతుండును, చిరయశోవిరాజితుండును నగు న్యాయవాది మధుసూదనరావు.

మధుసూదనరావు విద్యాధికుండు. చెన్నపురియం దుత్తమన్యాయవాది పరీక్షయం దుత్తీర్ణుండై, హేలాపురియందు న్యాయవాదవృత్తి నవలంబించి, యచిరకాలమున నధికధనము నార్జించి, పదివత్సరములైన ముగియక

మునుపే వృత్తి విరమించి, స్వగ్రామము జేరి యాలుబిడ్డలతో సుఖముగ జీవించుచుండెను. మధుసూదనరావుకు శారదకన్న మూడువత్సరము లధికవయస్సుగల జానకిరావను పుత్రుఁ డొకఁడుండెను. అతఁడిప్పుడు రాజమహేంద్రపురమున దొరతనమువారి యున్నత కళాశాలలో ప్రథమశాస్త్ర పరీక్షకు చదువుచుండెను. పట్టణావాసమునువీడి పల్లెయందున నివాసము నేర్పరచుకొనిన మధుసూదనరావు తనవృత్తియందువలెనే ప్రస్తుతమునను లుబ్ధత్వమున నపారయశము నార్జించెను. ఊరివారెల్ల రాతనిని గూర్చి "పిల్లికి బిచ్చమైననిడఁడు. తప్పదు గావున తనయొక్క కుమారుని విద్యాభ్యాసము నేలాగో జేయించుచున్నాఁడు గాని వారియింట నికవేరువిధమగు వ్యయమేలేదు. ఎంతధనమున్న నేమి?" యని యాడుకొనుచుందురు.

ధనవంతుని కుమార్తెయయ్యు, సుగుణఖనియయ్యు, రూపవతియయ్యు శారద నిజయౌవనమునంతయు నడవిగాచిన వెన్నెలట్లు వృథాచేయుచు, సోదరుఁడు సమీపమునలేని కొఱంతదీర్చుచు, పితృగృహమున నివసింపవలసివచ్చుట కేమికారణము?

౨. వైవాహికపు ముచ్చటలు

శారదకు పదునొకండు వత్సరములు గడచెను. తల్లి యీమెకు వైవాహికోచితప్రాయము సంఘటిల్లినది గావున వేగిరము తగుసంబంధము నారయుమని మధుసూదనుని తొందరపెట్ట సాగెను. ఇతర సంబంధమైనచో వరకట్నము లాంఛనములు మొదలగువానితో విశేషద్రవ్యము వెచ్చమగు నని తలంచి మధుసూదనరావు చిన్నతనము నుండియు శారదను తనమేనల్లుఁడగు సుబ్బారావున కిచ్చి పరిణయము గావింప దలంచియుండెను. దానికి తోడు సోదరియగు రుక్మిణమ్మకు శారదను గాంచినప్పటినుండియు నామెను తనకోడలిగఁ జేసికొనవలెననియు, ముందుగా చెప్పకున్నను తనయన్న తగిన వరకట్నము నేదోవిధముగ ముట్టచెప్పక మానఁడనియు నామె విశ్వసించియుండెను. చెల్లెలిమూలముననైన తనకార్యము కొనసాగించుకొన నెంచి యొక శుభదివసమున మధుసూదనుఁడు తనబావను సందర్శింప బందరుపట్టణమునకు బయలుదేరెను.

రామారావుగారు బందరు పురమున దొరతనమువారి కొలువులో నున్నాఁడు. ఆయన సుతుఁ డాపురియందలి కళాశాల ప్రథమశాస్త్ర పరీక్షకు జదువుచున్నాఁడు. సుబ్బారావు విద్యాభ్యాస మొనరించుచు తగిన యుక్తాయుక్తవివేచనజ్ఞాన మలవడుప్రాయముగలవాఁడై యుండినను మనోదార్ఢ్యమును, స్వశక్తియు లేనివాఁడు. తలిదండ్రులుగాని, మిత్రులుగాని యేదైన నచ్చునట్లు చెప్పినచో తదభిప్రాయమును స్వీకరించి యాత్మవిజ్ఞానము నణంచికొని, వ్యక్తిత్వమును చంపుకొని, మెలగుచుండు పిఱికివారిలో నొకఁడు. కాని వానికి కొంత పట్టుదలమాత్ర మొక్కొక్కప్పుడు గానవచ్చుచుండును. తన బావమఱఁది కుమార్తెను సుశీల కుద్వాహ మొనరించుటకు వచ్చినట్లు తెలిసియుండియు రామారావుగారి కీసంబంధ మిష్టములేకుండు

టచే నేమియు తెలియనివానివలె నటించుచుండెను. మధుసూదనరావు స్వయముగా నీ ప్రస్తావన తేనిచ్ఛగింపక మిత్రులగు నరసింహారావు మొదలగువారితో ముచ్చటించి, వారినెట్లయిన రామారావుగారిని సమాధాన పఱుపవలసినదని కోరెను.

మిత్రులు రామారావుగారికి నయవిధి బోధించి కావలసిన సంబంధము కావున నవశ్యము సమ్మతింపవలసినదని ప్రార్థించిరి. కాని కావలసినంతె కట్నము గైకొనుట కనకాశముండదని లోలోన శంకించి రామారావు వారిహితబోధలను త్రోసిపుచ్చి, వలదని నిరాకరించెను. రామారావుగారి విముఖత్వమున కాశ్చర్యపడుచు మధుసూదనుడు మఱునాడే బయలుదేరి స్వగ్రామము చేరెను.

శ్రావణము ప్రవేశించెను. ఒకదినమున నరసింహారావుగారు తొందరగా న్యాయస్థానమున కేగుచుండ దారిలో రామారావుగారెదురయ్యెను. మిత్రుడుగదా యని నరసింహారావుగారు కుశలప్రశ్నగావించెను. అంతట రామారావుగారు తమయింటి కానాటిరాత్రి విందుగుడువ రమ్మని మిత్రు నాహ్వానించెను.

"విందా? ఏల?"

"మాఅబ్బాయికి వివాహమైనది. నేడు గృహప్రవేశము"

"మీఅబ్బాయికా? ఏసంబంధము?"

"మేనరికమే"

"మేనరికమా? మొదట మేముచెప్పి నప్పుడు త్రోసివేసితిరే?"

"ఏదోలెండి. ఆడవాళ్ల బాధపడలేక సమ్మతింప వలసివచ్చినది"

"సరి" యని నరసింహారావుగారు వెడలిపోయెను.

క్రమక్రమముగా నరసింహారావుగారికి వైవాహికకాలమున జరుగుముచ్చటలు, లాంఛనాదులగూర్చి యవశ్యముగ తటస్థించు కయ్యములు మొదలగునవి తెలియవచ్చెను. ఆయన లోలోన నవ్వుకొనెను.

### ౩. అపూర్వపునస్సంధానము

శారదాంబకు యుక్తవయస్సు ప్రాప్తించెను. మధుసూదనరావుగారు వియ్యంకునకు శుభవార్త నెఱిగించుచు వీలయినంత త్వరలో పునస్సంధాన ప్రయత్నము లొనరింపవలసినదని వ్రాసెను. కొన్ని నెలలు గడచెను. రామారావుగారినుండి ప్రత్యుత్తరము రాలేదు. మధుసూదనరావు తమ పురోహితునకొక శుభముహూర్తనిశ్చయమును దెలుపుకమ్మ వ్రాసియిచ్చి, వియ్యాలవారి సమాధానమును గైకొనిరా నంపెను. పురోహితుని చేతనే తమకుమారునకు ప్రస్తుతము విద్యాభంగము జరుగునుగాన కార్యము నింతలో జరుపవీలులేదని రామారావుగారు కబురంపిరి. మరల కొన్నినెలలైన పిదప కబురులవలన కార్యములేదని మధుసూదనుడే స్వయముగా బయలుదేరి బృందావనమున కేగెను.

మధుసూదనరావొకయర్ధరాత్రమున విషణ్ణహృదయముతో స్వగృహముజేరెను. శారద నిద్రాపరవశమైయుండెను. యశోద తలుపుతెఱచినయంతనే "కార్యమా?పండా?" యని

ప్రశ్నించెను. విషాదముతో "కాయమే. మీ యల్లుఁడు తనకీభార్యవలదనుచున్నాఁడఁట. కొన్ని దినములలో నెట్లయిననమాధానపఱచెదనని మీయన్న గారు చెప్పినారు. మనప్రారబ్ధమిట్లున్నది. అమ్మాయి కీసంగతి తెలియనీయకుమని" లేనిపోనివి కల్పించిచెప్పి, మధుసూదనుఁడు మంచమెక్కెను. మనోవ్యాధికి మందు లేదందురు. మాసము గడువక మున్నే మనోవ్యాధిచేతనో, మరేకారణముననో మధుసూదనుఁడు మంచముపట్టి మండలదినములలో మానవలోకము వీడి చనెను.

భర్తృమరణదుఃఖమునకు లోగుచుండినను బాలిక బెంగపెట్టుకొనునేమో యను చింతచే, పాపము యశోద, పుట్టెడు దుఃఖమును లోన నణచుకొని, పట్టికి జామాత ప్రసంగమును తెలియనీయక కాలము గడుపుచుండెను.

ఒకవత్సరము జరిగిపోయెను. బాలికకు యుక్తవయసు ప్రాప్తించి రెండేండ్లయ్యెను. భర్తృసందర్శనము లభింపదయ్యెను. ఒకనాడు జానకిరావు శారదానహితుఁడై బందరు చేరెను. భర్తృగృహమున కేగుచుంటినని మనసున సంతసించుచుండినను, మాతను వీడి పోవవలసివచ్చినందులకు విచారించి శారద యెట్టులో కన్నీటితో గ్రామము విడచి పోయెను.

నాటిసాయంకాలమున వారు బందరు చేరిరి. "వయసు వచ్చిన కన్నెను తమయింట నుంచుకొనుట పాడిగాదని తీసికొని వచ్చితి" నని జానకిరావు రామారావుగారి కెఱింగించెను. రామారావుగారు మూకీభావము వహించి యూరకుండిరి. సుబ్బారావు వేదియోపనిమీద గ్రామాంతరమున కేగినట్లు తెలిసెను.

మఱునటి యుదయమున జానకిరావు చావడియందు వార్తాపత్రికను జూచుకొనుచుండెను. రామారావుగా రచటికేతెంచిరి. పెద్దలుగావున రామారావుగారు వచ్చినంతనే జానకిరావు లేచి నిలచెను. అంతవారి కీసంభాషణ నడచెను.

రా:—"తీసికొని వచ్చితివా?"

జా:—"ఏమిటి?"

రా:—"దస్తావేజులు"

జా:—"దస్తావేజులేమి?"

"ఓ తెలియదా? మీనాయన్న గారు క్రిందటి సంవత్సరము మిచటికి వచ్చినపుడు వరకట్నము క్రింద పదియకరముల భూమినిత్తుమని చెప్పియుండిరి. ఆసంగతి నీకుగాని మీ యమ్మకుగాని చెప్పియుండలేదా?"

జానకిరావాశ్చర్యపరవశుఁడయ్యెను. "ఆహా! ఎట్టికోఱిక కోరుచున్నాఁడు! వరకట్నము క్రింద తనయిల్లుగుల్ల జేసికొని ఉన్నదంతయు తనకిమ్మనియా వీనియుద్దేశము! రామారావుగారు, విశేషధనము సముపార్జించినవాఁడు, ఇంక నార్జించుచున్నవాఁడు, ఏకపుత్రవంతుఁడు, విశేషించి యాధ్యాత్మిక విద్యారహస్యముల నెఱింగిన తత్వజ్ఞానవేత్త, ఇట్టివిడ్డూరపు కోఱికలు కోరుటయా? తనకున్నది చాలకా, పరులకొంపను కూలవేయుటకు ప్రయత్నించుచుండుట? ఇహలోకమును వీడునపు

డీధనమునంతయు వెంటగొనిపోవునా?" యని విద్యావంతుఁడును, ఉదారస్వభావుఁడును నగు జానకిరావు వేయివిధముల తలపోసి, ప్రథమ విఘ్న మొనరించుట పాడిగాదని తలంచి ప్రశాంతచిత్తుఁడై "మాఅమ్మ నడిగి తెలియఁ జేసెద"నని చెప్పెను. అంతటితో రామా రావుగారు ప్రసంగమును ముగించి వెడలి పోయిరి.

మరునాఁడే జానకిరావు బయలుదేరిపోయి విచారముతో స్వగృహము జొచ్చెను.

శారదకు మామగారి గృహము కారా గృహసన్నిభ మయ్యెను. అగ్నిసాక్షిగ పరిణయమైన భర్త యామెతో నోరువిప్పి యొక నాఁడయిన భాషింపలేదు. అంతకన్నను మిన్నగ మేనమామయయ్యు మామగారి కామెజోలి యక్కఱలేదయ్యెను. మేనయత్త పాపమామెను చాకిరిచేయించుకొను నర్హమగు దాసినలె చూచుచుండెను. ఆమెకు కట్టుకొనుటకుమారు పుట్టముగూడ కఱవయ్యెను. ఆహా! ఒక ధనవంతునికుమార్తె, వేరొకధనవంతుని యొక పుత్రునిభార్య, వేఱువస్త్రమయినలేక గడుప వలసివచ్చెగదా!

కాని సుగుణాలవాలయగు శారద సహజ గాంభీర్యమును గోల్పోవక, ఎట్టులెట్టులో వీనినన్నిటిని సహించుకొనియుండెను. మూఁడు మాసములు గడచునప్పటికి ఆహారాదికమందు విముఖత్వముగలిగి, అత్తమామలయొక్కయు భర్తయొక్కయు నిరాదరణకులోనై నిరంతరము మనోవైకల్యమునకులోనై శారద యనారోగ్యవతియయ్యెను. క్రమక్రమముగ నామెకు జ్వర మంకురించెను. ఇదియే మిషగ గొని రామారావుగా రామెనుపుట్టినింటికిఁ ద్రోలివైచి, తలతడవి చూచుకొనెను.

౪. పరిత్యాగము

ఐదు, ఆరు, ఏడునెలలుగడచెను. శారద కత్తవారియింటనుండి పునరాహ్వానము రాలేదు. ఒకజాబైన లేదు. అందఱునామెపై నలుక వహించినవారైన తరుణమున నామె ప్రశంస నేరికి కానవలెను ?

ఆమెసహృదయమున శల్యసంస్థాపన మయ్యెను. అగ్నిసాక్షిగఁ జేపట్టి, హైందవ సాంప్రదాయము నొదలఁదాల్చు కులీనకుల సంభవుఁడై, విద్యావంతుఁడైన భర్త, తన్ని ట్లసహ్యముగఁజూడ నేటికని యామెకు నిరంతరము సందియము దోఁచుచుండెను. తన యందుగలలోటేమి? రూపమున కొఱంతయా? గుణములయందా? విద్యయందా? వీనియందు తనకేకొఱంతయుగానరాదే? పోనీ. భర్తపర నారీలోలుఁడై తన నెడ విముఖుఁడైయుండెనా? అట్లనుకొనుట కాతనియందట్టి లక్షణములు గానరావే? మఱి కతమేమైయుండును? వర కట్నమై యుండునా? అదియైనచో తానేమి సేయగలదు? తనదగ్గర నేమున్నది? తండ్రి సజీవుఁడైయుండినచో నిజాత్మజాశ్రేయోభి లాషచే నేదయిన ముడుపు ముట్టఁజెప్పియుం డెడు వాఁడేమో? కాని అతఁడు మరణించి నాఁడు. ఇకసోదరుఁడు 'దొంగలుపడిన యాఱు నెలలకన్నట్లు' సర్వము గడచినవెనుక తనకై ద్రవ్యము వెచ్చింప నిచ్చగించునా? ఇయ్య కొనినను తల్లి సమ్మతించునా? సమ్మతించి

నను వారికుటుంబపోషణార్థము విత్త మక్కఱ లేదా ? అదియుగాక యిట్లొనరింపుమని తా నెట్లుకోరగలదు?

అదియుగాక తనమామగారి కట్టితలంపే యున్నయెడల వివాహసమయమున వరక ట్నము నిర్ణయించుకొని నిష్కర్షగా వసూలు చేసికొనియున్నచో తన కిట్టిపాట్లులేకుండెడివి గదా? ఇపు డసహాయ, అబల, అన్యులపోష ణపై నాధారపడియున్నది. అట్టి బాలిక, యేమి సేయగలదు? ఇట్టి చింతనలతో నామెమనసు సంక్షోభించుచుండెను. ఈమనోవ్యాధినడంచు కొనుటకు మందు సద్గ్రంథకాలక్షేపమని తలంచి యీపనియందు నిమగ్నయై యామె కాలము గడపుకొనుచుండెను.

ప్రథమోల్లాసమునందు పేర్కొనబడిన దినమున లేఖయొకటి వచ్చెను. ఆమె కొకవిధ మగు అశరీరవాణి "ఈలేఖ నీశ్వశురగృహ మునుండి వచ్చిన"దని చాటుచున్నట్లుండెను. ఆలోచనాపరంపర లొక్కుమ్మడి విజృం భించి యామెహృదయసీమను కలంచివైచెను. దేహము గాలితాకుడున చలించు తీగచందం బున కంపించెను. పదములు తొట్రిలెను. ఆలేఖయందు తన భావిఫలమంతయు నిమిడి యున్నదని యామె తలంచెను. ఆనందనౌకా విహారమో, అనంతదుఃఖవారిధీనిమజ్జనమో? తనగతి యెట్లున్నదో ? కమ్మను దీసి చూతునా యని యామె తలపోసెను. అది యధర్మము. పరుల జాబులు చూ చుట పాపహేతువు. అదియుగాక అది అన్య భావలో వ్రాయబడియుండినచో తన కేమి లాభము? ఒకవేళ అది తన వదిన భర్తకు వ్రాసిన ప్రణయలేఖయై యున్నచో తన ప్రస్తుతావస్థయందట్టిదానిని గాంచుట గోరు చుట్టుపై రోకటిపోటు చందమున తన బాధ నినుమడింపజేయును కదా! ఈరీతిని తర్క వితర్కములతో నామె లోనికాలేఖను గొని పోయి, తల్లిసమీపమున బడవైచి, పర్యంక మునుజేరి, పరిపరివిధముల తలపోయసాగెను.

జానకి రా వింటికివచ్చెను. తల్లి వానికా లేఖ నొసంగెను. అతఁడు వ్రాతను జూచి పోల్చుకొని తనగదిలోనికేగి యిట్లు చదువు కొనెను:—

"జానకిరావుగారికి"

నేను తమసోదరి నిక నెన్నటికిని పరిగ్ర హింపజాలను. వైవాహికసమయమున వలదని వారించినను వినక మాయమ్మ యీసంబం ధము నిశ్చయించి నాకుచేసినది. బలిమిని చే పట్టిన భామపై మమత యుండనేరదు. కావున నామె ముఖము నేనెన్నటికిని చూడజాలను. ఆమె ప్రశంస నికముందు నాచెవుల బడనీయ కుందురుగాక యని ప్రార్థించుచున్నాను.

సుబ్బారావు"

ఈలేఖను చదివినంతనే జానకిరావున కాగ్రహ, విషాద, సంభ్రమము లొక్కమా రుదయించెను. సుబ్బారావు ద్రోహబుద్ధికై కోపమును, వాని మానసిక పరిణామమ్మున కచ్చె రువును, తనసోదరిగతిని గూర్చి ఖేదమును మనమున చెలరేగెను. "ఔరా! దురాత్ము డెంతటిపనికి సమకట్టినాఁడు! పసిఁడిబొమ్మ వంటి బాలికామతల్లిని పాపమనిఘయెన తలంపక

పరిత్యజించునుగా! ఇందులకు నేనేమి చేయవలయును? మనుష్యమాత్రుఁడు వేరొకని నేమి సేయగలఁడు? వీనితో బాహాబాహిని నాకసదీర పోరాడి నాచెలియలి కించుక యుపశాంతి గలిగించిన బాగుండును. కాని అది అధర్మము. ఏమి సేయుదును? ఆమెకీ వృత్తాంతము తెలుపకుండ ఈలేఖను భద్రపరచి, మూకీభావము వహించుటయే శ్రేయస్కరము." అని తలంచి జానకిరావు చిత్తమును శాంతపరచికొని, యుత్తలపాటు నడంచికొని, గాంభీర్యము వహించి యూరకుండెను.

ఇఁక నిట శారదమానసికావస్థ యెట్లున్నది? ఆమె కేలొకో తనయన్నకు వచ్చిన కమ్మ తన్నుగూర్చియై యుండునని తోచుచుండెను. రేయింబవ ళ్లామె కిదియేచింత. అనుదిన మామె దుస్స్వప్నముల గాంచుచుండెను. తానుభర్తచే పరిత్యజింపబడి నట్లును, భర్తపాదములపై వ్రాలి పరిగ్రహింపవలసినదని బ్రతిమాలినట్లును, ప్రాణనాథుఁ డామెతో భాషింపనైన భాషింపక పదములతో తన్ని వైచినట్లును, ఆమె కలగాంచెను. ఆమె కెట్లయిన నాలేఖ సంపాదించి చదువవలెనని కోర్కె యుదయించెను. కాని యీకార్య మధర్మమని యామెకొన్ని దినములోపికపట్టెను. హృదయ మామెను పరిపరివిధముల బాధింపజొచ్చెను.

తుద కొకనాడు సోదరుఁడు కార్యాంతరమున సమీప గ్రామమున కరిగినప్పుడు, శారద మెలమెల్లగ వానిగదియందు జొచ్చి, ప్రమాదవశమున శయ్యపై బడియుండిన తాళములగుత్తిని సంగ్రహించి, ఆలేఖను గ్రహించుటకై జానకిరావు పెట్టెను తెరిచెను. అందు వెదకుటయు లేఖ యామెకు దృగ్గోచరమయ్యెను. దానిని తీసి ప్రథమ వాక్యము చదువునప్పటి కామెకన్నులు పచ్చనయ్యెను. శిరోవేదన యుదయించెను. కాళ్లు తడబడెను. గదియంతయు తిరుగుచున్నట్లు తోచెను. ఉత్తరక్షణమున నామె మూర్ఛాగ్రస్తయై నేలవ్రాలెను.

### ౫. పాపఫలము

సుబ్బారావు పత్నిని విడనాడినప్పటి నుండియు సిరి వానిని విడిచిపెట్టెను. ప్రథమము శాస్త్రిగారి కుమార్తెను పెండ్లియాడుటకు పట్టుదలతో పాటుపడి యెన్ని విధముల ప్రయత్నించినను ఫలము లేకపోయెను. ఏడెనిమిది దండయాత్రలు సాగించి, విసిగి వేసారి, ఉద్యోగమును విరమించి, బొంబాయినగరమున వాణిజ్యవిద్య నభ్యసింపనేగెను. అచట నాతనికి జీవనము దుర్భరమయ్యెను. స్వగ్రామశీతోష్ణస్థితులకును, బొంబాయినగర శీతోష్ణస్థితులకును చాల వ్యత్యాసము గాన్పించెను. దానికితోడు బొంబాయిలో శర్కరామిశ్రితాహార సంచయమే కాని యుప్పుపులుసులు మందునకైనఁ గానరావయ్యెను. వానికాయాహారము రుచింపలేదు. క్రమక్రమముగా సుబ్బారావున కగ్నిమాంద్య ముదయించెను. అజీర్ణవ్యాధి పీడితునకు స్వప్నములు విశేషముగా వచ్చుచుండును. సుబ్బారావునకు కట్టెదశ ప్రాప్తించెను. అందాతనిసతీమణి యాత్మహత్య గావించుకొనినట్లును శవాకృతి తన్ను నిరంతరమును వేధించుచుండినట్లును వానికి గనవచ్చుచుండెను.

దానిచే నాతనికి నిద్దురయనిన నపరిమితమగు భీతి యుదయించెను. నిద్రలేమిని దేహమస్వస్థతగాంచెను. క్రమక్రమముగా నాతనికి మతి స్థైర్య మించుక చలించెనని వానిచేష్టలు గమనించుచుండిన సహపాఠులు గుర్తించిరి.

కొలదిదినముల కాతనికి బుద్ధి చలించి ...ను. "శారదా!" యను త్ర్యక్షరీ మంత్ర...ం బొనర్చుచు నతఁడు వీథులఁబడి తిరుగఁజ...చ్చెను. ఈవార్త మిత్రులు తంతిమూ...మున రామారావుగారికి తెలియఁజేసిరి. రామారావుగారును దొరతనమువారి ...లువులోనుండుటచే పైయధికారుల సె...లవులేక పోఁవలు లేదు గావున నాడే సెల...వుదరఖాస్తు నధికారుల కంపి, భార్య కీ...వార్త దెలిపి, వీలగునంత శీఘ్రముగ బ...ంబయి కేగ సంసిద్ధులగుచుండిరి.

అట బొంబయినగరమున సుబ్బారావున్మాదుఁడై సంచరించుచు నొకదినమున సాయంకాలము సముద్రతీరమున కేగెను. భానుఁడపరాద్రి గ్రుంకెను. తారకాగణపరివేష్టితుఁడగు రేరాజు తొంగిచూపుల నుర్విపై బఱపఁజొచ్చెను. శీతకరుని కిరణజాలము లుదధిజలంబుల ప్రతిఫలించి వింతసొబగు లీనుచుండెను. పైకెగయు తుంపరలు ఆణిముత్తెములట్లు మెఱయుచుండెను. శారదరాత్రి నిట్టిదృశ్యమెవనిహృదయమును చలింపఁజేయకుండును? ఉన్మత్తుఁడగు సుబ్బారావువిషయమున నిఁకఁ జెప్పనేల?. వాని హృదయము ప్రఫుల్లమయ్యెను. ఆతని కాచంద్రబింబమధ్యమున సహజాలంకృత స్వరూపిణియగు, శారదాదేవి యపరావతారమగు శారద



శారద సుబ్బారావును గాంచి చిరునగ వొలయించుచు చేసైగ చేయుచున్నది.

వికసితవదనసరోజము నాతనివంకకు ద్రిప్పి, కరపల్లవములఁజాచి, తన్ను జీరుచుండినట్లు దోచెను. వానిహృదయ మానందవారిధిని దేలిపోయెను. అతఁడామె నెట్లయిన సమీపింప నెంచి, సాహసమున నీటను దుమికి, యీదుకొనుచుపోయెను. పోయిన కొలందిని పూర్ణచంద్రబింబము వానికి మృగతృష్ణవోలె దవ్వగుచుండెను. శారదయు వానిని గాంచి చిరునగ వొలయించుచు, చేసైగ జేయుచు, బిలచుచున్నట్లుండెను. దగ్గఱజేరుచుంటి నను కొనినకొలందిని, మరల నించుకదూరమున కేగి

ఈరీతినే తన్నాహ్వానించుచుండినట్లు వానికితో చుచుండెను. అతఁడట్లే యోర్పుసహించి శక్తి వంచనలేకుండ యీదుకొని పోవుచుండెను. కొంతవడి కాతనిదేహ మలసిపోయెను. అవయవములు వివశము లయ్యెను. ఆయాస మెక్కుడయ్యెను. కాళ్లాడవయ్యెను. చేతులు గుడ్డపేలికలవలె వ్రేలిపోవుచుండెను. చిట్టచివర కాతఁడు చేయునదిలేక "శారదా! శారదా!" యనియఱచుచు నగాధమున మున్గిపోయెను.

రామారావుగారు ఎంబడియుచేరిరి. కుమారునిజాడ లెఱఁగించువారు లేరైరి. ఆయన రక్షకభటసాహాయ్యమున పట్టణమునంతయు వెదకించెనుగాని కార్యము లేకపోయెను. సుతునిజాడ తెలియక తలిదండ్రులు విచారభార వినమ్రులై మానసగరసమున మూడు దినము లుండిరి. మూడవదినము సాయంకాలమున సముద్రపుటొడ్డున సగము భాగము సముద్రపుచేపలచే తినివేయబడిన యొక మొండెము తేలెను. దానికి కొన్ని గుడ్డపేలికలు వ్రేలాడుచుండెను. అందు విస్ఫుటాక్షరములతో "సు. రా." అని వ్రాయబడి యుండెను. జాలరు లీశవమును బైటకీడ్చి యిసుకమీాద పడవైచిరి. పలువు రచటగుమిగూడిరి. వారిలో కుమారవియోగానల దందహ్యమానమానసుఁడగు రామారావుగారొకఁడు. ఆయన యావస్త్రములను గాంచినంతనే తమకుమారునివని గ్రహించి, తదుపరి పైనున్న యక్షరములచే స్థిరపరచుకొని, రక్షకభటుల కాసంగతి నెఱింగించిరి. పంచాయితీ జరిగెను. అందు పంచాయితీదార్లు, ఉన్మత్తుఁడగు సుబ్బారావ విద్యార్థి విధివశమున జలములఁబడి మునిగిపోయి మృతినొందెనని తీర్మానించిరి. సుతునకంత్యక్రియలు గావించి బిట్టువగతో రామారావుగారు బృందావనము జేరి, తమసోదరియగు యశోదమ్మ కీవార్త దెలియజేసిరి.

## ౬. చరమదశ

శారద మూర్ఛదెలియునప్పటికి రెండు దినము లయ్యెను. ఆమెకు శిరోవేదన యుదయించెను. సుప్రసిద్ధాంగ్లాయుర్వేద వైద్యశిఖామణులామెకు మేధోజ్వరము తగిలెననియు, ప్రాణభయము కూడ కలుగవచ్చుననియు వచించిరి. క్రమక్రమముగా జ్వర మెక్కుడయ్యెను. వారము దినములు గడచెను. దొమ్మిదవ దివసమున జ్వరము మట్టుటయో లేక హెచ్చగుటయో స్థిరపడునని భిషగ్వరులు వచించిరి. జానకిరావును ద్రవ్యమునకు లక్ష్యముసేయక తగినన్ని యుపచారము లొనరించుచుండెను.

తొమ్మిదవ దివసము వచ్చెను. నాఁడు జ్వరతీవ్రత యించుక తగ్గెను. ఆమె యిఁక బ్రదుకవచ్చునని వైద్యు లభిప్రాయపడిరి. కాని పాపము వారు జ్యోతిష్కులుకారు. కావున యిదమిత్థమని పూర్తిగా నిర్ణయింప లేరయిరి. శారద కొంతవడికి కనులు దెరచెను. ఎదురుగా జానకిరావు గాన్పించెను. శారద చేతులను జాచి దీనముగ 'అన్నా' యని పిలచెను. జానకిరావును విషాదముచే శిరమువంచి యామెను సమీపించెను.

శారద—"అన్నా క్షమింతువా?"

జానకి—"సోదరీ! నీవేమితప్పొనర్చితివి?"

శా—"లేఖచూచుట"

జా:—"సోదరీ! అది నీతప్పు కాదు, నాతప్పే. నీవృత్తాంతమై యుండినను, నీకు తెలిసినచో చింతింతువని, చెప్పక దాచితిని. కాని విధిప్రాతికూల్యమున నీ వది కనిపెట్టితివి. నాడే చూపి యుండినచో నింత చేటు మూడకుండెడిదేమో" అని జానకిరావు కనుల నీరునుంచి, [illegible] పెకర



మును తనకరమున గీలించి "శారదా! నన్ను క్షమింపు" మనియెను. శారద నిట్టూర్పు విడిచి అన్నా! "నాహృదయభారము కొంతతగ్గిన" దని పల్కి "ఆసంగతి యేమైన" దని ప్రశ్నించెను.

"ఏసంగతి?"

"మీ బావసంగతి"

"సోదరీ! చెప్పజాల" నని కన్నీరుగార్చెను జానకిరావు.

"అన్నా! ఏమిజరిగినదో చెప్పుము. ఏమయినను నాకింక చింత లేదు. నాజీవితకాలము కొలదిక్షణములలో ముగియనున్నది. నాప్రారబ్ధ మిట్లున్నది. పురాకృతజన్మ ఫలమిట్లున్నది కాబోలును. అన్నా! ఇంకను సందియ మెందులకు?"

"చెప్పుమనెదవా?

"చెప్పుము"

"మరణించినాఁడు"

"ధన్యుఁడు, అన్నా! నాకీ వ్యాధి గలుగకుండినచో వానిని క్షమించితినని తెలుపఁగోరియుంటిని. మృత్యువు సమీపించుచున్నదని నాకు తెలియును. కాని అదియు నాలస్యమయ్యెను. నాకన్న నించుకముందాయెను కాని పరలోకమునందైన నాయననుగలిసికొని సుఖించెదకాక. సోదరా! సెలవు. విశేషించి చెప్పజాలను. అపుడే నా కాయాస మెక్కుడగుచున్నది. అమ్మ నొకసారి పంపుము" అని యామె తలగడపై శిరమువాల్చెను. జానకిరావు దుఃఖమునాపుకొనలేకపోయెను. ఈదృశ్యము చూడజాలక గదినివీడి వెలుపలికేతెంచి, తల్లిని లోనికంపి, తనశయ్యపై బడి పిల్లవానివలె నేడువజొచ్చెను.

శారద, యశోదను గాంచి ముదమార కౌగలించి ముద్దాడి ఆయాస మెక్కుడగుటచే నామెచేతులలో వ్రాలెను.

శారదాంబ యస్తమించెను. ఆమెపతియు గతించెను. శారద యశశ్చంద్రికలును సుబ్బారాయనియపకీ[illegible] భూవలయమున చిరస్మరణీయములై [illegible]ని కథకునకును, పాఠకులకును గలసందియ[illegible]. శారదాంబను పరిత్యజించుట కేమి[illegible] వైవాహికజీవన విముఖతయా? ధనాల[illegible] మరేది?




గీతిక


కవికొండల వేంకటరావు గారు, బి. ఏ., బి. ఎల్.


౧

ఇవియన్ని మన కేల?
అదిగో! చూడుము గీత
ఆకాశమున — లేత.

ఈత చెట్టా వల
తాటి చెట్టా వల
'సరుగు' చెట్టా వల
సద్దు లేమిని గీత
మంటి మింటి నడుమ
మనికిc దేల్చెడు గీత
ఇవియన్ని మన కేల?
అదిగో! చూడుము గీత.

౨

ఆగీత తంబురా
తీగc జేసినపుడు
సంగీత మనిపించు;
ఆగీత మనచూపు
లదికి చూచినపుడు
సంగాత మనిపించు;
ఆగీత మనమనసు
లరసి మఱచినపుడు
సంకేత మనిపించు;
ఇవియన్ని మన కేల?
అదిగో! చూడుము గీత
ఆకాశమున — లేత.

౩

"చేలో" నీగొంతెత్తు
"జనదేవి" వినుపాట
చెలిమి ఆగీతలో
చెలగించు మఱుమ్రోత;
రేవులో బిందుంచి
బావి లో త్రిప్పపూట
కలిమి ఆగీతలో
కనుపించు నెఱవ్రాత;
పొలిమేర పుడుకేరి
చలిమంట కనుమాట
బలిమి ఆగీతలో
బమగొల్పు వఱువాత;
ఇవియన్ని మన కేల?
అదిగో! చూడుము గీత
ఆకాశమున — లేత.

# మూఁడవ విష్ణువర్ధనుని గణపవరము తామ్రశాసనము*

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

ఈ తామ్రశాసనము కొద్దినెలల క్రితము క్రొత్తగా కృష్ణా మండలములోని భీమవరము తాలూకా గణపవరము గ్రామమున నొకదిబ్బ త్రవ్వుచుండగా బయల్పడినదఁట. దేశోద్ధారక శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు మహాత్మాగాంధి పూజానిధివసూలు చేయు నిమిత్తము భీమవరము తాలూకా గ్రామములలో కడచిన మేనెలలో పర్యటనము చేయుచుండినప్పుడు గణపవర నివాసులు ఈశాసనమును వారికిచ్చిరి. ప్రకటనార్థము పంతులుగారు దానిని నాకొసఁగిరి.

ఆకారాదికములు.

శాసనమునం గల రాగిరేకులు మూఁడు. ఒక్కొక్కరేకు పొడవు ౭ అంగుళములు; వెడల్పు ౨.౫ అంగుళములు. రేకులు కుడి యెడమవైపులఁ గొంచెము వెడల్పుగను, నడిమి భాగమునఁ గొంచెము సన్నముగను ఉన్నవి. రేకుల యెడమభాగమున అంచులకు ముప్పాతిక అంగుళముదూరమున రంధ్రములు కలవు. ఈ రంధ్రములగుండ పోనిచ్చిన యొక రాగికడియము మూలమున ఈ మూఁడు రేకులును బంధింపఁబడియున్నవి. కడియముయొక్క వ్యాసము ౨ అంగుళములు. ఈ కడియము రాజముద్రికలో నతికింపఁబడియుండవలెను; కాని మన శాసనమున ఆముద్రిక లేదు. ఊడిపోయియుండునని నా నమ్మకము. ముద్రిక యూడిపోవుటవలన కడియపుఁగొనలను తాపటము చేసిన అతుకును మనము గాంచవచ్చును.

అక్షరస్వరూపము : భాష.

శాసనమునందలి లిపి తెలుఁగు-కన్నడ లిపి. అక్షరములు సర్వలోకాశ్రయుని 'చందలూరు' శాసనము,[1] అయిదవవిష్ణువర్ధనునిదనఁబడు 'అహదనకరము' శాసనము[2]లందలి యక్షరములను బోలియున్నవి. కాని యీ సర్వలోకాశ్రయుని కాలమునగాని, అతనికుమారుఁడగు మనయీశాసనమునందలిదాతయైన విష్ణువర్ధనుని కాలమునఁగాని స్థిరపడిన ఒక వ్రాఁతకత్తు కనఁబడదు. అక్షరములకు ఒకతీరు, ఒక పొందిక లేకపోవుటచేత దస్తూరీ కుదరనివాని వ్రాఁతవలెనుండును. వ్రాఁతతప్పులు చాలఁగలవు

* ఈశాసనమును ప్రకటించు సందర్భమున తమకార్యస్థానముననే పరిచూచుకొనుటకై యితర చాళుక్య శాసన ప్రతిబింబములను, ప్రతులను దయతో నొసంగిన చెన్నపురి గవర్నమెంటు శాసనశాఖవారికిని, చెన్నపురి వస్తుప్రదర్శనశాల [Museum] లో భద్రపఱుపఁబడిన శాసనములను పరిచూచుకొనుటకై అడిగినప్పుడెల్ల దయతో నొసంగుచువచ్చిన చెన్నపురి వస్తుప్రదర్శనశాల ఆర్కియలాజికల్ అసిస్టెంటుగా నగు శ్రీమాన్ ఆర్. శ్రీనివాసరాఘవ అయ్యంగారికిని [M. A.] కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

1. Ep Ind. Vol. VIII, P. 236.

2. Ind. Ant. Vol. XIII, P. 185.

ద్రావిడ 'ళ' కారము ౬ వ పంక్తిలో 'చళుక్యానాం' అన్నచోటను, ౯ వ పంక్తిలో °యుగళః, తులాధృత [క*] ళధౌత °అన్నచోట్లను గానవచ్చుచున్నది. ఉపధ్మానీయము °పాలనప్పరమ° అన్నచోట ౧౩ వ పంక్తిలోను, °శర్మ్మణఃపౌత్రాయ, °శర్మ్మణఃపుత్రాయ అన్నచోట్ల ౧౬ వ పంక్తిలోను గనఁబడుచున్నది. ఇది 'బండిఱ'గుర్తుమూలమునఁ జూపఁబడినది. జిహ్వామూలీయము ౨౦ వ పంక్తిలో 'యఃకరోతి' అన్నచోటగలదు. రేఫమునకుఁ బిదపవచ్చు ప్రతియక్షరము ద్విత్వముం జెందినది. ఉదా: °రిష్ణోర్వ్విర్వ్విధ°, విష్ణువర్ద్ధన°, సూరిశర్మ్మణో° మొదలైనవి.

భాష సంస్కృతము. కడపటి 'బహుభిర్వ్వసుధాదత్తా' యను మామూలు శ్లోకములు రెండుతక్క మిగిలిన శాసనమంతయు గద్యాత్మకము.

శాసనవిషయము.

సకలభువనములచేతను సంస్తుతింపఁబడు మానవ్యసగోత్రముకలవారును, హారితిపుత్రులును, కౌశికీవరప్రసాదమున సంపాదింపఁబడిన రాజ్యముకలవారును మాతృగణములచేతఁ బరిపాలింపఁబడువారును, స్వామియైన మహాసేనునిపాదములను ధ్యానించువారును. భగవన్నారాయణుని ప్రసాదమున సంపాదింపఁబడిన శ్రేష్ఠమైన వరాహలాంఛనము యొక్క దర్శనక్షణమునందె వశీకృతమగు శత్రుమండలి కలవారును, అశ్వమేధములుచేసి అవభృథస్నానముచేయుటచేత పవిత్రమైన శరీరములు కలవారును అగుచళుక్యులకులము నలంకరించువాఁడును, వివిధయుద్ధములందు సంపాదించిన యశశ్శ్రీకలవాఁడును అయిన శ్రీవిష్ణువర్ధన మహారాజుయొక్క పౌత్రుఁడును, శత్రురాజుల కిరీటములందున్న మణికిరణకాంతులచేఁ బ్రకాశించు పాదద్వంద్వము కలవాఁడును, పెక్కుమాఱులు తులాభారము తూఁగిన వెండిబంగారములను దానముచేయుటచేతఁ బవిత్రమైన శరీరముకలవాఁడును, సమస్తభువనాశ్రయ శ్రీవిజయాది [త్య] శ్రీమంగియువరాజుయొక్క కుమారుఁడును, తండ్రియొక్కగుణశక్తిసంపదను మించినవాఁడును, ప్రజలను జక్కఁగాఁ బాలించుటయం దాసక్తికలవాఁడును, పరమబ్రహ్మణ్యుఁడును, తల్లిదండ్రులపాదములను ధ్యానించువాఁడును, సమస్త భువనాశ్రయుండును అగు విష్ణువర్ధన మహారాజాధిరాజ పరమేశ్వర భట్టారకుఁడు పద్మిన్యగ్రహారవాస్తవ్యుఁడును, పాతాఞ్జలసగోత్రుఁడును, అథర్వవేదమునంతను దెలిసినవాఁడును సూరిశర్మపౌత్రుఁడును, నన్నిశర్మపుత్రుఁడును అగు సూరిశర్మకు సూర్యగ్రహణ నిమిత్తమున అత్తిలి విషయమునందలి అరియోడు గ్రామమున నివేశనస్థలముతోఁ బాటు రెండునివర్తనములభూమి దానముచేసెను.

శాసనయోగ్యత.

ఈశాసనముతూర్పుచాళుక్యులలోనివాఁడైన సర్వలోకాశ్రయమహారాజను నామాంతరముగల మంగి యువరాజుయొక్క కుమారుఁడగు విష్ణువర్ధన మహారాజుది. ఈవిష్ణువర్ధనునికిఁ బూర్వము తూర్పుచాళుక్యులలో నీ నామము ధరించినవార లిరువురుండుటచేత నీతనిని మూఁ

'ం' ఈ గుర్తుగలపదములు సంపూర్ణములు కావు.

డవవిష్ణువర్ధనుఁడందురు. తూర్పు చాళుక్యరాజులలో నీతఁడెనిమిదవరాజు. ఇతనితాతయే రెండవ విష్ణువర్ధనుఁడు. శాసనమునఁ దెలుపఁబడిన యీతని వంశావతారక్రమ మిది.

(రెండవ) విష్ణువర్ధనుఁడు.
|
(మొదటి) మంగియువరాజు.
|
(మూఁడవ) విష్ణువర్ధనుఁడు.

తూర్పుచాళుక్యులకు కుబ్జ విష్ణువర్ధనుఁడు మూలపురుషుఁడు. ఈతఁడే ఆంధ్రదేశమునఁ జాళుక్యరాజ్యము స్థాపించినవాఁడు. ఇతని నుండి యీమూఁడవ విష్ణువర్ధనుని వఱకు పూర్వ చాళుక్యశాసనముల ననుసరించి వంశానుక్రమ మీరీతిగ నున్నది.

మంగియువరాజు కుమారుఁడైన మూఁడవ విష్ణువర్ధనుని తామ్రశాసనము లింతవఱకు నాలుగు మాత్రమే దొరకినవి. అవి యేవన ౧. పసపుంబల్లు శాసనము[1] ౨. మావిండిపల్లి శాసనము[2] 3. ముసినికుండశాసనము[3] ౪. జలమూరుశాసనము[4]. ఈ గణపవరపుశాసనముతో నీతనివి అయిదుశాసనములగుచున్నవి. వీటిలో ముసినికుండశాసనము బీజవాడ (బెజవాడ) లోని 'నడుంబివసతి' అను జైనుల యాలయమునకుఁ జేసినదానమును దెలుపుచున్నది.[5] మిగిలినవి బ్రాహ్మణులకుఁజేసిన దానధర్మములను జేర్కొనుచున్నవి. వీటిననుసరించి యీమూఁడవ విష్ణువర్ధనుని కాలమున నాంధ్రదేశమున బ్రాహ్మణ

1. కుబ్జ విష్ణువర్ధనుఁడు (క్రీ. శ. ౬౧౬-౬౩౪) †
   - 2. జయసింహావల్లభుఁడు. (౬౩౪—౬౬౭)
   - 3. ఇంద్రభట్టారకుఁడు. (౬౬౭)
     - * 4. విష్ణువర్ధనుఁడు. (క్రీ.శ. ౬౬౭-౬౭౬)
       - * 5. మంగియువరాజు (క్రీ. శ. ౬౭౬-౭౦౧)
         - 6. (రెండవ) జయసింహావల్లభుఁడు. (క్రీ. శ. ౭౦౧-౭౧౪)
         - * 8. (మూఁడవ) విష్ణువర్ధనుఁడు. (క్రీ. శ. ౭౧౪-౭౫౧)
         - 7. కొక్కిలి. (క్రీ. శ. ౭౧౪)

† ఈసంవత్సరములు ప్రథమచాళుక్య భీముని శాసనము ననుసరించి వేయఁబడినవి. చాళుక్యశాసనము లన్నిటిలో చాళుక్యరాజ పట్టాభిషేక కాలమును దెలిపిన మొదటి శాసనము ఈప్రథమ చాళుక్య భీమునిదే. డాక్టరు ఫ్లీటుగారిచ్చిన కాలపరిమితికంటె ఈమొదటి చాళుక్యభీముని శాసనమునుబట్టి కైకొనిన కాలపరిమితి అత్యంత విశ్వాస పాత్రమైనదని నాయభిప్రాయము. * ఈపువ్వుగుర్తుగల పేళ్లు మనశాసనమునం జేర్కొనంబడినవి.

1. C. P. No 9 of 1913-1914 2. C. P. No 3 of 1914-1915. 3. C. P. No 9 of 1916-1917.
4. C. P. No 10 of 1919-1920 5. Ep. Rep. 1917, Para. 21.

గనిపింపవు. ఏలయన 'సర్వలోకాశ్రయ' బిరుదమున ననుసరించి 'అహాదనకర' శాసనము అయిదవవిష్ణువర్ధనుని దగునని నిర్ణయింపఁబడినది. ఈశాసనము అయిదవవిష్ణువర్ధనునిదే యని నొక్కివక్కాణించుట కం దాధారమేదియు లేనప్పుడు ఈ సర్వలోకాశ్రయ బిరుద మాతనిదే యని నిర్ణయించుట కెట్లువీలగునో తెలియరాదు. అదియటుండ ప్రత్యేకమొక్క బిరుదములననుసరించి యీశాసనమువీరిది: యీశాసనమువారిది అని స్పష్టముగ నిర్వచించుటకు బలము చాలదు. చాళుక్యరాజులలో ఒకేబిరుదమును ధరించినవారనుగలరు. దానికి తార్కాణముగ నీ 'సర్వలోకాశ్రయ' బిరుదధారణమునే చూపవచ్చును. చాళుక్యశాసనములలో నీబిరుదు రెండవ విష్ణువర్ధనునికి[1], మంగియువరాజునకు[2], మూఁడవ విష్ణువర్ధనునికి[3]గూడ వాడఁబడినది. అందువలన దానశాసనాధిపతిని నిర్ణయించుటలోఁ గేవల మొక్క బిరుదము నాధారముగఁ దీసికొనినఁజాలదు. ఇఁక నక్షరములపోలికనుబట్టి కాలనిర్ణయము చేయుదమన్ననదికూడఁజాలఁ గష్టసాధ్యము. ఒక సిద్ధాంతమును స్థాపించుటలో నితరాధారము లేవైననున్నప్పుడే బిరుదముల సామ్యమును, లిపిసామ్యమును వాటికి బలము నొసంగఁగలవుగాని ప్రత్యేకముగఁ గైకొనినచో నవి దుర్బలాధారములని యంగీకరింపకతప్పదు. ప్రత్యేకము బిరుదములమూలమున నితఁడు 'ఫలాన' రాజని యెట్లు నిర్ధారణచేయలేమో అట్లే కేవలము లిపిని ఆధారముగఁ గైకొనికూడ శాసనము 'ఫలాన' కాలమునాఁటిదని నిర్ధారణ చేయలేము. ఏలయన ఒకేకాలమున రెండుమూఁడు విధములైన వ్రాఁతకత్తె లుండవచ్చును. ఈ సందర్భమున సుప్రసిద్ధశాసనపరిశోధకులగు శ్రీయుత కే. పి. జయస్వాలుగారు వ్రాసిన విషయము గమనింపఁదగినది. కడచిన అక్టోబరునెల 'మాడర్న్ రివ్యూ' పత్రికలో శుంగవంశ శాసనమును గుఱించి చర్చించు సందర్భమున వారిట్లు తెలిపియున్నారు.

" The Script of this inscription is a death blow to the system of dating inscriptions by the index of letter-forms. It proves that two styles-Cursive and Monumental-were in Vogue. Our inscription is in the cursive style which reappears under the Kushans Side by side with the archaic form it was in use in Sunga times and earlier."

అక్షరములపోలిక ననుసరించి శాసనకాలమును నిర్ణయింపలే మనునదియే దాని భావము. మనమంతవఱకుఁబోవ నక్కఱలేదు. మనమూఁడవ విష్ణువర్ధనుని కాలముననే అతని శాసనములలోని యక్షరములు పెక్కుతెఱఁగులఁ గానవచ్చును. పసపుంబఱ్ఱు, మామిండిపల్లి, మనగణపవరము శాసనములలోని లిపి ఒకదానిలోనున్నట్లు ఇంకొకదానిలో లేదు. లిపినిబట్టియే మనము కాలమును, తద్ద్వారమున శాసనాధిపతిని నిర్ణయించిన నీమూఁటిలో నేదో యొకటిమాత్రమే మూఁడవ విష్ణువర్ధనునిదని నమ్మి మిగిలిన వాటిని అతనివి కావని త్రోసివేయవలసిన దురవస్థ సంభవించును. అందువలన

1 C P No. 9 of 1913-14; Ind. Ant. Vol. VII, P. 185. 2 Ep. Ind. Vol. VIII P. 236
3 C. P. No. 9. of 1913-14

శాసనకాల నిర్ణయమునకు కేవల మొక్కలిపినిగూడఁ బ్రమాణముగఁ గైకొనలేము. ఈ కారణములనుబట్టి పైని చెప్పిన అహదనకరాది శాసనములు మూఁడును అయిదవ విష్ణువర్ధనుని వని నే నంగీకరించుటకు సాహసింపఁజాలను. అవి అయిదవ విష్ణువర్ధనునివి కావనియే నానమ్మకము. అట్లయిన నవి యెవరివి? అవికూడ మనమూఁడవ విష్ణువర్ధనునివేయని నాయూహ. అందులకుఁ గారణములివి.

౧. గణపవరము శాసనలిపి అహదనకర శాసన లిపిని బోలియున్నది.

౨. సర్వలోకాశ్రయబిరుదము మనగణపవరము శాసనము నందును, అహదనకరాది శాసములందునుగూడ దాతయైన విష్ణువర్ధనునికి వాడఁబడినది. అదిగాక జళుమూరు శాసనమున మూఁడవ విష్ణువర్ధనునికి వాడఁబడిన 'మకరధ్వజ', 'ప్రళయాదిత్య' బిరుదములు అహదనకరశాసనము, రెండుబల్లి శాసనములలోని దాతయైన విష్ణువర్ధనునికిని బ్రయోగింపఁ బడినవి.

3. విషమసిద్ధినామము మూఁడవవిష్ణువర్ధనుని శాసనముద్రికలలోఁ గొన్నిఁటిమీఁదను, అయిదవ విష్ణువర్ధనుని వనఁబడుశాసనముల ముద్రికలలోఁ గొన్నిటి మీఁదను గూడఁ గలదు.

౪. గణపవరము శాసనమునందలి రాజప్రశస్తి వివరణమును, పెర్మంచిలి శాసనమునందలి రాజప్రశస్తి వివరణము నించుకంతయు భేదములేక యొక్కతీరుననున్నది. చూడుఁడు:

పెర్మంచిలి శాసనము : మొదటిరేకు. *

6. నపుషాం చళుక్యానాం కులమలంకరిష్ణో ర్వి[విధయుద్ధలబ్ధయశ*]

7. (శ్రీ) (శ్రీస్య) విష్ణువర్ధనమహారాజస్య పౌత్రఃపర [నృపతిమకుటతట*]

రెండవరేకు : మొదటిప్రక్క

8. ఘటితానేకమణికిరణరాగరఞ్జితచరణయుగళః అనేకతు

9. లాధృతకళధౌతదానపూతశరీరఃసమస్తభువన(నా)శ్రయ (శ్రీ) విజయా

10. దిత్య మహారాజస్య ప్రియతనయః సమతిసి(శ)యితపితృగుణ

11. శక్తిసమ్పన్న స్సమ్యక్ప్రజాపాలన [పర*]ఋపరమబ్రహ్మణ్యః

12. మాతాపితృపాదానుధ్యాతః సర్వలోకాశ్రయ (శ్రీ)విష్ణువర్ధనమ

13. హారాజాధిరాజపరమేశ్వరభట్టారకః.

౫. మూఁడవ విష్ణువర్ధనుని మావిండిపల్లి శాసనమును, అయిదవ విష్ణువర్ధనుని కారోపింపఁబడుచున్న రెండుబల్లి శాసనమును (గుంటూరు మండలమునందలి) పెరవలి అను గ్రామమున ఒకచోటనే దొరకినవి, అదియునుం

---

* ఈపెర్మంచిలి తామ్రశాసనము ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ గలదు. ఆ రేకుల మూలమును ఇదివ ప్రసక్తమైనంతవఱకు నిట పొందుపఱచియున్నాను. మొదటిరేకు సగముభాగము విరిగిపోవుటవలన ౬-౭ పంక్తులలోఁ గడపటిభాగమును గణపవరము శాసనమునసరించి నేను పూరించితిని. ఆభాగము కుండలీకరణమునఁ జూపఁబడినది. (ఈరేకులు కీ. శే. శ్రీయుత కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారియొద్దనుండఁగా నేనుచదివితిని.)

గాక యీ రెండుశాసనములందలి ప్రతిగ్రహీతలపేళ్లు ఒకటికాకపోయినను గోత్రములు మాత్రము సరిపోవుచున్నవి. ఇరువురిది కౌశిక గోత్రమే.

౬. మూఁడవవిష్ణువర్ధనుని జలుమూరు, అయిదవ విష్ణువర్ధనుని దనఁబడు రెంటుబల్లి శాసనములందలి ఆజ్ఞప్తి యొక్కఁడనియే నా యూహ. అతనిపేరు జలుమూరుశాసనమున 'కడఎఱెయ'అనియు,'రెండుబల్లి' శాసనమున 'ఎఱెయమ్మ' అనియువ్రాయఁబడినది. పేరులో నీమాత్రము స్వల్పభేదమున్నను వీరిరువురు నొక్కరై యుందురని యూహింపఁదగును.అది యటుండ నీతఁడే మూఁడవవిష్ణువర్ధనుని కుమారుఁడగు మొదటివిజయాదిత్యుని'శఖరంబు'శాసనము[1]నఁగూడ నాజ్ఞప్తిగ నున్నాఁడు. అతనిపేరు 'ఎఱయ వమ్మణ'. తండ్రి, కొడుకుల కాలమున నొక్కఁడే ఆజ్ఞప్తిగ నుండుటలో ఆశ్చర్యములేదు. అందుల కీ మన మూఁడవవిష్ణువర్ధనునే తార్కాణము గాఁ జూపవచ్చును. ఇతనితండ్రియైన 'సర్వలోకాశ్రయుని' కాలమునను, ఇతని కాలమునను గూడ ఒక్కఁడే ఆజ్ఞప్తిగ నున్నాఁడు.

౭. ఇన్ని కారణములను మించినది, ఇన్నిటికి నాధార భూతమైనది యగుబలిష్ఠ కారణము మంగి యువరాజునకు 'విజయాదిత్య' బిరుదముకూడ నుండుట. ఇంతవఱకుఁ గనఁబడిన యేశాసనమును గూడ ఇతనికి విజయాదిత్యబిరుద మున్నట్లు తెలిపి యుండ లేదు. గణపవరశాసనమే దీనిని బయటఁ బెట్టినది. దీనిని బట్టియే ఇంతవఱకు అయిదవ విష్ణువర్ధనుని కారోపింపఁబడు శాసనము లాతనివి కావనియూహించుటకుఁ గారణము.మంగి యువరాజు అనుటకు బదులుగాఁ గొన్ని కొన్ని శాసనములలో నీతనిం జెప్పవలసివచ్చినప్పుడు ఈతని బిరుదులు మాత్రమే పేర్కొనఁబడియున్నవి. అట్లే అహదనకరాది శాసనములలోఁ గూడ మంగి యువరాజనుటకు బదులుగ నీతని బిరుదములలో నొక్కటియైన విజయాదిత్య బిరుదమే పేర్కొనంబడినదని యూహింప నవకాశము గలదు.

౮. మంగి యువరాజు విజయాదిత్యుఁడగునా కాదాయను సంశయమును నివారించుటకు, పై కారణమును బలపఱుచుటకు నింక నొక్క యాధారము కలదు. అదియే దన 'సమస్త భువనాశ్రయ' యను బిరుదు పదము మనగణపవరము శాసనమున మంగి యువరాజునకును, పెర్మంచిలిశాసనమున విజయాదిత్యునకును ప్రయోగింపఁ బడినది. పైని చెప్పిన కారణము ననుసరించియు, బిరుద మొక్కటియగుటను బట్టియుఁగూడ మంగి యువరాజ, విజయాదిత్యు లిరువురు నొక్కరేయని యూహింపవచ్చును.

ఈ కారణములనుబట్టి అయిదవ విష్ణువర్ధనునివనఁబడుశాసనములన్నియు మూఁడవ విష్ణువర్ధనునివే యని నేనూహించెదను. ఈనా యూహయే సరియైన దగునేని మన యీ గణపవరపుశాసనము చరిత్రవిషయకమైన యొక చిక్కును విడఁదీసినదని నిశ్చయింపవచ్చును.

1. C. P. No. 22 of 1916-1917.

### స్థలనిర్దేశము.

దాన మొసంగఁబడిన భూమి అరియేడు గ్రామములోనిది. ఇది అత్తిలి విషయములో నున్నట్లు చెప్పఁబడినది. విషయ మనఁగా ఇప్పటి ఒకజిల్లావంటి దేశవిభాగము. భీమవరము తాలూకాలోని గణపవరమునకు దక్షిణముగనున్న ఇప్పటి ఆరేడు గ్రామమే శాసనము నందలి అరియేడు గ్రామము. శ్రీనాథకవిసార్వభౌముని నాఁటికిఁగూడ నిది అరియే డనియే వ్యవహరింపఁబడుచుండినట్లు భీమేశ్వరపురాణమునందలి యీ క్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది.

తే. యవన కర్ణాటకటక భూధవుల తోడ
బలిమి నాటించి యేలించెఁ దెలుఁగు భూమి
దననిజస్వామి నల్లాడ ధరణినాథు
భళిరె! యరియేటి లింగన ప్రభువరుండు.

దానమిచ్చిన క్షేత్రమునకు తామరవ్వా[డ*] తూర్పు సరిహద్దుగఁ జెప్పఁబడినదికాని యీ గ్రామ మిప్పుడు అచటఁ గానరాదు. ఇఁక, ప్రతిగ్రహీత పద్మిన్యగ్రహారవాస్తవ్యుఁ డని శాసనమునఁ దెలుపఁబడినది. పైని చెప్పిన గణపవరమే పద్మిన్యగ్రహారమని నిశ్చయింప వచ్చును. ఏలయన క్రీస్తుశకము పదునొకండు, పండ్రెండు శతాబ్దులందలి శాసనములలో[1] గణపవరమునకు పద్మినీపురము, అనుపేరు కలదు. అందువలన నీపద్మినీపురము మనపద్మిన్యగ్రహారము నొక్కటియే యని నిశ్చయించుటలో సందేహింప నక్కఱలేదు.

### ఆజ్ఞప్తి.

మనశాసనమున ఆజ్ఞప్తిపేరు 'నిస్సరమిణ్యే.' నన్యేశర్మ నన్నిశర్మ అగునట్లే నిస్సరమిణ్యే నిస్సరమిణ్ణి కావచ్చును. ఇతఁడే మంగియువరాజుయొక్క నూతులపట్టు[2], 'బాండాడనొత్తి'[3] తామ్రశాసనములలోఁ గూడ ఆజ్ఞప్తిగ నున్నాఁడు.

## మూలము*

మొదటిరేకు: రెండవపెడ.



1.
2.
3.
4.
5.

1. Ep. Coll. Nos 308, 309, 313, 314, & 316 of 1920. 2. Ind. Ant. Vol XX, P. 104.
3. ఆం. సా. ప. ప. సం. 2. పు. 215.

* నాయొద్దనున్న రేకుల ననుసరించి.

[ ] ఈకుండలీకరణమున మూలములోఁ గొంచె మరిగిపోయి స్ఫుటముగ లేనియక్షరములు ఉంచఁబడినవి.

[*] ఇట్టిగుర్తుగల కుండలీకరణమున మూలములో నుండవలసిన యక్షరములు లేకపోవుటవలనఁ నిపుడుంచఁబడినవి.

1. స్వస్తి శ్రీమతాం సకలభువనసంస్తూయమానమానవ్యసగో
2. [త్రాణాం *] హారితి పుత్రాణాం కౌశికీ వరప్రసాదలబ్ధరబ్ధ[1]నాం
3. [మాతృ *] గణపరిపాలితానాం స్వామి మహాసేనపాదాను
4. ధ్యాతానాం భగవన్నారాయణ ప్రసాద సమాసాదిత వరవ
5. రాహలాఞ్ఛనే క్షణ క్షణ వశీకృ[2] తారాతిమణ్డలాణా[3] అ[శ్వ *]

రెండవరేకు: మొదటిపెడ.



6.
7.
8.
9.
10.

6. [మేధా] వభృథ స్నాన పవిత్రీకృ[4]తవపుషా[ం *] చళుక్యాణాం[5] కుల[మ *]
7. [లం *] కరిష్ణో ర్వివిధయుధ[6]లబ్ధయశ శ్రీ[7]విష్ణువర్ధన మహారాజ[స్య]
8. [పౌ *] త్రః పరిస్నృపతిమకుటతటఘటితానేకమణికి [రణ]
9. రాగరఞ్జత చరణయుగళః అనేకతులాధృత [క *] శ[ధౌ]
10. [తదా] సనూ[8]తశరీరః సమస్తభువనాశ్రయ [శ్రీ] విజయాది [త్య *]

రెండవరేకు: రెండవపెడ.



11.
12.
13.
14.
15.
16.
17.

1. ०రాజ్యానాం అనిచదువవలెను. 2. °వశీకృతారాతి°. 3. °మణ్డలానామశ్వ అని.
4. పవిత్రీకృతం అని. 5. °చలుక్యానాం అని. 6. °యుద్ధ అని. 7. °యశశ్శ్రీ అని. 8. °పూత° అని.

11. [(శ్రీ)మం]గియువరాజస్య పుత్రః సమతిశై[1] తపితృగుణశక్తి సమ్పన్నః సమ్యక్ప్ర
12. జాపాలనపర ప్పరమ బ్రహ్మణ్య[ః*]మాతాపితృపాదానుధ్యాతః సమస్తభువనాశ్ర
13. య శ్రీవి[ష్ణువర్ధన] మహారాజాధిరాజపరమేశ్వరభట్టారకః అత్తిలివిష[యే]
14. అరివే[డునామ] గ్రామే రాష్ట్రకూట ప్రముఖాన్ స్వవిషయవాసినః కుటుంబినః సర్వాన్ [నిత్థ*]
15. మాజ్ఞాపయతి[విదిత]మస్తువోస్మాభిః[షడ్మి]న్యగ్రహారవాస్తవ్యాయ పాతాఞ్జలసగో
16. త్రాయ అఖిలా[థర్వణ] వేదవిదాయ సూరిశర్మణ[ణత్పౌత్రాయన]న్యశర్మణః పుత్రాయ సూరిశర్మణ[ణే]
17. [దివ్య] సామ్మణదాది[2]కర్మవిదాయ [సూర్యగ్రహణ నిమిత్తే] నివర్తన ద్వయక్షేత్రము[దక*]

మూడవ రేకు : మొదటి పేట.


18
19
20
21
22
23
24

18. పూర్వన్దత్తమ్ ఆవాస నికటసహితమ్ [॥*] అస్యక్షేత్రస్య సీమాన్తాః [।*] పూర్వతః తా
19. షరవా[డ*] దక్షిణత[ః*] దుత్తిశర్మణః క్షేత్రమ్ పశ్చిమత[ః*] గ్రామ క్షేత్ర[మ్*] ఉత్తరతః షమ్బిఖ(?)
20. రావి [।*] అస్యోపరి న కేనచిద్బాధా[3] కర్తవ్యా యః కరోతి స [ః*] పఞ్చభి ర్మహాపాతకై
21. స్సంయు[క్తో భ]వతి[।*]తథావ్యాసేనా ప్యుక్తమ్[।*]బహుభి ర్వసుధా[5]దత్తా బహుభి
22. శ్చానుపాలితా। యస్య యస్య యదాభూమి స్తస్య తస్య తదాఫలమ్॥ స్వదత్తా
23. మ్పరదత్తా[ం*] వా యోహరేత వసున్ధరా[ం।*] షష్ఠింవర్ష సహస్రాణి విష్ఠా యా[ం*] జా[య]
24. తక్రిమిః॥[6] ఆజ్ఞప్తి రస్యధర్మ్మస్య నిస్సరమిర్యో

---

1. ० సమతిశయితం అని 2. దివ్యసంప్రదాయ్రు విం (?) అని 3 ० కేన చిద్బాధా० అని
4. ० యః కరోతిం అని 5. ర్వసుధా० అని. 6. ० తే క్రిమిః అని.

# దైవనియోగము

పుతుంబాక శ్రీ కృష్ణయ్య గారు

ఒకసారి కలలో నొకసారి యింటిలో
బొడసూపి మాయమై పోయినావు
ఒకసారి నిద్రలో నొకసారి బాటలో
తళతళ త్రుళ్ళియని తరలినావు
ఒకసారి చెట్టులో నొకసారి గుట్టలో
కనుపించి వెంటనే గడచినావు
ఒకసారి నీటిలో నొకసారి భూమిలో
వెలుగొంది దివ్వెన వెడలినావు
కాని యటుమీదనిన్నెపుడు గాననైతి
తీరలేదింక నాబుద్ధి దీరలేదు
వరల నొకసారి నామీద మమతబూని
దివ్యదర్శన మిమ్మహో దీననాథ!

# అనుతాపము

సోమంచి సూర్యనారాయణశర్మ గారు

ప్రభులకుఁ బ్రభుఁడవై బ్రహ్మాండమంత నీ
వేలుచుండుట మది నెఱుఁగలేక;
సూది మోపుటకైనఁ జోటుండనీయక
నిండియుండుటను భావింపలేక;
చీమల మొదలైనఁ బ్రేమ నాలించుచుఁ
దవిలి పాలించుటఁ దలఁపలేక;
అఖిలజీవులకు స్వాతంత్ర్యేచ్ఛఁ గల్పించి
కైవల్య మిచ్చుటఁ గానలేక
ముక్తికని యెవ్వరెవరికో మ్రొక్కి మ్రొక్కి
సొరిది శుష్కోపవాసాల స్రుక్కి స్రుక్కి
పుణ్యజనపీడనమునకుఁ బొక్కి పొక్కి
చిక్కి దక్కితి ననుఁగటాక్షింపవయ్య
భరితభక్తకలాప! ప్రేమస్వరూప!




దిగవల్లి వేంకట శివరావు గారు, బి. ఏ., బి. యల్.

## I

భారతీయ సారస్వతమున, సంస్కృతాంధ్రవాఙ్మయములలో ప్రకృతి స్వభావ సౌందర్య ప్రదర్శనము తక్కువయని, లేదని, కొందఱు నిరసింతురు. కాని మనకును షేక్స్పియరులు, వర్డ్సువర్తులు కలరు. మనకును బైబిలు గ్రంథములోని ఉత్తమ ఘట్టములను మించినవర్ణనలు కలవు. మన భారతీయ మహాకవులును ప్రకృతి స్వభావప్రదర్శనమున తమశిల్ప చాతురిని చూపినారు.

మన ప్రమాణగ్రంథములగు వేదములందు ప్రకృతి సౌందర్యవర్ణనము ప్రకృత్యారాధనము ప్రధానభావములు. మన నాటకములపుట్టుక వసంతోత్సవములందు. మన ప్రణయదైవము పంచశరుఁడు. మన నాటకరంగములు ప్రకృతిసౌందర్యమధ్యమున నేర్పరుపబడినవి. విక్రమోర్వశీయముయొక్క మొదటియంకము హిమాచలమున ప్రకృతివైచిత్ర్యసౌందర్యవర్ణనముతో మొదలిడి ద్వితీయాంకమున ప్రమదవనవర్ణనముతో వసంతాగమముతో చతుర్థాంకమున, ప్రియావిరహఘట్టమున వర్షాగమముతో, ఋతుధర్మవర్ణనలతో సాగును. రాజు లతకూనను కౌఁగలించుకొనగానే యాస్థానమున నూర్వశి ప్రవేశించును! శాకుంతలమున దుష్యంతుని వేటనుగూర్చిన వర్ణనము సుందరముగనున్నది. కాళిదాసు కణ్వాశ్రమమును వర్ణించుపట్ల మనోహరమగు ప్రకృతిని చిత్రించినాడు. అనసూయా ప్రియంవదా శకుంతలల సంభాషణము, దుష్యంతుని మాటలు కణ్వాశ్రమపు సౌందర్యమునే చాటుచున్నవి. అభిజ్ఞానశాకుంతలమునుగూర్చి జర్మనీకవియగు 'గతే' యిట్లనినాఁడు. "వికాస సంవత్సరపు నూత్నవికాసము, తుదిఫలములు, కావలెనన్నచో ఆత్మకు ఉత్సాహము ఆనందము, పండుగ విందు, కావలెనన్నచో భూలోకము స్వర్గము నొక్కమాటలో కావలెనన్న "శకుంతల" యని నేను పేర్కొనెద"నని శ్లాఘించినాఁడు.

శకుంతల తన భర్తకడకు పోవునప్పుడు

" హరిణములు దర్భకవణముల్ దొరఁగవిడిచె
మానె పురివిచ్చి యాడుట లీ నెమిళ్లు
కరము కన్నీటిబొట్టుల కరణి నిడెగొ
బండుటాకులు రాలుచుమండె లతలు. "

(ఆంధ్రాభిజ్ఞానశాకుంతలము.)

అని ప్రియంవద పలుక శకుంతల తనలతాసోదరిని "వనజ్యోత్స్నను" సెలవడుగుటకు పోయి "వనజ్యోత్స్నా! నీ వీ త్రాముమామిడితో గూడుకొనియున్నను నన్నొక్కమాఱు నీశాఖాభుజములతో గట్టిగా గౌఁగలింపుమా!" అనినది. శకుంతలకు వనమృగములందు వృక్షములందు లతలందు గల ప్రేమ, అవి యామెపైన చూపిన ప్రేమయు నప్రతిమానములు.

భవభూతి రచియించిన ఉత్తరరామ చరిత్రమందలి కథాసందర్భమెల్ల తపోవనముననే జరిగినది. ఆ ప్రకృతి వర్ణనములు చిత్రకవిశేయు నద్భుతముగ నున్నవని పండితులయభిప్రాయము. ఇక భాసుడేమి బాణుండేమి యితర సంస్కృతనాటక కవులేమి తమతమ నాటకముల కథాసందర్భము ప్రకృతి సౌందర్యవర్ణనలతో, వసంత ఋతువర్ణనలతో ఇతర ఋతుధర్మవర్ణనములతో నింపినారు.

మహాకావ్యమునకు లక్షణములలో ప్రకృతివర్ణనములు ప్రధానముగ పేర్కొనబడియున్నవి. మన పంచకావ్యములందును ప్రకృతిస్వభావప్రదర్శనము చక్కగనున్నట్లు తెలియుచున్నది. కాళిదాసుని పుస్తకములెల్ల మనోహరమగు ప్రకృతివర్ణనములతో చిత్తరువులతో నిండియున్నవి.

ప్రకృతి సౌందర్యరాశియనఁదగు మేఘసందేశపు భావము కల్పన, కవనము, మనోహరములు. కాళిదాసుని చాతుర్యమెల్ల రత్నగిరిపైన పండించి యక్షుని చేత విరహ మనుభవింపఁజేయుపట్ల చూపినాడు. ఉదాహరణములు వ్రాయబూనుట సాహసము.

రఘువంశకావ్యమున కాళిదాసు ప్రదర్శించిన ప్రకృతిస్వభావసౌందర్యమునకు నుదాహరణముగ ప్రథమసర్గమున దిలీపమహారాజు వసిష్ఠాశ్రమమునకేగుఘట్టము చెప్పవచ్చును.

"సేవ్యమానౌ సుఖస్పర్శైః సాలనిర్యాసగన్ధిభిః ;
పుష్పరేణూత్కిరై ర్వాతై రాధూతవనరాజిభిః.
మనోభిరామాః శృణ్వన్తౌ రథనేమిస్వనోన్ముఖైః;
షడ్జసంవాదినీః కేకా ద్విధా భిన్నాః శిఖణ్డిభిః.
పరస్పరాక్షిసాదృశ్య మదూరోజ్ఝితవర్త్మసు ;
మృగద్వన్ద్వేషు పశ్యన్తౌ స్యన్దనాబద్ధదృష్టిషు.
శ్రేణీబన్ధా ద్వితన్వద్భి రస్తమ్భాం తోరణస్రజమ్;
సారసైః కలనిర్హ్రాదైః క్వచి దున్నమితాననౌ."

ఈ శ్లోకములలో స్వభావసామ్యము ప్రదర్శింపఁబడినది. అందు ముఖ్యముగా తుదిశ్లోక మద్భుతమగు భావములను కలిగియున్నది. కుమారసంభవమున ప్రథమసర్గలో 4 వ శ్లోకము.

"య శ్చాప్సరోవిభ్రమమణ్డనానాం
సంపాదయిత్రీం శిఖరై ర్బిభర్తి;
వలాహకచ్ఛేదవిభక్తరాగా
మకాలసంధ్యా మివ ధాతుమత్తామ్."

ఇది ఉత్తరధ్రువముదగ్గర నున్న పరిస్థితులను జ్ఞాపకము తెచ్చును.

తృతీయసర్గమున 25 వ శ్లోకము మొదలు స్థాణ్వాశ్రమమందు వసంతప్రాదుర్భావమగుటను గూర్చిన వర్ణనము కలదు. అందు ముఖ్యముగ 35, 36, 37 శ్లోకములతిమనోహరములు స్థావరజంగమ మిథునప్రణయమును ప్రదర్శించుచున్నవి. ఉదాహరణమునకు రెండు శ్లోకములు:—

"మధుద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః;
శృఙ్గేణ సంస్పర్శనిమీలితాక్షీం
మృగీమకణ్డూయత కృష్ణసారః.
దదౌ రసాత్ పఙ్కజరేణుగన్ధి
గజాయ గణ్డూషజలం కరేణుః;
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాఙ్గనామా."

## II

మనపురాణములందు ప్రకృతివర్ణనము లెన్నో కలవు. దేశమును, కాలమును, పాత్రములును స్వభావోక్తులతో అతిశయోక్తులతో వివిధాలంకారములతో చక్కగ వర్ణింపబడినవి. ప్రకృతిసౌందర్యము చక్కగ ప్రదర్శింపబడినది. మనరామాయణములోని, భారతములోని, భాగవతములోని, ఆశ్రమవర్ణనములు, తపోవనములు ఉద్యానవనములు, అందలి పశుపక్ష్యాదులు, వానిస్వభావ ప్రకటనము, ప్రకృతిస్వభావసామ్యనిరూపణములు నద్భుతములు. ఋతుధర్మములను, ప్రకృతియొక్క ప్రతియణువునందు కలిగినమార్పులను ప్రదర్శించుటలో మన సంస్కృతాంధ్రకవులు నిపుణులు. వాల్మీకి చిత్రించిన అరణ్యకాండమునందలి వర్ణనములు మనోహరములు. వాల్మీకిమహాముని ఎంతటి ప్రకృతిసౌందర్యసమ్మోహనమున మునిగి యిట్టి కోకిలారవమున బాడెనో! విశ్వామిత్రాశ్రమము, సుందరమగు తపోవనము. భరద్వాజాశ్రమము, చిత్రకూటము, మందాకిని, అత్రిమహాముని ఆశ్రమము, దండకారణ్యవర్ణనము, పంచవటి, అచ్చటి వర్ణనము, ఋతువర్ణనములు, శ్రీరాముని విరహము, లంకాద్వీపపు సౌందర్యము, ఉత్తరకాండమున వాల్మీకాశ్రమపువిశేషములును ప్రకృతివర్ణనములతో మనోహరములగు కవికల్పితములగు చిత్తరువులతో వివిధములగు భావప్రకటనలతో వింతలగు స్వరూపస్వభావసామ్యములతో నిండియున్నవి.

కణ్వాశ్రమమున దుష్యంతుడును,

"మాలిని;
ఏచి తనర్చినకోవుల నిమ్మగు
తావుల జొంపములం
బూచిన మంచియశోకములన్ సుర
పొన్నలఁ బొన్నల గేదఁగులం,
గాచి బెడంగుగఁ బండిన యాసహ
కారములం గదళీతతులం,
జూచుచు వీనుల కింపెసఁగ న్వినుచున్
శుకకోకిలసుస్వరముల్.

సీ. శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడుశుకముల చదువు వినియె
కదలక నిలుచుండు కరులయుఁ గరికర
శీతలచ్ఛాయఁ దచ్చీకరాంబు
కణముల చల్లని గాడ్పునపడి వానిఁ
జెంద సుఖంబున్న సింహములయు
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి
పెట్టు నీవారాన్న పిండతతులు
గడఁగి భక్షింప నొక్కంటఁ గలిసి యాడు
చున్న యెలుకలపిల్లల యొండుసహజ
వైరసత్వంబులయు సహావాస మపుడు
చూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమందె."

అని మహాభారతమున నన్నయభట్టు వ్రాయగా బమ్మెర పోతరాజుగారిట్లు వ్రాసినారు:

ఉరుతరశ్రాంతాహియుగళంబులకుఁ బింఛ
ముల విసరెడి కేకిముఖ్యములను,
గరుణతో మదయుక్తకలభంబులకు మేఁత
లిడుచు ముద్దాడు మృగేంద్రములను,
ఘనమృగాదలములు గాఁపుగా లేళ్లతో
రతులు సాగించు సారంగములను,
నునుపుగా హోమధేనువులకంఠంబులు
దువ్వుచు నాడుశార్దూలములను
దారి కలహించుచుండు మృగంపతులను,
మైత్రి నంకించు మార్జాలమల్లములను
మతిని జాతివైరంబులు మాని యిట్లు
గలసి క్రీడించు మృగములఁ గాంచె నతఁడు'

అతఁడు
హల్లకబిసరుహహంసీ
కల్లోలోత్ఫుల్ల యూథికాగిరిమల్లీ
మల్లీమరువక కురవక
సల్లలితానిలమువలన సంతుష్టుండై.'

ఇదిమాచి పింగళిసూరన,

"ఆవులు నాఁకఁగ న్నరమోద్పుపులులును
బలులవ స్తనువంగఁ బోవు లేళ్లు
లేళ్లి చెల్లాట రంజిల్లెడు హరులును
హరులు గోళ్లను గోఁకి నలరు కరులు
కరులకట్ఠాళి పైకరి నాడుపాములు
పాముల జాలించు బర్హిణతతులు
బర్హిణతతులఁ బ్రక్కఁ బాయని యెలుకలు
యెలుకలఁ బెంచు పిల్లులును గలిగె"

అని తపోవనముయొక్క మహాత్మ్యమును కళాపూర్ణోదయమున వర్ణించినాడు.

ఋతుసంహారమునుగూర్చి.

"ఫలితనవీనకంపళికదంబకదంబక కేతకీరజో [గా
మిళితసుగంధబంధురసమీరపవనస్సరీయోఁదుచుండెఁ [యూఁగి ను
నులియుచుఁ బుష్పకేతులను నుయ్యేల లూఁపఁగ నెక్కి
ల్లలపికీనికలంబు మృదులధ్వనిగీతము విస్తరించుచున్"

తదనంతరము భూపతికిని నవంబున కును శరత్సమాగమమైనపనియు శారసరత్రులు వికసన్నవకైరవగంధబంధురోదారసమీరసౌరభము తాల్చె ననియు భారతమున జరుగుచున్నాము.

"జొంపములు గొనియె వనములు
రొంపి లింగిరి నెమిలిగములరోద లుడిగె నదు
లింపులకుఁ బాసె నులుముల
శంపలసంపదలు మాసె శారదవేళన్"

అని భాగవతమునను గలదు. అంతట ప్రియులకుఁ బ్రియమగు హేమంతఋతువు వచ్చినది. కృష్ణుఁడు గోవర్ధనమెత్తినాడు. శరన్నిశలు వచ్చినవి. అట్టి శరద్రాత్రినే శ్రీకృష్ణునికడకు గోపికలు వచ్చినది. శ్రీకృష్ణునివేణుగానము వారి నాకర్షించినది. అత డంత హ్లాదుండయ్యె. అప్పుడే వారచ్చటి పున్నాగములను

తిలకంబులను యితర భూజములను మల్లియలను సంబోధించి వెదకిరి. అంతట పవిత్రమగు రాసక్రీడయు, జలక్రీడయు జరిగినవి.

పోతనామాత్యుడు భక్తిరసము వర్ణించుపట్ల నిది గమనించినట్లు "మందారమకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు వోవునే మదనములకు" అను సుప్రసిద్ధపద్య మేకరువుపెట్టకయే తెలియగలదు.

రుక్మిణీకల్యాణఘట్టమున స్వభావసామ్యము నెంత చక్కగ జిత్రించినాడో చూడుడు :

"దేవకీసుతుకోర్కె తీగెలు వీడంగ
వెలఁదికి మైదీగ వీడఁ దొడఁగె
గమలనాభుని చిత్తకమలంబు వికసింపఁ
గాంత నింతికి ముఖకమల మొప్పె."

III

మన ప్రబంధములందును ప్రకృతివర్ణన లత్యద్భుతముగ చేయబడినవి. ద్యానవిహారములు ఋతువర్ణనములు సూర్యోదయ చంద్రోదయవర్ణనములు, విరహములు, వీనియందు ప్రకృతిపై చిత్ర్యప్రదర్శనము స్వభావసామ్యనిరూపణము నత్యద్భుతముగ చేయబడినది. మన అల్లసానిపెద్దన తన మనుచరిత్రమున మహాప్రబంధలక్షణము ననుసరించి ప్రకృతివర్ణనములు చేసినాడు:

"సీ. ఏవిహంగముఁగన్న నెలుగించుచును సారె
వను సైకతంబులఁగూడఁదారుఁ
దారి కన్గొని యది తనజోడు గాకున్న
మెడయెత్తి కలయంగ మింట నరయు
నరసి కన్నీటితో మరలి తామ యెక్కి
వదన మెండగ సరోవారి నద్దు
నద్ది త్రావగ నైప కట్టిట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి భ్రమసి యుఱుకు
నుఱికి రెక్కలు దడియ వేఱొక్కతమ్మి
కగుగు నరిగి రవంబులోఁ దిరుగు తేంట్లఁ
బొడుచు ముక్కున మఱి మఱునఁ బోవు వెదకఁ
బంజఁ బ్రియుఁ బాసి వగ నొక్క చక్రవాకి."
అనినాఁడు.

ఇది యేవిరహిణి చేయదు ?

చంద్రోదయ మైనంతనే

"సీ. శిథిలకైరవదళశ్రేణి నొక్కలు తీఱె
శశికాంతపంక్తుల జలము లూఱె
గోరి కాంతులతోఁ జకోరికల్ రతిఁగేర
వారాశిగర్వంబు మేరమీఱె
ద్రోపడి యిరులు పటాపంచలై పాఱె
దిఙ్ముఖంబుల వింత తెలివి సేరె
జక్రవాకంబు లబ్జకుడుంగములు దూఱె
గామినీకాంతులకలఁక దేఱె
మదను డమ్ముల నూఱె హిమంబు పేరె
జడిసి విరహిణి వగగూరె జారచోర
దర్పములు జాఱె రవికరతాపమాఱె
జూడఁ జూడంగ దారకస్ఫురణ దాఱె."

అని పెద్దన్నగారు తమ చిత్రరచనా సామర్థ్యమును చూపుచు స్వభావసామ్యమును ప్రదర్శించినారు.

వసుచరిత్రమున అలంకారములేనిపద్య మొక్కటైనను లేదు. అందువలన నందలి ప్రకృతివర్ణనము లలంకారములతో నిండియుండును :

"సీ. చిగురుకెంగేలు సాచ రసాలవల్లరి
నేటిచూపులఁ జూచె తిలకలతిక
పికగీతిఁ బాడి చూపెఁ బ్రియాళులతపల్కెఁ
గీరభాషలఁ గర్ణికారశాఖ
ముఖరక్తి నింపె నింపుగలసంపఁగికొమ్మ
వన్నెగా నగియె లేఁబొన్నతీగ
సురభిళశ్వసనంబు నెరపె సింధుకవల్లి
గ్రుచ్చెఁ దావులు సోఁకఁ గ్రోవిరెమ్మ
యాత్మసుచిరోపచారంబు లధిప కల్ప
కంబునకుఁ దత్తదామోదగరిమఁ బెనుప
నంగనానిత్యకలితదోహదవిశేష
సన్నుతాచారముల సడిగన్నకతన."

"సీ. ఫలభంగములు సేయుచిలుకకు సాంగమై
క్రోధరసంబు ముక్కున నెయుండు
గాలభేదికి మహాకాలమూర్తికి దంట
కోయిల కెంపుమంట గురియఁ గంట
మదమరాళికి సదంభస్థితి యుడివోదు
ముఖరాగమును గళంబున సంబు

నలుపఁగొమ్మలతావు లార్చి యాఘవపూర్తి
  సడలించునళికి మే నెల్లమలిన
మట్టి యిట కేలవచ్చి తీయధరబింబ
మాతలిరుఁ గేరునీభుజామృదుమృణాళి
కలును నీపువ్వుకోమలాంగములు పూని
గట్టుదొరపట్టి వగు టెల్లఁ గంటి మబల!"

ఇందు రామరాజ భూషణుడు స్వభావసామ్య వైరస్యముల నెంతచక్కఁగ ప్రదర్శించినాడో చూడుడు. అయిన నితని ఉత్ప్రేక్షాలంకారములు అర్థాలంకారములు ఇతని భావములు నిజములో కల్పితములో యను సందియమును గలిగించుచుండును.

మనుచరిత్రముననను వసుచరిత్రముననను గల హిమాచలవర్ణనమును చూడుడు, ఎంతసుందరమో! గ్రంథవిస్తరభీతిని ఉదాహరణములు వ్రాయుట మానితిని. ప్రకృతి వర్ణనములెల్ల మహాప్రబంధలక్షణములుగ మన లాక్షణికులు పేర్కొనినారు.

కాముకులగు స్త్రీ పురుషులు ప్రకృతినిగూర్చి సంబోధించుచు ప్రణయార్థినోలలాడుసన్నివేశములు సంస్కృతకావ్యములందు తెలుగు ప్రబంధములందును గలవు. మేఘసందేశము, గీతగోవిందము, విల్హణీయము, నీసంపర్కములను చక్కఁగ ప్రదర్శించుచున్నవి. అందలి ప్రకృతి వర్ణనము లద్భుతములుగను సహజములుగను నుండును. అలంకారము లందము తెచ్చునేకాని అనుమానము కలిగింపవు. విల్హణీయమున ద్వితీయాశ్వాసము రమణీయమగుచున్నది. ఇందు వసంతకాలాభివర్ణనమున ఉద్యానవనలతలకును విహరించుచున్న స్త్రీలకును, పక్షులకును సౌందర్యసామ్యము ప్రదర్శింపఁబడినది.

"సీ. చిలుకాకు లనియేల చీల్చెదరే వన
  ప్రియచయాశాప్తి హరింపరాదు
బిసకాండములనేల విరచెదరే హంస
  జీవవిచ్ఛేదంబుఁ జేయరాదు
మకరందములనేల మాటెదరే సదా
  లినికాకరణవృత్తిఁ జెనుపరాదు
కువలయంబులనేల కూల్చెదరే ద్విజ
  రాజసంప్రీతి నార్పంగరా, దటంచు."

సరసోక్తు లాడుచు సరసుల క్రీడించుచున్నారీ స్త్రీలు.

పిమ్మట సూర్యాస్తమయము, చంద్రోదయము; అటుపిమ్మట యామినీ పూర్ణతిలక యుద్యానమున విహరించుటఁ గని వర్ణించు బిల్హణుని కవిత మనోహరము. తరువాత వీరి ఎడబాటు విరహము కలుగును.

"చ. మఱియు సుగంధయుక్తము
  మంజులమై తగు మోముదమ్మిపై
తిరిగెడుగంధలుబ్ధమగు
  తేటిగమిం గనుమోయి మాటికిం
దిరముచు మూయుచు న్మొగము
  ద్రిప్పుచుఁ గేలిసరోరుహంబుచేఁ
దరుముచు నొప్పు నష్ఫాలలఁతి
  ధ్యానముచేసెద నిట్టివేళలన్."

"మ. కలకంఠోపమకంఠి నాస్యజితరా
  కాచంద్రబింబ న్మృయూ
రలసద్బర్హసమానవేణి సుగుణ
  వ్రాతాత్మ నేత్రప్రభా
విలసన్మత్తచకోర యానవిజిత
  శ్వేతచ్ఛదం గాంచనో
జ్జ్వలకుంభస్తనిఁ గామినీమణిని నే
  భావింతు నెల్లప్పుడున్."

వైజయంతీవిలాసమున విరహఘట్టమును పరిశీలింతము. తృతీయాశ్వాసమున శరదృతువర్ణన మద్భుతముగ చేయబడినది. దేవదేవి విప్రనారాయణుని విటునిగ జేసినది. "నానావనీతలముల సకలకవిరాజ సంస్తుత్యవికలుమైన జీవనస్థితి" నెరసినది. వేశ్యమాత విప్రనారాయణుని దిట్టి యిల్లువెడలగొట్టినది. పాపము! విప్రనారాయణుఁడు దుఃఖించినాడు. ప్రకృతిని, సృష్టికర్తను, దూషించినాడు.

## IV

ప్రకృతి స్వభావసామ్యవైరస్యములను మన కవులు బాగుగ గమనించి ప్రదర్శించినారనుట స్పష్టము. పండితరాజబిరుదాంకితుఁడగు జగన్నాథపండితుని భామినీవిలాసమునుగూర్చి ఇచ్చట చెప్పనియెడల నీవ్యాస

మసంపూర్ణమగును. నిజముగ నితఁడు ప్రకృతి స్వభావ సౌందర్య ప్రదర్శనమును అందలి సామ్యవైరస్యముల నిరూపణమును పరమేశ్వరుని లలితకళాతత్త్వ విమర్శనమును చక్కఁగ, కన్నులకు కట్టినట్లు, చేసినాడు. ప్రకృతిలోని చిత్రములను తన శేముషీవిలాసమున ప్రాస్తావిక విలాసమున ప్రదర్శించినాడు. పండితరాజ శతకమందు నిట్టి ప్రస్తావన కలదు. యీరెంటి యందును పండితరాజు ప్రకృతి స్వభావమును సుందరముగ ప్రదర్శించినాడు.

"క. ఏ తెంచె దైవికమ్ముగ
నీతుమ్మెద యిటకు నవ్వకే కుటజంబా!
ఖ్యాతిగ మకరందము గల
వా తామరపూలు దీని వాసలఁబూనుక్.

తే. తేటిమాటువతో నొండు దీయమావి
మోక విలసిల్లు నందాఁకఁ గోకిలంబ!
వెడలఁబుచ్చుము నీవెటో విరసమైన
వాసరము లివి కాననాభ్యంతరమున.

క. బకము లవివేకములు; దలఁ
పకు నీకవిసలుపుపరిభవము లిల జైవా
తృకములు గావుతేఁ గమలిని!
మకరందసుధారసైకమార్మికము లటుల్.

క. పండులుఁ బత్రంబులుఁ బూ
లుండు నదేన్నండు లేదయో! బర్బ్బరమా!
ముండుల నెప్పుడు నింపుక
యుండెదు; నిన్నేమి గోరి యుపసర్పింతున్."

అని కొన్నిన్యస్తులనుజూచి ఓదార్చి—

"తే. త్రాముబాములఁ బూను గండంపుప్రాను
దీప మెప్పుడు మసిని నెత్తిని ధరించు
జందమామయు నాలాగె కందుఁదాల్చు
గోడె గాంద్రను గడ చేర్చుకొంద్రు తేండ్లు.

తే. ఉచితమగుఁజుమ్మి క్రోతులయోలగమున
బృథులతరుశాఖ లున్నతపీఠములుగ
గచకిచలు చారుసల్లాపనిచయములుగ
గజపులును జక్కు లతిథిసత్కారములుగ."

అని ప్రాస్తావికవిలాసమునందు చెప్పినాడు.

"క. వమ్ము సుమి తమ్మి సంభవ
మిమ్మహి జాబిల్లిఁ జూచి యెఱుఁగమి; వటు లే
సుమ్మీ విధుజన్మమ్మును
గమ్మని విరిదమ్మి నెమ్మిగమ్మం గనమిన్.

క. భేకము బకబకలాడుఁ గ
దా కలుషపుఁబడియనీరు ద్రావుచు నవురా!
కోకిలము గరువమొందదు
మాకందరసంబు నిరుపమానము గ్రోలున్.

ఉ. నేరెడుబండ్లు నల్లఁబడు
నీరగు నారికెడంబులోనఁ దా
నూరక హృత్పుటం బవిసి
యుండును దాడిమ మూను నక్కునన్
భారపుశూలముల్ పనస
పండు త్రపాత్రిభయాభ్యసూయలన్
సారగుణాకృతుల్ గల
రసాలమహాఫలరాజు రాజిలన్.

క. చిలుకల కలభాషణములు
కలకితనంబులును మాటకారితనంబుల్
గులశీలము లిన్నియు
నిష్ఫలములె మార్జాలచక్రవర్తులపాలన్.

క. సాగుగయ్యో నాకులన్నియు
ఘరఁదొంగెను బండులున్ నిదాఘుంబున మున్;
వ మాధవ! నీకరుణను
మాలా దరుణత్వమూను మాకంద మిఁకన్.

ఉ. పెద్దదియై కనుంగవకు
విందగు బూరుగుఁబూవుఁ జూడఁగా
బుద్ధి జనించె బుట్టు బువుఁ
బోలుఫలంబిటనంచుఁ జిల్కకున్
సద్దము నట్లు గాచికొన
దైవవశంబునఁ గాచి పండఁగా
నద్దిర! లోన దూదియయి
యయ్యదియున్ హృతమయ్యెఁబయ్యరన్.

ఉ. చిచ్చుజకాలకూటము భు
జించిన శంభుఁడు నీలకంఠుఁడే;
వచ్చి విషాహులన్ మెసవు
బర్హిణముఖ్యుఁడు నీలకంఠుఁడే;

పచ్చిక మీఁద మింగిటను
　　ప్రాకెడు పుర్వుల నేరువిత్తె యో
పిచ్చుక ! నీలకంఠుఁడనె
　　నేను నటింపఁ దలంచుకొందువో.

ఆ. సకలబుధులు రసికసారరసానుమో
దకులె కాక భిన్నధర్ములెవరు ?
కుసుమసమయమందుఁ గోకిలస్వరమింపొ
కాకియరపు సొంపొ కర్ణములకు ?"
　　　　(వసురాయకవి తెలుఁగు)

అని జగన్నాథపండితుడు తన పండితరాజశతకమున వ్రాసినాడు. ఈకవి ప్రకృతిస్వభావము నెంత బాగుగ గమనించెనో భామినీవిలాసమును జదివిన దెలియును. ఇంత విపులముగ ప్రకృతిస్వభావ మేగ్రంథమునందును ప్రదర్శింపబడియుండలే దను టతిశయోక్తి కాదు. భగవంతుడు ప్రకృతియం దెన్నో అన్యాయములను చేయుచున్నాడు.

"సీ. ముసిఁడిప్రాకున సైతమును బండ్లుగల్పించి
　　చెఱకున కేల సృజింపఁడాయె
భూతిగడ్డను సైతమును గంధమొనరించి
　　కుందనంబున కేల కూర్పఁడాయె
కాలమురాళ్లకు సైతమును బువ్వుఁ గల్పించి
　　శ్రీగంధమున కేల చేర్పఁడాయె
బుట్టక్రోవుల్లై సైతమును దేనె గలిగించి
　　గేదంగి కేల కల్గింపఁడాయె.
ధర నిరక్షరకుక్షుల ధనులఁ జేసి
విద్యగలవారి నేల దుర్విధులఁ జేసె
బ్రహ్మ వననేటి కతని నేర్పరిగ నెంచి
పుడమి వర్ణింపకవులఁ జెప్పెడిది గాక."

అని విప్రనారాయణుడు విలపించునట్లు చదువుచున్నాము.

ఇది నిజమే. మంచిసువాసన లీనుగులాబికి ముళ్లు, మంచియందముగల మోదుగ పువ్వునకు సువాసన లేమి మహావృక్షమునకుఁ జిన్నకాయలు, బలహీనమగు తీగకు గుమ్మడికాయలు, బ్రహ్మచారులకు విరహితులకు మిథునములకు గూడ నొకేమాగు వసంతము దాపురించుట, శారదరాత్రులందు ప్రియుల నెడబాపుట, యిది యన్యాయము కాదా? గండుకోయిలలు, భృంగములు, పడుమవారలు గల శాశ్వత వసంతమును మాత్రమే సృజింపని భగవంతుడు నిందార్హుడే. అది యేమిపాపమో కాని, యౌవనమున వైధవ్యమును, వసంతమున విరహము నానిర్దయుడు కలిగించును. విప్రనారాయణుఁడు అందులకే బాగుగ బుద్ధి చెప్పినాడు. భగవంతునికి కొంచెము పిచ్చికూడ నున్నట్లు తోచుచున్నది. ఏలన, సౌందర్యము ప్రకృతిస్వభావస్వరూపముల ప్రదర్శించుచు మధ్యమధ్య వైరస్యమును వైపరీత్యమును కలిగించుచుండును. పాటివట్టిని, తాడిచెట్టును, బొంతకాకిని, నీగ్రోను, నల్లజాతిగ నేల సృజియింపవలె? ఊరకుక్క సీమకుక్క నేల చూచి మొఱుగవలె? మానవుడు మృష్టాన్నము భుజించియు కొన్ని వేళల నేల నాకవలె? యజమాను నింట మాంసాగులు తినకునక మేల ప్రాతయెముకను నములవలె? కృష్ణాగోదావరు లాదిగాగల తియ్యనిపుణ్యనదులను సృజియించిన భగవంతుడు సముద్రము నేల క్షారముగ చేయవలె? ఆంధ్రదేశీయుడు ఉత్తరధ్రువపరిస్థితులను చూచి భగవంతుని విశాఖపట్నపు వైద్యాలయమునకుఁ బంపవలె ననఁడా? అందువలననే భగవంతుని చెయ్దములను విమర్శించి బ్రహ్మను కసిరిన విప్రనారాయణుడు మానవ స్వభావమును ప్రదర్శించుచున్నాడు. సాగంగ తమ్మయకవియు నీభావములను నిర్భయముగ, చక్కగ చెప్పి కృతకృత్యుఁడయినాడు.





# నేను - నీవు

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

నేను నీవను భేదమే లేని స్నేహ
మున బ్రవర్తిల్లి యేకత్వమొనర, సాత్త్వి
కావ్యయానందలీలకు నాశ్రయం బ
నంగ నుంటిమికద; యాలనాడు మనము.

పూవు నీయది యందలి తావి నాది,
తేనె నీయది యందలితీపి నాది,
పాట నీయది దానిభావంబు నాది,
మెఱుపు నీయది యందలి యొఱపు నాది;

అను తెఱంగున నీది 'నాయది' యనంగ
పంచుకొనియుంటి మానంద భాగ్యరాశి
స్వార్జితములైన విత్తముల్ పంచుకొనుచు
మంటి మట్టుపైన పైమార్గ మనుసరించి.

కలనుగాంచితి నొకమాంసఖండ మెవరో
తీసుకొనివచ్చి దీనిని తీసికొను మ
టంచు నిచ్చిరి, యది స్వీకరించి, దాని
బంచవలయునో? నీ కనుపాపబుద్ధి
దాని నొకచోట దాచి నీదరికి వచ్చి
నావి నే గొంచుబోయెద; నీవి నీవు
కొనుము, విడిపోద మీపొత్తు చనదుమనకు
నంటి రాజసవృత్తి న న్నంటికొనగ
వీడిపోయితి నిన్ను, నీవిచ్చినట్టి
పూర్వసంపదలను నొక మూలవైచి,
మాంసఖండంబె సర్వసంపదలటంచు
దానితో నుంటి తొంటినేస్తంబు మరచి.

పూవులును దావులును వీడిపోయె నెటకొ,
తేనెలును తీపు లెందొ గతించిపోయె,
పాటలును భావముల గూడి పారిపోయె,
మెఱపులును నొఱపులు నెందొ సురిగిపోయె
ఏది నాభాగ్యమనుచు నే నెంచినానొ,
యెంచి నా శక్తులెల్ల నర్పించినానొ,
దానికై నిత్యమును వెనుదగిలి, మృత్యు
దేవత యనంగ నొక కుక్క తినగ జొచ్చె.

దాని దప్పించుకొనదగుదారి లేక
పూర్వ వృత్తాంతమును తలపోసి యుంటి
నపుడు జ్ఞప్తికి వచ్చితివయ్య! నీవు
చూడజూడంగ నాకతి చోద్యమయ్యె.

కష్టములు నావి యయ్యె సౌఖ్యములు నీవి
యయ్యె, చీకటి నాదయ్యె, నయ్య! వెలుగు
నీదియయ్యెను సర్వము భేదమయ్యె
నటకటా! మాంసఖండంబు, కారణముగ
అనుచుజింతించి, మేలెంచి యపుడు మాంస
ఖండ మాపాపకుక్కయె గాన వైచి
తదియు గొనిపోయె దాని ననంతరంబు
చూచుకొంటిని తొంటి వస్తువులనెల్ల.

పూవు తావియు నేకమై పోయె నపుడు;
తీపియును, తేనె, యొక్కెడ నేపుజూపె;
పాటయును భావమొక్కటై పరగి మ్రోసె;
మెఱపునొఱపును నొక్కచో నిరవుకొనియె

నేను నీవంటి నీవు నేనే యటంటి,
కుక్క నేనంటి మాంసంపు ముక్క నంటి,
అంతయును మిథ్యయంటి సత్యంబు నేన,
యంటి; సకలంబు నం దంటియుంటి నంటి.



# ప్రాచీన హైందవ గణితములు

దర్భా యజ్ఞేశ్వర సోమయాజి గారు, బి. ఏ. యల్. టి.

IV

(తొమ్మిదవసంచిక తరువాయి)

## హిందువుల గణితశాస్త్ర సాంప్రదాయములు

ఇక హిందువులు వివిధగణితభాగములం దెంతెంతవఱకు సాధనముచేసిరో యను సంగతిని గూర్చి యీభాగమున ప్రకటించెదను. ఇంతవఱకు మన మరసిన విషయములకు దోడుగ మఱికొన్ని నూత్నవిషయములను జేర్చి, చర్విత చర్వణముగ నగపడువానికి నూత్నరూపము నొసగి యిందు ప్రకటించెదను. ఒకేవిషయమునకు సంబంధించిన యంశముల నచ్చట నొకటి, వేరొకచో మరికొన్నియు ప్రకటించి యుండుటచే వానివాని యనుబంధములన్ దృష్టియం దుంచుకొనుట యెల్లరకు సాధ్యముకాదనియు, నొకేవిషయ సంబంధ విశేషముల నొక్కచోటునకుఁ జేర్చిన యవి మనస్సునకు సులభముగా నెక్కుననియు నెంచి యిద్దానిని వ్రాయసంకల్పించితిని.

63. హైందవగణితములు గ్రీకుగణితములకంటె కొంచెము వృద్ధినందినవిగ నుండు పేకాక, పదునారు, పదునేడు, పదునెనిమిది శతాబ్దములం దైరోపీయులు కనుగొనినగణిత భాగములను కొన్నివిధముల పూర్వాస్వాదన మొనర్చు (Anticipate) చున్నవి. నవీన గణితజ్ఞానమంతకు నీగణితమే పుట్టుకొమ్మగా నున్నది. అందరివలెనే హిందువులు కూడ మిక్కిలి ప్రకృష్టములైన సిద్ధాంతములను చేయజాలకపోయిరి. వరాహమిహిరు (క్రీ. శ. 587.) డొప్పుకొనినట్లు హిందువుల ఖగోళ శాస్త్ర ప్రకర్షకు గ్రీకులఖగోళశాస్త్రములు కేలూత నొసగినట్లు తెలియవచ్చుచున్నది. హిందువుల విజ్ఞానము చాలమట్టుకు వారిచే నార్జింపఁబడినదే. ఇతరులయొద్ద వారు గైకొనిన విజ్ఞానము చాల కొంచెమనుట కెంత మాత్రము సందియము లేదు.

64. అవలోకనములుసల్పుట, ప్రయోగములను నిర్వర్తించుట యను సాధనములను సేకరించికొని, తత్త్వనిర్దేశ విశ్లేషణములు, యథార్థనిర్ధారణాశయములు నను,నుపాంగములను దోడుచేసికొని హిందువులు తమ విజ్ఞాననయనముతో నీ బాహ్యప్రపంచముమీద

సింహావీక్షణము చేసి, దానగల్గు భౌతికవికారాదులందు గర్భితములైన రహస్యములను గ్రహించి వానినెల్ల శాస్త్రమనుపేర ప్రపంచమునకు బ్రకటించియున్నారు. శాస్త్రజ్ఞానమునందు గ్రీకు లెంతప్రాముఖ్యమును గాంచిరో యంతప్రాముఖ్యమును హిందువులుకూడ బొందినట్లే కన్పట్టుచున్నది.

1. అంకగణితము.

65. కెజోరీగారి యభిప్రాయమును జదివినంతమాత్రముననే హిందువులు గణితముననెంతపరిశ్రమచేసిరో తేటపడగలదు. "ప్రస్తుతము పాశ్చాత్యశాస్త్రములందు కలిసిన గణితజ్ఞానము చాల ప్రకృష్టమైనది. ఆధునికాంకగణితబీజగణితములయాకారతత్త్వములు రెండును ప్రత్యేకముగా హైందవాచారనిష్ఠగలవియేకాని గ్రీకునాచారజములు కానట్టు స్పష్టపడుచున్నది. సంకేతప్రకటనలందణుమాత్రమేని కొఱతలేని హైందవ సంఖ్యానీకమును, ప్రస్తుతగణితవ్యాపారములతో దుల దూగు హైందవగణితవ్యాపారములను (Mathematical processes) చారుతరములగు హైందవబీజగణితీయవిధులను స్మరించి గంగాతీరవాసులగు ద్విజశేఖరులు ప్రశంస నీయులో కాదో యోజింపుడు. గ్రహచారమెట్టిదో కాని ప్రకృష్టములైన హైందవావ్యక్తవిశ్లేషణ ((indeterminate analysis) విధులైరోపీయులకు చాలకాలమువఱకు చేజిక్కకయే యున్నవి. అవి రెండుమూడు శతాబ్దములు ముందుగానే లభించియుండినచో పాశ్చాత్య గణితములకుఁ గొంచెముప్రేరకములుగ నుండెడివి. ప్రాచీనులలో హిందువులు గొప్పగణకులు. వీరంకెలనేఘాతమునకేని (Power) పెంచుటయందు నేర్పరులు. వర్గమూల,ఘనమూలాదులను నిర్ణయించుట వీరికి కరతలామలకము. డీమోర్గను గారు విన్నవించినట్లు గ్రీకుల జ్యేయాంకగణితభాగము కంటెను కూడ హిందువులయంకగణితమే మిక్కిలి ప్రశస్తముగా నున్నది. వేయేల, మనమిప్పుడు వాడుచున్నది కేవలము హైందవాంక గణితమే" అని కెజోరీగారు వ్రాసియున్నారు.

66. అంకగణితోత్పత్తికి కారణభూతములైన, (1) యంకెలను కనుగొనుట, (2) దశాంశసమితిని యంకెలను ప్రకటించుట యను నీరెండు విషయములను హిందువులే కల్పించిరి. క్రీ. పూ. 300 నుండియు కూడ హిందువు లంకెల నుపయోగించుచున్నారు. క్రీ. శ. 256 నం దశోకుని పర్వతశాసనమునందు వీని నుపయోగించియున్నారు. మన యంకెలను 'అరబ్బీయాంకము" లని పాశ్చాత్యులు వ్యవహరించుచున్నారు. కాని యిది యచరితార్థక సంజ్ఞయే (misnomer). వారీసంఖ్యలను నరబ్బీయ గురువులకడ నేర్చికొనిన కతముననే యీనామము వీనికి రూఢమైనట్లు తోచుచున్నది. క్రీ. శ. 476 నందున్న యార్యభట్టు దశాంశసమితి నెరుగును. క్రీ. శ. 598-660 లకు మధ్యకాలమున నున్న బ్రహ్మగుప్తుడుకూడ నీయంకెల నెరుగును. క్రీ. శ. 1114 నందున్న భాస్కరుడు దీనిని గూర్చి సంపూర్ణముగా నిర్దేశించియున్నాడు. అరబ్బుల యొక్కయు, గ్రీకో-సిరియనుల యొక్కయు

గ్రంథములందు దివి కనబడుటకు పూర్వము కొన్ని శతాబ్దములకు వెనుకనే దశాంశసమితిని హిందువు లెరుగుదురు.

67. సంఖ్యానీకసమితియు, లెక్కించు విధానమును నీరెండిటినికూడ నరబ్బులు హిందువులకడనే నేర్చికొనిరి. "మన మిప్పుడుపయోగించు నంకెలు చక్కని యాకారముగల హైందవసంకేతములనుండి యుత్పన్నము" లైనవని యాల్బరున్నిగారు (క్రీ. శ. 1033) వ్రాసియున్నారు. హిందువుల యంకగణిత, బీజగణితములకును, మధ్యయుగశతాబ్దములందు యూరపున బెంపొందిన గణితమునకును మూజాగారిద్వారమున సంబంధ మేర్పడినట్లు తోచుచున్నది. ఈమూజాగారు క్రీ. శ. 813-33 మధ్యకాలమున నున్న కాలిఫ్ మామున్‌గారియాస్థానమున ప్రథమగణితజ్ఞులై వారిగ్రంథాలయాధ్యక్షుడుగ నుండెడివాడు.

2. బీజగణితము

68. క్రీ. శ. 360 ప్రాంతమున జీవించియున్న డైఫాంటస్ అను గ్రీకుబీజగణితజ్ఞుడు బీజగణితప్రాథమికజ్ఞానమును హిందువులకడ గ్రహించియుండవలెనని కెజోరిగారు భావించుచున్నారు. "సంకేతముల నుపయోగించి వ్యవహరించిన హైందవబీజగణితము యూరపున బెంపొందిన బీజగణితమునకు పూర్వాస్వాదనకర్తగా నున్నది." అని హీంక్‌దొరగారు ప్రకటించియున్నారు. హైందవబీజగణితగ్రంథముల నేదృష్టితోజూచి బీజగణితములని వ్యవహరించుచున్నామో, యదేదృష్టితో జూచినట్లైన డైఫాన్‌టస్‌గారిగ్రంథములను బీజగణితములని వ్యవహరించుటకే మనస్కరింపదు. "కరణాకరణీయపరిమాణములకు (Rational and irrational quantities) నంకగణిత వ్యాపారారోపణము చేయుటే బీజగణితోద్యమ"మని తలచితిమేని హిందువులే నిక్కముగ బీజగణితమును సృజించినవారగుదురని హెంకెల్‌దొరగారు వాక్రుచ్చియున్నారు.

69. గంగాతీరముననున్న పాటలీపుత్రమనుపట్టణమున బుట్టినయార్యభట్టు (క్రీ. శ. 476) తనకాలమునాటికి ప్రచారములోనున్న బీజగణితజ్ఞానమును సంతరించి ప్రకటించి నూత్నవిజ్ఞానప్రతిష్ఠాత యను ప్రఖ్యాతినిగాంచెను. ఈతడు డైఫాంటస్‌నకు నూఱేండ్లు తరువాతివాడు. గణితక్రియావిధులకుగాని, వారు చేసినవిషయప్రసక్తికిగాని గ్రీకులు హిందువులకు మార్గదర్శకులుగ నుండలేదని స్మిత్‌గారు ధ్రువపఱచియున్నారు.

70. గ్రీకుబీజగణితముకంటె హైందవబీజగణితములకుఁ గలప్రత్యేకగుణములను కోల్బ్రూక్‌దొరగారీదిగువరీతిని ప్రకటించియున్నారు:

1. ప్రశస్తతరమై విస్తీర్ణబాహుళ్యముగల గణితవిధు(లు హైందవగణితము)లందు గలవు.

2. ఒకటికంటె నధికమగు నవ్యక్తపదములుగల సమీకరణములతోడి వ్యవహారములు. (అరబ్బులు ప్రకటించిన సామాన్యసమీకరణములయు, క్లిష్టసమీకరణములయు వివరణముల కిది తోడ్పడుచున్నది.)

3. ఉన్నతతరగతి ఘాతీయ (Higher powers) సమీకరణముల విశ్లేషణము. దీని యందు వారు కొలదిఫలితములనుమాత్రమే స్థాపింపగలిగినను వీనినిగూర్చి కొంత ప్రయత్నము చేసిరనుఘనతయే వీరికి చాలును. ఇంతియేకాక చతుర్థఘాతీయ సమీకరణములవివరణము లాధునికవివరణములకు పూర్వాస్వాదన కర్తలుగా నున్నవి.

4. ప్రథమ ద్వితీయఘాతీయ సమీకరణముల సాధారణవివరణములందు వైఘాటస్ గారికంటె చాలముందునకు సాగి యాధునిక బీజగణితజ్ఞుల కల్పనలకు పూర్వాస్వాదన మొనర్చుచున్నారు.

5. ఖగోళవిషయ నిరూపణములందును, రేఖాగణితోపపత్తులందును, బీజగణితము నుపయోగించి వానిఫలితములను స్థాపించియున్నారు. దీనినే నవీనులు కొంతకాలమైన తరువాత తిరుగ కనుగొనిరి.

71. హిందువులు పెంపొంద జేసిన బీజగణితము కేవలము ప్రాథమికబీజగణితముమాత్రము కాదని తేటపడుచున్నది. 5వ, 6వ శతాబ్దములందు హిందువులు స్థాపించినగణితము 16వ, 17వ శతాబ్దములం దుపబృంహితమైన గణితమునకు పూర్వాస్వాదనకర్తగా పరిణమించుచున్నది. ఆధునికబీజగణితజ్ఞు లిదివఱకే తెలిసినఫలములను తిరుగ స్థాపించి ప్రకటించియున్నారు.

72. ఈ కాలమునాటి హైందవబీజగణితము యాకుబ్ మూజాగారిద్వారమున నరబ్బుల బీజగణితమునకు ప్రధానపోషకముగా నుండి మధ్యశతాబ్దములయందు యూరోపున పెంపొందినగణితము నస్పృజుగ ప్రేరేపించుచున్నది. హైందవబీజగణిత మొకవిధముగా చీనాదేశపుగణితమునకు గారణభూతమై దానివలన జపానునందలి గణితాభివృద్ధికి కారణమగుచున్నది. హిందువులకును, చీనాదేశస్థులకును, చాలకాలమునుండి విజ్ఞానసాంగత్యము లేకున్నను హైందవబీజగణిత వ్యవహారములను చీనాదేశపుగణితజ్ఞు లెఱుగుదురనియు, నిప్పటికిని మధ్యరాష్ట్రమువా రీవిధుల నభ్యసించుచున్నట్లును, విలియమ్స్‌గారు వ్రాసియున్నారు:

73. భాస్కరాచార్యుని, (12 వ శతాబ్దము) తరువాత హైందవగణితముల యభివృద్ధికిని (ప్రత్యేకముగా దక్షిణహిందూస్థానమునమున పెంపొందినది) చీనాజపానులలో వీనికి గల్గినయభివృద్ధికిని సారూప్యమున్నట్లు తోచుచున్నదని సీల్ గారు తమయభిప్రాయమును వెల్లడించియున్నారు. కాని యీవిషయమును గూర్చి యింకను విచారింపవలసియే యున్నది.

74. నలింబీహారీ మిత్రగారు విమర్శించి చూచి హిందువులు తమ బీజగణితమునం దీదిగువవిషయములను స్థాపించిరని ప్రకటించియున్నారు.

1. ఋణపరిమాణ నిరూపణము.

2. వర్గాత్మక సమీకరణముల సంపూర్ణ వివరణములు. (క్రీ. శ. 598-660 కాలమున నున్న బ్రహ్మగుప్తుడు దీనిని ప్రకటించెను).

3. అంకపాశ, అంకసంఘాతములను (Permutations and combinations) నిర్ణయించు సూత్రములు.

4. కుట్టకములు (=అనిశ్చిత సమీకరణములు=Indeterminate equations.). అతిచతురతగల యీగణితభాగమునందు సాధారణవిధులను స్థాపించిన ప్రతిభ హిందువులదే యని కెజోరీగారు రుగ్గడించియున్నారు.

5. ద్వితీయఘాతీయ కుట్టకములు. ఆతాలపువ్రాతల బరిశోధించి చూచినచో నీవిషయములవలన హిందువుల మేధాబలవిస్తారత ప్రకటమగుచున్న ట్లెఱుకపడుచున్నది.

75. నవీనగణిత విభాగములకు పూర్వాస్వాదన కర్తలుగా నున్నమూడు బీజగణిత విషయములను గూర్చి కోలుబ్రూక్ గారీదిగువరీతిని ప్రకటించుచు నిట్లు వ్రాసియున్నారు.

1. ప్రఖ్యాత మగు పైథాగరస్ ప్రమేయము (సమకోణత్రిభుజపుకర్ణోపరివర్గము తక్కిటిభుజముల యోగతుల్యమగును) యొక్కయుపపత్తిని భాస్కరుడు (క్రీ. శ. 12-వ శతాబ్దము) తనబీజగణితమునందు రెండువిధములుగా ప్రకటించియున్నాడు. వీనిలో మొదటియుపపత్తిని వాలిస్‌గారు-(క్రీ. శ. 1616 1730) కోణీయచ్ఛిన్నములను (Angular Section) గూర్చినగ్రంథమున ప్రకటించి యున్నాడు. మనకుఁ దెలిసినంతమట్టున కిదియే ప్రథమ ప్రకటనము.

2. ప్రథమఘాతీయకుట్టక వ్యాపారముల సాధారణవివరణము. ఆధునికులలో బాచెట్ (1624) దీనిని ప్రకటించుటకు మొదటివాఁడు.

3. ద్వితీయఘాతీయకుట్టక వ్యాపారముల వివరణము. ఆధునికులలో నీవిషయ ప్రకాశకుడై ప్రఖ్యాతిగాంచినది యూరల్‌గారు (క్రీ. శ. 1707-83). "వేయియేండ్లకు పూర్వమున హిందువులు నిర్ధారణము చేసినయుద్దేశకము (Problem) ఇట్టి సమీకరణముల వివరణ ఫలములను కనుగొనుట కనువుగా నున్న"దని యూరల్‌గారే నచ్చియించియున్నారు.

76. భిన్నాంకములందు హారముమీద లవమును వేయుటను ప్రకటించి యాచారములోనికిఁ గొనివచ్చినది భాస్కరుడే. వర్గమూలసంకేతము నీతడే కనిపెట్టెను.

16వ. శతాబ్దముననున్న "స్టిఫెట్, రుడోల్ఫ్"లకు పూర్వముననున్న వైరోపీయులీసంకేతము నెఱుగరు.

భాస్కరు డిదిగువ వివరణములనుకూడ చేసెను.

సీ + ౦ = సీ;

$౦^2 = ౦$;

$\sqrt{౦} = ౦$;

$\frac{సి}{౦} = \infty$

3. రేఖాగణితము

77. హైందవరేఖాగణితము తొలుదొల్త బౌధ్యాయ నాపస్తంబ శుల్వసూత్రములందు గానవచ్చుచున్నది. వేదసారస్వతమునకు జెందిన యీ భాగములందు వైదికకర్మలలో గణితజ్ఞానము నుపయోగించి చేయుబలివిధానములు, నైమిత్తికములు, బలిపీఠముల నిర్మాణాదులు ననునవి చూపట్టెడిని.

78. ఈ కాలమునాటికి హైందవ రేఖాగణితము గ్రీకుగణితపు ప్రాబల్యవిశేషముల కధీనము కాలేదు. వేదములకాలమున నుపపత్తీకరించిన ప్రమేయముల నీదిగువ ప్రకటించెదను.

1. పైథగరస్ ప్రమేయము. (i. e. సమకోణత్రిభుజమునందు కర్ణోపరివర్గము తక్కిటిభుజములమీఁది వర్గముల యోగతుల్యమగును)

2. ఏవేని రెండువర్గముల యోగవ్యత్యాసములకు తుల్యమగు నొకవర్గమునుకల్పించుట,

3. ఆయతములకు తుల్యమగు వర్గములను కల్పించుట దీనివిపర్యాసవిధి.

4. ఏదేని సరళరేఖయందలి యభీష్టబిందువునుండి యారేఖకు లంబమును గీయుట.

5. అంకెలవర్గమూలముల ప్రకటించు పొడవుగల సరళరేఖలను కల్పించుట. $\sqrt{2}$ యొక్క స్థూలఫలము.

6. వర్గముల వృత్తీకరణము (Circling of a Square)

7. వృత్తముల వర్గీకరణము (Squaring of Circles) పాశ్చాత్యులయు, హైందవాదులయు ప్రఖ్యాతగణితజ్ఞుల కీర్తిచంద్రికల దిగమ్రింగిన రాహుగ్రహముగ వర్తించిన దీసమస్యయే. మిక్కిలి ప్రాచీనులగు హిందువులు "$\pi$=3.0014" యని ధ్రువపఱచిరి.

8. చిన్నచిన్న వర్గములయొక్క సముదాయముతో క్రమక్రమముగ ప్రవృద్ధిచెందు పెద్దపెద్దవర్గములను కల్పించుట.

9. సమలంబచతుర్భుజము (Trapezium) నందు సమానాంతర భుజములను వాని మధ్యదూరమును నెసఁగినచో ప్రత్యేకముగా సమద్విబాహుకములౌ వానినిగూర్చి మాత్రమే వానివైశాల్యముల నిర్ణయించుట.

79. ప్రాచీనహైందవులగణితశాస్త్రఫలితములు కేవలమూహాజన్యములు కావు. వారు తమసిద్ధాంతముల నన్నిటిని కడుజాగరూకతతో తర్కించియే స్థాపించిరి (కెజోరీగారు). ఇవి గ్రీకుసారస్వతప్రాబల్యమున కధీనమై పెంపొందినవియుంగూడ గావు (హీత్ గారు).

80. క్రీ. శ. 475 ప్రాంతముననున్న యార్యభట్టనేక ప్రశ్నములతోఁపాటీదిగువఫలితములను స్థాపించియున్నాఁడు.

1. త్రిభుజముల వైశాల్యముల నిర్ణయించుట.

2. వృత్తముల వైశాల్యమును నిర్ణయించుట.

3. సమలంబ చతుర్భుజముయొక్క వైశాల్యమును నిర్ణయించుట.

4. సమలంబ చతుర్భుజముయొక్క కర్ణముల సంపాతబిందువునకును, సమానాంతర భుజములకును గలదూరములను నిర్ణయించుట.

5. వృత్తముయొక్క త్రిజ్యా పరిమాణమును కనుగొనుట.

వృత్తముయొక్క వైశాల్యము "$\pi$ త్రి$^2$" యనుసంకేతచే ప్రకటించుచు "$\pi = \frac{62832}{20,000}$" యను సూక్ష్మమును యథార్థమును నగుఫలమును ప్రకటించియున్నాఁడు. "$\pi$"యొక్క యథార్థపరిమాణమును పర్బాకుగారికాలము వఱకు (క్రీ. శ. 1423-61) నైరోపీయులెరుగరు.

81. ఈసిలియందుకూడ హైందవరేఖా గణితజ్ఞులు, గ్రీకుగణితజ్ఞులమీద నాధారపడి యుండలేదు. వీరి గణితజ్ఞానపార్థక్యమునుగూర్చి యొకానొక రిట్లువ్రాసియున్నారు. "అపలోనియస్ కాలమునుండియు "యూక్లిడు సాహితీ సమితి" కాలావసానమువఱకు కేవలతర్క విచారము నిష్ఫలమని నిడిచిపెట్టిరి. హైందవ గణితశాస్త్రజ్ఞు లాచరణీయములగు గణనము లందుమాత్రమే తమబుద్ధిని ప్రసరింపజేసిరి. కాని తదితరవిషయములందు విముఖతనే వహించియుండిరి. ప్రాజ్ఞులైన గ్రీకుగణితజ్ఞు లెవ్వరును నాచరింప సాహసింపని చిన్నవృత్త చాపముయొక్క పూర్ణజ్య (Chord of a Small arc) పొడవు నావృత్తచాపపు పొడవునకు సమానమైనట్లు గ్రహించిరన్న విషయమును హైందవగణితజ్ఞులు పురస్కరించికొనుటన్నదే హైందవరేఖాగణితము గ్రీకురేఖాగణితము మీద నాధారపడియుండలేదనువిషయమును ఘంటాపథముగా జాటగలదు.

82. బ్రహ్మగుప్తుడు (క్రీ. శ. 598-660) రేఖాగణితమునందు కొన్ని క్రొత్తవిషయములను, గనుగొని యీగణితభాగమును పెంపొందజేసెను ఈతని నూత్నకల్పనలు:

(1) అకరణీయ భుజములుగల సమకోణ త్రిభుజములకల్పనలు.

(2) సమకోణత్రిభుజములను గూర్చిన వివిధగుణఫలితములు.

(3) వృత్తీయచతుర్భుజము యొక్క వైశాల్యమును కనుగొనుట.

(4) సమద్విబాహుక సమలంబ చతుర్భుజముల (Isosceles trapeziums) గుణఫలితములు.

(5) వృత్తీయ చతుర్భుజముల గుణఫలితములు.

(6) వృత్తముల గుణఫలితములు (I) వృత్తఖండపు ఎత్తును, పూర్ణజ్యయు నొసగినచో నావృత్తముయొక్క వ్యాసమును కనుగొనుట. (II) వృత్తఖండపు వైశాల్యమును కనుగొనుట హిందువు లొసగిన యీ మొదటి సూత్రము (నీరూపమున) గ్రీకు లెఱుంగరు. మూజాగారు (క్రీ. శ. 830) బ్రహ్మగుప్తుని గ్రంథమునుండి యీరెండు సూత్రములను గ్రహించెను.

(7) శంకుక్షేత్రము యొక్క (Cone) ఘనపరిమాణము వేలనముయొక్క (Cylinder) ఘనపరిమాణమునందు మూడవవంతు.

(8) సూచీయొక్క (Pyramid) ఘనపరిమాణము క్రకచాయతముయొక్క (Prism) ఘనపరిమాణములో మూడవవంతు.

(9) సరాసరి రంధ్రముగల యొక కోటరము (తొట్టి) ఘనమును కనుగొనుట (క్రకచాయ వేల నాదుములలో నేదైనను సరే).

83. భాస్కరుడు (క్రీ. శ. 1114) తన పూర్వులగు, లాటుడు, ఆర్యభట్టు, లల్లభట్టు (క్రీ. శ. 449) వరాహమిహిరుడు (క్రీ. శ. 505), బ్రహ్మగుప్తుడు, శ్రీధరుడు (క్రీ. శ 853), మహావీరుడు (853), వినయార్యభట్టు (క్రీ. శ. 970.) ఉత్పలుడు (క్రీ. శ. 970)

యీసిద్ధాంతుల గ్రంథములలోని ఫలితములను సంస్కరించి సంక్షేపముగా బ్రకటించియున్నాడు.

84. ఆర్యభట్టాదులు "$\pi$" యొక్క సూక్ష్మఫలితము నెఱిగియున్నను, తరువాత గణితజ్ఞులు గణనసౌలభ్యముకొఱకు దీనిస్థూలఫలమునుమాత్రమే యని తెలియజేయుచు భాస్కరుడు తన గ్రంథమునందు "వారుస్థూలఫలముల నుపయోగించినది దీనిసూక్ష్మ ఫలముల నెరుగకకా"దని ప్రకటించియున్నాడు. బ్రహ్మగుప్తుడు "$\pi=3$, ($=\pi\sqrt{10}$ దాదాపుగా)" ఫలమును గణనసౌలభ్యముకొఱకై గ్రహించెను.

85. పైథగరు ప్రమేయమున కీత డొసగినరెం డుపపత్తులనుపేర్కొనకతీరదు. క్రీ. శ. 1616, 1703 లలోనున్న వాలిస్‌గారు పీనిలోనొకయుత్పత్తిని తిరుగ కనుగొనిన ఫలితములనే హైందవరేఖాగణితజ్ఞులు కూడ కనుగొనినను నీఫలితములు ప్రకటన సంస్కరణ విధులందుయూక్లిడు (క్రీ. పూ. 306)నకు గల నైసర్గికనైపుణ్యములు మాత్రము మనవారి కలవడలేదు.

4. త్రికోణమితి (Trigonometry)

86. కొన్నివిషయములందు గ్రీకుత్రికోణమితికంటె హైందవత్రికోణమితియే యెక్కువయభివృద్ధిబొందినది. హైందవత్రికోణమితికొన్ని విషయములలో నవీనత్రికోణమితికి పూర్వాస్వాదకముగా నున్నది. హైందవగణితజ్ఞులు (1) "జ్యా"ల పతకమును" (Table of sines) (2) "ఉత్క్రమజ్యా"ల పతకమును (Table of Versed sines) కల్పించియున్నారు. పాశ్చాత్యులుపయోగించు "సైన్ (=sine)" అను పదము సంస్కృత "సింజిని" యను పదముయొక్క యరబ్బీయసంకరము.

87. "జ్యా"ల యుపయోగమును గ్రీకు లెరుగరు. వారు పూర్ణ"జ్యా"లసహాయముననే గణనము జేయుచుండెడివారు. వృత్తపాదము యొక్క (Quadrent) $\frac{1}{24}$వ వంతునకు హైందవ"జ్యా"ల పతకము ఫలితములను ప్రకటించుచున్నది; "ఉత్క్రమజ్యా" లపతకము కూడ నీవిధినే (యిదేరీతిగ) ప్రకటింపబడియున్నది. వీనిరెంటిటనుకూడ "జ్యా"ఉత్క్రమజ్యా"లు పరిధియొక్క నిమిషములుగ భిన్నములను వర్జించియే ప్రకటించుచున్నది.

88. "జ్యా"ఫలితములను గణనము చేయు సూత్రము ద్వితీయచలనీయవిధిని (Method of second differential) పురస్కరించికొని పతకములను కల్పించుకీతిని సూచించుచున్నది. ఫలితములను గణనమొనర్చుటయందిది యొక యనుపమానమైన నాగరికవిధి. (క్రీ. శ. 1556-1631) లందున్న యాంగ్లగణితజ్ఞ శిరోమణియగు "బ్రిగ్స్" గారుమాత్రమే యీవిధిని ప్రప్రథమమున వాడియున్నారు.

89. హిందువుల ఖగోళీయపతకముల నటుపిచూడ వారు గోళీయత్రికోణమితి యందలి ప్రాముఖ్యప్రమేయముల నెరిగియున్నట్లే తేటపడుచున్నది.

5. బీజజ్యామితి

90. క్రీ. శ. 850 ప్రాంతముననున్న "న్యాయ"తార్కిక శిరోమణియగు వాచస్పతి బీజమూర్తజ్యామితి (Co-ordinate solid geo-

metry) యొక్క మూలాంకురముల ప్రాథమిక విధిని పూర్వాస్వాదన మొనర్చెను. ఈతడు బీజ జ్యామితిని కల్పించిన పాశ్చాత్యగణకశిరోభూష ణుడగు "డెకార్ట్" 1596 1650 అనునాతనికి "8 శతాబ్దముల పూర్వమునను౦డెను" సీల్ గారు వాచస్పతిగారి యభియోగముల దిగువ రీతిని వర్ణించియున్నారు. "అవకాశమునం దేదేనియొక బిందువుయొక్క స్థానమును నిర్దే శించుటకువాచస్పతి మూడక్షములనుగ్రకొని యున్నాడు. (1) ఏదినమునం దైనను సరే ఆనాటి సూర్యోదయస్థానమునుండి సూర్యా స్తమయ స్థానపర్యంతము నుండురేఖ నొక దానిని (=తూర్పుపడమర రేఖను); (2) మట్ట తలస్థమగు నీపై రేఖయొక్క లంబదళనము నొకదానిని, (=ఉత్తర దక్షిణరేఖను); (3) పై రెండు రేఖల సంపాతబిందువును ఆనాటి సూర్యుడు నెత్తిమీదికివచ్చిన స్థానముతో సంధించురేఖ నొకదానిని (=ఊర్ధ్వాధర రే ఖను); క్రమముగా మూడక్షములుగను జేసి వ్యవహరించెను. అవకాశమునం దేదేనియొక బిందువు రెండవబిందువుతో నెట్టి పరస్పరస్థితి నున్నదో ప్రకటించుటకై యీమూడక్షము లనుండియు నవి యెంతెంతదూరము లందున్న వో నిర్ణయింపవలెను.

ఈదూరముల సహాయమునం జేసి వానిపర స్పరస్థితులు నిర్ణీతము లగును. ఆయాయక్షస్థ ములగు నీదూరములను సక్రమముగా వ్రాసిన చో (Written in order) వీనిలో ముందు సంభవించునది తక్కువదూరమునను, తరువాత సంభవించునది యెక్కువదూరమునను నున్న ట్లెఱుకపడుచుండును. అవకాశము నందున్న యేపరమాణువుయొక్కస్థితినేని మఱియొకదాని తోడి పరస్పరస్థితిని యీయక్షములతో సం బంధమేర్పరచి పై రీతిని ప్రకటింపవచ్చును.

91. అవకాశము మూడక్షములుగలది యను భావముయొక్క రేఖాగణితీయపృథక్క రణమునుమాత్రమే యియ్యది ప్రకటించుచు న్నది. సూక్ష్మదృష్టితో నాలోచనలను జలిపి నచో నియ్యది మూర్తబీజజ్యామితియొక్క బీజాంకురముల నొకవిధముగా పూర్వాస్వాదన మొనర్చుచున్నదని యొప్పుకొనక తీరదు.

### 6. చలనకలనము

92. క్రీ. శ. 1642-1727 నందున్న న్యూ (New) గారిని (1) చలనకలనతత్త్వ బీజమును (Principle of differential calculus) కనుగొనుటయందును; ఖగోళీయ ప్రశ్నము లను, గణనములను, నీవిధి ననుసంధించి ప్రకటించుటయందును; నీతని కైదు వందలయేండ్లకు బూర్వమున నున్నభాస్క రాచార్యుడు (క్రీ. శ. 1114) పూర్వాస్వాదన మొనర్చియున్నాడు. భాస్కరుడు స్థాపించిన సంకేతయు (Formula) దానిని ఋజువుచేసిన యుపపత్తివిధానమును, నవీనగణితీయ ఖగోళ శాస్త్రమున నుపయోగించు తాదృశవిధు లతో ఆయా చలనీయఫలితము లను (Differential of the planet's magnitud) నిర్ణయించుట యనుదానితో చాలవఱకు పోలియున్నది. భాస్కరాచార్యుని తాత్కా లికచలన భావనయు, దానిని నిర్ణయించు విధానమును చూడ నాతడు చలనకలనము

యొక్క తత్త్వబీజములతో పరిచయము గల వానివలె కనబడుచున్నాడు. చలనరాశి నిర్దేశతత్త్వ నిరూపణము (Integration) నం దార్కిమెడీసుగారు చేసినపరిశ్రమకంటె చలనకలనమున భాస్కరుడు చేసినపరిశ్రమ తీవ్రమైనది.

93. భాస్కరాచార్యుడు చలనకలనమున కనుగొనిన విషయవిశేషమును సీల్ గా రీడిగువ రీతిని బ్రకటించియున్నారు:— 'గ్రహముల తాత్కాలికచలనమునుగూర్చి లెక్కించుతరి నాగ్రహముయొక్క క్రమానుసారస్థితులను పరీక్షించి యాకాలావధియందు మాత్రము-(అమిత సూక్ష్మమైన కాలపరిమాణమైనను నీతఁ డొకత్రుటి కాలావధిని అనగా ఒకనిమేషమున 1/3375 వంతుకాలమునే మాత్రమే గైకొని) ఆగ్రహము యొక్కగతిని (Motion) స్థిరపరిమాణము గల దానినిగ భావించెను. ఈ విధానము నవీనచలనకలనతత్త్వవిధిని బోలియుండుటే కాక యించుమించుగా దానితో సారూప్యముగలదియే యగుచున్నది. భాస్కరాచార్యునిశకమున (12 వ శతాబ్దమున) నిట్టికలనవిధి యొకటియున్నదని విని నచో పాశ్చాత్యగణితజ్ఞు లచ్చెరు వొందెదరని యొకానొకరు వాక్రుచ్చిరి. భాస్కరు డసంపూర్ణస్థితినున్న చలనకలనకర్తయే యాయెను కాని యాత డీవిధి స్థూలఫలములను మాత్రమే ప్రాపింపజేయునని యెచ్చటను గూడ ప్రకటించియుండలేదు. భాస్కరు డీకలనవిధిని బ్రహ్మగుప్తుని స్థూలసూక్ష్మీకరణవిధానముతో సంధించియే ప్రకటించెను. భాస్కరుడు ప్రకటించిన 'జ్యా'లపతకమును కల్పించుటకై యుపయోగించినగణనవిధు లీచలనకలనతత్త్వాత్మకములే యైన ట్లెఱుకపడుచున్నది.

## నేను

ఉప్పొంగిపొరలెడు జీవనాంభోధిలోన
నలయయి జనించి ప్రవిమలానందశీత
[illegible] ల్లు నీదు కౌగిలినిజేర
[illegible] కరములనుజూచి, హర్షాన గంతులిడుదు.
గంతులిడి ప్రమద ముప్పొంగ కడలినుండి
ఎగసి నిను జేర యత్నించి, ఎగురలేక
క్రుంగిపడి వింతగా నవ్వుకొందునోయి
కరములనుజూచి హర్షాన గంతులిడుదు.

"కృష్ణుడు"




(ఆంధ్రభాషావిమర్శనములకు ప్రత్యుత్తరము)

ఈ నాటకము చాలామంది విద్వజ్జనులు మెచ్చుకొని యుండవచ్చును. అనేకస్థలములలో ప్రేక్షకులు ఆనందమగ్నులై యుండవచ్చును. ఈ సంగతిని నావ్యాసములో చెప్పేఉన్నాను; గ్రంథముపై ఇచ్చిన అభిప్రాయములవలననే స్పష్టమవుతున్నది. కాని వారిమెప్పు నావిమర్శనకు ప్రతిష్టంభకము కాదని నా అభిప్రాయము. గ్రంథములో లోపములుంటే ఎందుకు మెచ్చుకుంటారో, ఎందుకట్టి అభిప్రాయములు ఇస్తారో నేను చెప్పలేను. మెప్పులున్నవి కాబట్టి నావిమర్శన తప్పు కానేరదని నామనవి.

నావిమర్శన పూర్ణమైనది కాదని నేనే అంగీకరింతును. ఏవేవో విషయములు విమర్శనార్హములు ఉండిపోయినవట. నేను వ్రాసినదానికి నేను ఉత్తరవాదిని కాని విడిచిపెట్టిన దానికి కాను. వాటిని విడిచివేసినందుకు హేతువు లుండవచ్చు లేకపోవచ్చు. వాటితో ప్రసక్తి లేదు. అయినా ఖండనవాదులు ఆరోపించినంత వరకు అసంగతులను నేను విడిచివేయలేదు. కథాభివృద్ధి నేను పరీక్షించే ఉన్నాను. వివిధభాషలు నాకు నాటకములో కానరాలేదు; అంతా ఏకభాష, గ్రాంథికభాషే కదా. కాలగమనిక (Passing of time), రంగము, యనుక్రమణిక (Arrangement of the Scenes) అని అన్నవి, నాటకవిషయములా రంగవిషయములా? వీటిని నేను విమర్శించలేదు; ఇప్పుడు విమర్శిస్తే బాగుండదుకూడా.

నేను వ్యావహారిక భాషావాదినే. భాషాచర్చలోనికి నేను దిగలేదట. లోపము లున్నవని చూపించినానే. అంతకంటె ఎక్కువగా ఆచర్చ నాకు నచ్చక మానినాను. మరొకరు చేయవచ్చును. పెద్దపెద్ద పండితులే ఇప్పుడు ఆంధ్రభాషను సరిగా పూర్వపునియమముల ప్రకారము ఉపయోగించ లేకున్నారని రావుసాహెబు గిడుగు రామమూర్తిపంతులవంటి పండితులు ప్రకటిస్తూ ఉంటే, మన కెందుకు తగాయిదా లని ఊరుకొన్నాను.

నాటకమునకు ప్రదర్శనశక్తి ముఖ్యమని నేనే చెప్పియుంటిని. ప్రదర్శనమునకు బాగాఉంటే పఠనీయగ్రంథమవుతుందా? సురభికంపెనీనాటకములే ప్రమాణములు. నాటకములు దృశ్యకావ్యములుకదా, అయితే దృశ్యమునకు బాగాఉన్నా, కావ్యముగాకూడా ఉండవద్దా? దృశ్యములకు పరీక్షాస్థలమైన రంగము కావ్యములకు కూడా అవుతుందా? దృశ్యములను మెచ్చుకొన్న ప్రేక్షకులు కావ్యమును కూడా మెచ్చుకొన్నట్లేనా? రసనిర్ణేతలు ఎవరు? ఈభేదము చేసే నేను నావ్యాసమును వ్రాసియుంటే దానిని ఉల్లంఘించి ఖండనవాదులు వాదిస్తే ఏలాగు? ఈసందర్భములో మనదేశీయుల (అనగా సంస్కృతకవుల) రూపకములను ఉదాహరణములుగా చెప్పవద్దు; వారి నియమములను మన మిప్పుడు పాటిస్తూ ఉండలేదు.

నావ్యాసమునుండి ఐదుసారాంశములు, తీసి వాటిపై ఖండనగా కొంత వ్రాసియున్నారు. ఆసారాంశములకు ప్రత్యుత్తరము ఆవరుసనే వ్రాస్తాను.

i "పురాణకథలుకల నాటకములు నాటకారంభదశను సూచించునని" యొకసిద్ధాంతమును నేను సల్లడి చేస్తున్నానట. ఈమాటలు నావ్యాసములో లేవు. నేను వ్రాసినది ఏమిటంటే "పాశ్చాత్యదేశమున నాటకారంభదశలో ఉద్భవించిన మహిమల నాటకములవంటివి మన

* దీనిని గురించిన విమర్శనల నిక ప్రకటింపజాలము.—సంపాదకుడు.

వాఙ్మయములో ఇప్పుడు రాజిల్లుచున్నవి. వాటినుండి నీతులు సంగ్రహించి ...నాటకమును మెచ్చుకొనే ప్రేక్షకులు పురాణయుగమును దాటినవారు కారుగదా" ఇవి నావాక్యములు.

ii ఖండనలో తీసిపెట్టిన సారాంశము నేనువేయలేదు. "గర్వభంజన కథకున్నూ, ఈలీలలు కథకున్నూ సంబంధము కానరాదు" అని నావాక్యము. సంబంధము ఇదా అదా అని ఊహించి వాటిని చర్చించి, "ఏదైనా డొంకతిరుగుడు సమాధానమే" అని వ్రాసినాను. దీనికి ప్రత్యుత్తరముగా "నాంది మొదలు మంగళమువరకు విమర్శిస్తే; నాటకము చక్కగా చదివితే" అని ఖండనకారులు ఆగ్రహించినారు. ఆతరువాత "ఏల ఈలీలల కథ" అని ప్రశ్నచేసి ఉపపత్తులు మూడుచెప్పేరు. రెండోదానిని, స్త్రీలోలత్వభ్రమనాశనమును, నేను చర్చించేను; నాప్రశ్నలకు సమాధానము చెప్పక, కృష్ణుడు స్త్రీలోలుడు కాడు, స్త్రీలోలుడుకాడు, అని ఘోషిస్తే ఉపపత్తి స్థిరపడునా? మొదటి మూడు ఉపపత్తుల ప్రకారము లీలలకు పూర్వము సత్యభామాహంకారము గురించి గాని కృష్ణుని మహిమగురించిగాని నారదునికి తెలియదని చెప్పవలసి వస్తుంది. అయితే నారదుని రాక యాదృచ్ఛికమా? శచీంద్రుల సంభాషణఫల మేమిటి? అదికాక లీలలో వ్యక్తమైనది సత్యభామ మూఢ్యమా లేక అహంకారమా? కృష్ణునిసామాన్యమహిమా లేక కథతో సంబంధించిన మహిమా? ఈఉపపత్తులే నిలవవలెనంటే నాటకములోని కథారచన మారవలెను. అవి చక్కగాసూచన కావలసి ఉంటుంది.

iii. ఈశ్వరగుణములను మనుష్యస్వభావముతో మేళనచేయుటవలన నాటకములో కనబడే దోషముల గురించి నేను వ్రాసిఉంటే, గీతాశ్లోకములు వ్రాసి కృష్ణుడు ఈశ్వరుడే అని రుజువుచేయుట ఎందుకు? కృష్ణుడు లీలామానుషస్వరూపుడు అని ఎందరువార్లు నాటకములో ఉంటే నేనుచూపిన రసదోషములు ఎట్లా పరిహరింపబడును?

iv కృష్ణుని కోపకారణము ఏమిటి అని నేను ప్రత్యేకముగా చర్చింపలేదే. అది ఒకముఖ్యాంశముగా కూడా నేను వ్యాసములో వ్రాయలేదే. ఆకారణము భామనిరాకరణమని నేను వ్రాశేను. అదికాదట రుక్మిణి ఇంటికి వెళ్లకూడదని భామచేసిన నిర్బంధములు. అలాగు ఎక్కడ ఉంది? మొదటి అంకము కథంతా భామనిరాకరణము; నిరాకరణమప్పుడే కోపంవచ్చింది. అయితే కారణమేమై ఉంటుందో కదా!

v ఇందులో సారాంశమేమీ లేదే. నాకేమో నాలుగుసంగతులు గోచరము కాలేదట. మొదటిది కృష్ణుని ఈశ్వరాంశము; అది లేదని నేను అనలేదు. దానితో మనుష్యస్వభావము మేళనము చేయుటచేత వచ్చినచిక్కు చూపించేను. రెండోది భక్తి; నేనూ అన్నదే. చూ. ౩౨, ౩౩ పుట. మూడోదానిగురించి నేను వాదించలేదే. దానితో నాకు ప్రసక్తిలేదు. నాల్గోది నారదుని శీలముగురించి. నేను వ్రాసిన ఒక్కవాక్యములోను నారదునిభక్తి మాటఉన్నదే. చూ. ౩౧ పుట; అంతకంటె ప్రత్యేకముగా నారదుని ప్రయోజనము గురించి నేను చర్చించలేదు. ఇవి నాకు గోచరము కాలేదన్నమాట ఏమిమాట. ఖండనకారులు చెప్పినవర్ణనలు పురాణములోకూడా ఉంటవికదా; అవి కేవలము నాటక ప్రాశస్త్యమునకు ఎట్లు హేతువు లగునో తెలియదు. ఈలాగే మరొకసంగతి ఉన్నది. గుణపరిశీలనము నావిమర్శనావరణములోనికి రాలేదని వ్రాసినారు. దానిగురించి చర్చచేసి ఉన్నాను; చూ ౩౧ పుట.

ఏమి అవస్థ అని నేను అనవలసివచ్చింది. నేనేవో కొన్నిలోపములు చూపించేనని ఆగ్రహించి, నేను చేసిన వ్యాఖ్యానమును మరిచి నాపై ఉన్నవి లేనివి కలిపి ఖండనవ్రాయుట, ఖండనముద్రవ్రాసిన ఉపదేశమునకు సరిపడినదా అని నేను అడుగుతున్నాను. విమర్శన చేయుటలో నాకేమి గ్రంథకర్తగారితో తగాయిదాలేదు. వారిని నేను ఎరుగను. గ్రంథములో ఒకచక్కని అంశము ఉండుటచేతనే దానిపై ఆవ్యాసము వ్రాసేను. "పరిశోధిత ద్వితీయముద్రణమునకు" నావ్యాసము కొంత సహకారియై ఉంటే నావ్యాసము యొక్క ప్రయోజనము తీరినట్లే.

నావ్యాసముపై చేసిన ఖండనకే నేను ప్రత్యుత్తరము ఇచ్చేను. మిగిలిన అంశములు విడిచివేసేను. ఈ ప్రత్యుత్తరము వ్రాయుటకు గూడా నాకు ఇష్టములేదు. నాకు వ్యక్తితో సంబంధము లేనప్పుడు నా అభిప్రాయము వ్యక్తపరుచుటతో నాపని ముగిసినదని నేను ఉపేక్షిస్తే నామిత్రులు దీనిని వ్రాయక తీరదని అభిప్రాయపడుటచేత ఈ మాత్రమైనా వ్రాయవలసి వచ్చింది. నేనే వ్రాయుట సమంజసమని వారువ్రాస్తామన్నా నేను ఇష్టపడలేదు. గ్రంథపరీక్షతోనే ప్రసక్తిగాని అహంకారముతో కాదని మనవిచేస్తున్నాను.

# ప్రేమతత్త్వము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

(ఉత్తరభాగము)

(గతసంచిక తరువాయి)

నిష్కామ సాత్త్విక ప్రేమ



నిరీశ్వరసాంఖ్యము :—

అపరిగ్రహము సత్యమస్తేయము నహింస,
బ్రహ్మచర్యం బనఁబరఁగు యమము
స్వాధ్యాయ సంతోష శౌచ తపో బ్రహ్మ,
నిరతచిత్తత, లన నియమమగును,
పద్మాది దశవిధభవ్యాసనంబులు, నాచరించుటయగు నాసనంబు
వాయుపూరకము కుంభకము రేచకమనఁ, బరఁగుఁ బ్రాణాయామ మురు గుణంబు
చక్షురాదీంద్రియ సన్నిరోధంబె ప్రత్యాహారమనెడి యుత్తమగుణంబు
బంధించి చిత్త మీశ్వరునిపైఁ దిరముగాఁ, దగులంగఁ జేయుట ధారణయగు
నఖిలంబు మఱచి యేకాగ్రచిత్తాన నీశు, ననయంబుఁ దలఁచుట ధ్యానమగును
ప్రత్యగాత్మకుఁ బరబ్రహ్మంబునందు నైక్యముగల్గుట సమాధి యనఁగఁబడును
గీ. వీనియాచరణమునఁ బ్రధానమునకుఁ, దొలఁగి జీవుం డవిద్యచేఁ గలిగినట్టి
దుఃఖసంసారమునకును దొలఁగి యిష్టసిద్ధిఁగనఁజాలు నిదియె నిశ్శ్రేయసంబు.

పాణినిమతము :—

క. శబ్దంబె పరబ్రహ్మము, శబ్దంబే యఖిలలోక సత్తయు నగుటన్
శబ్దాగమ పఠనోదిత, శబ్దజ్ఞానంబు మోక్షసాధన మరయన్.

ఉ. జీవుఁడు శబ్దశాస్త్రము నశేషముఁ జక్క నెఱింగినన్ మహా
దేవుఁడు శబ్దరూపుఁడు నతీంద్రియుఁ డక్షరమాత్మయంచు నా
నావిధమూర్త్యరూప భువనంబులకెల్ల నిదానమంచు న
ద్భావముపుట్టి శబ్దమయతత్త్వ మెఱుంగుచు ముక్తిఁగాంచెడిన్.

క. అని జీవేశ్వరభేదం, బును శబ్దబ్రహ్మతత్త్వ బోధంబున ము
క్తినిబొందు జీవుఁడని చూ, పెను బాణిని మోక్షరాజ వీథియుఁ గరుణన్.

అధునాతన బ్రాహ్మమతము :—

మ. పరమానందమయుండు శాశ్వతుఁడు సర్వవ్యాపకుండుర్ జరా
చరసృష్టిస్థితిమూలకారణుఁడు విజ్ఞానాత్ముఁ డవ్యాజస
త్కరుణామూర్తి యనంతశక్తియయి సత్యప్రేమభాసిల్లు నీ
శ్వరుఁ బ్రేమించి యుపాసనల్ సలిపి మోక్షంబొందు జీవాత్ముఁడున్.

గీ. ఈశ్వరుఁడు తండ్రియని యెంచి యెల్లజనులు, సోదరులటంచుఁ బ్రేమతోఁ జూచి సర్వ
జంతువులయందు దయగల్గి సాధుశీల, మమరియుండుటయందు సారాంశమరయ
వర్ణమతభేదహానుమాట వలదువలదు, పూర్వాపరజన్మములమాట పొంతఁ బోకు
పుణ్యమున నీశ్వరప్రేమఁ బొందవచ్చు, పాపమున కనుతాపంబు పడుట శిక్ష
జ్ఞాన సత్య దయా న్యాయ సాధుశీల, పావనత్వములందు నీశ్వరునితోడ
నైక్యమార్జించుటే మోక్షమరయనిందు, ధర్మమునకుఁ బ్రేమ పరమసాధనము లగును.

క. పావనచిత్తంబున సంభావించుచు భక్తియుక్తిఁ బరమ ప్రీతిన్
దేవు నుపాసన చేసిన, జీవుం డానంద మిష్టసిద్ధిని జెందుర్.

క. అని జీవేశ్వరభేదంబును దెల్పుచు బ్రాహ్మమతము పురుషుఁడు మోక్షం
బను శాశ్వత మానందముఁ, గనఁ బ్రేమమె ముఖ్యమైన కారణ మనియెన్.

అద్వయప్రేమ

అద్వైతమతము :-

గీ. అఖిలవేదాంతవాక్య సమన్వయంబు, సకల మతభేదవాదైక్య సాధకంబు
నైన యద్వైతమును దెల్పె నఖిలగురుఁడు, శంకరాచార్యునకు నమస్కారశతము

గీ. ఆత్మతత్త్వంబు గాంచ మహానుభావు, లెందఱెన్నని మార్గంబు లెఱుఁగఁజేసి
రైన నవియెల్ల నెప్పటికైనఁ దుదకు, ఘనతమాద్వైతమార్గంబుఁ గలిసి తీరు.

ఆ. నిత్యశుద్ధ బుద్ధ సత్యరూపుఁడు నిరాకారుఁ డఖిలలోకకారణుండు
సర్వమయుఁడు బ్రహ్మ సర్వజ్ఞుఁడీశ్వరుఁ, డనఁగ నద్వితీయుఁడాత్మ వెలుఁగు.

గీ. అట్టి పరమాత్మునిచ్ఛమై నతని మాయ, శక్తిఁ గల్పిత మీజగజ్జాల మిందు
వెలయు జీవులు తత్ప్రతిబింబము లగుఁ, దరఁగలందోఁచు రవిబింబసరణియట్లు
ఘటములందున్న యామహాకాశమన్య, మగు ఘటాకాశముగఁ దోచునట్లు తనువు
లందుఁజొచ్చిన పరమాత్ముఁడన్యుఁడైన, యట్టి జీవాత్మగాఁ దోఁచు నదియవిద్య.

గీ. అపరిణామియు సన్మయుఁడవ్యయుండు, నైన పరమాత్ముని వివర్తమగునుగాని
కానఁబడునట్టి జగమునిక్కంబుగాదు, తలఁప జీవేశ్వరులకు భేదంబు లేదు.

గీ. ఆ ప్రబోధనమున శుక్తియందు రజత, భావమును రజ్జువందు సర్పత్వబుద్ధి
యంతరించిన యట్లాత్మయందనాత్మ, బుద్ధియును నాత్మవిజ్ఞానమున నశించు

ఉ. దారసుతాదిబంధము యథార్థముగా మదినమ్మఁబోక సం
సారమునందు రోఁత శమ సత్య దయాదులయందుఁ బ్రీతియున్
గారణకారణుండును జగన్మయుఁడైన సదాత్మభావనన్
గూరిమి యూఁతగాఁదనుఁ గనుంగొను జీవుఁడు వీతమాయుఁడై.

గీ. విద్య వినయంబు గల్గినవిప్రవరుని, గోలయగు శూద్రు, గోవును గుక్కురంబుఁ
గుక్కమాంసంబుతిను నట్టి కూళఁగూడ, సమముగాఁ జూచువాఁడు విజ్ఞానఘనుఁడు.

గీ. అన్ని జంతువులందున్న యాత్మయొకటి, దేనికైనను హింస యింతేనిచేసి
తనకుఁదాఁ జేసికొనినట్లు తన్నుఁబోలి, యన్నిటిని జూచునట్టివాఁ డాత్మవేత్త.

చ. తెలియఁగఁ దాముకానిదగు దేహము తామని యాయవిద్యలో
పలఁబడి దేహదారసుతబంధము సత్యముగాఁగనమ్మి జీ
వులు తమి నేను నాదనుచుఁ బుణ్యము పాపమొనర్చి పుట్టుచా
వుల నడిఁజొచ్చి కొట్టుకొనిపోవుట నాదిని సర్గమయ్యెడిన్.

ఆ. పూర్వపూర్వ జన్మ పుణ్యపాపంబులె, యుత్తరోత్తరముల విత్తులగును
చేసినట్టి మంచిచెడ్డల ఫలమిందె, యనుభవింపవలయు ననుట నిజము.

ఉ. కావునముందు వెన్కయనుగానక జీవుఁడు మూర్ఖుఁడై యవి
ద్యావశుఁడై యనిత్య ధనదారసుతాదుల కల్మి సౌఖ్యముల్
లేవడి దుఃఖముం గనుచు లేనిదియున్నదటన్న నమ్మికం
బోవుచు నిందుఁ బుట్టుచును బోవుచుఁ గాసిలుచుండు నీగతిన్.

ఉ. గాసిలి ప్రత్యగాత్మ నిజకర్మము రోసి యవిద్యఁ గల్గు నీ
దోసముఁ బాయ సాధనచతుష్టయసంపద గల్గి బ్రహ్మజి
జ్ఞాస యొనర్చి తెల్విమెయి సత్యము గన్గొని కర్మబంధనా
ధ్యాసవిముక్తిఁ గాంచి పరమాత్ముఁడె యయ్యెడు ముక్తి పేరిటన్.

చ. అని వివరించు నీమతమునందును దాను నిజస్వరూపముం
గనుఁగొనుదాఁక జీవునిమనంబునఁ బ్రేమ ముముక్షురూపునం
గనఁబడి ముక్తివేళ నణఁగారును బ్రహ్మమున న్మనంబుతోఁ
గనుఁగొనఁ బ్రేమతత్త్వమనఁగా నిదె మానసతత్త్వ, మయ్యెడిన్

ఉ. కారుణికోత్తమున్ గురు జగన్మయు నీశ్వరు నాత్మ నిల్పి యీ
ధారుణిలోని ప్రేముడివిధానములన్ సనిదర్శనంబుగాఁ
గూరిచి ప్రేమతత్త్వమును గూర్చితి నీతివివేకపద్ధతిన్
సారవిచారులార! గుణసమ్మతి నీకృతిఁ జిత్తగింపుఁడీ!

గీ. ఐహికాముష్మికముల నిర్వాహమునకుఁ, బుణ్యపాపంబులకుఁ, బ్రేమ పుట్టినిల్లు
కాన దానిని మంచిమార్గమున నడపి, మనుజుఁ డిహపరసౌఖ్యంబు లెనయవలయు.

కృ తి స మ ర్ప ణ ము

చ తెలసినభక్తిగల్గిన పతివ్రత యోర్పును నేర్పు విద్యయున్
గలిగినయట్టి సచ్చరిత గాదిలి పుత్రులమాత నాతలం
పుల నివసించు ప్రేమమయమూర్తియు మత్ప్రియ భావ యమ్మయ
ర్మిలికిని ప్రేమతత్త్వ మొనరించి యొసంగితి నప్పు తీర్చితిం.

ఇది

మల్లాది సూర్యనారాయణశాస్త్రి ప్రణీతమయిన

ప్రేమతత్త్వమునందు, ఆ ముష్మికమను నుత్తరభాగము

స మా ప్త ము






# అజంతాగుహాలయములు

కొ. నరసింహాచారి గారు

(పదవసంచిక తరువాయి)

అజంతాగుహాలయములలో ప్రతి గుహాలయమును, బౌద్ధశిల్పుల శిల్ప, చిత్రకళా ప్రావీణ్యమునకు, వారిజ్ఞాన విశేషమునకును సాక్షిగా నెక్కుడును చర్విత చర్వణమునది లేక దేనికది నూతనాంశములతో నిండియున్నది. వారి కీర్తిసామగ్ర్యము ప్రకాశపడి యలంకరమునకొనినట్లు గాక యనాయాసముగాను, స్వాభావికముగాను నేర్పడి నట్లున్నది. చర్వితచర్వణ మొందిన శిల్పులకును మాచువారలకును నిరుత్సాహ జనకముగాయుండునుగాన ప్రతివిషయమునను నూతనాంశములు ప్రవేశపెట్టఁబడి యున్నవి. ఒకగుహాలయమున 20 స్తంభములుండినయెడల నందలి స్తంభములన్నియు నేకరీతినిగాక కొన్నింటియందు నిలువునను, కొన్నిటియందు నేటవాలుగను, కొన్నింటియందు శంఖరేఖలనుబోలి సుళ్లవలెను కాలువలును పట్టెలును తీర్చఁబడి, చేయఁబడియున్నవి.

చిత్రము 1 ఎ.



౬ వ గుహాలయములోని ముందు 'సాల్వు' (Aisle)

స్వల్పతాధికతాభేదము లేక ప్రతివస్తురూపమును ప్రాముఖ్యమునకుఁ దెఁబడి చిత్రించఁబడియున్నది. మఱియుఁ జిత్రకారులు ప్రతిచిత్రమునను, చెక్కడపుఁబనియందును, వృక్ష, ఫల, పుష్పములను, శంఖము, మత్స్యము, గజ వృషభ తురంగాదిజంతువులను ధారాళముగాఁ జిత్రించి తమకుఁగల స్వాభావికపదార్థ ప్రీతి వెల్లడిచేసిరి.

## గుహాలయము 1 లోని శిల్పము, చిత్రలేఖనము.

ఆలయములోని లోకప్పు (Ceiling) న సాధారణముగా దూలములవలెను, వాటిపై నష్టముగా వాసములవలెను, పెండెలవలెను మలచఁబడి కలపసామాను లుపయోగించిన భవనమును బోలి యుండును. ఈవాసములు, దంతులు, దూలములు మలచఁబడినతర్వాత మధ్యనేర్పడిన ఖాళీస్థానములు సమచతుర దీర్ఘచతుర, వర్తులాకారములుగ విభజింపఁబడి, యాస్థలము (Square, oblong and Circular panels) లందు నానావిధచిత్రములు చిత్రించఁబడియున్నవి. ఈ చిత్రములు లేఖకులకు

వలెనే వీక్షకులకును సాహ్లాదజనకములై, యద్వితీయ సౌందర్యయుతములై, మనోరంజకములై యొప్పుచున్నవి. లోకప్పున నీసారుగఁబిళ్ల (Panels) లగణ్యములుగా నుండియు నొకదానియందును, నశ్రద్ధతోఁగాని యనాచిత్యముగఁగాని వ్రాయఁబడిన యొకరేఖయైనఁ గానరాదు. ప్రతిచిత్రమునందును ప్రతిరేఖయు చిత్రకారుని మనస్స్వేచ్ఛాప్రసక్తివలెనే హస్త స్వేచ్ఛాప్రసక్తియు మెఱయ వ్రాయఁబడియున్నది.

చిత్రము 1 బి.



గుహాలయము 1 లోని 'లోకప్పు' (Ceiling) యొక్క ప్లాను

1, 9, 10, 11, 12, 16, 17. చిత్రము 5 లోని చిత్రములుండు ప్రదేశములు

4, 6, 8, 3, 5, 13, 7, 14, 15 చిత్రము 2 లోని చిత్రము లుండు ప్రదేశములు

2. చిత్రము 3 లోని చిత్రముండు ప్రదేశము

కొన్ని పెద్దపొడుగుబిళ్ళల (Panels)లో రోజా పుష్పములతోఁ గూడినపూజలును, ముగ్గులును, పశుపక్షులరూపములును, కడునందముగా (2-వ చిత్రమును చూడుడు) అచ్చటచ్చట నల్లిబిల్లిగా నల్లుకొనిన వల్లులమధ్య క్రీడాడుచు పుష్పగుచ్ఛంబుల మకరందంబుల నాస్వాదించు పక్షులును, వ్యాధులబాధలఁ దాళఁజాలక పరువులిడు మృగగజ మహిషాదులును, పారసీకతలపాగలను, చొక్కాయలను, మేజోళ్లను, ధరించి పానీయం

చిత్రము 2





3



7

14

15

గుహాలయము 1 యొక్క లోకప్పులోని చిత్రములు (చిత్రము 1 బి. చూడుడు)

శ్లో. గాయంతి కేచి త్ప్రణమంతి కేచి న్నృత్యంతి కేచి త్ప్రహసంతి కేచిత్,
పతంతి కేచి ద్విచరంతి కేచిత్, ప్లవంతి కేచిత్ ప్రలపంతి కేచిత్.

శ్లో. పరస్పరం కేచి దుపాశ్రయంతే, పరస్పరం కేచి దుపాక్రమంతే,
పరస్పరం కేచి దుపబ్రువంతే, పరస్పరం కేచి దుపారమంతే.

(శ్రీవాల్మీకిరామాయణమ్, సుందరకాండమ్)

బుల నానుచును, ఆడుచును, బాడుచును, సంభాషించుచు నుండునట్లు మానవరూపములును జిత్రింపఁబడియున్నవి. పుష్పములు ముకుళములుగను, అర్ధనిమీలితములుగను, సంఫుల్లములుగను వల్లులమధ్యఁ జిత్రింపఁ బడియున్నవి.

చిత్రము 3



గుహాలయము 1 యొక్క లోకప్పులోని చిత్రము 2 (చిత్రము 1 బి చూడుడు)

కొన్నిచోటుల మామిడి, సీతాఫల, రామాఫల, నింబఫలములను, హంస, కీరాదిపక్షులు ఫలరసాస్వాద మొనర్చునట్లును చిత్రింపఁబడియున్నవి. ఈచిత్రము లన్నియు నొకటివిడిచి యొకటి శ్యామారుణ (Painted alternatively on dark and red grounds) భూమికలపై వ్రాయఁబడుటవల్ల నేత్రానందకరమై యొప్పుచున్నవి. ప్రథమమున చిత్రకారులు భూమిక (ground)ను నలుపునగాని, ఎఱుపునగాని మొత్తముగా వర్ణము వేసి తదుపరి యొక చిత్రమును తెలుపున చిత్రించి దానిపై నాయాభాగమునకు పలువగా దానిస్వాభావికవర్ణము నిచ్చుచుండిరి.

ఈగుహాలయములలో శాల లేక కూటము (Central hall) నకు చుట్టును సాల్పులు (Aisles) ఏర్పరుపఁబడియున్నవి. అందు సాధారణముగా సాల్పునకు (Aisle)ను శాలకును మధ్యనుండు స్తంభముల శీర్షికలపైన

చిత్రము 4



స్తంభశిరము

(Bracket capitals చిత్రము 4 చూడుడు) శాలపై పున నుండుభాగములయందు ప్రతిమలు చెక్కఁబడినవిగను, సాల్పుపైపుననుండు భాగములయందు ప్రతిమలు వర్ణముసఁ జిత్రింపఁబడినవిగను నున్నవి. ఎప్పుడును శాలకు వెలుతురధికముగ రాఁదగియుండును గాన నాపైపునఁ గల ప్రతిమలు మలచఁబడి (carved) యుండుటవల్ల వెలుతురా ప్రతిమలపైఁబడినపుడు వెలుఁగునీడలకలయిక వలన తిలతండులితములై (Effect of high lights and deep shadows) నేత్రానందకరములై యొప్పుచుండును. చిత్రకారులు సొరుగుఓళ్లల (Panels)పై చిత్రించు భాగములవిభజనయందును కొంతభేదమును జూపుచు వచ్చిరి. గుహాలయము 1 లోని దీర్ఘచతురస్రాకారస్థలముల యందు ఒక్కొక్కదానియందే 4 లేక 6 సమచతురములుగ భాగింపఁబడి యందు వేర్వేరుచిత్రములు మధ్య మధ్య (చిత్రము 5 లో 9,10,11,12 చూడుడు)నగాసుపని(fretwork) జిత్రింపఁబడియున్నవి. 2 వ గుహాలయమునందట్లుకాక యొక్కొక్కదీర్ఘచతురము (Oblong Panel)న నొకేచిత్రము చిత్రింపఁబడి యున్నది. (2-వ చిత్రములో 1, 3 వ చిత్రములో 2, చూడుడు)

చిత్రము 5




1, 9, 10, 11, 12, 16, 17 గుహాలయము 1 యొక్క లోకప్పునుండు కొన్ని సొరుగుబిళ్ల (Panels) లలోని చిత్రములు
(ఈ చిత్రములుండు ప్రదేశములకు చిత్రము 1 బి లో నాయాసంఖ్యలను చూడుడు)
'క' గుహాలయము 2 యొక్క లోకప్పులోని యొక చిత్రము

గుహాలయమున నంగణమునఁగల చిత్రము లీనాఁటికిఁ 4 వ చిత్రములోఁ గనుపఱుపఁబడియుండు చిత్రము 63 కూడఁ గాంతివిహీనములై యున్నవికాని శాలలోనివి చదరపుటడుగుల వైశాల్యముగలిగి 2 వ గుహాలయము కాంతివంతమైన విశదములుగాక ప్రభతఱిగి కన్పట్టుచున్నవి. లోని గర్భాలయము ముందుభాగమున శాలయొక్క

చిత్రము 6



గుహాలయము 2 యొక్క లోకప్పులోని యొక వలయాకారచిత్రములోని యర్థభాగము

(ఈ చిత్రము వైశాల్యము 63 చదరపు టడుగులు—9' × 7')

లోకప్పునందుండు చిత్రములో నర్ధభాగమును జూపుచున్నది. అజంతాలయములలోని చిత్రకళానైపుణ్యమును జాటిచెప్పుట కీయొక్కచిత్రమే చాలియుండ నిట్టివాటి ననేకములఁగల యీగుహాలయముల నెన్ని వర్ణింప నలవి కాదుగదా!

ఈ గుహాలయము లన్నింటిలోను బౌద్ధులశిల్పచాతుర్యమును, చిత్రకళాప్రదర్శన విశేషములును, వారి భక్తి మూర్తీభవించి, నాటకరంగమునఁ బ్రేక్షకులమానంబుల రంజింపఁజేయునట్లు నటించు నటకునిగీతి, ఆలయ రంగస్థలమున నానారూపముల నానాభావముల నెలయింపఁ జేయుచున్నట్లుఁ దోపఁ జేయుచున్నవి. చీనా జపాన్ మొదలగు ప్రాచ్య బౌద్ధదేశములయందును వారి చిత్రకళాప్రదర్శనము భక్త్యుద్బోధకమై యొప్పుచున్నది. అయిన నొకేబీజము క్షేత్రకాలభేదముల కనగణ్యముగ రసభేద ఫలముల నొసఁగునట్లు మత మొకటే బౌద్ధమతమైనను భరతఖండ, ప్రాచ్యదేశముల లోని చిత్రకళాప్రదర్శనమును కొంతభేదము గలిగి వెలయుచున్నది. కాని సామ్యతయు కొంతకలదు. చీనా జపాన్ దేశములలోని బౌద్ధచిత్రములయందలి చిత్రముల మూర్తిప్రదర్శనపద్ధతియు, అలంకారములతీరును అజంతాచిత్రములలోవలెనే యున్నవి. కాని చీనా జపాన్ దేశములలోని చిత్రములు భక్తిప్రాధాన్యములై నిష్కామత, త్యాగశీలతలనే ముఖ్యముగా వెల్లడిచేయుచు కేవల పండితజనరంజకములు కాఁజాలి యొప్పుచున్నవి. ఇందు బుద్ధునికి కేవలదేవత్వమును ప్రతిపాదించుటవల్ల నిందలిభావములు పామరుల కంత సులభగ్రాహ్యములు కాకపోవచ్చును. పండితజన గ్రాహ్యములగు విషయములు పామరుల కగ్రాహ్యములును అసులభగ్రాహ్యములను కావచ్చును గాని పామరుల కెఱుఁగఁగల విషయములు పండితజనము లెఱుఁగఁగలవిరయే యైయున్నవి. కాన నజంతా బౌద్ధచిత్రకారులు తమచిత్రములయందు కేవల మహానుభావ ప్రభావములఁ జూపక, ప్రాపంచిక వైభవములను, మానుషచర్యలను మఱియేయేవిషయముల నీప్రపంచమున నెట్లెట్లు చూడనగునో ఆయావిషయముల నట్లట్లే కనుపఱచిరి. వీరిచిత్రములయందు సర్వజనపూజ్యుడగు బుద్ధదేవుడు, భోగులలో భోగిగను, త్యాగులలో త్యాగిగను, భిక్షువులలో భిక్షువుగను, జాతకములని వెలయుచు బుద్ధుని యవతారములుగాఁ గొనియాడఁబడు కథలయందు జంతువులలో జంతువుగను చిత్రించఁబడెను. ఇట్లు పరిపరిస్థితులయందుఁ గానబడియు నందఱకును మార్గదర్శకుఁడై యుండుటయు తదితరుల కాయన యొక్క యమానుష ప్రభావము ద్యోతకమగునట్లును చిత్రకారులు తమప్రావీణ్యమువల్ల బౌద్ధమతమునకువలెనే చిత్రకళకును మకుటస్థానమును దేఁగలిగిరి. ఇట్లు ప్రదర్శింపఁబడిన చిత్రకళయే బుద్ధదేవుని దేవత్వమును బండిత పామరుల కందరకును నిరూపింపఁగలిగినది. చీనా జపాన్ దేశములలోని చిత్రకారులవలెఁగాక తమచిత్రముల ముఖ్యముగా పామరజనరంజకములుగాఁ జేయుటకు కారణము లేకపోలేదు. భగవంతుని దశావతారములలోను, జనసామాన్యముతోఁ గలసి మెలసి వారికష్టసుఖములఁ దామును బాల్గొనుచు వారికి సన్మార్గప్రవర్తకులై యచ్చటచ్చట దమయమానుషచర్యలఁ జూపుచు వచ్చినందున నేకదా, తక్కిన యవతారములవలెఁగాక శ్రీరామ, శ్రీకృష్ణావతారములు పండిత పామరులచే నెక్కువ కొనియాడఁబడి పూజింపఁబడుచున్నవి.



# మృత్యువు

కొప్పర్తి నారాయణమూర్తి గారు బి. ఏ., యల్. టి. (సాహితీ సమితి)

స్వర్ణమిళితారుణ భ్రమలను
భాస్కరుడు తన్మెచ్చి చేరగ
పశ్చిమా సతి తాండవించె
నపార జీవకళన్.

నీల గగన మహాంబురాశిని
తేలి యాడు విశాలద్వీపము
లనగ బరగెడి జలదతతి జ్యో
త్స్నావహం బయ్యెన్.
సంధ్యాకాంతులు బర్వె నల్లెడ
ఝురుల జ్వాలలు మ్రింగి మెగసెను
పూర్వనగములు శోకవిహ్వల
మూర్తులై తోచెన్.
విశ్వ మొకతరి నల్లబారగ
వెలుగు గ్రుంకె ధరాతలోదరి
మాయ ముసుగున మిత్తి ఛాయల
మడిగి విలపించెన్.

"కటికి చీకటు లురికి చుట్టెను
కల్ల దినకరు డింక వెల్గుట;
పడియె జీవము మిత్తివాతను,
పరంజ్యోతి, నమో!"
సాంద్రతిమిర నిగూఢగాఢ ప్ర
శాంతిలో భయ మస్తమింపగ
విశ్వమెల్లను రేయి తానయి
స్వేచ్ఛ విహరించెన్.
హాస ప్రఫుల్ల వజ్రనయనము
లంబరంబున వెలయగను భూ
కాంత మెదలెను తళుకు నిగ్గుల
కరుణ ప్రసరింపన్.
నిద్ర నుండ మృతించి తనుకొనె!
నిమిషమేగుట వదనమున చిరు
నగవు తోచెను సుషుప్తియని జ్ఞా
నం బాదవెనేమో!

పరిమళావహ నక్తవాయువు
పలికె మెల్లగ కాంత చెవిలో,
"మరణ మెక్కడ? నిద్రయేసుమి!
మానుమీ భయమున్.
శ్రమను డస్సిన నీ కుచిత వి
శ్రాంతి నిచ్చు సుషుప్తియే యిది
మింటికన్నుల నొక్కపరిగను
మృత్యు వెక్కడనో!"
పూర్వగిరుల వినూత్న కాంతులు
పుట్టి నింగికి బర్వ, సిగ్గున
నురికె తారలు స్వర్ణతోయధి
నుదయ సతి యలరన్.

బాల భానుని హేమకరముల
ప్రజ్వలించె గిరీంద్రపంక్తులు
మహిని చుట్టిన మలిన ధూమము
మాయమయి పోయెన్.

మహోజ్వలన కవాటమునుండి
బహుళాబ్ధతి వెల్వడి దినకరుడ
మితరాగమున మోము ముద్దిశ
సతియు మేల్కాంచెన్.

పల్లవించె వనంబులెల్లను,
ఉల్లసిల్లె జలాశయంబులు
భూతములు రవిసందేశమున
ముదముతో మ్రోగెన్.
"మరలి వచ్చితి నిదుర లెమ్మిక
మరణ మెరుగదు జీవమెన్నడు
మదిని నమ్ముడు రాత్రి వెడలగ
నుదయ మరుదెంచున్."




"అబ్దుర్ రజాక్"

ఆనెగొంది

విరూపాక్షస్వామి దేవాలయము

తుంగభద్రా నది

హంపి

మాతంగగిరి

తలారిగట్టు

నింబపురము

మాల్యవంత

రఘునాథస్వామి దేవాలయము

పానుసుపారీ బజారు

కృష్ణాపురము

ఏనుగుల శాల

రాయల మందిరము

అంతఃపురము

కడిరాం పురము

మహర్నవమి

కమలాపురము

కమలాపుర తటాకము

హొస్పేటకు

అబ్దుర్ రజాక్ కాలమునాటి బజారులు (వీథులు)

అబ్దుర్ రజాక్ వర్ణించిన నాల్గు బజారులు




భావరాజు వెంకటకృష్ణారావు గారు, బి. ఏ., బి. యల్.,

(తొమ్మిదవ సంచిక తరువాయి)

## విజయనగర వృత్తాంతము - సప్తప్రాకారములు

వెనుక వర్ణించినదాని బట్టి మన చరిత్రకారుడును రాయబారియు నగు అబ్దుర్‌రజాక్ విజయనగరమును ప్రవేశించినాడని చదువరు లూహించియుందురు. ఆతని కాపట్టణము బహువిస్తీర్ణమై, జనసంకీర్ణమై మనోహరమయిన యొక్క మహానగరమువలె గన్పట్టెను.

విజయనగర మేలు నృపాలుడు అసాధారణబల దర్పితుడు. ఆతని సామ్రాజ్యము సింహళద్వీప ప్రాంతములనుండి కలబరిగె రాజ్యప్రాంతమువఱకు వ్యాపించి, యెటుచూచిన వేయి యామడలమేర యున్నట్లున్నది. ఆతని రాజ్యమునకు పూర్వపశ్చిమగిరులందు సముద్రములే యెల్లలు. దేశమంతయు, చక్కగ సాగుచేయబడుచున్న కనులపండువైన భూములతో నొప్పారుచున్నది. ఈ క్ష్మాపాలుని రాజ్యమందు దేశదేశాంతర నగరములతో సముద్రవ్యాపారముచేయు ప్రసిద్ధ రేవు పట్టణములు మూడువందలు గలవట! నగరమందెచ్చట చూచిన రాక్షసులవలెను కొండలవలెను భయంకరములయిన యేనుగలు వేలకొలది గాన్పించుచుండును. ఈ రాజసైన్యమునందు కాల్బలము పదునొకండు లక్షలు గలదు. ఈ దేశీయులు తమయేలికను 'రాయ'లని వ్యవహరింతురు. హిందూస్థానమందెచ్చట నీ రాయలంతటి బలపరాక్రమసంపన్నుండగు భూపాలుడింకొకడు లేడని విందుము. ఇచ్చటి ప్రజలలో నందఱికంటె బ్రాహ్మణులు విశేషగౌరవమును బొందుచు పూజింపబడుచున్నారు.

విజయనగరమును బోలిన యనుపమాన భాగ్యవైభవసౌందర్యములుగల మహానగరమును ప్రపంచమందెచ్చటను ఇంకొకదానిని చూడబోము. మీదుమిక్కిలి వినజాలమన్న అతిశయోక్తి కాదు. ఎంతవిస్తీర్ణము. ఒక ప్రాకారములోపల నింకొక ప్రాకారము చొప్పున యేడు ప్రాకారముల నడుమ గట్టబడిన యీ మహానగరము మిక్కిలి దుర్గమమైనది. ఏడవ ప్రాకారమునకు వెలుపల యేబదిగజముల వెడల్పుగల బాహ్యప్రదేశము గలదు.[1] అచ్చోట నిలువెత్తున మొనలుదేఱి, కఱకుగానున్న బండఱాళ్లు దట్టముగా నిలువులోతున బాతిపెట్టబడియున్నవి. వానిమూలమున కాల్బంటుగాని రౌతుగాని సులభముగా నాఱాళ్లనడుమనుండి దూరిపోవజాలడు.

నగరముచుట్టును గల సప్తప్రాకారములలో, వెలుపలిది వలయాకారముగా నుండి యెత్తైన యొకశిఖరముపై నున్నది[2]

1. నిలువుగా బాతిపెట్టబడిన యీ ఱాళ్లనుగురించి క్రీ. శ. ౧౫౨౦ సంవత్సరమున విజయనగరమును సందర్శింపవచ్చిన "డామినిగో పేయస్" యను బుడతకీచుడు గూడ దానును వాటిని జూచియుంటినని వ్రాసియున్నాడు. తర్వాత తళ్లికోట యుద్ధానంతరమున మహమ్మదీయులచే నగరము విధ్వస్తము గావింపబడినపుడీ ప్రాకారమును ఈ ఱాళ్లును రూపుమాపబడెను.

2. అబ్దుర్‌రజాక్ వర్ణించిన యీ సప్తప్రాకారములు అందందుగల ద్వారములు కవాటములు ఈకాలపు విజయనగర యాత్రికులకు నెచ్చటెచ్చట నున్నవో సులభముగా బోధపడవు. మనయాత్రికుడు పశ్చిమతీరమునుండి బయలుదేరి, విజయనగరమును నైఋతి దిక్కునగల ద్వారముగుండనే ప్రవేశించినట్లు తోచెడిని. అదియే నిశ్చయమని యెంచినయెడల, నాతనినింక నెదిరింగి కర్ణాటక్షితిపాలు డంపిన ప్రతీహారులు, అబ్దుర్ రజాక్‌ను, ఎదుర్కొనిన

అయ్యది బాలితోడను సున్నముతోడను గట్టిగా గట్టబడి బలిష్ఠమైన కవాటమును కలిగియున్నది.[1] ఆద్వారము చెంత రేయింబవళ్లెల్లప్పుడును రక్షకభటులు ఏమఱక కావలిగాయుచుందురు. వారు దుర్గరక్షణము నందెంత అప్రమత్తులుగనుందురో, యాగంతుకులకడ నగరప్రవేశపు సుంకమును గైకొనుటలో కూడ నంతటి యప్రమత్తులు.[2] తొలికోటనుండి, రెండవప్రాకారమును, దానినిగడచి మూడవదానిని, అందుండి నాలుగవకోట ద్వారమును అట్లు వరుసగా దాటుచుపోయి యేడవప్రాకారమును సమీపించితిమి. ఈకడపటి ప్రాకారములోపల, రాయలమందిరములు, సౌధములు, సభామంటపములు, కొలువుకూటములు, కచ్చేరీలు గలవు. నగరమునకు వెలుపలగల ఏడవప్రాకారమునకు నాలుగు గవనులు గలవు. అందుత్తరదక్షిణముల వానికి నడుమను, పూర్వపశ్చిమద్వారముల నడుమను రెండామడలమేర యుండును. వెలిప్రాకారములలో మొదటిదానికిని, రెండవదానికిని నడుమ గల ప్రదేశమున సారవంతములయి, సాగుచేయబడుచున్న భూములు, ఫలపుష్పవంతములయిన చక్కనితోటలు పెక్కులుగలవు. అచ్చటచ్చటను మంచిసౌధములును, యిండ్లును, మంచిబావులును, ఆరామములును గలవు. వెలుపలి నుంచి మూడవప్రాకారము మొదలుకొని లోపలి యేడవప్రహరీవఱకును, రాజవీథికిఱుప్రక్కలను దట్టముగా నిండ్లు, అంగళ్లు, నడుమ నడుమ వీథులు, తోటలును గలవు. ఏడవప్రాకారము లోపల రాయలనగరును, సభాగారములును, సౌధములును నాలుగురాజవీథులు గలసికొని మొగయును గలదు. ఆరాజవీథుల నాలుగు నొకదాని కొకటి యెదురుగా నున్నవి. ముందుత్తరముగా రాయలు నివసించు నగరు కలదు. ఈనగరివాకిటనుండియే నాలుగువీథులును నాలుగు మొగలకు బోవును. ప్రతిరాజవీథి మొగను, నగరివాకి

---

గవను, ఏడవప్రాకారమున నగరమునకు నైఋతిదిక్కున నున్నదనియే నిశ్చయింపవలయును. ఈరాయబారి ప్రవేశించిన మొదటిద్వారము హొస్పేటకు నైఋతిదిక్కుగాగల రెండుకొండలనడుమ నున్నట్లు గానవచ్చును. ఒక్కమన అబ్దుర్‌రజాక్ మాత్రమేకాక తరువాతను, అంతకుబూర్వమును వచ్చిన విదేశీయులందఱు నీ ద్వారముగుండనే నగరును సొచ్చియుండిరి.

1. విజయనగర వెలిప్రాకారములలో మొదటిది హొస్పేటకు నైఋతిదిక్కుగా నున్నది. అచ్చటను గల రెండుకొండల నడుమ గల పెద్ద తటాకమునకు బశ్చిమముగా అబ్దుర్‌రజాక్ వర్ణించిన మొదటి దుర్గద్వారముగలదు. ఆదుర్గసమీపమునగల పెద్దచెఱువిపు డెండిపోయినది, గాని యానగర ముచ్చదశయందుండిన కాలమున, మిక్కిలి లోతుగానుండి మంచినీరుతో నిండియుండెను. ఆచెఱువునడుమ నొకబలిష్ఠమైన దుర్గ మిప్పటికినికలదు. అందు రక్షకభటులు కావలిగాయుచుండెడివారు. రెండవప్రాకారము హొస్పేటకు సమీపములో నుండెను. హొస్పేట (నాగలాపురము) ఆకాలమున జనసమ్మర్దముగానుండినట్లు అబ్దుర్‌రజాక్ వర్ణించుచున్నాడుగదా! మూడవప్రాకారము హొస్పేటకుత్తరముగా బోయియుండవలయును. అదియిపుడు గానరాదు. నాల్గవప్రాకారమునందు బలిష్ఠమైన కవాటమున్నది. ఈగోడ "మల్పనగుడి" గ్రామమునకు దక్షిణముగాబోవును. మల్పనగుడి యిప్పటికినిగలదు. పూర్వమీపేటలో సామంతమండలేశ్వరులు నివసించుచుండినట్లు శిథిలావస్థయందున్న సౌధములు, ఆరామములు మొదలయినవి చాటుచున్నవి. అయిదవగోడ యీగ్రామమునకుత్తరముగా బోయినది. ఆగోడ చాలభాగము శిథిలమయిపోయినదిగాని, యందలి దుర్గద్వారముమాత్ర మిప్పటికి నిలచియున్నది. ఆరవకోటగోడ కమలాపురపు తటాకమునకు దక్షిణముగా బోయి చుట్టివచ్చును. ఏడవప్రాకార మిప్పటికి మంచిస్థితియందున్నది. అందున్న నగరులు సౌధములు, మంటపములు, దేవాలయములు, సభాగారములు, మందిరములు మంచిస్థితియందున్నవి. ఈప్రాకారములోనిప్రదేశము తూర్పుపడమరలు రెండుంకాలుమైళ్లును ఉత్తరదక్షిణములు ఒకమైలును, కోడవును వైశాల్యమును గలిగియున్నది.

2. ఈవిధముగ మనదేశమున, ముఖ్యనగరముల వెలుపల నాగంతుకులకడనుండియు, సుంకముతీయు నాచారము పూర్వముండెను. ఈ బ్రిటిషుపరిపాలనమున నది తీసివేయబడెను.

టకు సమీపమున ధనురాకారముగా నున్న తోరణముతో గూడిన యెత్తైన గోపురమును,[1] దానిచుట్టును స్తంభముల తో నలంకరింపబడిన వసారాయునుగలవు. ఈరాజవీథుల మొగల నున్న తోరణగోపురము లన్నిటికంటె నగరివాకిటను అందమైన గోపురము ఒకటి గలదు. ఈ తోరణ గోపురముల క్రిందినుండి నాల్గుముఖముల బోవు రాజవీథులు మిక్కిలి వెడల్పుగానుండి రమ్యముగానున్నవి. రాజవీథులం దిరుప్రక్కలను పుష్పలావికలు పరిమళము గ్రమ్ముకొను నానావిధపుష్పములను విక్రయించు చుందురు. అంగళ్లవాండ్రుతమయంగళ్ల ముందట అందమైన మంచెలు గట్టుకొని తిమసరకుల నమ్ముకొనుచుందురు. ఇట్లిరుప్రక్కలను అంగళ్లు, పుష్పలావికలు స్థలమాక్రమించుకొనినను, అశ్వికులు, కాల్నడకవారు, యేనుగులు బండ్లు, పల్లకీలు మున్నగునవి గుంపులుగుంపులుగ నిసుక వైచిన రాలకుండ నమ్మచుబోవుచుండుటకు వీలయినంత వెడల్పుగా నీరాజవీథు లున్నవి. ఈవీథులు చాలదూరముకను చూపుమేరవరకు వ్యాపించియుండి నేను మనోజ్ఞమయిన దృశ్యమనొసంగుచున్నవి. ఎప్పుడు చూచినను పరిమళభరితములయిన వివిధజాతుల దివ్యకుసుమములే కానవచ్చుచు మండును. అన్ని పుష్పములలో నీదేశీయులకు గులాబి (గొజ్జంగి) పుష్పములన్న మిక్కిలి యిష్టము. అవి విశేషముగా దొరకును. ఇచ్చటి ప్రజలకు పుష్పములనిన ప్రాణము. ఆహారమెంత యావశ్యకమో పుష్పములం తావశ్యకము. భోజనమైన లేకుండ బోవుదురుగాని స్త్రీపురుషులు పుష్పములు ముడుచుకొనకుండ ధరింపకుండ నక్కడను బోలేరు. ఒక్కొక్కవిధమగు వస్తు వయమునువిక్రయించు నొక్కొకవాడవర్తకులు ఒక్కొకచోట గుమిగూడి జట్టుగా వ్యాపారము చేసికొందురు. ఏసరకులవాండ్ర యాసరకులదేగాని యింకొక సరకావాడలో దొరకదు.[2] ఇచ్చటి రత్నవర్తకులు నిర్భయముగా తమసరకులను ఎంతవిలువగలవానినైనను తమ సజ్జనైసూర్య మాణిక్యములను, పచ్చలను, నీలములను, పుష్పరాగములను, రత్నములను, మంచి ముత్యములను, నగలను. విచ్చలవిడిగా రాసులక్రింద బోసి నడివీథులందు విక్రయించుకొను చుందురు.

అత్యంతరామణీయకమై మనోజ్ఞమైన యచ్చోటి నగరివాకిట కెదురుగా నున్న నాలుగువీథులందును నక్కని నునుపైన రాతికాలువలగుండ పరిశుద్ధజలము నగరు లోనికి పట్టణములోనికి నెడతెఱిపిలేక పారుచుండును. దీనికి కాలువలు బట్టణమునం దంతటను గానుపించును. రాయలసౌధమునకు కుడిపై ప్రధానమంత్రి శేఖరుని సభాగార మంటపము కలదు.[3] ఆ విశాలమంటపమునకు నలుబది

---

1. రజాక్ వర్ణనాలుబట్టి యిప్పటి విజయనగరమును అర్థముచేసికొనుట కష్టముగానుండును. అతడు వర్ణించిన నాలుగుధనురాకారముగల తోరణములును మంటపములుగల గోపురములు నిపుడు గానరావు. అతడుచెప్పిన నాలుగువీథులలో నొకటి తూర్పుగాబోయి తుంగభద్రపైదుగా నానెగొందెకు పోవును. దానికి పాన్సుపారి వీథి యని పిలతురు. ఈ వీథిముఖమున నిలువబడియే మన రజాక్ నగరము ముందు వర్ణించియుండును. ఈ వీథికి నూటిగా నింకొకవీథి పశ్చిమముగా నరిగి కమలాపురపు కోటగుమ్మమువెంత, నుత్తరముగా తుంగభద్ర హంపి విరూపాక్షక్షేత్రములకు బోవువీథిని గలసుకొనును. నగరివాకిటను నాల్గువీథులనడుమ తోరణ, గోపుర, మంటపములనడుమ ప్రదేశము నానావిధములగు అంగళ్లతో నిండి రామణీయకముగా నుండెను గాబోలు. ఆగోపురములు తోరణములు ఎట్లుండెనో యూహించుకొనుటకుమాత్రము ఉత్తరమున తుంగభద్రయొడ్డున గలియు నాలుగువీథులమొగలగల శిథిలావస్థయందున్న గోపురమంటపములు జూడనగును.

2 ఇప్పటి మచిలీబందరు అట్టివిధమయిన బజారును కలిగియున్నది. ఒక్కొకరకపు దినుసు కొకబజారు యిప్పటికిని బందరునందు గలదు.

3. అబ్దుర్ రజాక్ చూచిన సభామంటపమును, దానికుత్తరముగానుండిన దస్తరములకొట్టును శిథిలావస్థయందిపుడు నగరువాకిట నాలుగువీథుల మొగకానక్రప్రక్క గానుపించుచున్నవి. సభాగారము పూర్వపుశోభతో నిపుడు గానరాదు. శ్రీనాధుడు కనకాభిషేకమును నడసిన ముత్తికసభాగార మిదియే కావలయును. పూర్వమున నీసభామంటపము దారుస్తంభములతో, చిత్తరువులతో మనోజ్ఞములయిన రంగురంగులతలతో నొప్పారుచుండెనుగాబోలు. స్తంభములు కర్రవియనియు సరంబికూడ కర్రతో కట్టబడి రంగురంగుల చిత్తరువులతో శోభిల్లుచుండెననియు, నదియంతయు తల్లికోటయుద్ధానంతరము ఈరకలచేతగుల పెట్టబడియెననియు పన్యాయులుగా రూహించుచున్నారు. ఇపుడామంటపమున నలుబది స్తంభపు దిమ్మలుగాక వరుసది గానవచ్చుచున్నవి.

స్తంభములు గలవు. వానికెదురుగా మనిషికంటె యెత్తయిన వసారాయొకటిగలదు. ఆవసారా యింపుమింపుగా యిరువదిగజములు పొడవును, ఆరుగజములు వెడల్పును గలదిగానున్నది. దీనిని దప్తర్ ఖానా "దస్తరములకొట్టు" అని పిలుతురు. రాజ్యమునకు సంబంధించిన యావత్తు కాగితములు, పత్రములు మొదలగునవన్నియు, దుస్తరములుగా గట్టి యుంచుదురు. ఇచ్చటనే కరణములు, తెరపిలేక లెఖల వ్రాయుచు కూర్చుండియుందురు. ఇచ్చటి జనులు రెండువిధముల వ్రాతసామగ్రి నుపయోగింతురు. అందు మొదటిది: రెండుగజములు పొడవును రెండు వ్రేళ్లు వెడల్పును గల తాటాకులు. ఈజను లాతాటాకులపై గంటములతో పరపర గీచుచు వ్రాయుదురు. ఈవ్రాత అంతశ్రేష్ఠమైనదిగా జనులు తలంపరు. తాటాకులపై గీకబడిన యక్షరములు మసితో వ్రాయబడనందున రంగుతో కంటికిగానరావు. అదియునుగాక తాటియాకులు చిరకాలముండక పోవుటవలన వాటిపైని వ్రాయబడిన అక్షరములును చిరకాలము నిలువజాలవు. ఇక రెండవపద్ధతి: తెల్లనిఫలకములకు నల్లరంగుపూసి వాటిపై, రాతిబలపములను పెట్టి తెల్లగా వ్రాయుట. ఈపద్ధతి చాల మంచిదట. ఇట్లు వ్రాసిన యక్షరములు చాలకాలము నిలచియుండును.[1]

స్తంభములుగల యీసభామంటపమున నెత్తైనవేదికపై ధన్నాయకుడు (దణాయి- సర్వసేనాపతి) రాజకీయోద్యోగులు తన్ను పరివేష్టించియుండ కొలువు తీర్చియుండును.[2] ఉభయపార్శ్వములందును వేత్రహస్తులు (చోబుదారులు) బారులుతీరి నిలువబడియుందురు. మంత్రిశేఖరునితో విజ్ఞాపనమొనరింపగోరిన దలంచిన వారు ఈవేత్రహస్తుల నడుమ నడచివచ్చి, ఏదైన యొక వస్తువును కానికగా సమర్పించి, సాష్టాంగదండప్రణామమాచరించి లేచి నిలువబడి ముకుళితహస్తులై శిరమువంచి, మనవి చేసికొందురు. ధన్నాయకుడును వారివిన్నపమాలించి, యుచితరీతిని న్యాయవిమర్శనముగావించి తీర్పిచ్చి పంపివేయును. ఆతనితీర్పునకు తిరుగులేదు. దణాయకుడు సభాగారమునుండి వెడలునపుడు కొలువు చాలింపబడును. ఆయనకు ఏడు రంగురంగుల గొడుగులు గలవు. ఆతడు బయలుదేరునప్పుడా ఆతపత్రములను గైకొని పరివారము ముందునడచును. వేత్రహస్తు లుభయపార్శ్వములందును నడచి వత్తురు. వారి ముంగిట శంఖకాహళాది మంగళతూర్యములు పూరించబడుచుండును. ఆతని కిరుప్రక్కలను, వందిమాగధులు కైవారములు చేయుచు స్తోత్రపాఠములనుజదువుచు "జయీభవ! దిగ్విజయీభవ" యనుచు నడచుచుందురు. ముందు వేత్రహస్తులు బరాబరులు దెలుపుచుండ, ఇతర సేవకులు ఛత్రిచామరములను బట్టుకొని వెంటరా, దణాయకుడు (సర్వసేనాధిపతి మంత్రియుగూడ అబ్దుర్ రజాకు కాలమున నొక్కడేయగును) బయలువెడలి, రాజమందిరమున కరుగును. రాజనగరునకు దణాయకుని సభామంటపమునకు నడుమ నేడు కక్ష్యాంతరములు గలవు. ఒక్కొక్క కక్ష్యాంతరము గడచునప్పటి కాతని వెంటబట్టుకొని రాబడు గొడుగులలో నొకటి తరువాత నొకటి వరుసగా మూసి వెనుకనుంచబడుచుండును. అట్లు దణాయకుడు ఏడుకక్ష్యాంతరములను దాటుసరికి ఏడుగొడుగులు వెనుక నుంచబడును. రాజసముఖమును దణాయకుడొంటిగ ప్రవేశింపవలయును. ప్రవేశించి రాజ్యమునందలి సర్వవృత్తాంతములను రాయల కెరిగించి, యాతని యాజ్ఞలను గైకొని సెలవుదీసికొనిపోవుచుండును. ఈదణాయకుని నిజమందిరము రాయలనగరునకు వెనుకనున్నది.

నగరునకు ఎడమవైపున ధన్నాయకుని సౌధమునకు వెనుక, టంకశాల గలదు. ఇచ్చట నీ దేశమందు చలామణియగుచున్న నాణెములన్నియు ముద్రింపబడుచున్నవి. ఈ దేశమున మూడు విధముల బంగారు టంకములు, రాగికలిపి ముద్రింపబడుచున్నవి. వానిలో

1. శిలాశాసనములు గావచ్చును. అబ్దుర్ రజాక్ వ్రాయసకాండ్ర దేశాచారములు తెలియనివాడు గావున, పొరబడి యుండవచ్చును.

2. ధన్నాయకుడు యొకయుద్యోగి యని తెలిసికొనకపోవుటయే కాక నాతడు ఖొజ్జావాడనియుగూడ రజాక్ పొరబడి వ్రాయుచున్నాడు. ఇమ్మడి దేవరాయని ధన్నాయకుని పేరు నాగన్నయని లూయిరైసుగారు చెప్పుచున్నారు.

మొదటిది 'వరహా'[1] ఈవరహా మనదేశపు రూపకీదీనారములకు రెంటికి సమానము. వరహాలో సగము విలువగల నాణెము నొకటి గలదు. దానిపేరు 'ప్రతాప'ము.[2] ఇది రెండవనాణెము.

మూడవది బంగారపుపణము. వరహాకు ఇరువదిపణములు, ప్రతాపమునకు పదిపణములు నిత్తురు. పణమునకు నాలు "తర"[3]ములను వెండినాణెములు నచ్చును. 'తర'మునకు మూడు "జతలు"[4] అను రాగిటంకములనిచ్చును. ఈదేశాచారమునుబట్టి రాయలకు సామంతమండలేశ్వరులు మహామండలేశ్వరులు తామీయవలసిన కప్పమును సంవత్సరమున కొకమారు టంకసాలయందు చెల్లించుచుండు యలవాటు. ఎవరికైన ధన మీయవలదినపుడు రాయలు టంకశాలపై, వాని కియ్యవలచినదానికి రాయసమంపును. సిపాయీలకు భత్యము నాలుగునెలలకొకతూరి రాయలిచ్చుచుండును. అందరికిని టంకములనే యిత్తురుగాని, సామంతరాజ్యములపై నచ్చు పన్నులాదాయమును విలియవేయు నాచారము రాయలపాలనమునందు లేదు.

ఈదేశపు జనసంఖ్య యింతయని యుజ్జాయింపుగానైనను చెప్పుటకు వలనుగాదు. ఎచ్చటగాంచినను దేశమంతయు జనసంకీర్ణము. ఇసుకపైచిన రాలనంతమంది జనులు గలరు. రాయల కోశాగారమందు ధనము దాచుకొనుటకై పాతాళపుకొట్టులనేకములుగలవు.[5] అందు బంగారము వెండి కరిగించి దిమ్మలుగా బోసియుంచుట గలదు. ఈదేశమునందు పేదవాని మొదలుకొని భాగ్యవంతునివరకు స్త్రీలు, పురుషులు, బాలురు, చివరకు బీదలుకూడ బొమ్మరిలాటలాడు బొమ్మలు నయితము చేతులకు, దండలకు, మెడలకు, కాళ్లకు అమూల్యరత్నాభరణములో, పుత్తడిసొమ్ములోనగనో ఏవో కొన్నిటిని ధరింతురు.

ఏనుగులు, వానిని బట్టుకొను విధము

నగరున కెదురుగా (అనగా తూర్పుగా) ప్రధానమంత్రి సభామంటపము గలదని చెప్పితినిగదా! ఆసభామంటపమున కెదురుగా రాయల ఏనుగులసాల గలదు. రాయల కేకశతాంపు నాల గేనుగులు గలవు; కాని వానిలో మంచివానిని పెద్దవానినిమాత్రము రాయలు తన యుపయోగార్థము నుంచుకొన్నాడు. పట్టణములోనికి ప్రవేశించునపుడు మనకుతగులు వెలుపలి ఆరేడుప్రాకారములనడుమ వాయవ్యదిశయందు అనగా ఉత్తర పశ్చిమ

1. వరహాను దీనారమని పేరుంచిరన్లు శ్రీనాథుని చాటుపద్యమువలననేకాక మహమ్మదీయ చరిత్రకారుల వలన గూడ దెలియుచున్నది.

2. అర్ధవరహాలు- ప్రతాపములు. ఇవి ప్రౌఢదేవరాయల పితామహుడైన మొదటి దేవరాయలచే ముద్రితమయినవిగా నలయును. ఆతనికి ప్రతాపదేవరాయలని బిరుదముగలదు. ఆబిరుద మీటంకమునను నిలచిపోయియుండును.

3. తరమను టంకమున్న సంగతి దెలుపు శాసనప్రమాణము లేమియు ఇంతవరకు గానరాలేదు.

4. 'జతలు'అను రాగిడబ్బు నేడుగూడకర్ణాటక దేశములో వ్యవహారమందున్నదేమోగాని యిచ్చటనాకు దెలియదు.

5. రాయల సువర్ణరత్నపుభాండాగము అంతఃపురసౌధమునకును టంకసాలకు నడుమనున్నది. దానికిలోపల ప్రహరీగోడ యొకటిగలదు. భాండారమంతయు భూమిలో నున్నది. దానికిచుట్టును, సిపాయీలు 'పహారా' కాయుటకు వెడల్పయినత్రోవ యొకటి గలదు. భాండాగారము నలువపగమైన గది. దానిపైన మరియొక అంతస్థు గలదు. అంతస్థునకు క్రిందభాగమున కర్రసరంబీ గలదు. ఈ భాండాగములోనికి మార్గము తూర్పుగా, నచ్చును. ఆమార్గమంతయు చీకటికోణముగా నుండును. ఆమార్గమునకు చివర పైకివచ్చుటకు రాతిమెట్లు గలవు. ఈ భాండారపుగదికి వెలుపలికిబోవుటకు ద్వారము తూర్పువైపున గలదు. ఆగదికిలోపల నాలుగు పెద్దస్తంభములు గలవు. ఈ గదియు, దానిపై మిద్దెగదియు వాటిగోడలును, స్తంభములును అన్నియు తెల్లసాలగచ్చుతో నునుపుచేయబడియున్నవి. ఇపుడా స్తంభములపైనుండిన సరంబి కూలిపోయినది గాని క్రిందగదిమాత్రము స్తంభములతో మంచిస్థితియందున్నది. వర్ణముకురిసిన ఈ పాతాళపుకొట్టులోనికి దిగకుండ చుట్టు ఎత్తుప్రదేశమున పిట్టప్రహరీగోడ యొకటి నేటికిని గానవచ్చుచున్నది. ప్రౌఢదేవరాయలకు క్రీడాభిరామకృతికర్త యనబరగు వల్లభరాయని తండ్రియగు త్రిపురాంతకుడు (తిప్పయ్యమంత్రి) నవరత్న సువర్ణ భండారరక్షకుడుగా నుండెను.

ద్వారముల నడుమ, నీయేనుగుల పోషించుటకు, పిల్ల యేనుంగులను పెంచుటకు, మత్తగజములను సాధుచేయుటకును యేర్పాట్లు గలవు. రాయలకు మంచి చక్కనైన ఐరావతమును బోలిన తెల్లయేను గొకటి గలదు. దాని మీద ముప్పదివఱకు నల్లని మచ్చలు మాత్రము గలవు.

ప్రతియుదయమున నీయేనుగును రాయలసమ్ముఖమునకు దీసికొని పోవుదురు. ప్రాతఃకాలమున నీ ముఖారవిందమును దర్శించుట రాయలకు శుభశకునము! రాయలవారి రాజయేనుగులకు అన్నము వండిపెట్టుదురు. అవంటలు లాకరలయందుననే జరుగవలయును. ఉడుకుపట్టైన తరువాత నాయన్నమునందు కొంచెము ఉప్పును, బెల్లమును వేసి, రెండేసిమణుగులు బరువుగల ముద్దలుగా జేసి, నేతిలోగాని, పెరుగులోగాని ముంచి, యాజంతువుల నోటిలో నుంతురు. ఆయాహారమును తయారుచేయుటలో నొకరు లేశదాన్యమును పొరబాటున వేయుట మఱచినను, ఆజంతువులు వారిని జంప నుద్యమించును. రాయలు కూడ వారిపొరబాటును మన్నింపక కఠినముగా శిక్షించును. ఇట్టిస్థానమున నామత్తగజములను రెండువేళల మేతనిడుదురు. ఒక్కొక్కరి కొక్కొక్కశాల చొప్పున అన్నింటికిని అన్నిశాలలును గలవు ఆశాలలగోడలు ఎత్తుగానుండి బలిష్ఠములుగా నున్నవి. ఆగోడలపైన లావుపాటి దూలములును, వానిపైన కఱ్ఱసరంబియు గలదు. పైనున్న దూలముల కేనుగల వీపులకు, మెడలకు గట్టబడిన ఇనుపగొలుసులు గట్టిగా గట్టబడియుండును. ఇట్లుగాక మరి యేవిధమున వాటిని గట్టిపెట్టినను ఆ పెద్దజంతువులు బలముగల వగుటవలన సులభముగా గొలుసులను సడలించుకొని పాఱిపోగలవు. వీటికి ముందఱికాళ్లకు గొలుసుల సంకెళ్లు గూడ తగిలించబడియుండును.

ఈదేశమున జనులు, గజముల నీవిధముగా బట్టుకొందురు. ఆజంతువులు సాధారణముగా నీరుద్రావ జలాశయములకు బోవుమార్గమునం దొక పెద్దగోయిని త్రవ్వి, దానిపై, వెదుళ్లను, ఆకులను కప్పి పలచగా మట్టిని జల్లి మామూలు నేలవలె నుంచుదురు. ఎప్పటి త్రోవయే యనుకొని యేనుగు లాగోతిమీద నడువబోయి యందు కూలును. అటుపిమ్మట రెండుమూడు దినములవఱకు మనుష్యుల నెవరిని ఆచెంతకు బోనీయరు. అట్లు కొన్నిరోజులు జరిగినపిమ్మట నొకడా మృగముకడ కేగి, దానిని పెద్దకఱ్ఱ తీసుకొని యూరక మోదును. ఒకవంక ఆకలిదప్పులచేతను, మఱియొకవంక బాధాకరములయిన దెబ్బలచేత నొడలు నొచ్చియున్న యాకరి కడకు నొకడు హఠాత్తుగా బరువెత్తికొని వచ్చి దానిని కొట్టుచున్న మనుష్యుని చేతిలోని కఱ్ఱలాగుకొని వానిని చావగొట్టునట్లు నటించి పలాయితుని జేసి యాకఱ్ఱను దూరముగా విసిరి పాఱవేయును. పిమ్మట నాయేనుగున కాహారముగా నింత రొట్టెను, నీటిని యుంచి మెల్లగా వెడలిపోవును. ఇట్లు కొన్నిదినములు వరుసగా నీకపటనాటకము నాడబడును. ఒకడు ప్రతిదినమును వచ్చి ఆయేనుగును చావమోదుచుండును. రెండవవాడు వానిని తరిమివేసి కఱ్ఱ విసరివైచి దానికింత యాహారము వేసిపోవుచుండును. ఇట్లు కొంతకాలము గడచినప్పటి కాజంతువునకు మొదటివానిపై మిక్కిలికోపమును, రెండవవానిపై నపారమైన ప్రేమయు నంకురించును. అంతట రెండవవాడు మెల్లమెల్ల నాయేనుగును మచ్చిక చేసుకొని, దగ్గఱకుజేరి, మేనును, తొండమును నిమురుచు, మంచి రుచ్యములయిన పండ్లను, కాయలనొసంగుచు చనువు చేసికొనును. ఆయేనుగును, వానియం దత్యంత విశ్వాసముగలదై, తనమెడకు గొలుసులు తగిలించినను యూరకొనెను.

వెనుక నొకసారి, రాయల గజశాలనుండి, తప్పించుకొని అడవులకు పాఱిపోయిన యొకానొక మత్తేభమును గూర్చి యొకకథ చెప్పుదురు. అప్పుడాతని మావటీడు, దానివెంటనే వని తెలుపుగా నాయేనుగు ఆహారమునకై చరించు తావులం దక్కడక్కడ పెద్దపెద్ద గోతులను త్రవ్వియుంచెనట! మావటీంద్రుడు ఏనుగులను బట్టుటకై చేయు మాయపన్నుగడలన్నింటిని బాగుగా నెఱింగిన దగుటచేత, తొండమునందు లావాటి యొక దూలమును బట్టుకొని, తనముందు నేలను గొట్టుచు నడచుచు బోవుచుండెను. ఇట్లనుదినమును, మేతకుబోవుచు, జలాశయమును జేరుచుండెను. అంతట మావటీంద్రుడు నాయేనుగును బట్టుకొనునాశ సన్నగిల్లెను. కాని రాయలకు మాత్ర మా యేనుగును బట్టుకొనవలయునను పట్టుదల

తగ్గకపోవుటవలన, వారికి మిక్కిలి ప్రాణసంకట మయ్యెను. అట్టులుండ నొకమావటివాడు ధైర్యము చేసి కొని, ప్రాణముపై నాశవదలి యాయేనుగు తఱుముగా బోవు మార్గమున నొకచెట్టుపై దాని కంటబడకుండ దాగుకొని కూర్చుండెను. అట్లు కూర్చుండి యాజంతువు చెట్టుక్రిందనుండి పోవునపుడు గుభాలున దానిపైకురికి, దాని వీపుమీదనుండి, దేహముచుట్టును గుండెలమీదుగా బిగించి కట్టబడియున్న త్రాడును గట్టిగా పట్టుకొనెను. ఈయవమానమును భరింపజాలక యాజంతువు, రోషము జెంది, తొండముతో నామావటివాని నెన్నిపాట్లు పెట్టవలయునో యన్నిపాట్లను బెట్టినది. చివరకు వాడెప్పటికిని వీపుమీదనుండి క్రిందకు పడకుండుట గని నేలపైబడి దొర్ల నారంభించెను. మావటివాడును మిక్కిలి చురుకుదనము గలవాడును, గడుసువాడును గావున, నాయేనుగు ఎట్లు దొర్లినను వాడుమాత్రము దానిక్రింద బడకుండ తప్పించుకొనుచు సంభ్రమములు బ్రద్దలగునేమో యనునట్లు నెత్తి పడమోదుచుండెను. ఈబాధననుభరింప జాలక తుద కామత్తేభము అలసి, సొలసి, మావటివాడు తన్నుగొలుసులతో దేహమంతయుకట్టి, యిష్టమువచ్చిన తావుకు గొంపోవుటకు సమ్మతించెనట! రాయలయెదుట కామావటివాడు, పట్టుపడిన మదపుటేనుగును గొంపో యెను. దానిని జూచినపుడు సంతుష్టాంతరంగుడై రాయలు వానిని యథోచితరీతిని బహూకరించిపంపెనట!

హిందూస్థానమునందు రాజులు వేటకు ఏనుగుల నెక్కి బోవుదురు. వేటకు బోయినపుడెల్ల, నెలలతరబడి యడవులం దుండుచు, ఏనుగుల వేటాడుచు, బట్టుకొను చుందురు. ఏనుగులవేటయన్న వారికి బరమసంతోషము.[1] రాయల కెవ్వనిమీద గాని, యనుగ్రహము దప్పిన పుడును, వాని నేరము, మిక్కిలి గొప్పదైనపుడును, వానిని యీమదపుటేనుగలక్రిందబడద్రోసి, త్రొక్కించి చంపుదురు. అవి వారిని కాళ్లతోడను, త్రొక్కుచు, దంతములతో బొడుచుచు, తొండములతో చీల్చివేయును.

వర్తకులు ఏనుగులను సింహళమునుండి, నానాదేశములకు గొంపోయి, వాటి, యెత్తునుబట్టి, గజమున కింత ధర యని నిర్ణయించి యమ్ముదురు.

### వేశ్యావాటికలు

టంకసాల కెదురుగా, కటకపాలుని, కచ్చేరి యున్నది. ఆతనిక్రింద నగరరక్షణమునకై పండ్రెండు వేలమంది పడి కావలివాండ్రు గలరు. వారికి జీతము క్రింద ప్రతిదినమును మనిషి కొకపణము చొప్పున వేశ్య వాటికలవలన పండ్రెండువేల పణముల సుంకము వసూ లు చేయబడుచుండును. వేశ్యావాటికల యందలి, వల యాండ్ర [illegible], సౌధముల విభ్రమము, వైభవసంపదలు, అప్పుడె విలాసినీతతుల సౌందర్యము మొల్క లేనగవు తో ముద్దుగురియుచున్న వారి నెమ్మోములు, వారి యొయ్యారపు నడలు, ఎంతటివానినైన వలపించువారి నేర్పరితనపు మినుసులు, మోహనాస్త్రములయిన వారి చూపులు, ఆహా! హా! వర్ణింప నాకుశక్యముగాదు. వర్ణింప మొదలుపెట్టిన నాకుకూడ మనసుచలించును గావున నంత టితో వారవనితల విలాసములు వర్ణింపవిరమింతును.

వేశ్యావాటికను గూర్చి యొకమాట మాత్రము చెప్పకతప్పదు. టంకసాలవెనుక సుందరముగా నిరు వదిగజములు వెడల్పును మూడువందల గజముల పొడవును గల యొకవీథి గలదు. ఆవీథి కిరు ప్రక్కలను చక్కని పూబొదరిండ్లతో నిండిన ముంగిట వాకిళ్లుగల శోభనగృహములు బారులు తీర్చియున్నవి. ఆ ప్రాంగణములందు చంద్రకాంతశిలానిర్మితములయిన వేదికలు వరుసగా గలవు. ఆ వేదికలకు వెనుక, మేడగోడలపై సింహములు, పులులు, చిరుతపు లులు, ఏనుగులు మున్నగు వన్యమృగము లనేకములు జీవ ము లుట్టిపడునట్లు చిత్రింపంబడియున్నవి. అపరాహ్ణ మున, ఎండవేడిమి యించుక తగ్గుచుండ, నీ వారవిలాసి నులు చక్కగా నలంకరింపబడిన తమ యిండ్ల ప్రాంగణ ములందున్న చంద్రకాంతశిలావేదికలపై తివాసులమీదను,

1 అబ్దుర్ రజాక్ తాను విజయనగరమున, విని, చూచినదానినిబట్టి, హిందూస్థానపురాజులకందఱకు నొక్క విధమగు నాచారమును వేడుకవ్యాపారమును సూచించుచున్నాడు. అబ్దుర్ రజాక్ నిజముగా పొరబడినాడనియే మామతము. ఈప్రౌఢదేవరాయలకు ఏనుగులవేటయనిన మిక్కిలి ప్రీతియట! అందువలన నాతనికి గజబేంటదేవరా యలని బిరుదము గలదట. దేవరాయనిబట్టి యాతనివేడుకను ఇతరరాజులకు రజాకు ముడివెట్టియున్నాడు.

కుర్చీలమీదను, సోఫాలమీదను, విలాసముగ, హాయిగ మీఱు చేటీజనముతో సుఖోపవిష్టులయి, యుందురు. ప్రతివెలపడుచును ఒడలంతయు, నవరత్నఖచితాభూషణములతో, మంచిముత్తెముల హారములతో కన్నులకు మిఱుమిట్లుగొల్పు చక్కదనముతో, రంగురంగుల చీరెలు కట్టియలంకరించుకొని, చూచువారల హృదయములను జూఱగొనుచుందురు. అచ్చటివారందఱు, పదియాఱ్వన్నె కుందనపు శలాకలవలెనున్న నెఱజవ్వనపు సొగసుకత్తెలే! ఒక్కొక్కపడుపుకత్తెకు ఇద్దరు ముగ్గురు దాసీలుందురు. వారు తమ యజమానురాండ్ర కడ నిలువబడి, మార్గమున బోవువిటకాండ్రను తమనేర్పుచేతనమ్ముట్టిపడునట్లు, నెఱ్ఱాట కత్తెల సౌందర్య సముద్రములో ముంచివేయ ప్రయత్నించుచుందురు. ఆవీథిని మన్మథుడు తన చెఱకువింటిని, సంధించి, శరంపరలు గ్రుమ్మరించును రేబవలు సంచరించును నాయప్సరసలనుబోలిన కాంతల వలలో విరహులగు వారిని బడద్రోయుచుండును. జలకాండ్ర సొత్తుగూడి సుఖింపగోరువాడీవీథినిబోయి, తనయిచ్చవచ్చిన తరుణిని గోరుకొని పడయవచ్చును. వేశ్యాగృహములందు పరిచారికలు, దాసీలు, మిక్కిలి యోగ్యురాలయి యుందురు. పడుపుకత్తెల్లాండ్రకై వచ్చిన విటులసొత్తేదయిన నొక ద్రుష్టిగప్పైన పోయిన పరిచారికల ప్రాణము మీదికి వచ్చును. వెంటనే వారు గృహమునుండి కొరడాలగొట్టబడుదురు. ఈనగరపు ఏడుప్రహరీలనడుమ లెక్కకుమించిన వేశ్యాగృహము లున్నవి. ఈ వేశ్యల వలన రాబట్టబడిన పంద్రెండువేల పణము లనుదినమును నగరుకావలివాండ్ర జీతబత్తెములకై వినియోగింపబడును. ఈకావలివాండ్రనుదినమును, అనుక్షణమును ఈయేడు కోటలనడుమ నేమేమిజరుగుచున్నదో, ప్రతిక్షణమును కటకపాలున కెఱింగించుచుండవలయును. ఏవస్తు వెచ్చట పోయినను, ఎక్కడేదొంగతనము జరిగినను తత్క్షణము నేరస్థుని వెదకి, పోయిన సొత్తును, సొత్తుదారునికి జేర్పవలయును. నగరమున ఏనేరమును జరుగనియ్యరాదు. వారివలన నేలోపమయిన వచ్చెనా, దానికి వారు కొంత జరిమానా నిచ్చుకొనవలయును. నాస్నేహితుడొకడు కొందఱి బానిసవాండ్రనుకొనియుండ, వారు తమ కావలివాండ్ర యధీనము తప్పించుకొని పారిపోయిరి. ఈ వృత్తాంతమును మేము నగరపాలకునికి (కటకపాలునకు) ఎఱిగించినంత, నాతడు మేమున్న పట్టణప్రాంతమందంతటను గల బీదసాదలను, పారిపోయిన బానిసలను పట్టితెచ్చి యప్పగింపవలసినదనియు, లేనియెడల వారలను గొనుటకై వెచ్చించిన ధనమును తెచ్చి యీయవలెనని ప్రకటించవలసినదని, తన సేవకులకు పడి కావలివాండ్రకాజ్ఞాపించెను. వారును అట్లుచేసియుండిరి. ఆబీదలు, పారిపోయినవారిని తెచ్చి యప్పగింపలేకనెట్టెటో, మేము ఖర్చుపెట్టిన మొత్తమును దెరిసికొని తెచ్చియిచ్చిరి. ఇట్టివి చోద్యమయిన, యీవిజయనగర మహాపట్టణ వృత్తాంతములు; యీనగర మేలు రాయల పరిపాలనా విశేషములు."

ఈచరిత్రకారుడు, రాయలవారి యుద్యోగీయులచే సన్మానింపబడి, యాతనికై నియోగింపబడియున్న రమ్యహర్మ్యతలమున విడిది దిగియుండెను. ప్రయాణపు బడలికవలన నీతని దేహము మిక్కిలి అలసిసొలసియుండినందున పెక్కుదినము లితడు సుఖముగ, నిర్విచారముగ, నాచక్కని సౌధమున, స్వర్గసమమైన యామహానగరమున నేకొదువయును లేక మొహరము పండుగలు వచ్చునంతవఱకు గాలము బుచ్చెను.






పూర్వకాలమున యదువృష్ణిభోజాంధక జాతులవారి నన్యోన్యప్రేమమును విడనాడి మత్సరగ్రస్తులు, స్వార్థపరులు, పరపీడకులు, దుష్టస్వభావులునై నిరంతరము నొండొరుల వంచించుకొనుచు, నేడు, మనచే నవతార పురుషుఁడుగఁ బరిగణింపఁబడుచున్న శ్రీకృష్ణభగవానుఁ డంతటివానికిఁ గష్టములను, దుఃఖములను గలిగించుచుండిరి. వీరి దుష్ప్రవర్తనమునకు మిగుల దుఃఖించుచు నొకప్పుడు శ్రీకృష్ణభగవానుఁడు దేవర్షియైన నారదునికడకుఁ బోయి, "ఓ నారదా! ఒకని యొక్క రహస్యాలోచనములు చదువురాని మూఢులకును, జ్ఞానహీనులయిన మిత్రులకును, చంచలబుద్ధులయిన పండితులకును దెలుపరాదు. నీవు నావిశ్వాసమునకుఁ బాత్రుఁడవయిన మిత్రుఁడవగుటవలన నీతో నాకష్టములను గుఱించి కొంతవఱకు వెళ్ళఁబోసికొని మనశ్శాంతిని బొందఁగోరుచున్నాను. ఓ దేవర్షీ! నీవుతలంచినమాత్రాన త్రిభువనముల సంచరింప సామర్థ్యముగలవాఁడ వగుటంజేసియు, ఎదుటివాని బుద్ధిప్రవీణతను గ్రహింపఁగలవాఁడవగుటంజేసియు నీతోమాత్రము నేను మాట్లాడఁ గోరుచున్నాను. నేనెప్పుడును నా బంధుబృందంబులయెదుట దాస్యబుద్ధితోఁ జేతులుజోడించుకొనినిలువంబడి వారియైశ్వర్యప్రాభవంబులను గుఱించి స్తోత్రపాఠములను జేయుచుఁ బ్రవర్తించినవాఁడను గాను. అయినను నేను సముపార్జించిన ధనములో సగము వారికై ధారపోసి నా రాజీపోసికొనెడి కష్టమాటలను పాటిగాఁ బట్టక మఱచిపోవుచుండెడివాఁడను. అయినను నిప్పునుగోరెడివాఁడు నిప్పుపుడకను రాచినట్లు నాబంధుజనులు నిరంతరము వారి క్రూరసంభాషణముచే నాహృదయమును రాఁజఁబెట్టుచున్నారు. ఓ దేవర్షీ! నిశ్చయముగా వారి క్రూరసంభాషణములచే నాహృదయము మండఁబెట్టుచున్నారు. నావారిలో సంకర్షణుఁడు బలసంపన్నుఁడు; గదుఁడు శాంతుఁడు; ప్రద్యుమ్నుఁడు రూపసంపన్నుఁడు. ఇంతటివారున్నను నేనసహాయుండనై యున్నాను. ఓ నారదా! అంధకులలో, వార్ష్ణేయులలో ననేకులు పట్టుదలగలవారు, ప్రాభవముగలవారు, బలముగలవారు, ధైర్యసాహసములు గలవారు, మహిమచే గొప్పవారునై యున్నారు. వారేపక్షమునఁ జేరిరో యాపక్షమునకు వినాశము గలదు. వారేపక్షమునందురో యా పక్షమున విజయముగలదు. ఇటువంటి బలగము నా ప్రక్కనున్నను నేను నిస్సహాయుండనై నిరుపేదనై యున్నాను. ఆహుకుఁడు, అక్రూరుఁడు నాకు పరమమిత్రులయినను, ఇందెవ్వని

కైన నాప్రేమను గనఁబఱతునేని రెండవవానికిఁ గోపముజనించుచుండును గావున నేనుభయులను బ్రేమించువాఁడ నైనను నాప్రేమము నెవ్వనిపట్లను బహిర్గతము కానీయక యున్నాను. వీరిలో నెవ్వనిని నేను విడనాడఁజాలను. అట్టిపని బహుకష్టసాధ్యము. దుఃఖప్రదము. వారుభయులు నాప్రక్కనున్నను దుఃఖప్రదమగుచున్నది. వారుభయులు నన్ను విడిచి దూరముగ నున్నను దుఃఖప్రద మగుచున్నది. ఒండొరులతో జూదమాడుకొనుచున్నతనయిర్వురు కొడుకులకిడఁగూరుచుండి యిర్వర జయమునుగోరెడి తల్లివలె నేనున్నాను. ఈ ప్రకారముగా ఓ నారదా ! ఇరుపక్షముల వారిచేతను బాధపడుచున్నాను. నాకును నా బంధుజనంబునకును లాభకరమైన విధానము తేటపఱుపుము."

అందులకు నారదుఁ డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను:

ఓకృష్ణా ! ఆపదలు రెండువిధములయినవి (ఆపదో ద్వివిధాః). బాహ్యములు, ఆభ్యంతరములని. స్వయంకృతము లాభ్యంతరములు; అన్యకృతములు బాహ్యములు. ఓ వృష్ణికుల సంభూతుఁడా ! ఇప్పుడు నిన్నావరించుకొన్న విపత్తునకు నీవే కారణభూతుఁడవు. భోజకులయిన బలదేవాదు లక్రూరుని పక్షమువారలు. నీవు సముపార్జించిన ధనము ప్రతిపక్షమువారయిన యాహుకాదులకు (ఉగ్రసేనుఁడు, బభ్రువు మొదలగువారు) నొసంగినందున వారందఱు నక్రూరుని పక్షమునఁజేరినారు. అనేక మిత్రులు నీకున్నను దొలుత నీవు గావించిన యీ స్వయంకృతాపరాధమువలన నీవిపత్తు నీతలపైకిఁ దెచ్చుకొన్నావు. ఒకఁడు తాను గ్రక్కిన యాహారమును మరల మ్రింగలేని విధముగా వారలనుండి యామైశ్వర్యమును గైకొనఁజాలవు. ఓకృష్ణా ! బభ్రువునుండియు, ఉగ్రసేను నుండియు వారిరాజ్యమును మఱల గైకొనఁ జాలవు. వారిలో నన్యోన్యకలహములు పుట్టించినయెడల నీవు గైకొనఁజాలవు. ఒకవేళ నీప్రయత్నము నెఱవేఱినను అది మిక్కిలి కష్టసాధ్యమైన దగును. బహుజననష్టమునకును, బహు ధననష్టమునకును, ఆస్పదముకావచ్చును. ఒకవేళ సర్వమునకు వినాశము సంభవింపవచ్చును.

కాఁబట్టి ఉక్కుతోఁ జేయబడిన యాయుధముచేఁ గాక యెల్లవారి హృదయములను వశపఱుచునట్టి మృదువైన యాయుధముతో (శాంతియుతమైనది) నీకార్యమును నెఱవేర్చుకొనుము. ఆ యాయుధమునకు నప్పటప్పట పదును బెట్టుచు నీ బంధువుల వాక్కులను బంధించి వారిని సరియైన మార్గమునఁ బెట్టుము.

అంత కృష్ణుఁడు నీవుచెప్పిన యాయుధమెట్టిదని దేవర్షి నడిగెను. అందుల కతఁడిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

నీశక్తి కనువగు నంశోవఱ కాహారమిడుట; వారిదూషణములను మఱచిపోవుట; వారియెడ మనఃపూర్వకమైన ప్రేమఁజూపుట; సదా శాంతిగలిగియుండుట, గౌరవముగలవానికి గౌరవము నొసంగుట; వీనితోఁగూడిన దే యా మృదువైన యాయుధము. దుర్భాష

లాడువాని పట్ల మృదుపదప్రయోగమును గావింపుము. ఇదియే వారి క్రూరసంభాషణముల నడఁగించును. వారిహృదయములను, మనస్సులను సంతోషింపఁజేయును. పవిత్రాత్ములు కలవారును, మహత్కార్యముల నెఱవేర్ప శక్తిగలవారును, మిత్రులుగలవారు మాత్రమే గొప్పభారమును వహింపఁగలరు. ఈ గొప్పభారమును నీవు నీభుజములందు వహింపుము. సరియైన బాటలం దన్ని యెడ్లును గొప్ప భారమును లాగఁగలవు. కాని వానిలో బలమైనవిమాత్రమే యెగుడుదిగుడుకు మార్గములందు భారమును వహించి లాగుటకు సమర్థములగుచున్నవి. ఐకమత్యాభావము వినాశమునకు హేతువగుచున్నది. వార్ష్ణేయులు భోజకులు నశించిపోఁగలరు. ఓ కేశవా? వారిలో నీవు ప్రముఖుఁడవుగావున వారట్టి వినాశమును బొందకుండ నీవు కాపాడఁజాలవా! స్వజాతి వారి యభివృద్ధి శ్రేయస్కరమైనది. నీబంధువులకు వినాశములేని మార్గమున నీవునడిచి వారిని రక్షింపఁజాలవా? ఓకృష్ణప్రభూ! నీవెఱుంగని రాజనీతియు, యుద్ధనైపుణ్యమును నేర్చుకోఁగలవా? ఓ మాధవా! యాదవులు, కుకురులు, భోజులు, అంధకులు, వార్ష్ణేయులు మొదలగు వారెల్లరు నీపై నాధారపడియున్నారు. ఋషులందఱును నీయభివృద్ధికై ప్రార్థించుచున్నారు. నీవు భూతభవిష్యద్వర్తమానముల నెఱింగినవాఁడవు. యాదవులలో శ్రేష్ఠుఁడవు. అందఱు నీపై నాధారపడి సుఖింపఁ గోరుచున్నారు.

అని హెచ్చరించి నారదుఁడు దేవలోకమునకుఁ బోయెను. శ్రీకృష్ణుఁడు ప్రసన్నహృదయుఁడై స్వస్థానమునకు విజయము చేసెను.



# కాపుకన్నె

శ్రీ శేషాద్రిరమణ కవులు



క్రొందమ్మితుమ్మెదజంట కూసినకైపడి
కనరు క్రొమ్మోఁతలు దిశాంగణము లొరయ
శారదచంద్ర రుక్పూరంబుగతి కేల
సోడవైన తెలినూలు పోగు దనర
చెలిమిమై రాజ్యలక్ష్మిని నీలముల పూజ
సలుపుకైవడిని జూపులు రహింప
జలజాక్షుకర సుదర్శనచక్రముం బోలి, గిరగిర రాటంబు తిరుగుచుండ
గృహసమీపస్థ నింబధాత్రీరుహప్ర,తీర దేశంబునం దొగి గూరుచుండి
పనుచు చెలువలతో గూడి బాలతీయు, కాపుకన్నెను గనుగొంటి కలవు దీల.




III

## మరికొన్ని విషయములు

(ఒక కృషీవలుడు)

పచ్చియెరువు రెండు విధములుగ పని చేయునని మునుపటివ్యాసమున సూచింపబడెను. నేలలో లోటుపడు ముఖ్యద్రవ్యమగు 'నత్రజని'ని నేలకు జేర్చుట (చిక్కుడు పూవులవంటి పూవులను బూయుజాతులు పెంచినపుడు మాత్రమే) యొకటి. నేలయందు జరుగు కొన్ని మార్పులకు తోడ్పడుట రెండవది. ఈరెండువిధముల పనిని గురించియు కొంత వివరింపవలసి యున్నది.

మెట్టనేలలోను తోటనేలలోను పచ్చియెరువును వేసి దున్నివేసినయెడల నది కొన్ని సూక్ష్మజీవుల పని వలన క్రమక్రమముగ చీకి యందలి నత్రజని సంబంధమగు పదార్థములనుండి మొదట నత్రాయితములును (Nitrites) పిమ్మట నత్రితములును (Nitrates) పుట్టును. ఇట్లు నిరింద్రియములగు నత్రితము లేర్పడిన పిమ్మట వాని నితరద్రవ్యములతో పాటు ద్రావణరూపమున మొక్కలు తీసికొనగలుగును.

పైనిచెప్పిన మార్పులకు కొంతకాలము పట్టును. కావుననే విత్తుటకు ముందు సుమారు రెండు నెలలకు ముందే పచ్చియెరువును వేసి దున్ని వేయవలెనని మునుపటి వ్యాసమున వ్రాయబడెను. ఒక్కొక్కప్పుడిట్లు ముందుగ వేసినను తగినంతవర్షము లేకపోయినచో యెరువు చీకి నత్రితము లేర్పడుటకు పదును చాలకపోవచ్చును. రొట్టను నేలపై వేయకమునుపే ఏదైన నీరున్నగోతిలోగాని, కుండలోగాని, వేసి 4, 5 జాములు ఊరనిచ్చితీసి వాడినయెడల నది త్వరలో చీకి యుపయోగించునని కనిపెట్టబడెను, పచ్చినీలి రొట్టకంటె నీలికుండ్లలో నూరిన పిమ్మట తీసివేసిన రొట్ట బాగుగ పనిచేయుట రైతుల కనుభవవేద్యమే కదా !

ఇట్లు నీటిలో నానవేసితీసిన రొట్టను వెంటనే యుపయోగించుటకు బదులు గుట్టలుగవేసిగాని, గోతులుగ వేసిగాని కొంతకాలము చీకనిచ్చి యుపయోగించుటయు మంచిదే. అందు జరుగవలసిన మార్పులన్నియు నేలలో వేయకమునుపే చాలవరకు జరిగి మంచి యెరు వేర్పడును. సస్యమును విత్తుటకుగాని, నాటుటకుగాని కొంచెము ముందుగవేసిన చాలును. పదును లేమివలన గలుగు నష్ట ముండకపోవుటచే నీపద్ధతి మెట్టనేలలకు మిగుల మంచిది.

గోతులలోగాని కుప్పలోగాని రొట్ట చీకునపుడది ఆరిపోకుండను గోతులలో నీరు చేరకుండగను జాగ్రత్తపెట్టవలెను. బాగుగ చీకినయెడల ఒకటి రెండుసార్లు దానిని కలియదీసి గాలిపోవునట్లు చేయుట మంచిది.

నత్రజనికితోడు స్ఫురమునుగూడ నేలకు జేర్పవలసినయెడల రొట్టను పైనిచెప్పినట్లు గోతులలోగాని గుట్టలుగగాని వేయునపుడు ఎముకలపొడిని రొట్ట పొరల మధ్య చల్లి దానితోపాటే చీకనిచ్చుట మంచిది. ప్రత్యేకముగ ఎముకలపొడి వేసినప్పటికంటె నిట్లు రొట్టతో కలిపి చీకిన యెముకలపొడి త్వరలో సస్యమున కుపయోగించును.

దంపనేలకు పచ్చియెరువు వేసినపుడు జరుగు మార్పులు మరియొక విధమయినవి. ఎల్లపుడును మడిలో నీరుండుటచే పైని చెప్పినట్లు నత్రితము లేర్పడుటకు

అవకాశములేదు. ఇట్టి స్థితిగతులలో మరియొకవిధమగు మార్పువలన 'అమ్మోనియా'యును మరికొన్ని 'నత్రజని' సంబంధమగు సేంద్రియ ద్రవ్యములును పుట్టును. వీనినే వరిమొక్కలు తీసికొనును. ఇట్లు నీరుండగా రొట్టచీకు నపుడు మొక్కలకు హానికరములగు కొన్నిద్రవ్యములు కూడ నుత్పన్నము లగును. ఇవి ఎప్పటికప్పుడు నీటితో గూడ పోవుచుండిననేకాని మొక్కలు చెడును. కావుననే నీరు బాగుగ వడియని జిగురునేలలలో అప్పుడప్పుడు సస్యము బాగుగ నెదిగి మంచిపంట నిచ్చుటకుబదులు దిగనారి పంట తగ్గుట సంభవించుచుండును. కావున పచ్చియెరువు వేయునేలల జలనిర్గమనము బాగుగ నుండునట్లు చూడవలెను. మరియు నెరువు చీకినపిమ్మటనే విత్తవలెను లేక నాటవలెను.

పచ్చియెరువు దంపనేలలలో చీకినపుడు పుట్టిన నత్రజనిలో చాలభాగము సస్యమున కుపయోగపడక వాయువులోనికి పోవునని కనుగొనబడెను. *కాని దంప నేలలకు పచ్చియెరువు వేయుటవలన మరియొక ముఖ్యోపయోగము కనిపెట్టబడెను. అతిక్రమముగ చీకుచున్న కొలదిని, వరినేలపైనుండు 'పాకుడు'♦తో సంబంధించిన కొన్నిసంకీర్ణములగు మార్పులమూలమున మొక్కల వేళ్లకు ప్రాణవాయువు నెక్కువగ కూర్పగలుగునని కనిపెట్టబడెను. ఇందుకు నేలలోని జలనిర్గమనము (నీరు వడియుట) అతిహెచ్చుగగాని అతిమందముగ గాని యుండక మధ్యమముగా నుండుట అనుకూలమనియు కనిపెట్టబడెను. కావుననే మిక్కిలి యిసుకనేలలలోను మిక్కిలి జిగురునేలలలోను, మంచిపంటలు పండవు.

పచ్చియెరు విట్లు ప్రాణవాయువును, కొంత నత్రజనిని మొక్కలవేళ్లకు సమకూర్చుటచే వరిచేలను బాగుగ నెదుగునట్లు చేయును. ఒక్కొక్కప్పుడీయెరువు విస్తారముగవేసిన నేలలలో చేనెదిగి యీనకముందే పడి పోవును. పడిపోయిన చేను పెరుగుటకు తగినంతపంట నీయకపోవుటయే కాక తరుచుపంట తగ్గిపోవుటయు సంభవించును. కావున పచ్చియెరువును నేలయొక్కస్థితి కనిపెట్టి తగుమాత్రముగ వేయవలెను. సామాన్యపు నేలలలో సత్తువనుబట్టి 2000 మొదలు 4000 పౌనులవరకు ఏటేటగాని రెండేండ్లకొకసారిగాని వేయవచ్చును. వీద నేలలలోను, చెరుకు అరటి నూవు మొదలగు సస్యములు పైరుపెట్టిన నేలలలోను యింకను హెచ్చుగ వేయ వచ్చును.

పచ్చియెరువుతో యెముకల పొడినికూడ వేసిన యెడల రాలిక హెచ్చగును. మొదటి సంవత్సరము 4 గుండ్ల ఎత్తును (224 పౌనులు) తరువాత ఏటేట 2 గుండ్ల ఎత్తును, లేక రెండేండ్ల కొకసారి 4 గుండ్ల యెత్తు వేయవలెను.

పచ్చియెరువు యొక్క సత్తువ సామాన్యముగ వేయుట మానినవెనుక నొకసంవత్సరము మాత్రము కనబడును. ఎముకలపొడియొక్క సత్తువ రెండు మూడేండ్ల వరకు కాన్పించును. హెచ్చుగవేసిన యెడల మరికొంత కాలముకూడ కాన్పింపవచ్చును.

దంపనేలలలో పచ్చియెరువు సస్యములను పెంచుటను గురించిన మరియొకవిషయమును గమనింపవలెను. జిగురుగానుండు పండలినేలలలో పచ్చియెరువు సస్యమును చల్లుటకుగాను నేలను దున్నుటగాని వెసకి తడుపుటగాని మంచిదికాదు. వీలయినచో వరిచేను కోతకు ముందు దున్నకయే విత్తులను చల్లవలెను. లేనియెడల సాధ్యమైనంతవరకు గట్టుప కొడిగానుండు యితర పొలములలోగాని, అదివరకే దున్ని పైరుపెట్టిన నేలలలోగాని, చెరుకుతోట తీసివేసిన నేలలలోగాని పెంచి అచట నుండి రొట్ట తెచ్చి వేసికొనవలెను. అట్టినేలలను దున్నినయెడల నొక్కొక్కప్పుడు పచ్చియెరువువలన గలుగు ఉపకారముకన్న దున్నుటవలన నేల గుల్లబారి హెచ్చు నష్టము గలుగవచ్చును. మరియు నేకారణము చేతనైనను నీపచ్చియెరువు సస్యము పెరుగక పోయినయెడల దుక్కి వలని నష్టము మాత్రము మిగులును.

పచ్చియెరువు నేలయందు చీకుటవలన పైని చెప్పిన యుపయోగములేకాక 'హ్యూమసు' అనుపదార్థము కొంత ఏర్పడి, దానిమూలమున మంటియొక్క భౌతికధర్మములు (అనగా జిగురు, నీటిని పట్టియుంచు

* Gases in swamp rice soils Part 1 P 88 by Harrison and Subrahmanya Aiyer.

♦ పాకుడనగా నీటిలో పెరుగు కొన్ని జాతులసూక్ష్మములగు మొక్కల సమూహము.

శక్తి మొదలగునవి) సస్యమున కనుకూలముగ మారును. ఇసుకనేలల కీయెరువును వేసినకొలదిని నేల జిగిపడి పంటలు హెచ్చును. జిగురునేలల నీయెరువు క్రమముగ గుల్లపరచి జలనిర్గమనమును బాగుచేయును. కావుననే కొన్ని జిగురునేలలలో పచ్చియెరువు వేసిన మొదటి సంవత్సరము పంట హెచ్చుటకు బదులు తగ్గినను క్రమ క్రమముగ నేల బాగుపడి పంట మొదటికంటె హెచ్చును.

వుల యెరువుకూడ అంతకంటె హెచ్చు సారముగల యితర ఎరువులకంటె శ్రేష్ఠముగనుండుట.

పచ్చియెరువువలన నేలకు సేంద్రియపదార్థము విస్తారముగ చేరుటచే నందలి కొన్నిజాతుల సూక్ష్మజీవులు వృద్ధియయి నేలయందలి సాధ్యాహారమును సిద్ధాహారముగ మార్చుట కెక్కువ వీలగును. కాని సేంద్రియ పదార్థము మిక్కిలి హెచ్చుగుట మరల నాజీవులకును

ఇట్లు 'హ్యూమసు'ను విస్తారముగ జేర్చుటచేతనే పశుబాధకరమే.



## వినతి

సాహితీసమితి సభాపతి, శ్రీ శివశంకర శాస్త్రి

వాసరముల్ మహాకఠినవైఖరిఁ బుచ్చుచునున్నవాఁడు, నీ
  దాసజనుండు తావక పదద్వయ సంస్మరణైక చిత్తుఁడై!
ఈసరి కేనియుం గృప జనింపమి కేమిటి కారణంబు? నేఁ
జేసిన దోసముం దెలియఁజేయఁగదే కరుణార్ద్ర బుద్ధివై!

నిన్నెపుడున్ స్మరించుచు ననిర్వచనీయ నిరంతర వ్యథా
ఖిన్నతతోడ నే హృదయగేహమునన్ లిఖియించుచుందు భా
వోన్నత తూలికాగ్రమున నుజ్జ్వల తావక దివ్యరూపమున్
మన్నన సేయరావె నను మంజుల శీతల వీక్షణంబులన్!

అయ్యయొ! దుస్సహంబుగ సహర్నిశమున్ హృదయాంబుజాతమున్
వ్రయ్యలు సేయుచుండు ననివార్యగతిన్ బహుళార్తి శస్త్రికల్ !
చయ్యన నీకృపామృత రసప్రసరంబు లభింప కున్నచో
నెయ్యది జీవనౌషధము నీహృదయంబున కంబుజేక్షణా !

ఈదగ శక్తి చాల దిఁక నీబహుళార్తి తరంగ సంకుల
హ్రాదినిలోన! కానఁబడ దావలి తీరపుఁజిన్నె లేవియున్
ఖేదము వాయ శీఘ్రముగఁ గేలను సత్కరమున్ గ్రహించి ల
క్ష్మీ దయితా, కృపాకలిత చిత్తముతో నిపుడైనఁ గావవే !



# తేజోలేఖనము

వింజమూరి కృష్ణమాచార్యులు గారు

(పదవ సంచిక తరువాయి)

## నాల్గవ ప్రకరణము

### చీకటిగది

### (DARK ROOM)

తేజోలేఖనమునకు జెందిన పనులన్నియు కొంచె మెచ్చుతగ్గగా చీకటిగదియందు ఎఱ్ఱవెలుతురు నిచ్చు దీపపుసహాయమున నెరవేర్చవలసియుండును. (ఒక టవచిత్రమును చూడుడు) ఆకర్షణఅద్దముల (Sensitive plates) నెప్పుడును, వెలుతురు సోకకుండ జాగరూకతతో చూచుచుండవలయును. వీటికి వెలుతు రెంతమాత్రము తగిలినను చెడిపోగలవు. ఈకారణముచే వీటి నుంచబడినట్టి అట్టపెట్టెలను ఎఱ్ఱదీపపువెలుతురుగల చీకటిగదియందు మాత్రము తెరవవలెను. ఏదేని దృశ్యముయొక్క ప్రతిబింబము నాకర్షింపజేయబడినట్టి ఆకర్షణ అద్దములను, (Exposed Plates) ద్రావకములలో కడుగు డివలప్‌మెంటు (Development) పనికూడ, చీకటిగదియందే చేయవలసియుండును. కొన్నిరకముల కాగితములపై ఫోటోగ్రాఫుల నచ్చువేయుటకు (Printing) కూడ చీకటిగది కావలసియుండును. ఈకారణములచే, తేజోలేఖకునకు చీకటిగది యెంత అగత్యమో వేరుగ చెప్పనక్కర లేదు. కమేరాయును, పరికరములును గలిగియుండినను, సరియగు చీకటిగదిలేనిది, తేజోలేఖనాభ్యాసమున కవకాశముండనేరదు. తలుపులన్నియు మూసివేసినచో, మనగృహములందలి గదులన్నియు చీకటిగదులుగా మారవా? యిందు కష్టమేమున్నదని చదువరు లూహింపవచ్చును. కాని, తలుపులు మూసినంతమాత్రమున, సామాన్య గృహములందలి గదులన్నియు, పూర్తిగా అంధకారమగ నుండవు. తలుపులసందుల నుండియో, ఇంటిపైకప్పునందలి రంధ్రములనుండియో, కొద్దిపాటివెలుతురు లోనికి వచ్చుచునే యుండును. ఆవెలుతు రెంతతక్కువగా నున్నను, ఆకర్షణ అద్దములను చెరచుటకు చాలును. డాబాకప్పుగాని, పరంజీగాని, కలగదులకు, పైనుండి వెలుతురు లోనికి రానేరదుగాని, తలుపులసందులనుండి మాత్రము రావచ్చును. తలుపులు మూసినపుడు గదిలోని కెంతమాత్రమును బైటవెలుతురు చొరకుండునట్టి యేర్పాటు గావించుకొనినతప్ప, పగటియందు డివలప్‌మెంటు వగైరా పనులేవియు చేయరాదు. రాత్రియందయినచో, యీచిక్కులేవియు నుండనేరవు.

హెచ్చరిక:—డార్కురూములాంతరునుండివచ్చు ఎఱ్ఱవెలుతురుతప్ప బయటినుండి యేవిధమగు వెలుతురును గదిలోనికి రాకూడదు.

తేజోలేఖనము నభ్యసించువారు తమగృహమునందలి చిన్నగది నొకదానిని చీకటిగదిగా నుపయోగించుకొనుటకై ప్రత్యేకించి యుంచుకొనుట మంచిది. ఇట్లు చేయుట కవకాశముండినచో, ఆగదియందు డివలప్‌మెంటు మొదలగు పనులు చేయునపుడు, ద్రావకముల బుడ్లను, తొట్టెలను, యుంచుటకు మేజా, కుర్చీ, బీరువ మొదలగు సామాను ప్రత్యేకించి అమర్చుకొనవచ్చును. అద్దములు కడిగిన మురికినీరు, ద్రావకములు, బల్లపైనుండి క్రిందికి పోవుటకు, బల్లకు కొంతభాగ

ములో రేకుతొట్టె (Sink) నొకదాని నమర్చి, దాని క్రింద తగరపురేకు గొట్టము నతికించవలయును. ఈగొట్టమునకు సరిగా బల్లక్రింద నొకపాత్రనుంచి, బల్లపైనుండు తొట్టెలో నీళ్లుపోసినచో, దానిక్రిందిగొట్టమునుండి సమముగా యీపాత్రలోనికి ధారగా పడుచుండును. పని అంతయు పూర్తియైన పిమ్మట, బల్లక్రిందిపాత్రలోని మురికినీటిని అవల పారబోయవచ్చును. డివలప్‌మెంటు చేయు బల్లకుసమీపముగా, గోడకుగాని లేక కొంచెము మెత్తగు కోళ్లబల్లపైగాని, నీటితొట్టె నొకదానినుంచి, దానిలో పరిశుభ్రమగు మంచినీరు పోసియుంచుకొనవలయును. ధనవంతులగువారి కిట్టిప్రత్యేకపు సౌకర్యములుగల చీకటిగది మిక్కిలి అనుకూలముగా నుండినను, సామాన్యు లిట్టిసౌకర్యములు గల చీకటిగదిని విధాయకముగా కలిగియుండ నగత్యములేదు. సామాన్యముగా, పడకగదిలో నొకమూల కూర్చుండి, రాత్రులందు డివలప్‌మెంటు మొదలగు పనులన్నియు సులువుగా చేసుకొనవచ్చును. కాని, ఎర్రదీపపు వెలుతురు తప్ప వేరు వెలుగు రెంతమాత్రమును గదిలోనికి రాకుండులాగున మాత్రము, చూచుకొనుచుండవలయును.

ప్రయాణము చేయునపుడు, చీకటిపడు నంతవరకు వేచియుండక, పగటియందు డార్క్‌స్లయిడులలో ఆకర్షణఅద్దములను పెట్టుకొనుట, డివలప్‌మెంటు చేయుట, మొదలగు పనులకు వీలగునట్టి "మడతచీకటిగది గుడారములు" (Dark Room Tents) ఫోటోసామానమ్ము పెద్దదుకాణములందు విక్రయింపబడును. ఇవి చూచుటకు చేతిపెట్టెవలెనుండి, మిగుల తేలికగను, కొలదిస్థలములో నిముడునవిగను యుండుటచే, తరచు ప్రయాణము చేయుచుండు ధనార్జనపరులగు తేజోలేఖకుల కెక్కువ ఉపయోగముగా నుండగలవు. పైన దెలుపబడిన సౌకర్యములన్నియు గలిగినట్టి డివలప్‌మెంటు బల్లయొక్కయు, చీకటిగదిగుడారముయొక్కయు, పటములను (రెండవ మూడవ చిత్రములను చూడుడు,

## ఆకర్షణ అద్దములు

## Sensitive Dry Plates

మనము కోరు దృశ్యముయొక్క ప్రతిబింబమును కమీరాయం దాకర్షించునవి, సెన్‌సిటివ్ ప్లేట్లనబడు ఆకర్షణఅద్దములు. ఇవి, వెలుతురు తగులకుండ కాపాడబడినంతకాలము, ఆకర్షణశక్తి గలిగియుండును. ఈకారణముచే, వీటి నుంచబడినట్టి అట్టపెట్టెలను, చీకటిగదియందు ఎర్రదీపపువెలుతురులో తప్ప మరియే యితర వెలుతురులోను విప్పరాదు. ఎర్రదీపమునకు 2, 3, అడుగులకంటె దగ్గరగా, ప్లేట్లను గల పెట్టెలను తెరువరాదు. ఎర్రదీపపు వెలుతురైనను, ఎడతెగక కొంతకాలము ప్లేట్లపై బడినచో, వాటి ఆకర్షణశక్తి చాల వరకు నశించును. కొంచెము వెల హెచ్చుగానున్నను, నిరపాయకరమగు వెలుతురు నిచ్చు మంచిరకపు చీకటిగది ఎర్రలాంతరును కొనుట మంచిది. చవుకరకపు వాటిని నమ్ముకొని పనిచేయుట ప్రమాదకరము.

ఈ ఆకర్షణ అద్దములు ఇంగ్లాండు, జర్మనీ,అమెరికా మొదలగు దేశములందు, తయారుచేయబడి, మన దేశమునకు దిగుమతిచేయబడును. వీటియందు నెమ్మదిగను, కొంచెము వేగముగను, హెచ్చువేగముగను, అతివేగముగను, పనిచేయునట్టి వేరువేరు రకములుగలవు. వీటిని తయారుచేయు కంపెనీ లనేకములున్నను, ఇంగ్లాండునందలి "ఇల్‌ఫర్డు"కంపెనీవారివలన చేయబడినట్టి ప్లేట్లు (Ilford Plates) ప్రపంచము నందంతటను ప్రఖ్యాతి గాంచియున్నవి. ఇల్‌ఫర్డుప్లేట్ల నెరుగని తేజోలేఖకు లీప్రపంచమున నుండియుండరని చెప్పవచ్చును. ఇల్‌ఫర్డుకంపెనీవారిచే తయారుచేయబడుచున్నట్టి ప్లేట్లయందనేకరకములున్నను, ఆర్డినరి, (Ordinary) యమ్‌ప్రస్ (Empress) స్పెషల్ ర్యాపిడ్ (Special Rapid,) ఇసోజెనిత్, (Iso - zenith,) అను నాలుగురకములు మాత్రము హెచ్చుప్రచారమునందున్నవి. ఈనాలుగురకముల ప్లేట్లతో, అన్నివిధములగు ఫోటోగ్రాఫులను దీయవచ్చును. ప్లేట్లన్నియు సాధారణముగా నీక్రింది పరిమాణముల తయారుచేయబడును.

$4\frac{1}{4}$ అం. $\times$ $3\frac{1}{4}$ అం. [కార్డుసైజు]

$6\frac{1}{2}$ అం. $\times$ $4\frac{3}{4}$ అం. [క్యాబినెట్టుసైజు]

$8\frac{1}{2}$ అం. $\times$ $6\frac{1}{2}$ అం. [ఫుల్‌సైజు]

ఇవిగాక, 10" × 8", 12" × 10", 15" × 12" కొలతలలో గూడ లభ్యము కాగలవు. నూతనముగా తేజోలేఖనము నభ్యసించువారును, విలాసార్థముగా పని

పటము ౮.

## తేజోలేఖన పరికరములు




1. చీకటిగది ఎఱ్ఱలాంతరు. 2. తొట్టెలు. 3. థర్మామీటర్. 4. రీటచ్చింగు బల్ల. 5. కర్రక్లిప్పు. 6. రీటచ్చింగు సామానులపెట్టె. 7. కొలత గ్లాసు. 8. ప్లేట్లపై దుమ్ము దులుపు కుంచె. 9. సన్నని మొనగల కుంచె. 10. చుక్కలుపడు సీసా. 11. మందులుతూచు త్రాసుగుండ్లు. 12. ప్రింటింగు ఫ్రేము.

చేయువారును, క్యాబినెట్టుసైజుకంటె పెద్దవికాని ప్లేట్ల నుపయోగించుట మంచిది.

ఆర్డినరీప్లేట్లు (Ordinary Plates)

ఇవి కట్టడములయొక్కయు, చలించనట్టి స్థలములయొక్కయు, మనుష్యులయొక్కయు, పటములను దీయుటకును, చిత్రపటములు ఫోటోగ్రాఫులు, మొదలగువాటినుండి నకలులు దీయుటకును (Copyng) పనికివచ్చును. వీటికి చాలకాలము చెడిపోకుండ నిల్వయుండు స్వభావముకలదు. వీటి ఆకర్షణశక్తియొక్క వేగము చాల తక్కువగానుండుటచే, నూతనముగా తేజోలేఖనము నభ్యసించువారికి మిక్కిలి అనుకూలముగా నుండును. ఇతర రకముల ప్లేట్లకంటె వీటితో పనిచేయుట సులభము.

వేగము (H & D. 70. B. W. $\frac{1}{3}$.)

ఎంప్రెస్ ప్లేట్లు (Emress Plates)

ఇవి ఆర్డినరీ ప్లేట్లకు రెట్టింపు వేగముగలిగి, ప్రకాశమానమగు వెలుతురులో కొంచె మెచ్చుతగ్గుగా అన్నివిధములగు ఫోటోలను దీయుటకును, ముఖ్యముగా మనుష్యులఫోటోలను దీయుటకును పనికివచ్చును. తేజోలేఖనమును వృత్తిగా గైకొనినట్టి ఫోటోగ్రాఫరులందరు మనుష్యులఫోటోలను దీయుటకీ ఎంప్రెస్ ప్లేట్లనే వాడుదురు.

వేగము (H & D. 100. B. W. $\frac{1}{2}$.)

స్పెషల్ ర్యాపిడ్ ప్లేట్లు (Special Rapid Plates)

ఇవి ఆర్డినరీప్లేట్లకు నాలుగురెట్లధిక వేగము గలిగియుండును. చలించుచున్న జనసమూహములయొక్కయు, దృశ్యములయొక్కయు, చంటిబిడ్డలయొక్కయు, ఫోటోగ్రాఫులను దీయుటకీప్లేట్లు వాడుకచేయబడును. వీటితో అన్నిసమయములందును, కొంచె మెచ్చుతగ్గుగా అన్నిరకముల ఫోటోగ్రాఫులను దీయవచ్చును. మబ్బుగానుండు సమయములందు ఫోటోలను దీయుటకీ స్పెషల్ ర్యాపిడ్ ప్లేట్లు మాత్రముపయోగపడగలవు. చేతి కెమెరాల నుపయోగించువారికి స్పెషల్ ర్యాపిడ్ ప్లేట్లనుమాత్రమెల్లప్పుడు వాడుకచేయుట మంచిది.

వేగము (H & D. 270. B. W. $\frac{1}{6}$.)

ఇసోజెనిత్ ప్లేట్లు (Iso-Zenith Plates)

ఇల్ఫర్డుప్లేట్లన్నిటిలో నివి మిక్కిలివేగముగలవి. వెలుతురునుండి కాపాడుటకై, వీటిని రేకుడబ్బాలలో పెట్టి మూతలు అతికివేయుదురు. ఈ ఇసోజెనిత్ ప్లేట్లతో, సెంతివేగముగా చలించుచున్న దృశ్యములయొక్క ఫోటోలనైనను దీయవచ్చును. సెకండులో 1000 వంతు కాలములోకూడ కెమెరా ఎదుటి దృశ్యముయొక్క ప్రతిబింబము నాకర్షించునంతటి వేగము వీటికి గలదు. పత్రికావిలేఖకులును, రిఫ్లెక్సుకెమెరాలు గలవారును, మాత్రమీప్లేట్లను వాడెదరు. వీటిని పూర్తిగా అంధకారముగానుండు చీకటిగదియందుగాని, లేక నిరపాయకరమగు ప్రత్యేకపు ఎర్రగీపపు వెలుతురులోగాని (Safe Light) డివలప్ చేయవలసియుండును.

వేగము (II & D. 700. B W. 1/12)

డార్కుస్లైడులో ప్లేట్లు వేయుట

చీకటిగదియందలి బల్లపై డార్కుస్లైడు, ప్లేట్లపెట్టె, ఎర్రదీపము, మొదలగుసామానుల నుంచుకొని, గదిని మూసి, గది తలుపులన్నియు మూసి, పిమ్మట ప్లేట్ల పెట్టె విప్పవలయును. అంతకుమును పెంతమాత్రమును తెరువరాదు. ప్లేట్ల పెట్టె తెరచినపిమ్మట, అందుండి యొక ప్లేటును పైకితీసి, దానికి మందేప్రక్క పూయబడియున్నదో కనుగొనవలయును. పెట్టెనుండి ప్లేటును పైకితీయునప్పుడు, దానిపై పూయబడిన మందునకు చేతులు తగలనీయక, వ్రేళ్లతో అంచులనుమాత్రము పట్టుకొనవలయును. ప్లేటుయొక్క మందు పూతగలవైపు కనుగొనుటకు, దానిని ఎర్రదీపపు వెలుతురులో పరీక్షించితిమేని, మందు పూతగలప్రక్క, దీపముయొక్క రూపము మబ్బుగను, మందు లేనివైపు స్పష్టముగను, గనబడును.

ప్లేట్లపెట్టెనుండి ప్లేటును పైకి దీయుటకు పూర్వము, డార్కుస్లైడును మయముగా తెరచి 1-వ సంఖ్యగల తలుపుండుభాగము నీకెదురుగా నుండులాగున, బల్లపై నుంచుకొనవలయును. పిమ్మట నీ కెదురుగనున్న భాగమునందలి కాళీస్థలములో, నొక ప్లేటును, మందుగలవైపు క్రింది కుండులాగున నుంచవలయును. దానిపై నల్ల

అట్టగాని రేకుగానియుంచి, (యిది డార్కుస్లైడునందే యుండును) ఆ అట్టపై మరియొక ప్లేటు, మందుగలవైపు పైకుండులాగున పెట్టి స్లైడు మూసివేయవలయును.

పెద్దసైజు డార్కుస్లైడులలో చిన్న ప్లేట్లు వేయవలయుననినచో, యిన్నర్ ఫ్రేములు (Inner frames) అని పిలువబడు కర్రచట్టమును, ప్రథమమున స్లైడునందుంచి, దానిమధ్యముగానుండు కాళీలో, చిన్న ప్లేటు పెట్టవలయును. డార్కుస్లైడున కిరువైపులనుండు తలుపులపై, 1-2. సంఖ్యలు వేయబడియుండును. 1 వ సంఖ్య గల తలుపు, లెన్సున కెదురుగా నుండునట్టుల, కమిరాయొక్క వెనుక భాగమున డార్కుస్లైడునుదోపి, తలుపు పైకిలాగినచో, నొక ప్లేటుయొక్క మందు పూయబడిన వైపు, లెన్సున కెదురుగానుండి, కమిరా యెదుటి దృశ్యము నాకర్షించుటకు సిద్ధముగానుండును. ఆ ప్లేటొక దృశ్యము నాకర్షించిన పిమ్మట (Exposed) స్లైడుయొక్క తలుపుమూసి పైకి తీసివేయవలయును. మరియొక ప్లేటు నుపయోగింప దలంచినచో, స్లైడును త్రిప్పి 2వ సంఖ్య గల తలుపు లెన్సున కెదురుగా నుండునట్టుల పెట్టవలయును.

పైన దెలిపినవిధముగా డార్కుస్లైడునందు రెండు ప్లేట్లు పెట్టినపిమ్మట, రెండు భాగములును దగ్గరగా కలియునట్టుల మూసి, పక్కలనుండు బందులను బిగించి, వెలుతురు తగులకుండ నల్లగుడ్డలో చుట్టి, పైటికి తీసుకొనిరావలయును డార్కుస్లైడునందు ప్లేట్లువేయుటతోడనే, మిగిలియున్న ప్లేట్లను అవి ప్రథమమున చుట్టబడియున్నట్టి కాగితములలో చుట్టి, పెట్టెలో పెట్టి మూతవేయవలయును.

మడతపేటి కమిరాలయొక్క డార్కుస్లైడులు రేకుతో చేయబడి 1 ప్లేటు మాత్రము పట్టునవిగా నుండును. ఈరేకు స్లైడులలో ప్లేట్లువేయుటకు, వాటి తలుపులు పైకిలాగి, మందుగల వైపు పై కుండునట్టుల ప్లేట్లనుపెట్టి, తిరిగి తలుపులు దోపివేయవలయును. డార్కుస్లైడులను పరిశీలించి చూచినచో, వాటియందు ప్లేట్ల నెట్లు పెట్టవలయునో సులువుగా బోధపడగలదు.

తేజోలేఖనాభ్యాసమునకు వలయు పరికరముల

పట్టిక

(నాలవ చిత్రమును చూడుడు)

1. కమిరా (Camera) (లెన్సు, షట్టరు, స్టాండు, డార్కుస్లైడు వగైరాలతో గూడినది.) పరిమాణము అభ్యాసకుని యిష్టమును బట్టి నిర్ణయించుకొనవలయును.

2. చీకటి గది ఎర్రలాంతరు.

(Dark Room Ruby Lamp.)

3. తొట్లెలు 6 (Dishes) $4\frac{1}{4}'' \times 3\frac{1}{4}''$, $6\frac{1}{2}'' \times 4\frac{3}{4}''$, $8\frac{1}{2}'' \times 6\frac{1}{2}''$ కొలతలు గలవి.

4. పటములను కడుగు పెద్దతొట్టె, (Washing Dish) $12'' \times 10''$ కొలతగలది.

5. 10 అవున్సుల నీరుపట్టు కొలతగ్లాసు. (Measure Glass.)

6. చుక్కలు కొలుచుగ్లాసు.

(Minim Measure Glass.)

7. చుక్కలుపడు బుడ్డి. (Dropping Bottle.)

8. పటముల నచ్చువేయు ప్రింటింగుఫ్రేములు 6 (Printing Frames $4\frac{1}{4}'' \times 3\frac{1}{4}''$, $6\frac{1}{2}'' \times 4\frac{3}{4}''$, $8\frac{1}{2}'' \times 6\frac{1}{2}''$ కొలతలు గలవి.)

9. రబ్బరురోలరు (Rubber Roller Squeegee) 6" పొడుగుగలది.

10. ప్లేట్లపై దుమ్ముదులుపు కుంచె.

(Plate Dusting Brush.)

11. సన్నని మొనగల కుంచె.

(Spotting Brush.)

12. రీటచ్చింగు సామానుల పెట్టె.

(Retouching Outfit.)

13. రీటచ్చింగు బల్ల,

(Retouching Desk )

14. క్రింసన్ లేక్ రంగు బిళ్ల.

(Crimson Lake Colour Stick)

15. ద్రావకములయొక్క శీతోష్ణస్థితిని తెలియజేయు తెర్మామెటర్. (Thermometer F.)

16. మందులు తూచు త్రాసు, గుండ్లు.

(Scale and Weights)

17. కఱ్ఱ క్లిప్పులు 3 డజనులు.
(Wood Clips)

18. గాజుమూతలు గల సీసాలు, 6 మొదలు 16 అవున్సులవరకు పట్టునవి——6.

19. ఆర్ద్రణ అద్దములు, (plates) కమెరా యొక్క పరిమాణమునకు సరిపోవు కొలతలలో 4, 5 డజనులు.

20. అచ్చువేయు పి. ఓ. పి. కాగితములు, (P O. P.) రెండు పెద్ద కాగితములు గల గొట్టము.

21. సెల్ఫు టోనింగు పేపరు.
(Self Toning Paper) 3,4, ప్యాకెట్టులు.

22. ఫోటోగ్రాఫుల నతికించు అట్టలు ( Mounts )వివిధరకములలో వేరువేరుకొలతలు గలవి. 5, 6 డజనులు.

రసాయనిక పదార్థములు

23. సోడియమ్ సల్ఫయిట్ (పలుకులు) (Sodium Sulphite Crystals ) 1 పౌను.

24. సోడియమ్ కార్బొనేట్ (పలుకులు) ( Soduim Carbonate Crystals )1 పౌను.

25. పైరోగాలిక్ ఆసిడ్ (Pyrogalic Acid) 1 అవున్సు.

26. మెటోల్ (Metol) 1 అవున్సు.

27. పొటాసియం మెటాబైసల్ఫయిట్. (Potassim Meta-bisulphite) ½ పౌను.

28. పొటాసియం బ్రొమైడ్. (Potassium Bramide) 1 అవున్సు.

29. గోల్డు క్లోరైడ్ (Gold Chloride.) 15 గ్రెయినుల గొట్టము.

30. హైపో. (Hypo) 6 పౌనులు.

31. అమోనియమ్ సల్ఫోసైనైడ్.(Ammonium sulphocyanide) 2 అవున్సులు.

32. హైడ్రోకినన్ (Hydro kinone1) అ.

33. ఎజాల్ (Azol) 3 అవున్సులు.

34. ఫొడినల్ (Fodinal) 3 అవున్సులు.

35. రైటోల్ (Rytol) 1 పెట్టె.

36. పటిక (Alum) 1 పౌను.

37. సీమసున్నపు పొడి (French Chalk) 1 పౌను.

38. బిగురు చేయు పిండి (Starch) 1 పౌను.

39. క్రోమ్ పటిక (Chrome Alum) ½ పౌను.

సశేషము.

---

# చకోరిక

గాధావఝుల రామావధాని గారు

"శారద పూర్ణిమావిమలచంద్రికనో స్థిరమంచు తేజస్సుధా
ధారల నోలలాడుచు సతంబుని వెన్నెల సన్నిలోన సం
చారము సేయుచుండ్ తమము సంగతిరాని మరపొంది పెట్టినె
కోరికదీర నొక్కకళ గ్రోలుటకేనియు నోచనైతిగా.
పూచినరెల్లుపూత లవి పూచినయట్టులె యుండె ప్రేమమై
జాచుకరంబు లల్ల దిగజారగలే దిసుమంత నీసుధా
వీచిక లాహరించుటల వేడుక దీరదు దేహమంతయుం
లోచనమై కనుంగొను విలోకనకేనియు జాలినొందవో?"

చెన్నరాజధానియందు 1924-వ సంవత్సరము జనవరి మొదలు మార్చివఱకు

ముద్రితములై ప్రకటింపఁబడిన

# ఆంధ్రగ్రంథముల పట్టిక

## పద్యకావ్యము—౧. ఇతిహాసము పురాణము

ఆంధ్రమహాభారతము

భాస్కరరామాయణము—భాస్కరకవి

## పద్యకావ్యము—౨. మాహాత్మ్యము

కోటిఫలీమాహాత్మ్యము—వి. వీరశంకరమూర్తి

## పద్యకావ్యము—౩. ప్రబంధము

మంజరీమధుకరము—శ్రీరామరాజకవులు

## పద్యకావ్యము—౪. శతకము

కృష్ణశతకము—యి. తమ్మిరాజు

భరతమాతృశతకము—కల్లూరి అహోబలరావు

రాధాకృష్ణశతకము—యం. వెంకయ్య

వరదరాజశతకము—కాదాటి నరసమ్మ

శ్రీనగరేశ్వరశతకము—పి. శరభసాళ్వం

శ్రీ అగస్త్యేశ్వరశతకము—పి. శరభసాళ్వం

శ్రీ గద్వాలకేశవశతకము—సి. చెన్నరెడ్డి

సర్వమాన్యశతకము—ఎ. సోమనాథరావు

## పద్యకావ్యము—౫. ఇతరములు

చాడేశ్వరీస్తోత్రము—పి. వి. చిన్నస్వామి

ధ్యానామృతము—మళయాళస్వాములు

విష్ణుసహస్రనామావళి

శివసహస్రనామస్తోత్రము

శ్రీవేంకటేశస్తోత్రం

శ్రీసూక్తవిధానము

సుబ్రహ్మణ్యస్తవరత్నమాల—కె. వెంకటరత్నం

స్తోత్రపాఠములు

## వచనకావ్యము—౧. కథ, నవల

ఆంధ్రదేశీయకథావళి—టి. రాజగోపాలరావు

ఆనందరాయవిజయము—వి. వెంకటశాస్త్రి

కాశీమజిలీకథలు, 9-వ భాగము—మధిర సుబ్బన్న దీక్షితకవి

కాశీరామేశ్వర మజిలీకథలు—యం. వెంకటకృష్ణశర్మ

ద్వాదశరాజులకథలు—నరసింహయోగి

తెనాలి రామలింగనివినోదకథలు—యం. వెంకటకృష్ణ శర్మ

నోములకథలు, ఆఱుభాగములు

పితలాటకము—వి. వాసుదేవశాస్త్రి

ప్రాచీనకాలపు హిందూ సుందరీమణుల చరిత్రములు, మొదటిభాగము—ఆర్. వెంకటశివుడు

బాలభక్తచరిత్ర—వేదము లక్ష్మీనారాయణశాస్త్రి

బొండుమామోపాఖ్యానము—జి. రంగయ్య

మహాభారతకథలు—డి. గోపాలరాజు

లక్ష్మీప్రసాదము—కేతవరపు వెంకటశాస్త్రి

వలపులమడుగు—యస్. జి. ఆచారి

శ్రీశుకమహర్షిచరిత్రము—ఎ. వకుళాభరణపరదేశి

హిందూపురాణకథలు—డి. వెంకటరామయ్య

హారలాలు—ములుగు వెంకటకృష్ణయ్య

కపాలకుండల

కుసుమ—కేతవరపు రామకృష్ణశాస్త్రి

గోరా 1, 2 వాల్యూములు—వేంకటపార్వతీశ్వరకవులు

మృత్యుతరంగిణి

హత్యారహస్యము

## వచనకావ్యము—౨. చరిత్ర

కొండవీటిచరిత్ర—ఖాసీం అలైజా

ఫ్రెంచి స్వాతంత్ర్యవిజయము, మొదటి సంపుటము—అయ్యదేవర కాళేశ్వరరావు
వెలస్లీ రాజనీతి, మహారాష్ట్ర సామ్రాజ్యవిచ్ఛిత్తి—యం. సంజీవరావు

వచనకావ్యము—౩. రాజకీయము

మన కీదారిద్ర్య మేల అను భారతవర్ష ఆర్థికచరిత్ర—దేశిరాజు రామచంద్రరావు, దేశిరాజు సుబ్రహ్మణ్యం

వచనకావ్యము—౪. చట్టములు

సివిల్ క్రిమినల్ రివిన్యూన్యవహార మతలబి—జి. సేతుమాధవరావు

వచనకావ్యము—౫. ఇతరము

తులసీప్రభావము—బి. కోటీశ్వరరావు
నాటకదీపిక, ప్రథమ భాగము—పి. టి. రాఘవాచార్యులు
పంచపాండవుల వనవాసము—వేలూరి కన్నసుదాసు
బ్రహ్మపురాణము
బాలభారతము—హసబ్నిస్ వాసుదేవరావు
మనుకథాసారము—కె. నారాయణమూర్తి, ఆర్. నారాయణరావు
లక్ష్మణరాయవ్యాసావళి, ప్రథమ సంపుటము—కె. వి. లక్ష్మణరావు
సుభద్ర—పులుగుర్త లక్ష్మీనరసమాంబ
హనుమద్విజయము—పి. వి. సుబ్బారావు
హరిశ్చంద్రచరిత్రము—వావిలికొలను సుబ్బారావు
హరిశ్చంద్రచరిత్రము

నాటకములు

ఉత్తరరాఘవము—బి. లక్ష్మీకాంతకవి
ఉన్మత్తరాఘవము
కనకాంగి—కె. సత్యనారాయణ
కోకిలాంబ—సి. జగన్నాథరావు
చంద్రకళాస్వయంవరము—ఉప్పల చంద్రశేఖరగుప్త
ధర్మాంగదనాటకము—పి. లక్ష్మణకవి
పురూరవ—గూడూరి కోటీశ్వరరావు
ప్రథమసాంధికుడు
ప్రహ్లాద—డి. సీతారామారావు
బిల్వమంగళ, అను చింతామణి 2-వ ముద్రితము—చర్లావధానుల మాణిక్యశర్మ
లక్షణాపరిణయ నాటకము—పి. సుబ్బరాయకవి
విచిత్రకుచేలము—సత్యవోలు కామేశ్వరార్యకవి
వివేకదీపిక—యం. సూర్యనారాయణకవి
విషాదవాసంతిక—యస్. జి. ఆచారి
శ్రీకృష్ణ తులాభారము—పి. సుబ్బయ్య
శ్రీ కృష్ణలీలలు—పి. వెంకటకృష్ణదాసు
శ్రీరామకల్యాణము—యస్. రామకోటేశ్వరశర్మ
సంజీవనము—పి. రాఘవేంద్రరావు
సత్యహరిశ్చంద్రీయము—బి. లక్ష్మీకాంతకవి

హాస్యము

ఇంటిమోసగాండ్రు—యన్. లక్ష్మీకాంతశాస్త్రి
కాంగ్రెస్ కబుర్లు—కె. వేంకట అప్పారావు
గిరిగమ్మత్తు ఫార్సు—వి. లక్ష్మణరావు
గోంగూర ఎలెక్షన్ (2-వ ముద్రితము) పి.యం. ఆర్.
మూర్తిగారి ధనవినియోగము
భూర్యకాల మహోదయఫార్సు—పి. హనుమంతరావు, పి. రామస్వామి
మూన్నాళ్ల ముచ్చట—లొల్ల భగవానులు
షోకీలా పెండ్లాము—కాశ్లకూరి హనుమంతరావు

భాషానిఘంటు వ్యాకరణము

మూడవపాఠము పుస్తకము—యం. వెంకటరత్నము, కె. వీరేశలింగం
సరస్వతీవాచకము (ఐదవ తరగతి) గద్య పద్యముల టిప్పణి
సులభ వ్యాకరణము, ప్రథమ భాగము—వావిలికొలను సుబ్బారావు

జ్యోతిషము

నవగ్రహచింతామణి,
దైవజ్ఞాదర్శము అను జ్యోతిషసారసంగ్రహము—యస్. భాగీరథీరావు

గణితము

ఇంత్రీ—జి. సేతుమాధవరావు

## వైద్యము

ఆరోగ్యసూత్రమాల—కే. లక్ష్మణపెరుమాళ్లు
గృహచికిత్స—షేకుమహాలా
[illegible]క సింధూరమా? శిలాజిత్తు భస్మమా? యస్. సూర్యనారాయణ శాస్త్రి.
వ్యాసప్రోక్త వైద్యశాస్త్రము—కామాక్షయ్య
సర్వమూలికా యోగమంజరి—కె. లక్ష్మీపతి

## మతము.

ప్రభులింగలీల—పిడుపర్తి బసవకవి

## వేదాంతము

అక్షరహంసలు—జి. వెంకట సుబ్బారావు
కర్మమీమాంస—డి. కూర్మనాథాచారి
ఘటశోధని—దత్తావధూతస్వామి
పరమార్థము—కృష్ణార్య
మోక్షసాధనము, రాజయోగసారము—టి. వెంగమాంబ
రాజయోగానందము—బి. కొండలరాయ నాయుడు
శ్రీరహస్యార్థబోధ—శ్రీ నిత్యానంద స్వామి
శ్రీరామ చరితామృతము జగద్గురు మీమాంస—డి. కూర్మనాథాచారి
శ్రీ వనభూషణము—

## సంగీతము—౧. లక్షణము

శ్రీ త్యాగరాజ హృదయము—౩వ వాల్యూము
సంగీతకృతి దర్పణము—యం. సుబ్రహ్మణ్య శాస్త్రి
సంగీత విద్యాదర్పణము—యు. వెంకటస్వామి నాయుడు
స్వరమంజరి—టి. శింగరాచార్యులు

## సంగీతము—౨. హరికథ

కుచేలోపాఖ్యానము హరికథ—పి. గోపాలదాసు
యదుపుర మాహాత్మ్యము—యస్. జగన్నాథ కవి
శ్రీ గోదాచరిత్ర హరికథ—బి. రాఘవాచారి
వీరాంజనేయ విజయం హరికథ—కె. కోటమరాజు

## సంగీతము—౩. గేయము

కాంగ్రెసుపాట—ఆర్. వెంకటకృష్ణరావు
చిలుక ముగ్గులపాట
నలుగు పాటలు
నవరస భరితానందప్రదాయిని
మస్తాన్ షరీఫ్
నూతన జావళీలు—జానంగల నాగభూషణదాసు
పెద్దకామమ్మ కథ
బాలకృష్ణలీలలు
భక్తామృతము—పి. వీరమల్లయ్య

## ఇతర కళలు

శరీరశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము—యస్. కామేశ్వరరావు

## ఇతర గ్రంథములు

అచల నిర్గుణతత్వరత్నాకరము
అబలావిలాసము—సిరికొండ లక్ష్మీనరసింహ శాస్త్రి
అస్పృశ్యోపన్యాసము—బాబు భగవానుదాసు
అస్పృశ్యత—వేదాంతం శంభు శాస్త్రి
ఆనీసోపనిల విచారణ—పి. లక్ష్మీనారాయణ
ఆర్యావర్త ప్రశంస—డి. కూర్మనాథాచారి
ఉపన్యాసము—ఐ. వెంకటరాజగోపాల్ రావు
కలికాల భూతము – జి. నారాయణమూర్తి
కాంగ్రెసు అడావిడి—యస్. రామచంద్రరావు, యస్. యస్. నారాయణరావు
కాకినాడ కాంగ్రెసు—కే. జగన్నాథదాసు
కాకినాడ కాంగ్రెసుకట్నము—కే. నారాయణ రావు
కాకినాడ తాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘ నిబంధనలు
కారకల్లో—యం. రాజరావు
కుమార హితచర్య (2వ కూర్పు) వావిలికొలను సుబ్బారావు
కోడెయిగిరి యాత్ర.
గాలివాన—సోమరాజుల సూరిదాసకవి
గ్రామ పంచాయతీన్యాయస్థాన నిబంధనలు—జి వెంకటరంగారావు
గ్రామమునసబుల పరీక్షాదర్శిని—బి. లక్ష్మీనరసింహం
గృహలక్ష్మి—పి. అప్పారావు
జగద్గురుని అవతారము—ఎ. నంజుండప్ప

జనరల్ నాలెడ్జి—వి. రామచంద్రయ్య
జాతీయవిద్య (ప్రథమ భాగము.)
తుపాన్ అడావిడి—కె. వి. అప్పారావు
దస్తావేజుల మతలబి—జి. సేతుమాధవరావు
దాతృత్వము—ఐ. సత్యనారాయణ వర్మ
దేశీయ ఆటలు—జి. మధ్వరావు
నాట్యాంబుజము—పురాణం సూరిశాస్త్రి
నీతిపద్య రత్నావళి
పతిహితచర్య (2 వ కూర్పు) వావిళ్లకొలను సుబ్బారావు
పరశురామ చరిత్రము—అబ్బరాజు సీతారామశర్మ
పల్నాడు దురంతములు—గద్దె రంగయ్యనాయుడు
పశ్చిమాంధ్ర ప్రబోధము . కె. వెంకటరమణాచారి
పుష్పబాణ విలాసము
మననివాసస్థానము—సి. మారిసన్
మారుతీభాండాగారోత్పత్తి
నక్షత్రమాల—యం. హనుమంతం
బాలవిజ్ఞాన శాస్త్రము—కె. వీరభద్రయ్య
బ్రాహ్మధర్మ వ్యాఖ్యానము—మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు.
బీజాక్షరవర్ణమాలికాస్తోత్రము
భక్తకర్ణామృతము—ఎ. సోమనాథరావు
మహోదయ మాహాత్మ్యము—వి. వెంకటేశ్వర
మహాత్మాగాంధిజీవితము
ఉపన్యాసములు, వ్యాసములు
ఉపదేశములు, ప్రథమభాగము
ముప్పైఎనిమిదవ భారతజాతీయ మహాసభ, అధ్యక్షోపన్యాసము—మౌలానా మహమ్మదాలీ
ముప్పైఎనిమిదవ దేశీయమహాజనసభ— ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసము కొండా వెంకటప్పయ్య
మారుతీ పుస్తక భాండాగారము, మారేడు మాక
యక్షప్రశ్నలు
రథోత్సవ కైంకర్య విజయము
రాజభక్తి, యోగభక్తి జనపనేని సూర్యనారాయణ రాజు
రాజమహేంద్రవర దేశీయ విద్యాలయము
లచ్చారామాస్తవము—జె. సీతారామస్వామి
లక్ష్మీచలో—హై. శ్రీరామచంద్రమూర్తి, డి. నరసింహాచారి
లోకోక్తిముక్తావళి—యస్. సోమసుందర కవి
విద్యాభిమానసమాజము, రాజమహేంద్రవరము—కె. సూర్యారావు
శీగనరి—కాశీ వ్యాసాచార్యులు
శివగణపతిము—ఏ. శంకరశాస్త్రి
శ్రీనృసింహకమ్—ఆర్. రామనాథశాస్త్రి
శ్రీ రామధ్యానము
శ్రీ గురు ప్రభావము—యం. నారాయణస్వామి
శ్రీ రామానుజగురుకులము
సర్వేశ్వరము—పి. టి. నరసింహాచారి
సకలసర్వ సంప్రదాయదీపిక
సుభద్రాపరిణయము—వి. ఆదినారాయణదాసు
సుమతి సత్యప్రభావము—జి. వీరాస్వామి
సూర్యనారాయణ స్మరణ, ఆపదుద్ధారక స్తవము-యన్. సూరిశాస్త్రి
సోదరస్మృతి—సి. నిత్యానందం





# పాంథుఁడు

ఉమ అలీషా కవిగారు

ఇది ప్రియురాలు పూర్వము వసించెడుసౌధము విన్నఁబోయి యు
న్నది యిచటామె లేదు; విపినంబునఁ బూఁబొదఁ బాసి తేటి పో
వదు పిక మారసాలమును బాయదు నాప్రియ వాసి దుఃఖ మ
హ్రదమున నన్ను డించె నకటా! యిట నశ్రులు రాల్చుచుండెదన్.

ఉ. చల్లనిపిల్లగాలి తెరచాటున వచ్చి వనంబు సొచ్చి సం
ఫుల్లసుమాళితోఁ గలిసిపోవుచుఁ గొన్నిటిరాల్చె నిల్లె నా
పల్లవపాణినిన్ మరుఁడు వాపెనొ యేమొకొ సీధుపాత్రముల్
బిల్లలు తీసి బోర్లబడవేసినకైవడి నేమి చెప్పుదున్.

గీ. సూర్యుఁ డపరాద్రిఁ గ్రుంకె ప్రసూనబోణి, పడవిమల్లెల నేరికో నరుగుదెంచె
కాలకన్య నల్లనిచీరఁ గట్టుకొనియె, నుడుగణంబులు పొడసూపె నుదధి పొంగె.

గీ. దర్పకుఁడు వచ్చి వంచిన ధనువువలెను, పాలకడలిలోపలి వెండి పడవవలెను
ప్రకృతికన్య త్రావెడుపాన పాత్రవలెను, నభముపైఁ దోఁచె రెండవనాఁటి విధుఁడు.

గీ. ఎవ్వతో దీపమును బెట్టి యేగె నింట, దానిఁ గని పతంగంబు సంతసముతోడ
వలచి ప్రాణంబు లర్పించివైచె; నేను, నామనోహారికేల యీనోమనైతి.

గీ. మిడుతపై దీపమున కెట్టి విడుపరాని, ప్రేమయోకాని; యొక్క రాత్రియునుగూడ
బ్రతుకనీయదు; మిడుత దా వలచి పడినఁ, దానుఁ బడి యాఱిపోవు సంతసముతోడ.

చ. మిడుతయు దీప మొక్కెడ శమించెనుగాని పతంగ మాశమై
విడిచెనుఁ బ్రాణముల్ విసిగి వేదనఁ గాలుచు దీప మాఱెని
ట్లడరువియోగభార వివశాత్ముల సంగతి నవ్వు నొక్కఁడున్
బుడమిని నేడ్చు నొక్కఁడును పోవు బ్రియావిరహాగ్ని మ్రగ్గుచున్.



# టూటన్ ఖామనుగారి సమాధి

మూడువేలేండ్లకు పూర్వము ఈజిప్టు దేశమునందలి లక్సారు రాజ్యమును పాలించుచుండిన టూటనుఖామను గారి సమాధిని ద్రవ్వగా లభించిన వస్తువులు, చిత్రములు అనంతకాలము కడచినను కొంచమయిన చెక్కుచెదరకయున్నవి. ఆకాలమునాటి యీజిప్టు శిల్పవైఖరిని ఇపుడు వెస్టుమిన్‌స్టరుఆబీలోగల శిల్పవైఖరితో పోల్చిచూచిన యెడల ఈజిప్టుదేశపు చిత్రకళయొక్క అద్భుతవికాసము చిరస్థాయిత్వము సువ్యక్తము కాకపోదు.

చిత్రము 1.



1. పట్టాభిషేక సింహాసనము ఈ సింహాసనము బంగారు రేకులతో తాపబడియున్నది. రత్నములు, వివిధవర్ణములు, ఆకారములు గల అద్దపు ముక్కలు, పింగాణి ముక్కలు మొదలయినవి అందు సుందరముగ చెక్కబడి యున్నవి. కాళ్లు పిల్లికాళ్లవలె నున్నవి. బంగారు రేకుతో సుందరముగా జేయబడిన సింహపుతలలు ముందరి కాళ్ల పైభాగము నలంకరించి యున్నవి. చేతులు రెండును, రెక్కలు కిరీటములుగల సర్పాకారముగ నున్నవి. నిదివర కెన్నడును లభింపలేదు. రచనాకౌశల్యము మిగుల శ్లాఘింపదగియున్నది.

2. ఆసియాదేశపు యుద్ధచిత్రము. ఒకానొకసంపుటము (క్యాస్కెటు)యొక్క సొరుగు బిళ్లపై వ్రాయబడిన అద్భుత వర్ణచిత్రము యొక్క సూక్ష్మాకారము.

ఈ చిత్రమున రాజు రథారూఢుడై తన ఆసియాదేశపు శత్రువులను చించి చెండాడుచున్నాడు. వివరణవిలాసము భావప్రకటనము

చిత్రము 2.



వెనుకవైపున నాధారభూతములైయున్న నిలువులనడుమ నారుసర్పములున్నవి. వానికితలలపైన కిరీటములును, సూర్యబింబములును చెక్కబడి యున్నవి. వీపు పలకపైన రాజాంతఃపురరంగమున రాజదంపతులు చిత్రింపబడి యున్నారు. పైభాగమున కిరణముల వెదచల్లు సూర్యబింబముకలదు. ఇట్టిచిత్రము ఈజిప్టున మిగులరమణీయముగ నిందు ప్రదర్శింపబడినవి. రాజు రథముపై నిలుచుండి అతి సంరంభముతో విల్లు నెక్కుపెట్టుచున్నాడు. బాణములతో నిండిన అమ్ములపొదు లాతని కిరువైపుల నల్లలనాడుచున్నట్లున్నవి. శత్రువులు మారిమసగినట్లు ఆతని పాదములకడ పీనుగుపెంటలై పడుచున్నారు. ఇందు రాజు

పెంపుడు కుక్కలు శత్రుసేనలపై కవియుచుండుట చూడదగినది.

కాంచుట మిగులనాశ్చర్యమును గలిగించుచున్నది.

చిత్రము 3.



చిత్రము 4.



3. ఆచార్యకర్మలయందుపయోగించుచుండు చేతికఱ్ఱయొక్క పిడి. ఈ పిడిపై ఈజిప్టునందు దక్షిణోత్తర రాజ్యములను పాలించు ఇద్దరు శత్రురాజుల ప్రతిమలు చెక్కబడియున్నవి. అందు ఆసియాదేశపు వైఖరినున్న ప్రతిమ దంతముతోడను, తక్కినది నల్లచేవతోడను చేయబడియున్నది.

ఈజిప్టు చిత్రకళయందిది యద్వితీయమయినది. ఈరెండు ప్రతిమలకు నలుచని బంగారురేకు ఉడుపుగా తాపబడియున్నది. అందు వివిధరత్నములు చెక్కబడియున్నవి. ఈపిడియొక్క ఆకారము నవీనవైఖరిని గను

4. కాలరు (చొక్కాతో మెడకు తగుల్చుకొను నలంకారము.)

ఇది రాజుయొక్క యొకానొక చొక్కాకు నుండినది. ఇది సమాధియందు దొరకనాప్పుటమున లభించినది. ఈచిత్రమును జూచిన నీకాలరునందలి పూసలు, కుండలములు ఒకటితో నొకటి తిన్నగా దిద్ది కూర్చబడినట్లు తోచుచున్నది. కుండలములు పూవులవలెను, రేకులవలెను, వివిధవర్ణములతో ప్రకాశించుచున్నవి.



# సాభిప్రాయ విశేషములు

## నిరంకుశ నిర్బంధములు

శ్లో. కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయో విదుః;
సర్వ కర్మఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః. గీ. ౧౮ అ. ౨.

మహాఘనులు రీడింగు లిట్టను ప్రభువులు పాతాళహోమము చేసి మాయాశక్తిని గడించిరి. మాయాశక్తిమహిమను దురభిమాన పరాయణులు గనుగొనజాలరు. దురభిమాన పరాయణులు స్వకీయపౌరుష ప్రమాణము నారాధింప గలుగుదురుగాని పరమార్థ ప్రయోజనము నారాధింప జాలరు. సామ్రాజ్యాభిమానము, శ్వేతజాత్యభిమానము, అధికారాహంకారము పరార్థప్రయోజనమునకు ప్రతిబంధకములు. మాయాశక్తి స్వప్రయోజనార్థము వినియోగపడునపుడు డనర్థపరంపరలు సంభవించుచుండును. వంగదేశమునందు ప్రయోగింపబడిన నవీనాన్యాయశాసనము ప్రభుత్వదౌర్బల్యమునకు దోడ్పడునటులు ప్రభుత్వబలమునకు దోడ్పడుటలేదు. అపరాధమును స్థాపింపని దండనము సంపూర్ణస్వాతంత్ర్యముగల దేశములందు సైతము నిరపరాధ దండనముగను బరిగణింపబడును. పరాధీనమై నిరంకుశాధికారాయత్తమైన దేశములం దిట్టిదండనములు నిరపరాధదండనములుగను బరిగణింపబడుట సహజము. స్వప్రయోజనరక్షణార్థ మేర్పడిన ప్రభుత్వవిధానమునందు భిన్నప్రయోజనము సంభవించుటయు నసంభవము. లిట్టను ప్రభు వెన్నిఖండనమండనములను సమర్థనపత్రములను బ్రకటించినను నవి ప్రజాహృదయమునందు విశ్వాసమును గలిగింప జాలవు. లిట్టను ప్రభువు చేసెడి దీర్ఘోపన్యాసములే సంశయభావమునకు నిదర్శనములు. వీరి బెదరింపులును విచిత్రముగ నున్నవి. ప్రభుత్వము ప్రవేశపెట్టనున్న నిర్బంధ శాసనమును పోషించుట నాయకధర్మమట! ప్రపంచమునందు లేని క్రొత్తధర్మమును లిట్టను ప్రభువు కనిపెట్టుటయును గొప్పతనముగదా! రాజ్యాంగాందోళనమునందు శాంతస్వభావము దుర్లభమని తెలిసిన లిట్టను ప్రభువు స్వయముగ నీసిద్ధాంతము నేల నన్వయింపజేసికొనరో తెలియకున్నది. శ్రీ రంగనీతు లితరులకు జెప్పుట కేర్పడినవి గాని స్వయముగ నాచరించుట కేర్పడవు గదా! పాపము నిర్బంధవిధానముల యాధారమునను వంగరాష్ట్రమునందు స్వరాజ్యవిధానమును స్థాపించుచున్న లిట్టను ప్రభువునకు బంగాళీలు కృతజ్ఞులగుటకు బదులు కృతఘ్నులగుట విపరీతముగదా! నేరమును రుజువుచేసి దండించుట ధర్మశాస్త్ర సమ్మతము. రుజువుచేయుట సాధ్యపడనపుడు

దండనప్రయోజనము నిరర్థక మగుచున్నది. కోపావేశపూరితమైన బ్రిటిషు ప్రభువు దృష్టికి నిరంకుశాధికారమును నిర్మూలము చేయుటకు కంకణమును గట్టుకొనిన స్వరాజ్యపక్షము రాజకవర్గముగ గనుపింపవచ్చును. రాజద్రోహ నిర్మాణమున కేర్పడిన యపరాధాన్వేషణ గుప్తశాఖవారి రహస్యనివేదికలు కోపానలమున కాజ్యాహుతులను గల్పించి మండింపజేయుచున్నవి. వంగదేశమునం దరాజకు లున్నను దేశబంధుదాసుగారి యనుచరు లరాజకులైనను ప్రభుత్వవిధాన మశాంతికి దోడ్పడుచున్నది గాని శాంతికి దోడ్పడుటలేదు. నవీనశాసనము వంగశాసనసభను నితర రాష్ట్రము లందును అన్ని ప[illegible] వారిని నేకము చేసినది. మితవాదులు సయితము నిర్బంధవిధానముయొక్క ప్రభావమును సులభముగను గనుగొనగలిగిరి. గాంధిమహాత్ముడు కాంగ్రెసునందుగల రెండు పక్షముల నేకముచేయుటకు దీక్షను వహించెను. స్వరాజ్యపక్షమువారితో నొడంబడికను చేసెను. ఆయొడంబడిక సంపూర్ణబహిష్కారపక్షమున కప్రియమైనను దేశాభ్యుదయమునకు వర్తమాన పరిస్థితులం దవసరమని దేశమునందుగల నిద్రావస్థ విశదము చేయుచున్నది. ప్రజాహృదయమునందు ప్రబోధము గలుగనంతవరకు స్వరాజ్యసంపాదనము దుర్లభమని గతానుభవము విశదము చేసినది. ఆయనుభవమునే మహాత్ముడు కార్యరూపమునను విశదము చేయుటకు బూనుకొని తన నిశ్చలమైన దేశభక్తిని విశదము చేసెను.

* * * *

గాంధిదాసుల యొడంబడిక

ఈయిరువురును చేసికొనిన యొడంబడిక కాంగ్రెసునందలి పూర్ణాసహాయవాదుల కసంతృప్తిని కలుగజేసినను గాంధిమహాత్ముని మహాత్యాగమును విశదము చేయుచున్నది. మానవులకు స్వధర్మానుష్ఠానమున నహంకారము మహాప్రతిబంధకముగ నున్నది. గాంధిమహాత్ము డహంభావమును విసర్జించి కాంగ్రెసు బలమును వృద్ధిచేసి త్యాగమహిమను విశదము చేసెను.

తీర్మానము

ఈదేశమునం దన్నిపక్షములవారును స్వరాజ్యమునే కోరుచున్నను దేశమునందు భిన్నపక్షములేర్పడి భిన్నమార్గముల పనిచేయుచున్నట్లు గనుపడుచున్నది. వీలైనంతవరకు అన్నిపక్షములను కాంగ్రెసుపతాకము క్రిందచేర్చు టత్యవసరము. అదియునుగాక గవర్నరు జనరలు అనుమతితో రాష్ట్రీయ ప్రభుత్వమువారు వంగరాష్ట్రమున నిర్బంధవిధానము నవలంబించిరి. ఈనిర్బంధవిధానము అరాజక పక్షములకొరకు గాక వంగరాష్ట్రి స్వరాజ్యపక్షముకొరకే ప్రయోగించిరని మేము నమ్ముచున్నాము. కాన దేశమునం దన్నిపక్షములును ఏకీభవించి యీ కఠినవిధానము నెదిరించవలసిన యావశ్యకము మరింత హెచ్చినదిగావున ప్రస్తుతము దేశీయులందరును బెల్గాంలో కాంగ్రెసు మహాసభవారు అనుసరింపవలెనని కోరుచు మేము కొన్ని సూచనలను చేయుచున్నాము.

1. "అసహాయోద్యమము నందలి షరతులన్నిటిలో విదేశవస్త్రములను ఉపయోగింపరాదు, ధరింపరాదు అను నొక్కషరతును తప్ప తక్కిన అన్నిషరతులను ప్రస్తుతము జాతీయవిధానముగా విరమింపవలయును." అని కాంగ్రెసు మహాసభవారు తీర్మానింప గోరెదము.

2. కాంగ్రెసులో నివారు చేయవలసిన పనులలో వేరువేరు పనులను వేరువేరు వర్గములవారు అవసరమును బట్టి చేయవచ్చును.

3. నూలు వడుకుట బట్టలు నేయుట మున్నగు పనులను ఖద్దరు వ్యాప్తినిగూర్చియు, వివిధమతములకు త్వరలో గాఢమైత్రినికలిగించుటనుగూర్చియు, హిందువులలో అస్పృశ్యతను తొలగించుటను గూర్చియు కాంగ్రెసునందలి అన్నిపక్షములవారునుగూడ శ్రద్ధతో పనిచేయవలెను.

4. భారత-రాష్ట్రీయ శాసన సభలలోని కార్యములను కాంగ్రెసులో నొకభాగమగు స్వరాజ్యపక్షము వారు నెరవేర్పవలెను. అందులకు కావలసిన నిబంధనలను వారే చేయవలెను. ధనమును వారే సమకూర్చుకొనవలెను.

5. దేశీయులందరును నూలువడికిననేగాని దేశము స్వశక్తిపై ఆధారపడజాలదని అనుభవమువలన తెలిసియున్నందునను జనసామాన్యమునకును కాంగ్రెసువారికిని దృఢసంబంధమును కలిగించుటకు నూలువడుకుటయే ముఖ్యసాధనము గావునను నూలువడుకుటను ఖద్దరును బాగుగా వ్యాపింపజేయుటకును కాంగ్రెసునిబంధనలలో 7వ నిబంధనకు బదులుగ యీక్రింది నిబంధనను కాంగ్రెసువారు మోదింపవలెనని కోరెదము.

"18 ఏండ్లకు లోబడినవారును, కాంగ్రెసు పనులను నెరవేర్చునపుడు శుద్ధఖద్దరుబట్టలను ధరింపనివారును, స్వయముగా వడికినట్టిగాని లేక జబ్బుగా నుండుట స్వయముగా వడుకుట కిష్టపడకపోవుట మున్నగు సందర్భములలో యితరులచేత వడికింపబడినట్టిగాని తిన్ననినూలు 2000 గజములు ప్రతినెలకును పంపనివారును, ఏ కాంగ్రెసువర్గము (ఆర్గనైజేషను) లో గాని సంఘము (కమిటీ)లో గాని సభ్యులుగా నుండగూడదు."

ఈయొడంబడికకు గారణము కాంగ్రెసునందు దినదిన ప్రవర్ధమానంబు లగుచున్న భేదాభిప్రాయములని మహాత్ముడు విశదము చేసెను. భేదాభిప్రాయముగలవారు ప్రతిపక్షులకు సహానమును జూపుటకుబదులు కోపావేశపరులై నిందారోపణములకు బూనుకొనిరి. స్వరాజ్యపక్ష నాయకులను వారిమార్గము నుండి మరల్చుటకు త్యాగము సాధనముగాని దురహంకారము సాధనముగాదు. త్రికరణశుద్ధిగను అసహాయోద్యమానుష్ఠానము సాధ్యముగానపుడు విశ్వాసరహితులు నూతనమార్గము నవలంబించునపుడు సానుభూతిని జూపుట ధర్మముగాని దురహంకారమును బూనుట ప్రయోజనకరముగాదు. విశ్వాసములేనివారిని విశ్వాసముగలవారినిగను జేయుట యసాధ్యము. స్వరాజ్యపక్షమువారిని గాని యితరపక్షములవారినిగాని కాంగ్రెసు సిద్ధాంతములందు విశ్వాస పరాయణులను జేయుటకు ప్రేమత్యాగములు సాధనములు గాని ద్వేషాభిమానములు సాధనములుగావు. స్వాభిమానానుష్ఠానమును వదలి స్వధర్మానుష్ఠానమును జేయుట రెండు పక్షముల నాయకులకును సాధ్యముగాలేదు. అన్నిపక్షములవారికి లక్ష్యము స్వరాజ్యము గాని పరస్పరరంధ్రాన్వేషణమును స్వాభిమాన ప్రకర్షణమునుగాదు. స్వరాజ్యసంపాదనమున కన్నిపక్షములవారును వారివారి సంస్కారమున కనుకూలముగను పాటుపడుటకు హక్కుగలదు. వారి నానహించిన భ్రమ స్వానుభవమువలనను పోవలయును గాని బలవంతము వలనను పోజాలదు. అసహానమువలన దేశమునకు గలిగిన పరమానర్థములను మహాత్ముడు గ్రహించెను. విభేదములవలనను గలిగిన దౌర్బల్యమును గ్రహించెను. గాంధిమహా

త్ములు దేశోద్ధరణమునకు స్వీయాభిమానమును విసర్జించి ఆత్మసమర్పణమునుజేసి తన విశుద్ధమైన మాహాత్మ్యమును సంశయాత్ములకు విశదముచేసి ధర్మానుష్ఠానవిధానమును కరతలామలకముచేసెను. అన్ని పక్షములవారును దేశోద్ధరణమునకును నాత్మోద్ధరణమునకును మహాత్మునిమార్గము నవలంబించి స్వధర్మారాధనమును జేయుదురుగాక! గాంధిమహాత్ముని త్యాగప్రభావము బొంబయియందు గూడిన యఖిలభారత జాతీయోపసంఘసమావేశమునందును నానాపక్ష మహాసభయందును విశదమైనది. ఉపసంఘమునందు గాంధిదాసు ఒడంబడిక యామోదింపబడినది. ఖద్దరుబలత్కారమును దానికి విముఖులైన స్వరాజ్యపక్షము వారు నయితే మంగీకరించిరి. ఇదియును మహాత్ముని విజయచిహ్నముగాని పరాజయ చిహ్నముగాను.

*　　*　　*　　*

నానాపక్ష మహాసభ

రీడింగులిట్టను ప్రభువులు ప్రయోగించిన మాయాశక్తికి నానాపక్షమహాసభ సద్యఃఫలము. అయిదేండ్లనుండియును ననోన్యమూ ఖానలోకనమును జేయనొల్లని నాయకులనేక వేదికయందు నిర్బంధ శాసనము చేర్చినది. సంపూర్ణ సహాయవాదులు, స్వరాజ్యవాదులు, స్వతంత్రవాదులు, మితవాదులు కన్నెన్నను పక్షవాదులు సంయోగ సమావేశమునందు గూడిరి. గాంధి దాసు శ్రీనివాస శాస్త్రి బెజంటు నరసింహరాజు రామచంద్రరావు స్వామిస్వామి మొదాల్యారుగారులు మొదలగువారి సమావేశ మాశ్చర్యజనకము గదా! ఆపత్కాలమునందు భేదాభిప్రాయము లంతరింపగలవిధము నీసమావేశము విశదము చేసినది. శ్రీనివాసశాస్త్రిగా రధ్యక్షతను వహించుటయును చింతామణిగారు తీర్మానమును ప్రతిపాదించుటయును ఆశ్చర్యజనకములుగదా! నాయకులకు స్వరాజ్య సంపాదనము నందుగల యనుతాపము నీసమావేశము ప్రత్యక్షముచేసినది. సాధనాదర్శములందు భేదములున్నను నిరంకుశ ప్రతిఘటనమునందును స్వరాజ్య సంపాదనమునందును భేదాభిప్రాయములు లేవని యధికసంఖ్యాకు లామోదించిన తీర్మానము విశదము చేసినది. ఈసమావేశము జయప్రదముగ జరుగుటకు గాంధిమహాత్ముని త్యాగమే మూలకారణము. సభయందామోదితమైన తీర్మానము సామాన్యమైనను నిర్బంధవిధానములకు దగిన ప్రత్యుత్తరముగ నున్నది.

తర్జుమా

(1) "అరాజక కుట్రలవలన స్వరాజ్య మెన్నడును రాదని యీసభవారు దృఢముగా తెలుపుచున్నారు. అట్టి సంఘములు దేశమునందు ఏర్పడినను నన్నిటిని నిష్కర్షగను తీవ్రముగాను నిరసించుచున్నారు. 1924 సంవత్సరపు గవర్నరుజనరలుగారు ప్రయోగించుట అక్రమము. ఇది వ్యక్తిస్వాతంత్ర్యముపైని ప్రత్యక్షముగ దాడిగాన శాసనసంఘములవారి అనుమతిని బడయకుండ నాశాసనమును అమలుజరుపగూడదు. ఆ అధికారమును ప్రభుత్వోద్యోగులవశము చేయుటవలన వారు దుర్వినియోగము చేయుటకు చాల అవకాశములున్నవి. నిర్దోషులకును సక్రమరాజకీయసంఘములకును చాలనష్టము కలుగును. వెనుక నిట్టిశాసనముల నమలుజరిపినపు డట్టి ఫలితమే కలిగినదని అనుభవమున తెలిసియేయున్నది

గాన అన్నిరాజకీయపక్షముల, అన్నితరగతుల భారతీయులను యీ చర్యలను తీవ్రముగా నిరసించుచున్నారు.

(2) ఈ కఠినశాసనములను వెంటనే రద్దుపరచి అవసరమైనచో అరెస్టుచేయబడినవారిపైని మామూలు చట్టముల క్రింద కేసులనుచేసి విచారణజరుపవలెనని యీ సభవారు కోరుచున్నారు.

(3) వారంటులేకుండా కారణములు తెలుపకుండా వారిని చెరసాలలోనుంచుటకు దొరతనమున కధికారము నిచ్చునట్టి 1818 మూడవరెగ్యులేషనును వెంటనే రద్దుపరచవలెనని యీసభవారుకోరుచున్నారు.

(4) ప్రజలు న్యాయముగా చిరకాలము క్రిందటనే యియ్యవలసినహక్కులను నిరాకరించుటవలననే యిట్టి రాజకీయస్థితి యేర్పడినది. కాన వెంటనే స్వరాజ్యము నొసంగుటయే శాంతిస్థాపనకు ఉత్తమసాధనమని యీసభవారు నిశ్చితాభిప్రాయులై యున్నారు”

వివిధ పక్షములవారును నంగీకరించిన తీర్మానమును నాచరణమునందు బెట్టగల బాధ్యత నాయకులమీదను గలదు. అన్నిపక్షములనాయకులును తీర్మానమును సఫలముచేయుటకు వారిప్రాణమానధనములను యథాశక్తిని సమర్పింపవలసి యుందురు. ఈసమావేశమును సాధ్యముచేసిన గాంధి మహాత్ముని త్యాగమునే ఇతరనాయకులును బూని స్వధర్మ నిర్వహణమును జేయుదురుగాక!

* *

ధర్మనిర్వహణ మార్గము

బొంబయితీర్మాన మధికారులకు ధర్మ నిర్వహణ మార్గమును బోధించుచున్నది. అరాజకము నణచుటకు ప్రజలతోడ్పాటు సాధనముగాని నిర్బంధము సాధనముగాదు. అధికారులు పర్వతాగ్రములనుండి రాజద్రోహమును చాటినను రుజువులేనిది ప్రజాహృదయములందు విశ్వాసము గలుగదు. ఇంతవరకు నిర్బంధశాసనములు వంగరాష్ట్రమునందుగాని యితరదేశములందు గాని శాంతిస్థాపనమున కుపయోగపడలేదు. అధికారులిప్పుడైనను దురహంకారమును వదలి నాయకులను సంప్రతించి న్యాయానుసరణముగను నేరస్థులనుదండించుటకు బూనుకొనుటధర్మము వివేకము. కాని లిట్టను ప్రభువుగారి కోపావేశమును, కన్సర్వేటివు పక్షపు విజయనాదమును, వారి సామ్రాజ్యదురభిమానమును ధర్మానుష్ఠానమునకు ప్రతికూలముగ నున్నవిధమును పరిస్థితులు విశదముచేయుచున్నవి. ఈజిప్టునందు చూపిన నిరంకుశబలప్రదర్శనమునే భరతఖండమునందును బ్రిటీషు ప్రభుత్వాధికారులు చూపుట సహజము. ఈనిరంకుశవిధానమును ప్రతిఘటించుట కన్నిపక్షములవారును నంతర్భేదములను విసర్జించి గాంధిమహాత్మునివలె దేశోద్ధరణమునకై పాటుపడి మహాత్ముని త్యాగమును సార్థకముచేయవలసియుండును. మూడువారములలో బెల్గామునందు గాంధిమహాత్ముని ప్రధానత్వము క్రిందను భారతజాతీయ మహాసభ గూడనున్నది. ఆమహాసభ కన్నిపక్షములవారును మౌలానా మహమ్మదాలీగారు కోరినట్లు వచ్చేసి యథాశక్తిని నిరంకుశవిధాన నిర్మూలనమునకును స్వరాజ్యసంపాదనమునకును దోడ్పడి గాంధిమహాత్ముని విశ్వాసమును సఫలముచేసి చరితార్థులగుదురుగాత! శ్రీకృష్ణభగవానులు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు రణోన్ముఖుడైన శస్త్రసన్న్యాసముచేయబూనిన విజయునకు బోధించి కృతార్థునిజేసిన విధమునను గాంధిమహాత్ముడు ప్రత్యక్షముగ నాచరించుచున్న విధమునను భిన్నపక్షముల వారును మతములవారును స్వలాభములను పక్షలాభములను విడిచి అహంకారమును విసర్జించి నిష్కామకర్మయోగపరాయణులై మోక్షసాధనముల నారాధించి పురుషార్థమును బడయుదురుగాత!